# దగాపడిన తమ్ముడు

(నవల)

బలివాడ కాంతారావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# దగాపడిన తమ్ముడు

సంస్కారంగల ఒక మనిషి ఒకనాడు అటంబాంబును, జపానులోని హిరోషిమా నగరం నడిబొడ్డుమీద వేశాడు! అదేరోజు రాత్రి ఆంధ్రదేశంలో, ఉత్తరాన వంశధారా నదీతీరంలోని నవిరిగ్రామంలో ఒక సంస్కారం లేనిమనిషి, పదిహేనువందల పల్లీయులని గజగజ లాడించాడు:

ఆ మనిషి సంస్కారం అటంబాబును ఏ నడిసముద్రంలోనో పడవేయనీకండాచేసి. రెండులక్షల అరవై వేలమందిని చంపి, ఒక లక్షా అరవైమూడు వేలమందిని గాయపరచి, మూడువేల మూడువందల ఎకరాల మేరను ధ్వంసం చేసి, అరవైనాలుగువేల భవనాలు కూల్చివేసింది.

నవిరిలో గజగజలాడిన పదిహేను వందలమందిలో ఇతడికి లేని సంస్కారం భయాన్ని రేకెత్తించి ఆ గ్రామదేవత నీలమ్మకు నివాళిగా, ఒకరోజు వూరంతాకలిసి ఆటపాటలతో ఉత్సవాన్ని చేసుకోనిచ్చింది!

వంశధార నదిఒడ్డునే గ్రామకంఠంలో వున్న నీలమ్మ గుడిలో ఆ రాత్రి శివమెత్తిన దాసుడు రాముడు, గగనానికి వినిపిస్తునట్లు అరుస్తున్నాడు.

చప్పి ముక్కు, వాలిన గడ్డం, విరబోసిన జుత్తు, కొమ్ముల్లా తెలుపు, నలుపు కలయికతో మెలితిరిగిన మీసాలు, గోక్కుపోయిన ముఖం, నల్లని బక్కచిక్కిన శరీరం! చిన్న గావంచాకట్టు తప్పించి అతడి వొంటిమీద బట్టలేదు.

చుట్టూ మూగిన పల్లీయులలో దాసుని శివాలకు తలలు దించేవారు కొందరు, అక్కడే దాసుకు పాదాలదగ్గర తమ గెడ్డాలను వంచేవారు మరి కొందరు, అయ్యో! ఎంత పొరపాటై పోయిందని విసుక్కొనేవారు చాలామందీ వున్నారు.

తన కాళ్ళ దగ్గర పడ్డ గెడ్డాలకు, ఈ దాసునికీ బాగా పరిచయంవుంది. ఈ దాసుడు రాముడే ఒకప్పుడు మంగలి రాముడనే పేరుతో వుండేవాడు. కొడుకు చేతికి అందేవరకు అతినమ్మకంగా తనే ఎప్పుడూ ఆ మంగలి తోలు పొది పట్టుకొని ప్రతియింటికి వెళ్ళి క్షురకర్మ చేసేవాడు. తన కొడుకు తనలా డిప్ప కత్తిరింపు, గెడ్డం గీస్తే నాలుగు గంట్లు పెట్టడం నేర్చుకోలేదు. "పట్నంబాబులకు క్రాపింగులు కూడా మా బాబు సేస్తాడని" గర్వంగా రాముడు చెప్పుకొంటూండేవాడు. తనకు దొరికిన తీరుబడిలో గ్రామకరణంగారి వెంట వుంటూ కొద్దో గొప్పో ఏ చుట్టముక్క రూపంగానో, లేక చోడి గింజల రూపంగానో సంపాదించేవాడు.

ఒకనాడు కరణంగారి యింటికి కొత్త రెవిన్యూఇన్‌స్పెక్టరు వచ్చాడు. ఇదివరకు చాలామందికి కాళ్ళుపట్టడం, నలుగురాయటం, తలకు నూనెరాసి మర్దించడం చేసేవాడు, తను చచ్చేవరకూ ఆ పనిమాత్రం సంతోషంగానే చేస్తూంటా ననుకొన్నాడు. కానీ ఆ ఇన్‌స్పెక్టరు రాకతో తన జీవితంలోనికి కొత్తగ్రహం వచ్చిందని, రాముడే నమ్మకంగా అనుకొన్నాడు. ఆ వేళ ఒంట్లో కొద్దిగా జ్వరంగా వుంది, "కాళ్ళు పట్టావా లేదా వెధవా!" అంటూ ఇన్‌స్పెక్టరు ఎగిరిపడ్డాడు. చేతులు కట్టుకొని తన వొంట్లో బాగాలేదని వినయంగా విన్నవించుకొన్నాడు. అధికారికోపం రెచ్చిపోయింది. అన్నీ వేషాలని, జైల్లో పెట్టిస్తానని జడిపించాడు. చేసేదిలేక కాళ్ళు పట్టాడు. కాని కడుపు కమిలిపోయింది.

ఆ నిముషంనించి వైరాగ్యం వచ్చింది. ఈ నీలమ్మ గుడిదగ్గర కూర్చున్నాడు. ఒక్కసారి తను ఆ అధికారిమీద అధికారి అయితే ఎంత బాగుండే దనిపించింది. కాళ్ళు పట్టమని అనేవాడినే అనుకున్నాడు. ఇంత కష్టపడ్డాను, ఒక్క కానీ ఇచ్చాడు కాదే అనుకున్నాడు. తనేదో అయి పోవాలనే కోరికతో వెనకకు తిరిగి రెండు చేతులెత్తి "అమ్మా! నీలమ్మ తల్లీ! నా కడుపు కమిలిపోతుందమ్మా! నా బాధ యిది కనికరించు తల్లీ! ఈ మంగలిరాముడ్ని మనసులో పెట్టుకో అమ్మా!" ఇలా అన్నాడేగాని ఏంకావాలో కోరుకోవడం మరిచిపోయాడు!

గుడి నల్లగా వుంది. గుడికి రాతిగుమ్మం వుంది కానీ తలుపుల్లేవు. లోన ఒక దిమ్మమీద నాలుగు కర్రవిగ్రహాలున్నాయి. మధ్యనున్న రెంటిలో వొకటి నీలమ్మ తల్లి, రెండోది నీలమ్మ అన్న ఎర్రన్న, మిగతా రెండూ నీలమ్మ అప్పాచెల్లెళ్ళు! త్రోవవెంటపోయే ప్రతివారూ వొక మొక్కు మొక్కుతారుగానీ, అలనా పాలనా వీటి కుండేదికాదు. తన అయ్యకు కూడా ఈ గుడి ఎప్పుడు కట్టారో తెలియదట. కానీ సచ్చిన తన అయ్యకు నీలమ్మంటే ఎంతో భక్తి! తనకుమాత్రం లేదూ?

కొద్ది నిముషాలు పోయాక రాముడికి ఎంతో జాలివేసింది, నీలమ్మ గుడి అంతా బుగ్గితోనూ, పట్లుతోనూ నిండిపోయిందే! గబ గబ ఇంటికి వెళ్ళాడు. చీపురు తెచ్చి అంతా తుడిచాడు. పట్లు తీశాడు. తరువాత బొమ్మలకి రంగులేస్తే ఎంత బాగుండునని పించింది. గుడికి సున్నం వేస్తే? ఈ తల్లికి అలనా పాలనా లేదే! పల్లకివుంటే..డప్పుల ధమధమతో వూరేగునే! అంతా తను అప్పుడేచేస్తే ఎంత బాగుండును! అంత డబ్బుంటే తను చెయ్యగలిగేవాడే! తన రాబడి తనచేతిని నోటివరకూ ఎప్పుడూ పోనివ్వదు. ఊరిలో వాళ్ళతో చేప్తే!......అనుకున్నట్లే నలుగురైదుగురితో చెప్పాడు. వాళ్ళెవరూ వినలేదు. వేళాకోళం చేశారు. మన తాత ముత్తాతల దగ్గరనుంచీ లేనిది, మనం కొత్తగా చేస్తే యేమవుతుందో అని బెంగతో అన్నవాళ్ళు కూడా వున్నారు. ఈ తల్లికి ఒక మొక్కు మొక్కడం తప్పించి పూజా పునస్కారాలు చేస్తే కోపం వస్తుందని యింకొక ముసలమ్మ చెప్పింది.

రాముడి కిదేమీ నచ్చలేదు. రానురాను నీలమ్మ తల్లిమీద భక్తి హెచ్చిపోయింది. ఒక్కొక్కసారి చీకటి పడ్డవరకూ వుండేవాడు. ఒక్కొక్కనాడు చిన్న ప్రమిదతో దీపం పెట్టేవాడు. చేతులు కట్టుకుని కూర్చునేవాడు. ఈ మధ్య రెండుసార్లు ఇన్‌స్పెక్టరు వచ్చాడు. కానీ, కాళ్ళు పట్టమనలేదు! "నీలమ్మ తల్లి" తన బాధ విన్నదని గట్టిగా నమ్మాడు

రానురాను గెడ్డాం పెరిగిపోయింది. కళ్ళు మబ్బులు కమ్మాయి. రోజా యేటిలో వుదయమే ఒక మునుగు మునిగి అలా నీలమ్మగుడికి వచ్చేవాడు. తనకు వచ్చిన భాషలో వచ్చినట్లు ప్రార్థించేవాడు. ఇప్పుడు యెవరైనా క్షౌరానికి పిలిస్తే "యీవేళ ఉపవాసం వున్నాను. పొది ముట్టుకొంటే నీలమ్మతల్లికి కోపంవస్తాది" అనటం అలవాటైంది. రెండు మూడుసార్లు భక్తి హెచ్చటంవల్ల గట్టిగా పైకి అనటం నేర్చుకున్నాడు. పొరుగూర్లో శివాలువేసే మనిషిదగ్గరకు మూడుసార్లు వెళ్ళి ఆ రీతిని నేర్చుకొన్నాడు. గుడిలో ప్రయత్నించాడు. గొంతుకకు తరిఫీదిచ్చాడు!

ఒకనాడు తెల్లవారేసరికి ఊరంతా ప్రాకింది – నీలమ్మతల్లి మంగలి రాముడిమీద వాలిందని! అదిగో వీరావతారం.... వాలింది వాలిందన్నారు సగంజుత్తు నెరసిన ఆ వయసువాళ్ళు. "నిజమేనర్రా.......అసలు అడు రెండు మూడు నెలలై ఈ గుడి వదల్లేదర్రా, ఆ తల్లి వుపాసన చేశాడు! వాలింది" అన్నారు మరికొందరు.

ఇలా రోజుకి రోజు మరింత భక్తి హెచ్చిపోయింది. శివాలు వెయ్యటంలో మరింత ప్రావీణ్యం వచ్చింది! తను కోరుకున్నవన్నీ జరిగాయి – బొమ్మలకి రంగులు – గుడికి సున్నం, దేవుళ్ళకు పుష్పకం, ఊరంతటికి తను ఈ తల్లికి దాసుడని......తనను భక్తిగౌరవాలతో చూడటం – ఇదివరలా మంగలిరాము డనకుండా, దాసుడు రాముడనటం – రెవిన్యూ ఇన్‌స్పెక్టరు మళ్ళీ కాళ్ళు పట్టడానికి రమ్మంటే, తను యీసారి ధైర్యంగా రానని తిరిగి కబురుపంపటం – అధికాదికి కోపంవచ్చి ఎగిరి పంతంబడితే, వూరంతా ఒకటై ఆ దాసుడిచేత ఆ పని చేయించటానికి వీలులేదనటం – ఇంతా జరిగింది! ఇప్పుడు దాసుడు ఆ వూరికి వేదాంతి, పూజ్యుడు!

అలాంటి గౌరవం ప్రజల్లో సంపాదించుకున్న దాసుడు, చుట్టుపట్ల గ్రామాల్లో కలరా వుండటం విని తన పని తను చేశాడు. అంచేత తను యీ నాడు గొంతుకనెత్తాడు.

గుడిలో ప్రమిదలో దీపం వెలుగుతూంది. చిన్న చట్టాలలో గుగ్గిలం ధూపం వేశారు. గుడిలో పెద్దరైతు, రైతుభార్య, గ్రామనాయుడు, (మునసబు) మరి నలుగురు పెద్దలూ కూర్చున్నారు, గుడిబయట చాలామంది నిశ్శబ్దంగా నిల్చున్నారు.

కళ్ళు మూసుకున్న దాసుడు రాముడు "ఊ" అంటూ ఊపిరి ఎగబీల్చాడు. మఠంవేసుకొని వున్నాడేమో, ఇదివరలా బీభత్సంగా కదల్లేదు, ఇక గొంతుకనుంచి పెద్ద మూలుగు బయటపడింది. వెంటనే "నరుడా!" అని అరిచాడు, ఇక రాగాలతో మొదలుపెట్టాడు. "ఓరి నరుడా! సార్ని అమ్మవారు వెళ్ళిపోతున్నాది. దూతలు తినేస్తున్నాయి – యీ – ఓరీ! దూతలు తినేస్తున్నాయిరా! నాను ఈ ఊరిని యెంతకని కాస్తానూ.......మరి యెంతకని కాస్తా.....నూ! ఆ దూతలు ఈ ఊరిమీద పడి తినేస్తున్నాయిరా! నా నెంతకని కాస్తానూ! జాగ్రత్త పడితే గానీ ఊరు.....ఊరంతా వుండదు. దూతలు నొల్లెస్తాయి. జాగర్త పడురా నరుడా!"

అడ్డతలకాయతో ఏనుగులాంటి పెద్దరైతు, రాముడి కాళ్ళమీదపడి, "అమ్మా! తల్లీ! గేమానికి కాసినతల్లివి. నువ్వు కాయకపోతే యింకెవరు కాస్తారు?" అన్నాడు.

దాసుడు గొంతుక గగనానికి మళ్ళీ వినిపించింది. "ఎర్రోడా! నాను తలుచుకుంటే భూచక్రం బుగబుగ మండిపోతుంది. సవుంద్రాలు యింకి పొతాయి. ఇటు దిక్కున్న పొద్దు అటు దిక్కు లేస్తాది!"

"నిజం తల్లీ! నిజం! ఈ పిల్లల్ని కనికరించు తల్లీ!" ముసలినాయుడు అందుకున్నాడు.

దాసుడు ఒక్క నవ్వునవ్వి "ఓరి నాయనా! నా పిల్లోళ్ళంటే నాకు యెర్రిరా! ఆల్లమీద నల్లని ఈగ వాలితే నా ఒళ్ళు కందిపోతాది. ఆల్లకి సిన్న సీమ కరిస్తే నాకు గాబరా అయిపోతాది! పక్కన తమ్ముడు యెర్రన్నున్నాడు. ఈడు అక్కచెల్లెళ్ళతో ఒకడే మగబిడ్డ. దొరికినోళ్ళని తినేయడమే ఈడి పని – నాగురించి కాదురో.... యీడిగురించైనా.......ఇన్నాళ్ళు వూరుకొన్నారు.....పనిపాటల్లో వున్నారని సెప్పకొచ్చినాను.....సంబరం సెయ్యాలిరో! అప్పుడే నాను సార్ని అమ్మోరిని, దూతల్ని తగిలేస్తంటే, యీడు సాయం సేస్తాడురో! నాయనలారా! సెయ్యండిరా.....సంబరం సెయ్యండి!....."

రాగాలతో దాసుని కోర్కె బయటపడటంతో, అంతవరకూ పిడికిల్లో ప్రాణాలు పెట్టుకొన్న వాళ్ళందరిలోనూ కొద్దిగా ఉత్సాహం బయలుదేరింది. నీలమ్మతల్లి సార్నిఅమ్మవారు, ఈ ఊరు దిబ్బసెయ్యకండా కాస్తుంది. ఆ తల్లికి సంబరం సెయ్యాల సెయ్యాలని అందరూ వూసులాడుకుంటూంటే, పెద్దరైతు గుమ్మందగ్గర నిల్చుని, గట్టిగా అన్నాడు: "వచ్చే గౌరీపున్నమ్మనాడు, యీడు ఆదూ అనకండా ఊరంతా కలసి నీలమ్మతల్లికి తిరుగుదులు చెయ్యాల."

"ఓ" అన్నారు అందరూ!

## 2

గౌరీపున్నమ వచ్చింది! పల్లీయులలో ప్రమాదం హెచ్చింది! పున్నమ అయిదురోజు లున్నదనగా చిన్న తాటిరేకు బుట్టల్లో ఇసుకపోసి ఐదారు రకాల పప్పుదినుసులు వేసి నీడలో వుంచారు. జాజిపూలు నారకుచ్చుల్లా పెరిగాయి. ఆడమ్మలు ఉపవాసం వున్నారు. జాజిపూలు జుత్తులో దోపుకున్నారు.

సాయంత్రం దాసుడు గుడిగుమ్మందగ్గర నిల్చున్నాడు. చూపులో సంతోషం, నిల్చోవటంలో నిటారు, జుత్తు విరబోసి వుంది. ముక్కులో బంగారంకాడతో మూతి తెరచి నిల్చున్నాడు. వాతావరణం వెచ్చగా హాయిగా ఉంది.....

ముఖాలనిండా పసుపులు రుద్ది మోదాన్నిగొలిపే ఆడంగులు, ఆనందంతో హాయిగా బిందెలనిండా ముగ్రాటాలతో వయ్యారంగా నడుస్తూ దాసుని కాళ్ళమీద వారు పోస్తున్నారు.

ఒక మొక్కు మొక్కుతున్నారు. దాసుడు గర్వంగా చూస్తున్నాడు. తన బ్రతుకు ఎంత మారిపోయింది? కొన్నేళ్ళక్రితం వీళ్ళందర్నీ అమ్మా, తల్లీ అని బ్రతిమాలి చోడిగింజలు అడుక్కునేవాడే! అదిగదిగో పెద్దరైతు భార్య! నాయుడికూతురు. ఇంకా ఎందరు తన కాళ్ళమీద పసుపు నీటిని కుమ్మరిస్తున్నారు!!

ఏటికీ, గుడికీ మధ్య రంగు రంగు చీరెలతో, నెత్తిన బిందెలతో పల్లెవనితలు నడుస్తూనే వున్నారు. కొండమీద ప్రొద్దు కనుగీటి క్రుంగింది.

కనుచీకటి. చంద్రుడు లేచాడు. శరత్కాలపు వెన్నెల శరీరాలని పులకరింప చేస్తూంది! ఒకమూలనుంచి ఏదో కూనిరాగం, ఇంకోవేపు గంగమ్మతల్లి గలగల్లాడుతూంటే చూస్తున్నవాళ్ళ కిలకిలలు! అంతా ఆనందమయం!

భోజనాలయ్యాయ్. దగ్గరనున్న పట్నం నుంచి అద్దెకు తెచ్చిన రెండు పెట్రోమాక్సులైట్లు వెలిగాయ్. అప్పుడే డప్పులు ఢమఢమలాడుతున్నాయ్. విశ్వమంతా వెలిగిస్తున్న చందమామను వెర్రెత్తించి, డప్పులవాళ్ళు పరిగెత్తిస్తున్నారా అనిపిస్తున్నట్టు బాదుతున్నారు.

ఉదయంనించి ఉపవాసం వున్న దాసుడు, ఒక్కొక్క బొమ్మనే కర్రపుష్పకం ఎక్కించాడు. ప్రజల్లో ఉత్సాహం రేకెత్తింది. అరటిపళ్ళూ, పువ్వులూ పుష్పకం మీదకు విసిరారు! చిచ్చుబుడ్లు కాల్చారు! పుష్పకం చాకలివాళ్ళ భుజాలమీది కెక్కింది.

రంగులతో అలంకరించుకొన్న విగ్రహాలు, ఎర్రని పుష్పకం చుట్టూ కలవతోరణాలు. దాసునికి వూరంతా కలిసి ఇచ్చిన నేరేడుపండురంగు పట్టు పంచె – వెన్నెల్లో మెరిసే సున్నమేసిన గుడి....ఈ రంగురంగుల కలయిక హరివిల్లు చూసినట్లుగా...... కనులపండువుగా వుంది!

అందరి ముఖాలు పున్నమవెలుగులాగే మెరిసిపోతున్నాయ్! దాసుడు పీఠాధిపతిలా పుష్పకం ముందు నిల్చున్నాడు.

నీలమ్మగుడి ఎదురుగా రెండేళ్ళ క్రితం కొబ్బరితోట వుండేది. 1943లో పెద్దగాలివాన నాలుగుచెట్లని తప్పించి, మిగతావాటిని వూడ్చేసింది. ఆ స్థలంలోనే డప్పులు మోగుతున్నాయ్! ఉత్సాహం ముసలివాళ్ళలో కూడా తాండవించింది. పెద్దవాళ్ళ భుజాలమీద చిన్నకుర్రాళ్ళు కూర్చుని చూస్తున్నారు. చుట్టుపట్ల గ్రామాలనుంచి వచ్చిన చుట్టాలూ. బంధువులూ, మరింత ఉత్సాహం చూపిస్తున్నారు.

డప్పులు "ఛినకఛినక్ సో......" అని మందంగానే మోగడం మొదలుపెట్టాయ్. ఒక ఐదేళ్ళకుర్రాడు మొగ్గలు వేస్తున్నాడు. డప్పులవాళ్ళు గంతులేస్తూ బాదుతున్నారు.

ఇంకో ముసలాడు ముందుకు వచ్చాడు. పళ్ళూడినా, "ధంజినకడి ధంజినకడి!" – అని డప్పులవాళ్ళను యెగరకొడ్తున్నాడు.

"ఇదిగో.....వచ్చాడూ?......" అన్న తృప్తి చుట్టూ మూగిన వాళ్ళలో ఒక్కసారి ఆవరించింది! చెక్కు చెదరని ఉక్కులాంటి శరీరం! పంచె లంగోటీలా ఎగగట్టి, మీసాలు మెలుపుకుంటూనే రంగంలోనికి పిల్లి మొగ్గతో మధ్యకురికాడు. నలుపైనా నిగనిగలాడే దేహచ్ఛాయ! పొడుగాటి ముక్కుకు తగ్గ ఉబ్బిన పెద్దముఖం! కళ్ళు కళకళ లాడుతున్నాయ్! మెడలో కాశీతాడు, మణికట్టుకు మరొక నల్ల త్రాడు! అదే చెప్తుంది గరిడీలో వాడు ఘటికుడని. గూటల్లాంటి దండలు, దూలాలవంటి తొడలు! అంత మనిషి ఒక్క ఎగురు ఎగిరి గాలిలో తేలిపోతున్నాడు. ప్రతీ కీలు సులభంగా త్రిప్పుతున్నాడు. గేరాగిరజాలు వీపుకు అంటీ అంటనట్టుండి ఎగురుతున్నయ్. వాడే, మరెవడూ కాదు......పుల్లయ్య.

డప్పులవాళ్ళు ఒకచోట నిల్చుకోలేకపోయారు. అదిగో ముందుకు వెనకకి రొప్పుకపోతున్నారు.

"ఝనక్ ఝనక్ లబ్బిమ్మకడి ఝనక్ ఝనక్!" పుల్లయ్య ఆటకి డప్పులన్నీ కూడి దగ్గరకువచ్చి మోగుతున్నాయ్. ఆ చుట్టుపట్ల పది గ్రామాలకీ పేరుపడ్డవాళ్ళు.....పుల్లయ్య ఆటకి.....అప్పుడప్పుడూ డప్పులు ఆగిపోతున్నాయ్! పెట్లిపోతున్నాయ్! "భళిరా పుల్లయ్యా!" అని ప్రజలరుస్తున్నారు.

ప్రక్కన డప్పులు గడ్డిమంటవేసి కాచుకున్నా, పోటీకి నిల్చోలేకపోతున్నాయ్. అప్పుడే రెండు డప్పులు పెట్లిపోయాయి. పులి ఆట ఆడుతూ అడుగులు వేస్తున్న పుల్లయ్య చప్పున ఆగిపోయాడు. అందరూ గతుక్కుమన్నారు. డప్పులవాళ్ళ ముఖాలు మెరిశాయ్! పుల్లయ్య అలసిపోయి ఓడిపోయాడు!!

పుల్లయ్య నాలిక కరుచుకున్నాడు. ఆ తల్లికి మొక్కకుండా మొగ్గ లేశాడే- ఎంత పొరపాటైపోయింది! గబగబ నీలమ్మ తల్లి దగ్గర కెళ్ళి ఒక మొక్కు మొక్కాడు. దాసునికి దండం పెట్టాడు దాసుడు చిన్న నవ్వు నవ్వి "భళిరా! పుల్లయ్యా!" అన్నాడు. డప్పులవాళ్ళు కొయ్యబారి పోయారు. వాళ్ళ చేతులకు శక్తి లేనట్లుగా డప్పులు మోగుతున్నాయ్. అందరూ వూసులాడుకుంటున్నారు. "పుల్లయ్య పుల్లయ్యే, తక్కువోడా?" "ఆ గరిడీలో చుట్టుపట్ల మించిన మగోడున్నాడా? లేడు......లేడు.....నిబద్దిగా లేడు" అంటున్నారు.

గర్వంతో ఒక ముసలాడు మీసం దువ్వుకున్నాడు. తనకు గురువు పుల్లయ్య అయినందుకు ఒక చిన్నకుర్రాడు నవ్వుతూ హోయిగా భుజాలు తట్టుకున్నాడు.

పుష్పకం కదిలింది. ప్రజ కదిలారు. ముందుగా చిచ్చుబుడ్లు వెలిగాయ్.

ఊరిలో ప్రతి ఇంటిదగ్గిరా పుష్పకం ఆగుతోంది. ఇల్లాళ్ళు బెల్లం, వడపప్పు, అరటిపళ్ళు నీలమ్మతల్లికి యిస్తున్నారు. ఇంటిని చూచి మరీ దాసుడు నీలమ్మభాగాన్ని తీసుకుంటున్నాడు. కొందరు చీరలు చూపించి మొక్కుతున్నారు.

పెద్ద రైతు ఇంటి కెదురుగా మళ్ళీ చాలాసేపు ఆగారు. పుల్లయ్య చేత బాణాకర్ర పట్టుకుని సాముకు లంఘించుకున్నాడు. "ధంజినకడి ధంజినకడి" అనే శబ్దంతో చెవులు బ్రద్దలైపోతున్నాయ్, రాకెట్‌లా గాలిలో కర్ర తిరుగుతోంది. కంటికి కనపడ్డంలేదు. డప్పులు ఆగిపోతున్నాయ్! అదిగో ఆగిపోయాయ్! ఇదిగో ఆగిపోయాయ్! చెమటలు కక్కుతున్న పుల్లయ్య ఫకాలుమన్నాడు. ప్రజలంతా ఒక్క గొంతుకతో కేకవేశారు: "భళీ! భళీ!!"

అవును – పుల్లయ్య పెద్దరైతు ఇంటి అరుగుమీద మూగిన యౌవనంతో బలిసి మిసమిసలాడే సువాసినుల హృదయాల్లో – అదేదో అనుభూతి కలిగిస్తున్నాడు.

పుష్పకం కదిలిపోతూంది. ప్రజలు కదులుతున్నారు. పెద్దవీధిలో మరి రెండుచోట్ల గరిడీ పెట్టారు. పుల్లయ్య శిష్యులు గురువు పేరు నిలబెట్టారు. పెద్ద వీధి చివర పుష్పకం ఆగింది, ఎదురుగా కలకత్తానుంచి మదరాసు పోయే ట్రంకురోడ్డు వుంది. రోడ్డు రెండోవైపు వీధులున్నాయ్. పుష్పకం రోడ్డు దాటేముందు మళ్ళీ డప్పులవాళ్ళు శక్తిని కొలుకున్నారు.

పుల్లయ్య పిల్లిమొగ్గతో రోడ్డు ప్రక్కనే నడిచాడు. మళ్ళీ లేచినిల్చుని గిరిచుట్టూ తిరిగాడు–అవేళ సంతనుంచి వస్తున్న బళ్ళసమూహం ఈ ఉత్సవాన్ని చూసి ఆగింది. బళ్ళు ఎక్కి బండినాయుళ్ళు చూస్తున్నారు, మధ్యకొచ్చాడు ఒక కుర్రాడు. మూడు పళ్ళూడిన పాపడు. తొడలు చరుచుకుంటూ గెంతుతున్నాడు. డప్పులవాళ్ళు గాలిలో ఎగిరిపోతున్నారు. మూతి బిగించి కుర్రాడు వాళ్ళకంటే హుషారుగానే ఎగురుతున్నాడు. బుగ్గలు పొంగివున్నాయ్. గోచి వూడిపోతూంది, ఆరేడేళ్ళు నిండకపోయినా ఎక్కడ కండ అక్కడుంది. చూపుకి ముద్దుగా, ముచ్చటగా వున్నాడు. అంతా ఆ కుర్రాడిని చూసి ఉబ్బిపోతున్నారు.

పుల్లయ్య శిష్యుణ్ణి చూసి "వహవ్వా" అనుకున్నాడు. ఒక్కసారి మధ్యకురికి పిల్లిమొగ్గవేసి కదలకుండా ఒక్కచోటే నిల్చున్నాడు. తల ఆ మెత్తని భూమిమీద ఆన్చాడు. డప్పులాగిపోయాయ్. పాపడు గబగబ గాలిలో ఉన్న పుల్లయ్య పాదాలవరకూ తాటిచెట్టు యెక్కినట్లు యెగబ్రాగుతున్నాడు: పుల్లయ్య కాసుకోలేదు, కుర్రాడు జారిపోతాడు, తప్పక జారిపోతాడు! అందరూ.....బండినాయుళ్ళతో సహా గొణిగేశారు......కుర్రాడు రెండుపాదాలమీద తన చిరుపాదాలు వేస్తున్నాడు.....

నిశ్శబ్దం! నిశ్శబ్దం! నోళ్ళన్నీ తెరచివున్నాయ్. ముఖాలన్నీ మీదికి ఎత్తి చూస్తున్నాయ్.

ఒక్క విజిల్.....పాదలమీద నిల్చున్న కుర్రాడు భుజాలుతట్టి నవ్వుతున్నాడు.

ఆహో!.....భళి.....భళి.....ప్రజల కంటిరెప్పలు పడడంలేదు. గుండెల మీద పిడికిళ్ళు పట్టుకున్నారు. పుల్లయ్య ఊపిరి బిగబట్టాడు!

నిలవనీటిలో ఒక బెడ్డ వేసినట్లు తరంగాల్లా వచ్చి పుల్లయ్యచెవిలో మాటలు దూరాయ్. ఎవరది? బండినాయుడే!..... "ఇంకెవరికంత సాహసం ఉంటాది? ఆ కిందోడి కొడుకే మీదోడు!"

పుల్లయ్యకళ్ళు కాయలు కాసిపోయాయ్, ఆ అన్నమనిషిని చూడాలి, తప్పక చూడాలి! పాపడు దిగిపోయాడు, ఎదురుగా ఉన్న బండినాయుడే! ముసలాడిగాలేని ముసలాడు – వయసులో ఉన్న ముసలాడు – ఉత్సాహంలో కుర్రాడు. ఇంకా మురిసిపోతూ బొక్కినోరు విప్పి నవ్వుతున్నాడు.

బళ్ళు కదులుతున్నాయ్. ముసలాడు కొరడాతో దున్నపోతులను అదిలిస్తూ "అదృష్టం అంటే అలాగుండాలి! అయ్యపేరునిలిపే పాపణ్ణి కన్నాడు!"

బళ్ల కదిలిపోయాయ్, పుష్పకం కదిలిపోతూంది. ప్రజా కదులుతున్నారు. పుల్లయ్య కదలలేకపోయాడు!

అవును. కొడుకు! నాకు కొడుకు!! నాకా కొడుకు?నాకెందుకు కుండకూడదు? నాకూ కొడుకు కావాలి, కావాలి.

ముచ్చటగా, ముద్దుగావున్న పాపడు, ఆడూ నాలాగే గేరా గిరజాలు పెడ్తాడు నలుగురిలోనూ మెప్పతెస్తాడు. దేనికీ జడవడు. ఆడిని గరిడీలో ఘటికుణ్ణి చేస్తాను. మాటన్నాడంటే పేణంపోయినా నిలబడతాడు. దొంగల్ని పట్టే దొరవుతాడు. దోసిళ్ళతో దానం చేస్తాడు. మట్టిని నమ్మి చెమట కార్చి మా పరువు నిలబెడతాడు!

నా కొడుకు! నా కొడుకు!

# 3

పెళ్ళాంకన్నా పిల్లడిగురించి తలుచుకోవడం అంటేనే పుల్లయ్యకి హాయిగా ఉంది. ముసలాడి మాటలు మళ్ళీ మళ్ళీ నెమరువేసుకుంటున్నాడు. చటుక్కున పోతులకి గడ్డి వెయ్యలేదని జ్ఞాపకం వచ్చింది. అడ్డత్రోవగుండా ఇంటికి పోవాలని రోడ్డు ఎక్కాడు. నాలుగడుగులు వేస్తే రోడ్డుప్రక్కనే కళ్ళాలు, కళ్ళాలను అనుకునే పడమటివేపున మురగడి మడులు, మడిగట్టుమీద నడుస్తున్నాడు. మళ్ళీ కొడుకుతలపు పోతులగురించి మరిచిపోనిచ్చింది!

అగాడు. ఏటిఒడ్డు కనిపిస్తోంది. అదిగో నీలమ్మగుడి, చందమామ ఎత్తున ఉన్నాడు. మేఘాలు తెలతెలపోయి తప్పుకున్నాయ్. పట్టపగల్లా వెన్నెల తీర్చికాస్తోంది.

వెన్నెల్లో ఏటిమీదున్న మూడు ఫర్లాంగుల వంతెన తెల్లతెల్లగా మెరిసిపోతూంది.

చల్లనిగాలికి మెల్లగ కదులుతూ పొట్టతో పచ్చగా ఉన్న చేను పలకరించింది, "హో! హో! – మా తల్లి లచ్చిందేవి" అని మనసులో చేతులెత్తి మొక్కుకున్నాడు. అక్కడక్కడ పొట్టవిడిచిన వెన్నులు వూగుతున్నాయ్. ఆ ప్రశాంతతలో గలగల్లాడుతున్నాయ్– మా లచ్చిందేవి గాజుల గలగలు!

నవ్వుకున్నాడు. సంతోషంతో శరీరం ఉబ్బిపోయింది. అడుగులు వేస్తున్నాడు. ఆకాశం నిర్మలంగా వెలిగిపోతూంది.

పాడిపంటలున్న బంగారుభూమి, పాలుపెరుగులున్న పల్లె. కవ్వమాడని ఇల్లు, కదురు తిరుగని కొంపా లేదు.

మా వూరు! ఇది మా వూరు! పుల్లయ్య తన వూరును తలుచుకుని ఒక్క ఎగురు ఎగిరాడు.

చిత్త చిత్తగించి, స్వాతి చల్లచేసి, విశాఖలో విసరకుండా ఉంటే అనూరాధనాటికి అడిగినంత ఫలసాయం ఇస్తానంటుంది భూమాత. రోహిణిలో వర్షం కురిస్తే రోళ్ళు నిండిన పంట!

ఈ వూళ్ళో గంగమ్మతల్లికి కొదవలేదు. వర్షాలు కొండల్లో కురిస్తే ఏరు పొరుతుంది. కాలువలు నిండిపోతాయి. పంటలు పోవటం విచిత్రంగా ఉంటుంది. వీళ్ళకి. రెండేళ్ళక్రితం కోతలు కోస్తారనగా గాలివాన కొట్టింది, వూడ్చేసింది. వూడ్చేసినా ఈ వూరివాళ్ళు చెయ్యి చాపలేదు. కరువుపెట్టిన మెట్టప్రాంతాలవాళ్ళకి సహాయం చేశారు.

ఇల్లాంటిది తన వూరు, ఇంత గొప్పది తన పల్లె! పుల్లయ్య తిరిగి చూశాడు. చిన్న తెల్ల మబ్బు చందమామను కప్పేసింది. చిన్నగాలి చేనుమీద సవారీ చేసింది. అవును, సకాలంలో పడింది ఇత్తనం, గాదెలు నిండవా? చప్పున తన విషయం తలుచుకున్నాడు. తన కొడుకు! – కొడుకు తనలా గిరజాలు తిరిగి, దొంగలనుపట్టే దొర – సకాలంలో పడ్డవిత్తనం, కాలం యెరిగిన కొడుకు ఒకటే! కార్తిలో పడని వర్షం, కాలంలో పుట్టని కొడుకు సమయానికి పనికిరాడే!

పెళ్ళాం లేకుండా కొడుకెలా వస్తాడు! పెళ్ళాంకన్న ఒళ్ళు ముఖ్యమన్న పట్టుదలే ఇంకా పెళ్ళాంగురించి తలుచుకోడానికి జంకుపుట్టిస్తోంది.

కాలు కదిపాడు.

ఎక్కడి నించో – ఆ తియ్యని రాగం!

"చందమామో!"

పుల్లయ్య ఒళ్ళంతా ఒక్కసారి మురిసిపోయింది.

"నోమీ నోమన్నాల నోమన్నలాలో –"

వహ్వా – బలే బలే – పెదాలు చప్పరించాడు. ఎన్నో గంధర్వాంగనల గాత్రాలలా కలిసి "చందమామో!"

మళ్ళీ వొకేస్వరం "నోమీ నోమన్నాల నోమన్నలాలో –"

పుల్లయ్యకు ఆ గొంతుక పిలచినట్టయింది! పరుగులెత్తి ఆ గొంతుకలో కలిసిపోదా మనిపించింది.

తనే ఏమిటి? పిలుపు విని చందురుడే సరిగ్గా పోలేక ఇటు పరుగెత్తి వస్తున్నాడు.

తేజరిల్లిన చంధమామ తెగ మురిసిపోతున్నాడు.

"చందమామో!" ఎన్నో స్వరాలు! చప్పట్లుకూడా వినిపిస్తున్నాయ్.

మళ్ళీ తనక్కావలసిన గొంతు మధురాతి మధురంగా "వాడి చేతులు పెద్దావని చేటలు కొనినివ్వడే –"

"చందమామో! చందమామ!!"

పుల్లయ్య గప్పా గప్పామంటూ గంతువేసి వచ్చాడు, గుడి దాటాడు, ఏటివొడ్డున పడ్డాడు, ఆ స్వరం తనను లాగుకొంటోంది. ఏదో అనుభూతి మురిపింప చేస్తోంది!

వెన్నెలను యేరు మింగుతూ దిగువకు దిగజారిపోతూంది.

అదిగో ఏటివొడ్డున వంగిన చింతచెట్టు. చెట్టుపక్కన పొడకబండి. ఆ బండిపక్కన చిన్న బయలు. ఆ బయలులో – ఆ వెలుగులో తెల్లని బట్టలతో పసందైన పల్లెపడుచులు!

నృత్యగానాలతో నీటుగా మెరిసిపోతున్నారు. పుల్లయ్య మెల్లగా దొంగలా చెట్టుచాటున చేరాడు. కళ్ళతో వాళ్ళని మింగేసేలా చూశాడు. మనసులో సరసాలతో తాను మురిసిపోతున్నాడు!

చప్పట్లుకొడుతూ ఎనమండుగురు వెనకపాటతో గొంతులేస్తున్నారు. వాళ్ళచుట్టూ తిరుగుతూ, ఇంకోపడుచు ముందుపాట పాడుతోంది.

ఆ పాడుతోందే నీలమ్మ, ఊరంతా నీలి అంటారు.

నీలి వంగుతూ, వాలుతూ వయ్యారంగా చుట్టూ తిరుగుతూ, చెట్టు దరిదాపులలోనికి వస్తూంటే, పుల్లయ్య నరాలు వుబ్బిపోతున్నాయ్. చెయ్యి పట్టుకొని లాగి చేతితో నలిపేద్దామని వుబలాటపడుతున్నాడు.

తెల్లని బట్టలు – పండు వెన్నెల – బలిసిన శరీరాలు – విజృంభించిన యౌవనం. చల్లనిగాలి. మెల్లని తియ్యనిపాట. హాయ్ హాయ్!

జాకెట్లులేని జవ్వనులు.

ముఖాన పసుపు, మెట్టల్లో జాజువులు, మళ్ళీ పాట మొదలుకొచ్చారు.

"నోమీనోమన్నాల నోమన్నలాలో–

చందామామో!

వాడిచేతులు పెద్దావని చేటలు కొనరివ్వాడే
చందామామో!"

పుల్లయ్య చేతులు చూసుకొన్నాడు, పెద్దచేతులే, హాయిగా రాగంతో తిరుగుతూ నీలి చెట్టుచాటుకు వస్తోంది.

ఆహా! ఆ విజృంభించిన యౌవనశోభంతా ఆ వక్షంలోనే వుంది. చూసిన పుల్లయ్య వెర్రెత్తి పోయాడు. మళ్ళీ తిరుగుతూ—

"వాడికడుపూ పెద్దాదని కడవలు కొనరివ్వడే
చందామామో, చందమామ!"

చప్పట్లు, లయ, లయకు తగ్గట్లు అడుగులు పడుతున్నాయ్. మళ్ళీ నీలి చెట్టుచాటుకు చేరింది. నీలి అట్టే నలుపుగాని నలుపు. ఆ ముఖం అమాయకానికి నిలయం. అసూయలేని తళుకు ఆ ముఖంలో వుంది.

ఒళ్ళు విరుస్తూ మళ్ళీ గొంతుకెత్తింది—

"వాడికాళ్ళూ పెద్దావనీ నిచ్చెన కొనరివ్వడే –
చందామామో చందమామ!"

ఆ ఒళ్ళు విరుపు – ఆ కళ్ళు తళుకు – పుల్లయ్య మ్రానుకు అంటిపోయాడు.

"వాడిపళ్ళూ పెద్దావని పప్పొండరివ్వడే–
చందామామో చందామామ!"

పడుచులు చుట్టూ తిరుగుతున్నారు. పుల్లయ్య పట్టలేని మమకారంతో, మనసు కలిపానని, నిలిపానని, ముందుకు రెండుసార్లు నీలి చెయ్యి పట్టుకోవాలని, వురుకుతూ ఆగిపోయాడు.

ఇక పదం చకచక నడిచింది, పుల్లయ్య ఉరకలు వేస్తున్నాడు.

"వాడి బొక్కినోటికి లెక్కల పలకర్ర
వాడిపట్టిబుర్రకి, పట్టుతలపాగో"

"అమ్మో! అలాంటి మొగో డెవరిక్కావాల!" ఎనమండుగురూ తుర్రున ఎగిరిపోయారు తూర్పు దిక్కుకు. నీలియిల్లు దక్షిణానికి వుంది.

"నీలి నిల్చుంది! నిజంగా నీలి నిల్చుంది! ఒంటిగా! వహ్వా! వహ్వా! నీలి నిల్చుంది."

నీలి కదుల్తోంది, కదిలిపోతూంది,

పుల్లయ్య పయ్యాట ఛెంగుపట్టి, పట్టి లాగాడు వెనకనుంచి. నీలి అదిరిపడి చూసింది, ఆ చాటుకి లాక్కుంటే "హో – దొం......గా!"

పుల్లయ్య మూతిమూసి గుండెకు హత్తుకున్నాడు. ముఖంలో ముఖం పెట్టి "దొంగనో దొరనో సూడు! బాగా సూడు" అన్నాడు.

"హ్ఁ హ్ఁ – నీకు నాయంకాదు, నాయంకాదు. దేముడు నీకు బాగా సూడ్డు. వదిలే. ...వదిలే."

నీలి గుమ్మరిస్తోంది, పుల్లయ్య వదల్లేదు. గట్టిగా అరవబోయింది. అరవలేదు. గుంజాటన పడుతోంది. విడిపించుకోలేక గిజగిజలాడిపోతూంది.

మెట్ట (క్రొప్పు) వూడిపోయింది. మనిషి నలిగిపోయింది. అంతా అయోమయం!

'ఉష్!' అన్నాడు పుల్లయ్య ఒక్కసారి. కరిచి విడిపించుకున్న నీలి పరుగులెత్తింది. చేతిమీది కాటురాస్తూ "నిన్నే పట్టుకోకపోతే" అంటూ తలాడించాడు. వెళ్ళిపోతున్న నీలి "సిగ్గులేదూ?" అన్నట్లు వినిపించింది.

## 4

తల ఆడించుకుంటూ నాలుగడుగులు వేశాడు. తిరిగి చూశాడు. నీలి కనబడలేదు. కాని నీల తన దగ్గరే నిల్చున్నట్లనిపించింది. పెదవు లొకసారి చప్పరించాడు. తస్సదియ్యా, ఎక్కడికి పోయిందనుకుంటూ ఇంటివేపు నడిచాడు.

పాదాల చప్పుడు విని నిల్చున్న పోతులు తేరి జూచాయి. కన్నెలు తెంపుకొని దగ్గరకు రావాలని వురుకున్నయ్. గబగబ పెరటిలోకి వెళ్ళాడు. గడ్డిమేటినుంచి గడ్డిలాగి పోతులముందు వేశాడు. ఆకలితోవున్న పోతులు అమాంతంగా మింగేస్తున్నాయ్. నిల్చున్నాడు. పోతుల ఒంటిమీద దర్జాగా నిమిరాడు.

పైన వెన్నెల. పోతులు గడ్డితింటూ చిన్న శబ్దం చేస్తున్నాయ్. చిరుగాలి వీస్తోంది. నులకమంచం వాకిట్లో వెన్నెల్లో వేసుకున్నాడు. కూర్చున్నాడు. పెరటిలోవున్న రావిచెట్టుమీద పిచ్చుకలు కిలకిలలాడుతూ చిన్న అలజడి చేస్తున్నాయ్.

"చందమామో" పదం ప్రతిధ్వనిస్తోంది. చందమామవేపు చూస్తున్నాడు. పొంగే సముద్రంలా ఒళ్ళు పొంగిపోతూంది! నీలి చరచరా తప్పించుకుపోయింది, పిట్ట!

మీసాలు సర్దుకున్నాడు. దానితో సరసాలతో మురిసిపోకపోతే యీాడు పుల్లయ్యేకాడు! మల్లునాయుడు కొడుకే కాడు.

పోతులు చారబడ్డాయి. పుల్లయ్య వాకిటినుంచి మంచమెత్తి గుమ్మందగ్గర వేశాడు. గడ్డియిల్లు గుమ్మటంలా వుంది, అటున్న చందురుడు ఇటు వచ్చాడు.

నిద్దరపట్టలేదు. ఇంకా డప్పులమోత వినిపిస్తూనే వుంది. ఒక్కసారి తనెంత మారిపోయానో అనుకున్నాడు. "యీా యేళ పోతులకి గడ్డెయ్యటం మరిసిపోనాను, నీలమ్మ తల్లికి మొక్కటం మరిసిపోనాను. అంతా మరుపే!"

ఏనాడూ పుల్లయ్యలో మరుపులేదే! ఏనాడూ ఆడాళ్ళకి దూరంగా వున్నాడే. ఈనాటికి ఆడదానికి లొంగిపోయాడే!

"ఛా ఛా! యేం బ్రతుకు! ఆడదానిచేత సిగ్గులేదూ అనిపించుకున్నానే!"

ఇలా చాలాసేపు గింజుకున్నాడు. తన గుండె ఎప్పుడు తెల్లవారుతుందని ఎదురుచూసింది. చూస్తూవుండగానే కంటిరెప్పలు బరువెక్కిపోయాయి.

తెలతెలవారేసరికి పొలంలో కత్తవబోరిగ భుజాన్న వేసుకుని పుల్లయ్య గట్టుచుట్టూ తిరుగుతున్నాడు. ఉదయాద్రి ముఖాన్న వెలిగే బాలభానుని కిరణాలు, పచ్చని ఆ ప్రకృతిపైబడి పులకరింప చేస్తున్నాయ్. అక్కడక్కడ మెరకనుంచి పల్లంకు పారే జలం చిన్న జలజల శబ్దం చేస్తోంది. చిన్నగాలికి చేను చేసే గలగల శబ్దం. ఆ లేత ఎండలో వరి ఎన్నులు హొరం పడ్తున్నాయ్!

బారెడు పొడవున చేను, జానెడు పొడవున్న యెన్నూ! ఈ ఏడు రోళ్ళు నిండిన పంట తప్పదు.

ప్రక్క పొలంనుంచి పీస నరిసింహులు "ఒరయ్యో! ఈ యేడు మిడత మచ్చుకొకటీ లేదురా!" అరిచాడు. నరిసింహులను ఊళ్ళో వారంతా ఇంటిపేరు పెట్టి పిలుస్తారు.

"మిడతలా? సేనిముంగటి కొస్తే సంపేసి నలిపెయ్యనూ" అన్నాడు. పుల్లయ్య పట్టుదలతో ఆరచిన ఆరుపుకు చేను ఊగుతోంది. చిన్న బుడ బుడ శబ్దం. బుంగ నీటిని మింగుతోంది. బొరిగతో బుంగని కప్పుతున్నాడు.

బుంగ కప్పటంవల్ల నీరు మ్రింగలేదు. ఇంతలో పీస తన గట్టుమీదకు వస్తూ "ఇంకేంరా గట్టునున్న గడ్డి కోశావుకాదు?"

"కోశాను. మళ్ళీ పెరిగిపోతుంది. పెరగనీ పెరగనీ. ఈ ఊరు పశువులనోట శనుంటేనా? మనూరంటే యేంటి? బంగారం! బంగారం!"

పుల్లయ్య మాటలకి పీస నవ్వాడు, తనతరవాత తరం ఊరిని చూచి గర్విస్తోందని.

"దిగవ పొలాని కెళ్ళావా?"

"ఓ! అందులో యీ యేడు చేను తెగబలిసిపోనాది!"

"నీకేంరా? ఒక్కటే లోటు!"

"నాకా? నాకేం లోటు? నాకు లోటన్న మొగా డెవడూ?"

"పట్నం బుగతోరి రెండెకరాల పొలం అంబారానికి దున్నుతున్నావా? మీ అయ్య గడించింది ఏభై సెంట్లున్నాయా? మరి నీ కడుపే పెళ్ళం అని ఎప్పుడూ యేడిస్తే......ఈ ఒళ్ళు యినపదిమ్మా యిలాగ వుండిపోడానికి? – ఇనపదిమ్మే తుప్పుపట్టుది – కాలూ సెయ్యికి అయ్యేవోళ్ళుండాలంటావా?"

పీస ఇదివరలా ఇప్పుడూ పెళ్ళి చేసుకోమంటున్నాడు. కొత్తేమీ లేదు. పుల్లయ్య కొరకొరా చూడలేదు. చిరునవ్వు నవ్వాడు. ఎదురుగా వున్న మనిషి బుగ్గమీసాలు ఆడుతున్నాయ్! చీకికళ్ళతో చూస్తున్నాడు. చిన్న నవ్వు నవ్వాడు. "నా కైదుగు రాడపిల్లలు, ఆరుగురు మొగపిల్లలు సుమా!" అన్న గర్వం ఠీవిగా నిల్చున్నవాడిలో కన్పిస్తూనే వుంది.

పంచ ఎగగట్టిన పీస ఒంటిమీద బట్టలేదు. సగం నెరసిన తల గోక్కుంటున్నాడు – "నీకు తెలీదు! సూశావా? జపానోడు వస్తాడనుకున్నాను. పిల్లలను బట్టి భూమి పంచేస్తాడనుకొన్నావా? ఆడు ఓడిపోనాడని పట్నంలో మొన్న అనుకుంటున్నారు. నాను నమ్మలేకపోనాను. పొట్టోడికి పుట్టెడు బుద్ధులు కదా? ఏ మంత్రమో, తంత్రమో యేసి, తెల్లోడిని మోసంచేసైనా రాజ్యం ఏలతాడనుకున్నాను! పోనీ ఇప్పుడేం పోనాది? కాంగ్రెసోడు రాడా? ఆడూ జపానోడిలాగే ఎక్కువ మంది 'పిల్ల' లున్నోళ్ళకి ఎక్కువ భూమి ఉండాలంటాడటలే!"

పుల్లయ్య నవ్వాడు. పీస పట్నం ప్లీడరుబాబు నాలుగెకరాల పొలం దున్నుతున్నా, ఇప్పటికి పదేళ్ళయింది, రెండుసార్లు అంబారం యివ్వలేకపోయాడు. ఇచ్చేదామని వుబలాట పడ్డాడు. ప్లీడరు ఊరుకోలేదు. కోర్టుకెక్కించాడు. ఉన్న జిరాయితీ పొలం అమ్మేసి అంబారం సొమ్ముకట్టాడు. కోర్టుకు తిరిగాక గేనం కలిగింది. లోకం పోకడ తెలిసిందని పీస చెప్పుకుంటాడు. ఊళ్ళో తన ఈడువాళ్ళు పీస మాసెడ్డ తెలివైనో డంటూంటారు.

పుల్లయ్య "పద పోదాం" అన్నాడు.

పీస ఎగువపొలాని కెళ్ళొస్తా నన్నాడు. ఒకడుగువేస్తూ "ఒరయ్యో, గాంధీమహాత్ముడున్నాడే! మారాజు – దేవుడితో సమానం!" అన్నాడు.

"ఓ ఓ! దేవుడే" అన్నాడు పుల్లయ్య.

"అలాంటి దేముడు మాసెడ్డ పట్టుపట్టాడట! సూడు – కాంగ్రెసోడు రాజ్యం ఏలకమానడు! అడొచ్చాడూ అంటే – దున్నేవోడిదే పొలం అవుతాదంట! అయ్యో పుల్లిగా, పెద్దరైతుకి ముప్పై ఎకరాల పొలం. ఒక కొడుకే, అలా వుండానికి వీలుండదే! అడికంటె నాను పెద్దరైతునవ్వాల. కాలమానం ఎలా తిరుగుతాదో? యేగం ఒకింటోడివైతే! ఒంటిపచ్చివా యిప్పుడు......"

పుల్లయ్య కులాసాగా నవ్వాడు. కొడుకు జ్ఞాపకానికి వచ్చి చరచరా నడిచాడు. గట్టుమీద నడుస్తూనే ఆగిపోయాడు. కొడుకు ముందు భుజాన బోరిగేసుకొని మిలటరీ మనిషిలా నడుస్తూన్నట్లనిపించింది. ఒళ్ళంతా కళ్ళయి కొడుకు ఠీవిని చూస్తూ మురిసిపోతున్నట్లు భ్రమపడిపోతున్నాడు.

"కొడుకు! నా కొడుకు! వాడిని ఎత్తుకుని ముద్దులాడాలని, తను పిల్లి మొగేసి పాదలదగ్గరకు యెగబ్రాకి యెక్కినిల్చుని భుజాలు తట్టే వీరుడు తన కొడుకు.....కొడుకు!"

గట్టుదాటి, పుట్టదాటి, రోడ్డుదాటి, మురగడిపొలందాటి, గుడిదాటి తిన్నగా అదెమ్మప్ప యింటివేపు వెళ్ళాడు.

అదెమ్మప్ప ఊరంతటికీ అప్పే. చెవులకు నాగులూ, చేతులకు మురుగులూ. ముప్ఫయియేళ్ళప్పుడు మనిషి ముదరకుండా నిగనిగలాడింది. అప్పటికి ఒక్కర్తే కూతురు. మనిషి ఇరవైయ్యేళ్ళదానిలా వుండేది. చిక్కితే రక్తం వచ్చే వంటిబింకం! అలాంటప్పుడు మొగుడు పోయాడు. మారుమనుం వెళ్ళమని చాలామంది చెప్పారు. పెద్దనాయుళ్ళు కోరివచ్చారు. ససేమిరా కాదంది! సూద్దాం దీని పంతం అన్నారు. నడుం కట్టుకొని ఎలాగ ఇంటిలో యింకొకడ్ని సూడకండా వుంటుందని......ఆ ఒక్క కూతుర్ని మేనల్లుడికిచ్చి ఇల్లరికం తెచ్చుకుంది. ఉన్న ఆస్తిలో, నిలుపుకున్న శీలంతో ఊరందరికీ అప్పయింది! ఈ యేభయ్యోపడిలో ఊరిలో ఎవరికి ఏ సలహా కావాలన్నా ఈ అప్పదగ్గిరకు రావలసిందే.

పుల్లయ్య వచ్చాడు. అరుగుమీద అప్ప బెండకాయలు పులుసులోకి తరుగుతోంది. చూడగానే చిన్న నవ్వు నవ్వింది.

"అడుగో వచ్చాడు! పెళ్ళీ పెడాకులులేని పాపడు!"

పుల్లయ్య అరుగుమీద అప్పదగ్గరగా కూర్చున్నాడు, ముదర బెండకాయలవైపు చూస్తూ.

"అప్పా! పంతం వచ్చిందే!" అన్నాడు.

"బెండకాయలా ముదిరిపోనావు! ఈ వయసుదాకా మన జాతిలో ఎవరూ నేరురా! పెళ్ళీ గిళ్ళీ అయితే పంతా లెందుకొస్తాయ్! ఎవ్వరితో యేం తగువు తెచ్చినావ్?"

పుల్లయ్య చెప్పడానికి సిగ్గుపడ్డాడు అప్పతో సెప్పకపోతే ఊలుపడదే? పెద్దదిక్కు మరి! తెగించి చెప్పేశాడు.

"ఇన్నాళ్ళూ ఒళ్ళు పాడవుతాదని పెళ్ళొద్దన్నాను కానీ....."

"ఏటీ, ఏటీ! పెళ్ళా పెళ్ళా! నా నాయనే! ఎంత మంచి కబురు సెవిలో యేసినావురా! ఒక యింటోడివైతే....నీ పిల్లా....నీ జెల్లా....!"

పుల్లయ్యకు ఇంకా సిగ్గు చావలేదు. ముఖం దించుకొని బొరిగతో గడపమీద మెల్లగా పొడుస్తున్నాడు.

"మరి నాయనా! బంగారం యేమాత్రం వుంచినావు? – మన కులాచారం బట్టి పెళ్ళి నీ యింట్లో చెయ్యాలికదా? నువ్వంటే యెవర్తి వలచి రానంటాది?"

ఆమె ముఖంలోని ఒకనాటి అందచందపు శేషాలు కన్పిస్తూనే ఉన్నాయ్. కత్తిపీట ప్రక్కకు నెట్టి సర్దుకు కూర్చుంది. పుల్లయ్య వైపు చూసింది. రెండో అరుగుమీద కూతురు రాట్నం త్రిప్పుతోంది. ఎదురుగా పశువుల సాలనుంచి అవులు తోలుకుని, మందకు పోతున్నాడు కాపరి. అప్ప అంది.

"మరి సెప్పు బంగారం యెంతుంచినావో?"

"ఏవుందప్పా? నీకు తెలీదా? ఆ ఉన్న భూమిమీదే యేమైనా తీసుకురావాల!"

"దానిమాటకేంగానీ....."

పుల్లయ్యకి నాన్చటం యిష్టంలేనట్లు గబగబ బొరిగ అక్కడ వదిలి అన్నాడు:

"అప్పా! మరి పంతం వచ్చిందే! నివ్వెళ్ళి ఆ నీలి...."

అప్ప బుగ్గమీద చెయ్యివేసి ఆశ్చర్యంగా చూసింది.......చప్పున మాటాడలేక తికమకపడింది.

"ఇదేంటిరా నాయనా! ఎత్తెత్తి యెంగిలాకు మీద కాలేసినట్టు, నువ్వంటే – ఏసూపురేకల పాప రాదు?"

"అప్పా! మరి అడ్డు పెట్టకే! నాకు పంతం వచ్చిందని సెప్పినాను కదా?......"

"తొందరపడకురా! నాయుడోరిబొట్టి నారాయణమ్మ మోజుపడి వస్తానంటే వద్దన్నావ్! ఈ ఊర్లో పెద్దింటి ఏ యెలవోడు నీకు బొట్టినివ్వనంటాడు! సూడు, నా మాటిను! ఆ నీలా? ఏం సూపురేఖలు నేవు! పోనీ, కన్నారిది రూపాయన్నర కోక పాలైనా తెచ్చుకోలేదు!"

"అప్పా, అప్పా!" ఆగిపోయాడు.

"అది సెల్లక వుండిపోనాది! అత్తారింటికెళ్ళితే నువ్వు కాళ్ళు సెతులూ తీసుకు రావాల? తొందరపడకు నాయనా! బంగారం పళ్ళెంలాంటి దానికే గోడసేరు వుండాలంటారు! ఏదో ఒక పెద్దింటి పిల్లని సేసుకుంటే – నీకెవరున్నారు మరి? – కష్టాల్లోనూ సాయపడ్తారు."

పుల్లయ్య తల దించేశాడు.

కంటి యెదట నీలి.....ఆ విజృంభించిన యౌవనంతో వక్షం! ఆ కౌగిలి.....ఒళ్ళంతా జలదరించింది! పెదవులు చప్పరించుకొన్నాడు! 'నిన్నే పట్టుకోకపోతే'.......తన పంతం.....సిగ్గులేదూ అందే! ఛా ఛా! పంతం పంతమే.

ముఖమెత్తి "అప్పా" అన్నాడు. అప్ప ఆతృతతో మనసు మార్చుకున్నాడేమోనని చూసింది.

"అప్పా! ఏం లేకపోయినా అది రెండు సేతులు తెచ్చుకోదా? రైతోడి కాళ్ళు సేతులు గట్టిగా ఉండాలికానీ.....!"

అప్ప చిరాకుగా అంది: "నా నెందుకు యింత సెప్తున్నానో యినిపించుకున్నావు కాదు! దాని కా ముసల్ది తప్ప మరెవరూ లేరు అది మనవరాలియెంటే వస్తాది. రేపొద్దున్న అది గటుక్కుమంటే నువ్వే సెయ్యాల! నీ కున్న దెంత? నలుగురు పిల్లాజెల్లా అయితే యెక్కడుంటావ్? కోరి ఇందరు పెద్దింటోళ్ళు నీ కాళ్ళవద్దకు వస్తూంటే, వస్తున్న సంపదని తన్నుకుంటావురా?"

పుల్లయ్య – తెలిసిన వేదాంతంలోనికి దిగాడు. "అప్పా! ఉన్నప్పుడు రెండు, ఎలిపోయేటప్పుడు రెండు. మనిషియెంట ఉంటాయంట! ఆ కీర్తి, అపకీర్తి దానితోనే పడతానులే! నీ మీదే ఈ పెళ్ళి భారమంతా యేస్తున్నాను."

అప్ప లేచింది. "నాయనా! యీ పెపంచకంలో యెలాగో బతకలేవా? నీళ్ళో, సాలో, గంజో, గడుగో ఆ పుట్టించినోడు యివ్వడా? పెద్దింటి అల్లుడి వయితే ఎక్కడైనా పావల డబ్బులకి పరపతి వస్తాదని యింత సెప్పినాను. ఆ నీలి అదృష్టం అలాగుంటే నేను యింత సెప్పటం తప్పే! నాను పెద్దదాన్నని నామీద భారమేసినావు కనక, నీ యమ్మవుంటే ఎలాగయ్యేదో నానూ అలాగయాను. అందుకే ఇన్ని మాట్లాడావు. నీ దగ్గర నీ మాటా, నా దగ్గర నా మాట ఆడటం నాకు తెలీదు. మనసులో వున్నది మొగమాటం లేకుండా అనేశాను. తప్పకండా దాన్నే సేసుకో! అది యింటికొచ్చిన ముహూర్తాన నీ యిల్లు లచ్చిందేవితో గలగల్లాడిపోకూడదా? మాలాంటోళ్ళం మీ బాగు కోరతాంగానీ, బస్టు కోరతామా? మా అమ్మిని అడగటానికి పంపిస్తాను....బంగారమో?"

పుల్లయ్య లేదన్నట్లుగా ముఖం పెట్టాడు. అప్ప చిన్ననవ్వు నవ్వి. "ఆ ముసల్ది కూటికి తక్కువదైనా కులానికి తక్కువ గాదురా! యెన్నడక్కండా మనవరాల్ని పెళ్ళికిస్తాది? సరే నువ్వెళ్ళు – పోతులు కడగవా? నా నేదో సూస్తాను!"

పుల్లయ్య ముఖం వెలిగింది. అరుగుమీదనుంచి వురికి బొరిగ పట్టుకొని ఉల్లాసంతో విజులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 5

పోలినాటి వెలమబిడ్డ పుల్లయ్య పెళ్ళి స్థిరమయ్యింది. ఈ పెళ్ళి గురించి తలోలా అనుకున్నారు ఆ ఊరు చరిత్రలో యిదొక సంచలనాన్ని కలిగించిన ఘట్టం.

రూపురేఖలులేని, గతిలేని బొట్టుకి, రూపరేఖలుండి నలుగురిచేత శభాష్ అనిపించు కున్న పాపడికి పెళ్ళి! చుట్టుపట్ల ఊళ్ళనించి యెందరు కోరి పిల్ల నిస్తామన్నారు? తను అందులో యెవర్ని చేసుకున్నా ఆస్తిపాస్తులు కలిసొచ్చేవే, ఇప్పుడు రెండువేపులా ఖర్చులు తనే భరించాలి.

కొందరు రాత అనుకున్నారు. పెద్దవీధి రాట్నాలసాలలో పాతికరాట్నాలు తిరుగుతూండగానే ఆడంగులు ఈ పెళ్ళిని గురించి ఊసులాడుకున్నారు.

చివరకు "ఆ యమ్మ శాపం ఊరకనే పోతాదా? సత్తెం! సత్తెం!" అని ఒక వయసుమళ్ళిన మనిషంది. అందరూ నిజమని తలలూపారు.'

ఆ స్థలపురాణం ఒక తరంనుంచీ ఇంకో తరంవారికి కథరూపంగా అల్లుకుంది. ఒకప్పుడు ఒక జంట ఆ దారిన వెళ్ళిపోతూంటే, ఊళ్ళో కొందరు విరగబడి నవ్వారట! మొగుడు వికారంగా పొట్టిగా ఉన్నాడు. పెళ్ళాం ఠీవిగా, అందంగా జబర్దైన మనిషి! ఈడూజోడూ లేని ఈ జంటను చూసి నవ్వగానే ఆ పెళ్ళాం పతివ్రత అవటంచేత, శాపం ఇచ్చిందట, "ఈ ఊరి ఆడపిల్లలకి ఈ ఊరే గతి" అని. ఆ నమ్మకంవల్ల సాధారణంగా ఊరి పాటక జనం, రైతు కుటుంబాలు, ఈ ఇంటిపిల్ల ఆ ఇంటికి, ఆ ఇంటిపిల్ల ఈ ఇంటికి వచ్చేటట్లు చేసుకుంటుంటారు!

ఈ శాపం నీలికికూడా తగలటంచేత ఊళ్ళోనే మొగుడొచ్చాడన్నారు.

పెళ్ళికి నీలి ఒప్పుకుంది. పుల్లయ్య వప్పో అనుకున్నాడు సిగ్గులేదూ అని రెట్టించింది. కాటేసింది......పెళ్ళికి ఒప్పుకుందే....బలే! నోరూరిపోయింది. "పట్టుకుంటా నన్నాను నా పంతం నెగ్గింది. దాన్ని ఇలాగలాగ యెలా గడుగుతాను? మీసాలు తిప్పనూ? సిగ్గు నాకా దానికా? ఆ రోజు రావాల......రానీ.....రానీ!" అని పుల్లయ్య పెదవులు బిగించాడు.

రోజంతా అదే తలపుకు వచ్చేది. "ఛా ఛా! నా కెప్పుడూ యిలాగ ఉండేదికాదే! నోరూరిపోతుంది. నీలి నా మనసులో నిగనిగలాడి పోతుంది. దానికి ఒకంతట లొంగుతానా? దానిమాట దానికప్పచెప్పనా!" తల ఆడించాడు. "బలే బలే! నా కొడుకే! ఈ వూరు బంగారం! నా కొడుకు బంగారం....."

ఒక్క ఎగురు ఎగిరాడు.

పెళ్ళిరోజు వచ్చింది. పెళ్ళికొడుకు ఇంటిముందర పందిర వేశారు. ఆదెమ్మ అప్పుడే పెద్దరికం, అసలు ఈ పెళ్ళి ఖర్చులకి రెండువందలు పద్దూ గిద్దూ లేకండా అల్లుడితో చెప్పి పుచ్చుకుంది, ఈ గుమ్మటంలాంటి ఇంట్లో పొందికగానే పెళ్ళి జరిపిద్దామని. పుల్లయ్య పెళ్ళంటే పొన్నూరువాళ్ళు కూడా వచ్చారు.

నీలి తల్లి పళ్ళూడిన ముసలిది. రోజులు లెఖ్ఖపెట్టుకు కూర్చుంది. చింపిరిజుత్తుకు ఆదెమ్మప్ప మంచినూనె రాసింది. కొత్తకోక కట్టించింది. ఆ ముసలిదాని కళ్ళు ఈ చివరి దశలో ఆశతో చూస్తున్నాయ్. టకోరామేళం వాగుతూంటే పసందుగా వినిపిస్తోంది.

ఈ ముసలిది ఒకప్పుడు మనుమరాలిలానే వుండేది. మామ్మపోలికే నీలిది. కట్టుకున్న మొగాడు త్రాగుబోతు, ఒళ్ళంతా హూనం చేసేవాడు. యెముకకు యెముక విరిచేసేవాడు. ఎవరితోనూ చెప్పుకోలేదు, నీతికి నిజాయితికి కట్టుబడింది. యౌవనం వొక్కడికే అనుభవించడానికి అప్పచెప్పింది. పిల్లలు పుట్టారు. పెరిగారు. తిండిలేక చచ్చినవాళ్ళు చచ్చారు. అదంతా జ్ఞాపకంవస్తే మనిషంతా గిరగిర చుట్టుకుపోతుంది. వణికిపోతుంది. గుండెదడ పట్టుకుంటుంది.

అంతా చచ్చారు. మిగిలింది. ఒక్కకూతురు కూతురే. తనమమాత్రం ఈ పిల్లకోసం బ్రతకనిచ్చాడు దేముడు.

మేళం మోగుతోంది. ముసలిది అరుగుమీద కూర్చుని పెళ్ళిపీటల వైపు చూస్తోంది. ప్రొద్దున్న జరగవలసిన తంతు జరిగిపోయింది.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి.

పెళ్ళికొడుకు అలక సాగించాడు. వెళ్ళి పక్కనేవున్న వంగిన చింతమ్రానుమీద కూర్చున్నాడు. తోటిపెళ్ళికొడుకుకూడా చెట్టెక్కాడు. పుల్లయ్య చుట్టూ చూశాడు. ఇక్కడే....ఈ చెట్టుచాటునే....నీలిరూపు, చూపు. ...సొంపు. పెంపు చూసి మురిసిపొయ్యాడు, ఆమె వంటిని తాకి ఉద్రేకంతో ముద్దులాడాడు. చేతిమీద కాటు చూసుకున్నాడు.

"ఇంకెంత సేపు.....?"

సాయంత్రం కావస్తోంది. పశువుల బీడునుండి తిరిగివస్తున్న పశువులు సాలలు చేరుకుంటున్నాయ్, ఆడకూతుళ్ళు కడవలతో నీరు తన యెదురుగుండా తీసుకపోతూ పుల్లయ్యవేపు వొకచూపు పారేస్తున్నారు. నాలుగడుగులు ముందుకు వేసి వూసులాడుకుంటున్నారు. చిన్న నవ్వు నవ్వుకుంటున్నారు. పుల్లయ్యకు సిగ్గు పుట్టుకొచ్చింది. ఆడవాళ్ళమీద ఎన్ని కబుర్లాడాడు! వాళ్ళని విషం చూసినట్టు చూశాడు. ఇప్పుడో? ఆడదానికి లొంగిపోతున్నాడు!

వాళ్ళంతా తననుగురించే వూసులాడుకుంటున్నారు. నిజంగా...."ఆడుకోనీ....నా పంతం సెల్లాల. మీసకట్టున్న మొగోడ్ని నాను!" అనుకున్నాడు.

గలగల గంగమ్మ పారుతోంది. చెట్టుమొదట కూర్చుని యేటివైపు చూస్తున్నాడు. వారధిమీద బళ్ళు, బస్సులు, మేకలమంద, మనుషులు పోతున్నారు, చూస్తున్నారు.

మేళం వినిపించింది......వస్తున్నారు.....తోటిపెళ్ళికొడుకు చెట్టుమీద నుంచి ఒక్క గంతేశాడు–

పుల్లయ్య కొత్త కమీజు, పంచా, జరీవాణి, తలపాగా సర్దుకున్నాడు.

పొలోపొలోమని ఆడంగులు కిలకిలమంటూ చుట్టుముట్టారు. అందరూ వరసకి వదినెలు.....మరదళ్ళు.... పుల్లయ్య ముఖం దించేశాడు! తోటిపెళ్ళికొడుకు, "యెత్తరా ముఖం, సిగ్గుపడతావేంది? అడగరా కట్నాలు" అన్నాడు. ఆడమ్మలు "దాసుంచాం!" అన్నారు.

మేళం మోగుతోంది. పుల్లయ్య పెళ్ళికి ఊరంతా పెద్దలే! ఈ తంతుకు పెళ్ళికొడుకు సిగ్గుపడిపోతున్నాడు. రమ్మని యెవడో జాతోడు పిలుస్తున్నాడు! మామవరస.......పుల్లయ్య లేచాడు. "కూకోడు! కూకోడు!" అని అరచారు కుర్రాళ్ళు. ఆడాళ్ళంతా "ఓ.....ఎందుకు కూకోడు!" అంటూన్న సన్నని స్వరాలు కలిసి వినిపించాయ్.

పుల్లయ్యను బలవంతంచేసి కూర్చోబెట్టారు, ముఖం పక్కకు తిప్పించారు. అలక......ఇది అలకే అన్నట్లుగా ముఖకళను, అందరు కుర్రాళ్ళు అరచి మార్పించారు. మేం నెగ్గామని సగర్వంగా నవ్వుతూ యెగురుతూ యౌవనులవేపు చూశారు.

"ఓడిపోనారు!" అని కుర్రాళ్ళు అరచేటప్పటికి ఆడాళ్లు నవ్వుతూ ముఖాలు చూసుకున్నారు.

పుల్లయ్యకి మరదలువరస అవుతుంది......ఒక పిట పిటలాడుతున్న పెళ్ళికానిపిల్ల, ఒంటి బింకంతో, కళ్ళ తళుకుతో కళకళ్ళాడుతోంది.

పంతంతో ముందుకు పెళ్ళికొడుకు దగ్గరకు వచ్చింది. ఈ నూనూగు మీసాల యువకులు మొఖాలు తెలవేసి పెదవులు చప్పరించుకొంటూ పిల్లవైపు చూశారు....బలే....బలే......

గొంతుకెత్తింది. కిక్కురుమనకండా వూరుకొన్నారు. పాడుతుంటే ఆమెవైపు కళ్ళుప్పచెప్పి చూస్తున్నారు.

"ఏమయ్యా మీ రలిగి తోట మున్నారా!
గుఱ్ఱమూ లేదని మీ రలిగినారా?
గుడ్డికుక్కున్నాది యెక్కి రావయ్యా!
గంధమూ లేదని మీ రలిగినారా?
గేదెపుర్రున్నాది రాసుకోవయ్యా!
ఆకులూ లేవని మీ రలిగినారా?
చిక్కుడాకు లున్నాయి వేసుకోవయ్యా!
చెక్కాలు లేవని మీ రలిగినారా?
చింతపిక్కాలున్నాయి వేసుకోవయ్యా!
ఏమయ్యా మీ రలిగి తోటనున్నారా?"

పాటయ్యింది. పకపక అందరూ నవ్వారు. ఊసులాడుకున్నారు. రెండు పార్టీలవారు వాదించుకుంటున్నారు. ఇంతలో కబురు వచ్చింది. "బాపనబాబు మూర్తం దగ్గర పడినాది, రమ్మంటున్నా"రని. పోలోమని అంతా కదిలారు. అల్లుడి అలక పోడానికి ఈ పెళ్ళి అయ్యేవరకూ మామగా అభినయిస్తున్న మనిషి ఏమీ ఇయ్యలేదు. అల్లుడు చిరునవ్వుతో మామవెంట పడ్డాడు.

పెళ్ళిపందిరి! పీటదగ్గర ఒకపక్క మేడి, మోకు పెట్టారు. రెండోపక్క సన్నెగల్లు. మేళం మోగుతోంది. ముసలమ్మ అరుగుమీద కూర్చుని చూస్తోంది.

సాయంత్రం లగ్నం. అక్షంతలతో వరసయినవాళ్ళు సరసాలాడుకుంటున్నారు. ముత్తయిదువుల కోలాహలం ఇంతా అంతా కాదు. వాళ్ళ గొంతుకలదగ్గర మొగాళ్ళగొంతుకలు పనికిరాలేదు. పుల్లయ్య పెళ్ళి...ఆగేరా గిరజాలు.....ఆ మెలితిరిగిన కండలు.....అందరికీ అదో వెర్రి అభిమానం.

తంతు పూర్తయింది. పుల్లయ్య సెతుమానం కట్టారు "అచ్చింతాలు యెయ్యండర్రో!" అని ఎవరో అరిచారు. అక్షతలు పడ్డాయి. పెళ్ళికొడుకు పెళ్ళికూతురివైపు ఓ వోరచూపు చూశాడు."

ముఖానికి పసుపు, పసుపుపచ్చని కోక, చేతికి గాజులు, చెవులకి కమ్మలు, ముక్కుకి సవరంకమ్మి, మెడలో పగడాలకుత్తికంటు, కాళ్ళకు మట్టెలు, కంటికి కాటుక, నుదుట కుంకుమబొట్టు, నల్లని మెట్టె. పుల్లయ్య సంతోషంతో సర్దుక కూర్చున్నాడు.

ముసలిది పిచ్చిగా నవ్వుకుంటోంది. ఆదెమ్మప్ప తన పెద్దరికం సాఫీగా సాగిపోయిందని మురిసిపోతూంది. అందరి ముఖాలలో కాంతి వెలుగుతున్నది.

బాపనయ్య అరటిపండు వలిచి, పెళ్ళికొడుకు చేతిలో పెట్టాడు. మేళం ఆగిపోయింది. మనుషులు మాట్లాడకండా చూస్తున్నారు. గ్యాస్ లైట్లకాంతి పందిరిని ప్రకాశవంతం చేస్తోంది.

పుల్లయ్య పురోహితుడు చెప్పినట్లు అరటిపండు సగం ముక్క కొరికి, మిగతా సగం భార్యనోటిలో పెట్టాడు. ఆమె తిన్నాక బాపనయ్య చెప్తుంటే పుల్లయ్య "ఈ

యేళనుంచి నిన్ను నాను పెళ్ళాడినందున, యే పనిచేసి తెచ్చినడబ్బూ సగం నీకు యిస్తాను" అన్నాడు.

ఈసారి ఆమె సగం ముక్క కొరికి, మిగతాసగం మొగుడినోటిలో పెట్టి సిగ్గుతో మెల్లిగా "ఈ యేళనుంచి మిమ్మల్ని నాను పెళ్ళాడినందున యిప్పటినుంచీ మా కన్నవారివలనగానీ మిగతా బంధువులవలనగానీ వచ్చిన డబ్బు – నా సర్వస్వం మీ అధీనంచేస్తున్నాను" అంది.

ఈ మాటలు అనిపించిన బ్రాహ్మడు ఇద్దరినీ లేవమన్నాడు. లేచినా పుల్లయ్యకు మనసంతా ఆ మాటలతోనే నిండిపోతోంది. ఆ మాటల్లోవున్న సత్యం గుండెకు హత్తుకోవటంవల్ల పెళ్ళాంవేపు మాటిమాటికి చూస్తున్నాడు. తనకేదో పవిత్రమైన బంధం దగ్గరకు చేర్చింది. కొద్ది నిముషాల ముందుకన్నా ఇప్పుడామె ఇంకోవిధంగా కనిపిస్తోంది. తన పంతాన్నీ, ఆవేశాన్నీ ఈ మూడుముళ్ళూ చల్లార్చినట్లనిపించాయి. భార్యవేపు గౌరవంగా చూస్తున్నాడు.

దంపతులు పల్లకి యెక్కి వూరేగారు.

## 6

ఏటి ఒడ్డున రెల్లుపూలు గాలికి మెల్లిగా కదులుతున్నాయ్. ఒడ్డున కొత్త పెళ్ళికొడుకు నోటిలో పల్లుదోముపుల్ల పెట్టి యెదురుగా కనిపించే వారధి వైపు చూస్తున్నాడు. పొద్దుటి యెండలో వంతెన మనోహరంగా కన్పిస్తోంది, నీలాటి రేవులో పల్లెవనితలు వూసులాడుకుంటూ పుల్లయ్యవేపు ఒకచూపు పారేస్తున్నారు. ఆలమందలు యేటి అవతల ఒడ్డునవున్న బీటిలో మేస్తున్నాయ్.

పుల్లయ్య కళ్ళప్పచెప్పి వీటివైపు చూస్తున్నాడేకానీ, నీలితోనే మనసు నింపుకొన్నాడు. రాత్రి పల్లకిలో ముఖమేనా ఎత్తిందికాదు. దాని కాటికకళ్ళలోని తళుకులు చూద్దామని వుబలాటపడ్డాడు. కాని సిగ్గు!

లేచిపోయాడు. పళ్ళుదోముపుల్ల అక్కడ పారేసి గంగలో దిగి ముఖం కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. పెళ్ళిబట్ట పసుపు ఒంటినే వున్నాయ్, గబగబా ఇంటికి వెళ్ళాడు. గదిలోకి వెళ్ళి నీలిచెయ్యి పట్టుకోవాలనుకుంటే, ఆదెమ్మప్ప అరుగుమీద కూర్చుంది. ఒళ్ళు చల్లారింది.

ఆ వేళంతా ఆరాటమే. ఇల్లు కదల్లేదు. ఎవరొచ్చినా లోలోన విసుక్కుంటున్నాడు. కొద్దిక్షణాలు ఎలాగో అంకించుకొన్నాడు. పెరటిలో పట్టుకుందామనుకునేసరికి పిట్ట తుర్రున ఎగిరిపోయింది. వెంటపడితే పట్టుకోగలడు గాని ఆదెమ్మప్ప అరుగుమీద కూర్చునుంది.

అవేళ మధ్యాహ్నమే అంతా మాగన్నుగా నిద్రపోతూంటే, నీలి ఎందుకో పెరటిలోకి వచ్చింది. దొరికిందిరా అనుకున్నాడు. అటువేపు వెళుతూంటే ఇటువేపు వచ్చి గుమ్మంలో ముసలమ్మదగ్గర కూర్చుండిపోయింది. సిలక తమాషా చేస్తూందే అనుకున్నాడు.

పెదవులు చప్పరిస్తున్న పుల్లయ్య వాటిని ఒక్కసారి బిగించాడు, "తస్సదియ్యా, పంతం పంతమే! మీసకట్టున్న పసున్న మొగాడ్ని.....నాకా దానికా సిగ్గు? దాన్ని ఇలాగ అలాగ యెలా గడుగుతానో?" అనుకున్నాడు.

అలా అనుకుంటూ యాండగానే చీకటిపడింది. మనసులో ఆ మాటలు దొర్లుతూయాండ గానే భోజనాలయ్యాయ్, ఇంకా ఆ పట్టుదల సడలకుండానే ఇంటినిండా వదినలు, మరదళ్ళు మూగిపోయారు.

శోభనం. వండిన పిండివంటలు ముత్తైదువలు గదిలో అమర్చారు. అంతా ఆడపుట్టే! ఇంక సందడికి కొదవలేదు. పుల్లయ్య ముఖంలోకి చూసి మరీ వరసైనవాళ్ళు మాటలు విసురుతున్నారు. ఉహూఁ! పుల్లయ్య మూగోడిలా చూస్తున్నాడు.

వరసకి వదినౌతుంది; నల్లగా బింకంగా వుంది. మూడుపదుల వయస్సు, ముగ్గురు పిల్లలతల్లి. పుల్లయ్యచేతిలో ఇచ్చరూపాయి పెట్టి, మొగుడూ పెళ్ళాల చేతులు కలిపించింది.....ఇద్దరినీ గదిలోకి తీసుకువెళ్ళింది. ఆడాళ్ళంతా వెంటపడ్డారు, నులకమంచంమీద జంటకూర్చుంటే జవ్వనులంతా నవ్వుతూ మురిసిపోయారు. నీలి చెవులో నోరుపెట్టి ఇంకా ఏమేమో చెపుతూనే వున్నారు.

పుల్లయ్య తల వంచుకుని అలాగే కూర్చున్నాడు, వదిన అందర్నీ "పదండ్రా" అంది. గది బయటికి అందర్నీ పంపించాక పుల్లయ్య తలెత్తి వదినవైపు చూస్తూ, చేతనున్న రూపాయి ఇచ్చేశాడు, వదిన నవ్వుతూ తీసుకుంటూ "జాగర్త.... పెళ్ళాం అంటే మొగ్గలెయ్యటం కాదు, వెయ్యికళ్ళతో దాన్ని సూడాల – అందులోన అది అమ్మలేనిపిల్ల. అమ్మలేని పిల్లలకు అల్లకల్లోలాలు కదా! అమ్మా, అయ్యా, మొగుడూ అంతా నువ్వే దానికి ! సూపు మద్యం కాకుండావుంటే, దానిపస నువ్వే తెలుసుకుంటావ్! అది బాగుంటేనే నీ బాగు!.....వస్తా.....జాగర్త!" అన్నది.

వదిన కదిలిపోతూంది. పుల్లయ్య తన పెద్దకళ్ళతో చూస్తున్నాడు. చూపు మద్యమైపోతూంది. కళ్ళు మసకలు కమ్మాయి, తలుపు వేసుకున్నా ఇంకా ఆ తలుపువేపే చూస్తున్నాడు.

"పెళ్ళం అంటే మొగ్గలెయ్యటంకాదు!" ఈ మాటలే మనసులో అను కుంటూ నీలివైపు చూశాడు. ఒళ్ళంతా అదోలా అయ్యింది. గప్పున దగ్గిరకు లాక్కోవాలనుకున్నాడు. కానీ అనుకోకుండా లేచి నిల్చున్నాడు.

కర్రపెట్టెమీద ప్రమిదలో దీపం వెలుగుతోంది. గది బయట చిన్న అలజడి వినిపిస్తోంది, దీపం ఆరిపేదా మనుకున్నాడు. కాని మళ్ళీ మనసొప్పలేదు.

ఇదేదో కొత్తగావుంది. ఆడవాళ్ళని మచ్చికచెయ్యటం గట్టిచిక్కే అనుకున్నాడు.

గబగబ వెళ్ళి చెయ్యి పట్టుకులాగాడు, చెయ్యి లాక్కుంది. తప్పుకుంది. మొఖం ఎత్తమంటే మొడికెత్తింది.

పుల్లయ్య కిదేం నచ్చలేదు. తనలాంటి మీసకట్టున్న మొగాడు కనుసైగచేస్తే రావలసింది, ఇంత ఆర్భాటంచేస్తూందే! "పొద్దున్న దగ్గర నుంచి ధోరణే యిలానేవుంది! దీనిసంగతేటో చూస్తాను, పంతం పంతమే!" అనుకున్నాడు.

చాలా సేపటివరకూ అలాగ పెట్టెమీద కూర్చున్నాడు, మూగదానిలా పెళ్ళాం ముఖం దించుకు కూర్చుంది. ఛా ఛా అనుకున్నాడు.

పైన అలజడి వినిపించలేదు, ముందురాత్రంతా నిద్రలేదేమో, ఎవరింటికివాళ్ళు పోయారు.

నీలి కొద్దిగా తలెత్తి గుమ్మంవేపు చూశాక, క్రీగంటితో మొగుడివేపు చూసింది.

పుల్లయ్య పెళ్ళాంవేపు చూడలేదు యౌవనగర్వంతో వున్న పెళ్ళాం దాసోహం అనాలన్న అహంభావంతో పుల్లయ్య వెలుగుతున్న దీపకళికవేపు చూస్తున్నాడు. వత్తి మీదకెత్తాడు.....అదేదో వెన్నెల్లోవున్నట్లని పించింది. వంగిన చింతచెట్లు..... జవ్వనులు..... నీలి సొంపు, పెంపు....... చందమామ! తుర్రున యెగిరిపోయారు! నీలి... నీలి...... నీకు నాయంకాదు...... దొంగా...... దొంగనో దొరనో సూడు...... కాటేసిందే......! చెయ్యి తడుముకున్నాడు! పంతం పంతమే సిగ్గు......నాకా దానిగా?

గబగబ లేచాడు, పక్కన కూర్చున్నాడు. "సూడే నీలీ!" అన్నాడు. నీలి చూడలేదు. మీసం తిప్పాడు. నీలి చూసింది. గర్వంతో చిన్న నవ్వు నవ్వాడు.

"ఏమనుకున్నావో:....నా సంగతి!"

ఈసారి నీలి మరికొద్దిగా తలెత్తి పైకి చూసింది. పుల్లయ్య చప్పున చేతితో నీలి తల పైకెత్తాడు! "బాగా సూడు.... దొంగనో దొరనో!"

జవాబులేదు. దెబ్బతిన్న లేడిలా చూస్తోందనుకున్నాడు.

పుల్లయ్య వేళాకోళంగా నవ్వాడు మీసాలు తిప్పుతూ, "ఏమైనా....పట్టుకుంటానన్నాను.... అఁ పట్టుకున్నానా?" అన్నాడు.

నీలి మురిసిపోయే మొగుడివైపు నవ్వకండా చూసి, తలదించి మెల్లిగా నవ్వుకుంది.

పుల్లయ్య మరీ అహంభావంతో నిల్చుంటూ నీలి తలెత్తి ముఖంలో ముఖంపెడ్తూ "సిగ్గు నీకా నాకా? హోహో!"

భర్త నవ్వు పూర్తయ్యేవరకూ అలా చూస్తోంది. ఆనందంలో హోయిహోయిగా తేలిపోతున్నాడు, "జవాబు చెప్పదేంటి? ఓడిపానాది, ఓడిపోనాది!" అనుకున్నాడు.

నీలి చిరునవ్వు వలకబోసింది. పుల్లయ్య చూశాడు, ఆగిపోయాడు.

నీలి ఈసారి ముఖం వెలిగించి, భర్తవేపు కళ్ళప్పచెప్పి చూసింది, నవ్వింది. నవ్విందే......పుల్లయ్య పిచ్చాడిలా, ముఖంలోకి చూస్తూంటే, నీలి తలదించి, ఇంకా నవ్వుకుంటోంది.

అదిగో మాట్లాడింది.....హోఁ మాట్లాడిందే!

"ఓడిపానాను......!"

పుల్లయ్య తృప్తిగా నవ్వుకుంటూనే యెటకారం....యెటకారం......అనుకుంటూ "అఁ"అన్నాడు.

నీలి తలమీద కప్పుకున్న చీరకొంగు తీసి లేచినిల్చుంది. ప్రమిదలో పత్తి కొద్దిగా దిగువకు లాగి మళ్ళీ వచ్చి కూర్చుంటూ....

"అనాలనుకున్నదంతా అనేశావా?" అంది.

హోఁ– పుల్లయ్యపక్కనే మంచంమీద కూర్చుంటూ "హోఁ – నాకేంటి?...... మీసకట్టున్న మొగాడ్ని! అవును నానంటే నాకుగర్వం! మా వంశం అలాంటిది. సిగ్గులేదా అన్నావు – నాకా నీకా సిగ్గు?" అన్నాడు, ఈ మాటలు ముఖం

అదోలా చేసుకొంటూ అంటున్న భర్తవేపు నీలి చూస్తూనే వుంది. ఇంకా ఇటువేపు ముఖం తిప్పని భర్త భుజంమీద చెయ్యివేసింది. పుల్లయ్య కదల్లేదు, మెదల్లేదు.

ఆ భుజంపై అలా తలవాల్చి చిన్న కమ్మనైన స్వరంతో, మెల్లమెల్లగా "సూడు! నువ్వు చేసినపని బాగుందా?" అన్నది.

"నాదా తప్పు?"

"తప్పని అనలేదు. సూడు. నీ సెల్లెల్నే యవడో నివ్వు చేసినట్లు సేస్తే నివ్వెలాగుంటావ్? పోనీ, నన్నే ఇంకో మొగోడు నివ్వుచేసినట్లు సేస్తే, నేను అడికి లొంగిపోతే నీకు యెంత అన్నాయం సేసేద్దును! నీకు తెలిస్తే నివ్వు యేమౌతావ్?" అంది.

పుల్లయ్య వోరచూపు చూశాడు. నీలి మరీ దగ్గరగా జరుగుతూ, ఆ చెయ్యిని గేరాగిరజాలలోకి చొప్పిస్తూ భర్తను అంటిపెట్టుకుని, "సూడు! నీ కళ్ళు మూస్తాను, లోకం కళ్ళు మూస్తాను. కాని దేముడి కళ్ళు ముయ్యగలనా? మన మంచీ చెడూ సూసేవాడు పైనున్నాడని నువ్వు నాయంగా నమ్మకంగా యెల్లకపోతే – మనం బతికెందుకు?"

చల్లనైన వాతావరణం నెమ్మదైన మాటలు! ఈ ఆడకూతురు కన్నవారింటో కడుపుకి కష్టాలుపడింది. యౌవనంతో వంగుతూ వాలుతూ వయ్యారంగా తిరుగుతూ పాడుతూ మురిసిపోయింది, పెళ్ళిఘడియల్లో ఏమీ తెలియని అమాయకురాలి మల్లె సిగ్గుతో ముడుచుకుపోయింది. పెళ్ళామై పంతం పట్టిన మొగుడికళ్ళు విప్పుతోంది.

పుల్లయ్యకు కొద్దిగా వణుకుపుట్టింది. నీలి తన పెళ్ళామని మరిచిపోయాడు. అదేదో ఒక పవిత్రమైనదిగా కనిపించింది. ఆమె మాటల్లోని సత్యం ప్రతీకణంలోను ప్రతిధ్వనిస్తోంది. "అవును.......నాదే తప్పు......" అని లోలోన పెద్దపెట్టున తిట్టుకుంటున్నాడు.

నీలి మరీ దగ్గరగా జరిగి కౌగలించి మొగుడ్ని పట్టుకుంది. ఆమెకు తెలుసు ఎందరు యౌవనులు ఈ మనిషిగురించి మిసమిసపడి మనసులో కోరికతో నిండిపోయేవారో. ఆమెకూడా ఈ గేరాగిరజాలు, ఈ మెలితిరిగిన కండలనుగురించి ఎన్నిసార్లు తలుచుకుంది...! వాటిని తలచుకోవటం వెర్రితనమని ఈ వెర్రిబాగులపిల్ల ఆ తలపును తుడిచిపెట్టేది. కాని ఆ గిరజాలలో ఇప్పుడు తన చెయ్యి దూర్చివుంది. ఈ తిరిగిన కండలకి తన శరీరం తాకుతోంది! ఎంత హాయి..... ఇంక ఆమెకేం కావాలి!

నీలి కళ్ళల్లో నీరు.....పెదవులమీద వెర్రినవ్వు పుల్లయ్య చూశాడు! పెళ్ళాన్ని గట్టిగా గుండెకు హత్తుకున్నాడు.....నీలి.....నా నీలి.....నాదే నాదే......ఒళ్ళంతా కళ్ళు చేసుకున్నాడు – ఎంత హాయి.... .ఇంత హాయ్ హాయ్ బ్రతుకిదే. ఇందులో ఎంత తీపి....ఇదివరకు గడిపిన బతుకంతా ఇసుక దిబ్బ.......ఇప్పుడు.. .పంటతో నిండిన తన పొలాన్ని చూసినట్లుగా, అంతకు రెట్టింపు గర్వం.

ఆమె కళ్ళలోనించి జారే నీటిని తుడిచాడు, ఆమె నవ్వే పెదవులను తన పెదవులకు దగ్గరగా చేర్చుకున్నాడు.

# 7

నీలి మునుసీగ్గు దొంతరులు రానురాను తెలతెలపోయిన మేఘాల్లా చెదరి పోయినయ్. ఆ మనసులో, ఆ చూపులో ఒక కొత్తదనం, ఆశ, అనురాగం కనిపించేవి, పుల్లయ్యని చూచి చిరునవ్వుతో చిందులు త్రొక్కేది.

మొగుడు మందహాసం చేసేవాడు. వలచివచ్చిన మగని ఇల్లంతా మనుషులు వుండడానికి పనికివచ్చేటట్లు చెయ్యాలి. ఇంట్లో ఒక దాకా, కుండా, బిందే ఏదీ సరిగా లేదు. ఇప్పుడే ఇలా వుంటే పెళ్ళిముందెలా వుండేదో!

పెళ్ళానికి ఇంటి పనిపాట్లలో ఏదైనా సహాయం చేద్దామని వెళ్తే ఈ బలే చక్కనివాని చేతకానితనానికి నీలి చిన్ననవ్వు నవ్వి ముఖంలో వింతకాంతులు వెదజల్లేది.

పుల్లయ్య తన చేతకానితనాన్ని మరచిపోయి, చిగురించిన కోరికలతో నగవుతో మురిసిపోతున్న పెళ్ళాన్ని ఉర్రూతలూగించేవాడు.

పుల్లయ్య శరీరపోషణపట్ల నీలి శ్రద్ధ తీసుకొంటూంది. పారేనీట్లిలో బుడకపెట్టి పుల్లయ్య ఒళ్ళు బాగా తోముకొని నీళ్ళు పోసుకొని ఇంటికివస్తే పెళ్ళాం – గేరా గిరిజాలకు నూనెరాసి చక్కగా దువ్వుతుంది. వేళకు తిండి, కంటికి నిద్ర, మనసుకు హాయి కలుగుతున్నాయి.

ఈ రోజుల్లో ఇంటిపిల్లి అయిపోతున్నాడు. రోజూ ఒకసారి పొలంకు పోవటం, మిగతా కాలమంతా పెళ్ళాందగ్గర కూర్చోవటం, ఊళ్లో తలోలా అనుకుంటున్నారు, నవ్వుకున్నారు. వేళాకోళం చేశారు. గరిడీకి రాలేదని చాలామంది విసుక్కుంటున్నారు. ఒకవేళ వెళ్ళినా ఎంతసేపో వుండేవాడు కాదు.

"కొత్త రబ్బసం, అందులోనూ ముదిరిపోనాక పెళ్ళం వచ్చింది, బెల్లం కాకపోతాదా?" అంటున్నారు.

పుల్లయ్య గరిడీనుంచి వస్తూ ఈ మాటలు విన్నాడు. నలుగురూ పక పక నవ్వుతున్నారు. కోపం వచ్చింది. గబగబ వెళ్ళి గడపలో కూర్చుండిపోయాడు. పెళ్ళాం కులుకు పలుకుల్లోని తలపులేవో అర్థంచేసుకోక ముఖం ముడుచుకున్నాడు.

పెళ్ళాం కరిగించి కవ్వించింది. అలా కూర్చునే చేతులు త్రిప్పుతూ అన్నాడు: "నాను పెళ్ళొద్దంటే, సేసుకో అని వేళాకోళం చేసేవోరు, నేను చేసుకొన్నానా? ఇప్పుడూ యేళాకోళమే – వోరున్నాదని!"

నీలి చిన్ననవ్వు నవ్వి ఆ అమాయకమైన ముఖం వెలిగించి "అందుకేనా అలాగున్నావ్! ఆల్లెందుకన్నారు? పడేవోడివని అభిమానంతోటే అన్నారు. నవ్వుతాలు నవ్వుతాలుగా తీసుకోవాలిగానీ, మనలో లోటుంచుకుని..... పంతాలు, కోపాలు తప్పుగాదా?" అన్నది.

పుల్లయ్య మొగమెత్తి మెరిసే కళ్ళవేపు చూశాడు. ఇంకా ఆ చూపు తన పొరపాటును ఎత్తిపొడుస్తున్నట్లనిపించింది. తన పంతాలు ఎలాంటివో శోభనంనాటి రాత్రే తెలిసిపోయింది. ఆమెకంటె తను గొప్పవాడేనని అనుకోలేకపోతున్నాడు.

ఏదో భయం, భక్తి, అభిమానం, అనురాగం.....చివరకు గర్వం, తన మనసులో గిరగిరలాడిపోతున్నాయి!

దీపావళి దాటింది; వచ్చింది నాగులచవితి. ఊరంతా సందడిగా ఉన్నది. రోడ్డుపక్కన పుట్టలో పోసిన పాలు బాగా ఇంకిపోయాయి. నాగన్న నోటిలో గుడ్లు పడ్డాయి. మధ్యమధ్య టపాకాయల సందడి.....ముగ్గూ పసుపూ పుట్టను కప్పివేశాయి.

ఇంటికి వచ్చారు. ముసలమ్మ మనవరాలుకు కొడుకుపుట్టే నాగరాజని పేరుపెట్టానని మొక్కుకుంది. పుల్లయ్య విన్నాడు. ఛర్రుమన్నాడు. "నా కొడుకు పేరా? మా అయ్య పుట్టుకొస్తాడు, మా అయ్య మీసాలు తిప్పిన నాయుడు. నా కొడుకూ అలాంటోడే అవ్వాలి. అడు బుసకొట్టే నాగన్న కాడు."

"తప్పు తప్పు" అంది ముసలమ్మ.

"తప్పూలేదూ గిప్పూలేదూ. నా కొడుకు పేరు మల్లనాయుడే."

ఇంకా ముసలమ్మకీ, పుల్లయ్యకీ వాదన సాగుతోంది. పకపకా నవ్వుతూ నీలి పక్కకొచ్చింది.

"చెట్టున కాయే కాయంది.....ఎందుకలా అయిపోతారు? రెండు పేర్లు పెట్టుకుందురు గానీ.... పేరుల్లో యేవుంది?"

"లేదూ? మా అయ్యపేరు పెట్టకపోతే సచ్చి సర్గానఉన్న మా అయ్యకు కోపం రాదా?"

"వస్తాది? ముమ్మాటికి వస్తాది...." అంటూ ఏదో కొత్త నోరు కలిసింది.

"గుడ్డోడా నిజం సెప్పావురా!" అని పుల్లయ్య అంగటికి వెళ్ళాడు.

చేతిలో కర్ర....పొడుగాటి మనిషి. ఎముకలు కనిపిస్తున్నా, ఒకప్పుడు బలంగా వుండేవాడని చెప్పొచ్చు. పుల్లయ్య ఇంకా వాడితో మాటాడుతూంటే, నీలి అప్పుడే వాకిట విస్తరాకు వేసింది. గుడ్డి వెంకన్న "కన్నోరింటిలో పేదారోదాకి గంజిపోసి రచ్చించావు. నీ ఇంట్లోనే అన్నం పెట్టున్నావు తల్లీ! ఏదైనా మనిషి మిగల్డు గానీ, మాట మిగిలిపోతుంది" అన్నాడు.

భోంచేస్తూంటే ఇంకో ముసలిగొంతుక "యెంకడి పని పండింది – అదృష్టం –" అన్నది.

"ఏవే ముండా! నీ లోబం కాలా......నడ్డి వంగినా, నీలో నలుసు సావనేదు–" అందుకున్నాడు గుడ్డి వెంకన్న.

"ఊరుకో! రా......గన్నెమ్మా:.....నువ్వూ ఈ పక్కన కూర్చో." నీలి యింకో విస్తరి వేసింది.

"ఇలాగ యిచ్చేయి తల్లీ! ఒగపూటే యింత మెక్కేబదులు రెండు పూటలకు సర్దుకుంటాను!......"

"గంపెడు డబ్బు, గుంపుడు భూమీ ఉంచుకొని, కాకికి సెయ్యి దులవకుండా, నివ్వు తినకండా బతికినావు – ఏం అయ్యావే! తినే ముండా! తిన్నదే దక్కింది." అందుకున్నాడు గుడ్డి వెంకన్న.

గన్నెమ్మ అన్నం మూటకట్టుకుని వెళ్ళిపోయింది.

గుడ్డి వెంకన్న తింటునే మాటలు లంకించుకున్నాడు:

"ఒరీ నాయనా! పుల్లయ్యా! గుఱ్ఱానికి బారెడుతోక ఉంటాది – రెయ్యికి జానెడు మీసం ఉంటాది – నాభం? ఈ మనుషులకీ ఎందుకొచ్చిన గర్వాలురా? అడున్నాడే ఆ రాజిగాడు – ఇంకా నామీద కసి తీరనేలేదు. సూస్తున్నాను.. ...సింహం ఉందే......ముసలైనా.....జబ్బుదైనా....గడ్డి పరకలు మేస్తాదిరా? గొడ్డు కనిపిస్తే గుడ్డిదౌతాదిరా?"

"పో పోరా! దొంగ నాయాలా! కళ్ళు పోకపోతే...నువ్వా! ఈ చుట్టుపట్ల వూళ్ళు తగలెట్టేద్దువు!"

"నాయనా! గొడ్డు గోతిలోపడితే తలొకమాటంటారులే!"

"నువ్వా! కళ్ళులేని సింహానివి – కోరలు తీసిన పాముని – యెదవ కుటుంబాలనే కాల్చేశావు నీ పొగరుతోని! ఎలాంటోడికి అలాంటి గతే పడ్తాదిలే...." పుల్లయ్య కోపంగా లేచిపోయాడు.

నీలి చప్పున అందుకుంది. "తిండిపెట్టి తిట్తావా? తప్పు తప్పు!" వెంకన్న దగ్గిరగావెళ్ళి, "నీతో సరసం ఆడుతున్నాడు. ఏం అనుకోకయ్యా!" అన్నది.

ముసలాడు నవ్వాడు. "తల్లీ! ఆ రోజుల్లో నే నొక పులిని....నన్ను మరిపించేడు గరిడీలో పుల్లయ్య. అయితే నేను పెజల్లో చెడ్డోడి నయ్యాను. నీ మొగుడు సెభాస్ అనిపించుకున్నాడు. కలకాలం నీ పసుపు కుంకుమతో నీ ధర్మం కాసి, ఇద్దరూ హాయిగా బతుకుతారమ్మా!"

"పో పోరా! నీ దీవెన లెవరిక్కావాల దొంగోడా?" పుల్లయ్య అందుకున్నాడు.

" నువ్వు వెలమోడివి......నాను గొల్లోడిని."

"జాతు లెందుకు తెస్తావయ్యా! ఆకాశంక్రింద ఉన్నాలంతా ఒకటేజాతి" అంది నీలి చప్పున.

"మా తల్లీ! సల్లని సెందురుడినాగ నీ శాంతమే నీ మొగుడి కోపాన్ని మాయం చేస్తాది......" అంటూ లేచి, కర్ర తడుముకుని వెళ్ళిపోతూ "అమ్మా!" అన్నాడు. గొంతుక గుర గురలాడిపోయింది, కళ్ళు గ్రుడ్డివైతే నీళ్ళు ఎందుకుండవ్.......పరిస్థితి అర్థంచేసుకున్న నీలి ముందుకు నడిచింది. నడుస్తూనే వెంకన్న అన్నాడు, "అసలు సంగతి ఈ నాటికీ యెవరికీ తెలీదమ్మా........" ఉధృతంగా యేడుపు వచ్చేసింది. "ఏడవకయ్యా! మన చేతిలో యేవీలేదు, నరులకి తెలియకపోయినా దేముడికి అందరి మంచి చెడ్డలూ తెలుస్తాయ్...."

"నా కూతురా, సిన్నదానివైనా నిజం చెప్పావు."

ప్రొద్దు ప్రక్కకు తిరిగింది. పసుపులు పూసుకున్న ముత్తైదువులు, ఆచారాన్నిబట్టి పొలాలకి జట్టులు జట్టులుగా బయలుదేరారు. పసుపువర్ణం దేరుతున్న చేలు, తల లూగిస్తూ పలకరించాయి. గాలికి వంగుతున్న వెన్నులు చిన్న అలజడి శబ్దం చేస్తున్నాయ్. కోతలు మొదలుపెట్టడానికి ఇంకెన్ని రోజులో లేవు, విరామం ఎరుగని పనిరోజులు దగ్గరపడుతున్నాయ్. వయసులో ఉన్న ముత్తైదువలు వేరే మాటలు ఆడుకున్నారు. వయసు మళ్ళినవారు పంటనాణెం పరీక్షించుకున్నారు. పుట్టికి యెంత బియ్యం రాలుతుందో? తవుడు పశువులకి యెన్ని రోజులొస్తుందో – బుగతకి

అంబారం చెల్లించగా ఎంత మిగులుతుందో మిగిలినదానిలో కంబారి, యేరీజీ, చాకలి, మంగలికీ పోను మిగిలేదెంతో.....ఆ మిగిలిందాంతో, యేడాదంతా యెలా గడపటమో – ఇలా రకరకాల అంచనాలు వేస్తున్నారు. విచారంతో తిరిగివచ్చినవాళ్ళూ ఉన్నారు.

నీలికూడా వెళ్ళివచ్చింది. ఆమె ఇలా ఏమీ అనుకోలేదు. ఒళ్ళు గట్టిగా ఉంటే రెక్కలకష్టంమీద బతకలేమా అన్న ధీమా ఆమెది.

రాగానే పుల్లయ్య పెళ్ళాన్ని "కాళ్ళు పీకెట్లంలేదా?" అని అడిగాడు.

నీలి సమాధానంగా చిరునవ్వునే వొలకబోసింది. పుల్లయ్య ముఖంలో ఏదో ద్వేషం స్ఫుటంగా కనిపించటంతో నీలి దగ్గరగా జరిగి, "చెప్పు, ఎందుకలా ఉన్నావు?" అని అడిగింది.

పుల్లయ్య ఎగిరిపడ్డాడు. "ఆ పాపిష్టోడికీ, ఆ పాపిష్టి ముండకీ తిండి పెట్టి నీ కడుపు మాడ్చుకోమని ఎవరు చెప్పారో నీకు?"

"ఎవరు పాపిష్టోళ్ళు?" అంది నీలి నవ్వుతూ.

"కారూ? అది డబ్బుముకంసూసి మొగుడ్ని సంపింది. ఆడు దొంగ ఎదవ....."

"అంతేనా?" నీలి మందహాసం చేసి మొగుడి నడుమును చేతులతో చుట్టివేసి, "సూడు!" అంది.

"ఏం సూస్తాను? ఆడికి కళ్ళుపోయినా పౌరుషం చావదు. దానికి నడ్డి వంగినా మమకారం పోదు!"

"మనికి లేదా? అందరు మనుషులూ ఒకలానే వుంటారా? నీ కాళ్ళలాగ నీ సేతులున్నాయా? అన్నీ కాళ్ళయితే మనిషి బతకగలడా? నువ్వు ఎందుకూరికే ఒకరిని చూసి అసహ్యపడతావు? అసహ్యపడితే అయుస్సు తక్కువంటారు... సూడు!"

పుల్లయ్య ముఖం భార్య వైపు తిప్పాడు. ఆమె ప్రశాంతమైన ముఖంతో మాటలు ఒలకబోస్తోంది..... "నూతిలాగ సూరమ్మ వుండేది. చేదలాగ వెంకన్న తోడుకొనేవాడు. అది సచ్చాక.....పాపం! ఏనుగలాంటివాడు పీనుగయ్యాడా? గన్నమ్మ అంత బతుకు బలికింది.....అన్నమో రామా అని అడుక్కుంటోందా? నీకు తెలీదు..... కడుపు సంవద్రం. తెల్లారితే పరగడుపే......నాలిక దాటితే నరకం. మట్టికుండలో ఒండి చర్మం కుండలో పడేసుకోవటమే......చెయ్యి కింద ఉండటంకంటే మీద వుండటం అదృష్టం కాదా?.......అలాగ అయిపోకు!"

పుల్లయ్య వెంటనే మాట్లాడలేకపోయాడు. నీలి మొగుడ్ని అదిమి పట్టుకుంది. పుల్లయ్య మనసు రానురాను పెళ్ళాంమాటలు తలపుకు రాగా వెన్నలా కరగజొచ్చింది. ఆమెను గట్టిగా బాహువుల్లో బంధించబోయాడు. ఇంతలో ఆమె మెల్లగా మాట్లాడుతోంది: "మా మామ్మ సెప్పింది – ఎగిరిన దూది గాలిలో ఎంతసేపో వుండదని. నువ్వు అలాగ వూరికినే ఎగిరిపోకు. నీ కాలికి దెబ్బ తగిలితే ని సెయ్యి వూరుకుంటుందా? అలాగే మన సుట్టపట్ల ఉన్నోళ్ళు ఆకలని యేడుస్తాంటే ఊరుకోమంటావా? సెప్పు?...."

ఆమె భర్తను మరీ గట్టిగా అదిమిపట్టి ప్రశ్నించింది. పుల్లయ్య శరీరమంతా గగుర్పాటుజెంది జవాబియ్యలేక ఆమె తలను తన వక్షానికి అదిమిపట్టాడు. కళ్ళల్లో నీరు వూరినట్లుకాగా అభిమానం అంతా మౌనంగా ఆమెపై ప్రసరింపచేశాడు. నీళ్లు నిండిన యిద్దరి కళ్ళూ ఏకమైనాయ్!

# 8

గుడ్డి వెంకన్న అసలుపేరు వెంకయ్య. చిన్నప్పుడే తండ్రిపోతే, తల్లి కొడుకుని కన్నవారింట్లో వదిలి, ఇంకో మనువుకి వెళ్ళిపోయింది. మారుమనువుకి వెళ్ళి మరేం సుఖపడలేదు. త్రాగుబోతు మొగుడి తన్నులకి ఒళ్ళు చితికిపోయింది. విచారంతో ఎన్నాళ్ళో వుండలేదు. కొడుకు శైశవంలోనే లోకం విడిచిపెట్టింది. వెంకన్న తాతకి పెద్ద మేకలమంద ఉండేది.....చిన్నప్పుడే తాతని నానా తిప్పలూ పెట్టేవాడు. మందలో కొత్తగా పుట్టిన మేక పిల్లల్లో మూడోవంతైనా మాయమౌతూండేవి. పిల్లల్ని సగానికి సగం ధరకి అమ్మేవాడు వెంకన్న. ఆ రాత్రే కొన్నావాళ్ళదగ్గరనుంచి ఆ పిల్ల సాధారణంగా మాయమైపోయేది. అమ్మిన డబ్బులో పదోవంతైనా తను పేదారోదా అనుకొనేవాళ్ళకు చేరేది. "మీసాలు సరిగ్గా మొలవకుండానే యిలా చేస్తున్నాడు కదా! ఇంకా పెద్దయితే వీడిని పట్టలేం. బిడ్డయినా, బిడ్డయినా పుట్టాక విడిచిపెడ్తామా? ఆడపిల్ల అయ్యింటే – ఒక బిరుదు తీసేసును అల్లుడు – ఎంతైనా మొగోడు – మూరెడు గుడ్డ, ముద్దడు అన్నం తెచ్చుకోలేడా!" అని తాత తమాయించుకునేవాడు.

యౌవనం ఉబుక్కుని వచ్చింది. కండలు తిరిగిన జవాను. రాళ్ళతో కుస్తీలు పట్టి చెట్లని పీకేసే బలం. అందమైన ముఖం! దొంగవెధవైనా బీదా బిక్కీ అంటే వెన్నలా అయిపోతాడని, తాతకు మనుమడంటే లోలోపల గర్వం ఉండేది. గరిడీలో ఘటికుడయ్యాడు. మీసాలు తిప్పి తొడచరిచే అహంభావం వచ్చింది. మేనమామ వీడితో పడలేక ఆస్తి పంచుకొని వేరే వెళ్ళిపోయాడు. మిగిలిన కొద్ది మేకలతో మంద సాగలేదు. ముసలాడు మనవణ్ణి తిడుతూనే గంజిపోసేవాడు. కానీ ఒకోసారి తల్లీతండ్రీ లేనోడని ఏడ్చేసేవాడు. వెంకన్నకు మాత్రం ఆ విచారం ఒకనాడూ లేదు. అసలు విచారం అంటే ఏంటో ఎరగడు. తాతయ్య చచ్చిపోయిన్నాడు మాత్రం ఏడ్చాడు. ఆ మరుసటిరోజువరకు ఆకలి వెయ్యలేదు. ఆకలి వేసేసరికి "తాతా గెంజిపోసేరా!" అన్నాడు అప్రయత్నంగా. కాని మళ్ళీ ఆ యింట్లో వుండలేక వీధిలో పడ్డాడు. ఎవరూ తనను సరిగ్గా పలకరించలేదు. అందరూ దూరాన్న ఉన్న తన్ను చూసి ఇళ్ళల్లోకి వెళ్ళిపోతున్నారు. పిల్లలు కూడా తనని చూసి భయపడుతున్నారు. వీధికుక్కలూ పక్కకు వెళ్ళిపోతున్నాయ్!

ఒక్కసారి తనింత చెడ్డవాడినా అనుకున్నాడు. దొంగతనాలు చేశాడు! నలుగురినీ భయపెట్టాడు – తిట్టాడు – కొట్టాడు. డబ్బులేనప్పుడు దారికాశాడు. మర్యాదగా అడిగి ఉన్నదంతా పుచ్చుకొనేవాడు. ఇవ్వనివాళ్ళ వీపులు చితకగొట్టేవాడు. అయితే యిదంతా తను ఎలా చెయ్యగలిగా ననుకున్నాడు. తనొక బంగారుపళ్ళెం – గోడలా తాత అండ వుండేది – అది ఇప్పుడు లేదు – అంచేత కామోసు – తనకేమీ విలువలేదు.

తను చెడ్డవా డవ్వాలి! విధిలేదు. మందలేదు – మసానులేదు. తిండిలేదు. డబ్బూలేదు – గిబ్బూలేదు. ఈ లోకంలో తనకు తనే! ఏడ్చినా ఏడ్వాలి. తనెందు కేడ్వాలి? తను కష్టపడడం నేర్చుకోలేదు – "సరే, వచ్చేదేదో వచ్చింది.

జీడమరక పోతాదా? కాని – ఈ పెజల్లో పెద్దాడిని అవనే అయ్యాను – అలాగే వుంటాను – మనిషి ఛస్తే మాట మిగుల్తాది. ఎద్దు ఛస్తే యెముక మిగుల్తాది – ఈ సుట్టుపట్ల నాను సచ్చినా రావణాసురిడిలాగ నా పేరు ఉండిపోనీ–" నడుస్తూనే అనుకున్నాడు వెంకన్న.

'మా తాత ఎంతో మంచోడనీ' ఇదే తొలిసారి అనుకోవటం! దుఃఖం ముంచుకు వచ్చేసింది. కాని కళ్ళల్లో నీరు రాలేదు. ముందుకు సాగలేక ఎదురుగా ఉన్న సూరయ్య ఇంటి అరుగుమీద కూర్చుండిపోయి నేలవేపు చూస్తున్నాడు. తాత కనిపిస్తున్నాడు – తనవేపు చూసి ఏడుస్తున్నట్లనిపించింది. ఏకాకి తను!

సూరయ్య ఇల్లు పెద్దదే! పదెకరాల పల్లపు భూమి. సక్కనైన సుక్కలా ఒకే ఒక కూతురు సూరమ్మ. సూరమ్మకు అందానికి తగ్గ మాటల తీరు ఉంది. వయసు వచ్చినా తండ్రి మమకారంచేత ఇంకా పెళ్ళి చెయ్యలేదు. ఏదో ఇల్లరికం అల్లుడికోసం తాపత్రయపడుతున్నాడు.

వెంకన్న వేపు చూసి "పాపం!" అంది. వెంకన్న వినిపించుకోలేదు. "కడుపు అంటుక పోయింది. అన్న పెట్టేదా?" వగరెక్కిన కోయిల గొంతుకలా ఉంది. ముఖం పక్కకు తిప్పాడు. ఆ మందహాసం చేస్తూన్న ముద్దుమోము చూడగానే తనలో సంతోషం గెంతులు వేసుక వచ్చింది. అంతలో కల్లోల గౌతమీ పొంగి పారింది.

సూరమ్మతల్లి లోనుంచే కేకవేసింది: "ఓ లమ్మీ! కుక్కనోట్లో కర్రెట్టకే – భౌ భౌ మంటాది!"

తను కుక్కా! తన కా విశ్వాసం ఎక్కడుంది? మళ్ళీ తనను ఈ రైతుభార్య అవమానపరిచిందనుకున్నాడు. పుట్టేడు అప్పైనా కాయొచ్చు కాని పిప్పిమాట లెవడు పడ్తాడు? నాలాంటి మనిషి ఆ రైతోడు. వాడిలాంటి మనిషి నాను–

"ఏవమ్మో తల్లీ! ఏవన్నావ్!" అని లేచాడు.

వెంకన్న వైఖరి చూసి ఆమె ముఖంలో లేని నవ్వు తెచ్చుకొని "ముసలోడు ఎంత మంచోడు వెంకన్నా!"

వెంకన్న మనసు మళ్ళీ తాతవైపు తిరిగిపోయింది.

"అవునమ్మా! అడు బతికినన్నాళ్ళు నానాహింసలు పెట్టారు. నా నుంచి అడు ఊరంతా పెద్దయిపోయినాడు."

వెంకన్న వస్తున్న ఏడుపును అపుకోవటంలో మరి మాటాడలేకపోయాడు. ఇంతలో పెరటి వరండాలో వడ్డించి సూరమ్మ రమ్మంది.....తల్లి మాటాడలేదు. వెంకన్న వద్దని వెళ్ళిపోబోతూంటే సూరమ్మ తన కళ్ళల్లోకి నిదానించి చూసింది. తొలిసారి తన జీవితంలో నరాలు పొంగి కంపించినయ్.

కాలు కదిపినా ముందుకు పోలేదు. ఆమెలోని ఏదో మహత్తరశక్తి తనను కట్టేసి ఆమెవేపే లాగుకుంటోంది. మళ్ళీ ముఖం తిప్పాడు. ఆమె తనను గెలుచుకున్నట్లు చిరునగవు విసరింది. ఆమె ఏమీ అనలేదు. ఇంకా అలానే నిల్చుంది. వెంకన్న ఎదురీత ఈదలేకపోయాడు. వెళ్ళి విస్తరిముందు కూర్చున్నాడు. పశువులసాలకు తల్లి వెళ్ళింది. ఎదురుగా నిల్చున్న సూరమ్మవేపుకు చూడటానికి సిగ్గువేసింది. అసలు

తినడానికే సిగ్గువేసింది. ఒక్కసారైనా తలెత్తకుండా ఉండలేకపోయాడు! తన కండల్ని. శరీర పొందికను చూసి మురిసిపోతూందని తెలుసుకున్నాడు.

భీమబలుడు - యౌవనం బలిసిన ఆడది చూసి చలించిపోయింది. అంతే. ఒకేమాట అంది: "నువ్వెంత మంచోడివి!"

వెంకన్న ఆ మాట విని అదిరిపోయాడు. ఈ లోకంలో తనని మంచోడని అన్నవాళ్ళున్నారే! కూటికిలేని పేద తనెక్కడ? సిరిగల ఇంటి ఈ చక్కని చుక్క ఎక్కడ!

నోటిలోనికి ముద్ద వెళ్ళలేదు. ముఖం కొద్దిగా మీదికి లేచింది. ఓరగా చూశాడు. జవ్వని నరాల బిగువుతో నాట్యం ఆడినట్లుంది. ఒళ్ళు పులకరించింది. ఎటు చూసిన.......అందం......ఆనందం! ఆమె ఒళ్ళంతా అందమే..... చప్పున లేచి ఏదో చేసేద్దామనుకున్నాడు, లేచిపోయాడు.

"సూరీ! నాయంత పెడ్డోడు ఎవుడూ నేడూ?"

అదే వెళ్ళిపోవటం......తిరిగి చూడలేదు. తనలో పెనుగాలి వీచింది ......ఎప్పటికీ అణగారలేదు.

గూడులేని పిట్టలా తిరిగాడు. సూరమ్మ కబురుపెట్టింది. ఎందుకో భయం వేసింది. డబ్బు పంపించింది. అందుకున్నాడు. మళ్ళీ "అడదాని డబ్బు నాకొద్దు" అని యిచ్చేశాడు. ఎక్కడికి వెళ్ళిపోయాడో యేంటో మూడుపక్షాలు దాటేవరకూ ఎవరికీ కనబడలేదు.

తిరిగి గౌరీ పున్నమనాటికి వచ్చాడు. ఆకాశంలో చందురిని చల్లని చూపు చుక్కల కనుగీటులను సరీగ్గా కనపడనీయలేదు! ఊరంతా ఉత్సాహంగా ఉంది. కమ్మరి చేసిన గైరమ్మతల్లి బాజా భజంత్రీలతో డప్పుల ధమధమలతో ఊరేగుతోంది. యువకులు యువతులు మెచ్చుకునేట్లు దేని ఎదురుగా గరిడీకి లంఘించుకున్నారు. సూరమ్మకు కావలసిన ఒళ్ళు కొంతసేపటికిగానీ రంగంలోకి దూకలేదు. డప్పులవాళ్ళని వెర్రెత్తించాడు వెంకన్న! కానీ మనసు మనసులో లేదు....గైరమ్మ కదలిపోతూంది. వెనకా ముందూ చుట్టూ ప్రజ కదులుతున్నారు. సంతోషంతో గెంతులు వేస్తున్నారు కొందరు. ఆడుతూ పాడుతూ పోతున్నారు మరికొందరు. వెంకన్న ఆగిపోవటం చూసి సూరమ్మ తోటివారినుంచి తప్పుకుంది.

ఆమె ఇంటిపెరటే - బూజాగా, తుప్పలా అక్షింతాల చెట్టు - ఆ ప్రక్కనే గడ్డిమేటు! ఆ చాటులో నిల్చుంది! అనుకున్నట్లు వెంకన్న ఆ త్రోవనే వెళ్ళిపోతున్నాడు. సైగచేసింది. నిల్చున్నాడు. కానీ రాలేదు. చూసింది. ఆగలేక చెయ్యి పట్టుకుంది. అప్పటికీ కదల్లేదు. "ఎవరూ లేరు" అంది.

"నేనెవరికీ జడవలేదు. పదిమంది వచ్చినా చీల్చేస్తాను."

"నా మాట వినవూ?"

ప్రార్థనతో కూడిన కోరికకు కాదనలేకపోయాడు. వెంటపడ్డాడు.....ఆకసం నిర్మలంగా ఉంది. పట్టపగల్లా తీర్చి కాస్తున్నది వెన్నెల!

"ఈరోజు ఎప్పటి కొస్తాదని ఎన్ని రోజులనుంచో చూస్తున్నాను. నిన్ను పట్టుకుని మురిసిపోవాలని.....ఎదవ జాతులు!"

వెంకన్న ఆమె నింకా తాకలేదు. అన్నాడు: "అందసందాలున్న ఆడకూతురివి నువ్వు! బంగారంనాంటి కొంపలో పడతావు. నాలాటి పాప్పోడితో నీకెందుకు?"

ఆమె నోరు నొక్కేసింది. "నా పెళ్ళి స్థిరమైపోయింది, రాత్రీ పగలూ నీకోసమనే కాసుకొని వున్నాను. ఎటో వెళ్ళిపోదాం పద......పద!"

ఆమె గట్టిగా అదిమి పట్టుకుంది. కన్నీరు కార్చేస్తోంది. వెంకన్న లోన చలించినా, బయటికి శిలాప్రతిమలా అయ్యాడు.

"వద్దు! ఇంత బలంగలవోణ్ణి నీటికంటె పల్చన, దూదికంటే తేలికయిపోమంటావా?"

ఆమె మాటాడలేదు.

"వద్దు సూరీ! ఈ దొంగోడ్ని యిలా బతకనియ్యి!"

ఆమె కళ్ళవెంట నీరు కారుతోంది. చూశాడు, మనసు మళ్ళీ ద్రవించుకపోయింది. "సూరీ! నన్ను మంచన్నది యీ లోకాన నువ్వొక్కదానివే! లోకాన నా బాగుకోరిన నీ ఒక్కదానికీ అన్యాయం సేసేస్తే ఈ భూమి నాలాంటి పాపిష్టోడిని మొయ్యగలదా? ఈయాళ ఇక్కడుంటాను – రేపు యేవూరో, యేమూలో – సుఖాన్నవున్న పేణాన్ని దుఃఖాన్న పెట్టుకోక!"

వెళ్ళిపోవాలని ఆమె కన్నీరు చేతితో తుడిచాడు. ఆమె ఇంక యేడవలేదు. వెన్నెలను ఒక మబ్బు తినేస్తోంది. ఆమె దుఃఖాన్ని ఒక కోరిక నమిలేస్తోంది.

"సూడు! నేనొక్కటి కోరతాను, కాదనకు–"

వెంకన్న ముందుకు అడుగువేయబోయి ఆగాడు. "సెప్పు" అన్నాడు.

"ఇదు!" చెయ్యి చాపింది.

మబ్బుతెర లేచిపోయింది. మెరుగెక్కిన చందురుడు మెల్లగా కదిలిపోతున్నాడు.

తెల్లవారేసరికి వెంకన్న వూళ్ళోలేడు. వారంరోజుల్లోనే వూళ్ళో డకోరామేళం వాగింది. యెర్రయ్య పెళ్ళికొడుకు. ఏనుగులాంటిమనిషి – గానుగెద్దులాంటి తరిఫీదు, మొదటి పెళ్ళానికి పిల్లాజెల్లా లేరు. ఈ మొగుడితో మనలేనని కన్నవారింటికి వెళ్ళిపోయి తెగతెంపులు చేసుకుంది. ఊళ్ళో నలుగురూ, సూరమ్మ చాలా బాగుంది. చక్కనిచుక్క అన్నారు. పదుగురూ అటున్న పిల్లని పెళ్ళిచేసుకోవాని భీష్మించుకున్నాడు. పెళ్ళయి పోయింది. డబ్బుకీ తనకీ లంకె. దానికోసం యేం చేయమన్నా చేసేస్తాడు.

సూరమ్మ కాపరానికి వచ్చింది. "దున్ననివానికి మడి యెందుకు? యేలకపోయి నవానికి పెళ్ళ మెందుకు" అనుకుంది సూరమ్మ. ఇంట్లో తనకేం లోటులేదుకానీ, సౌఖ్యం అనేది లేకపోయింది. రెండు నెలలు పోయాక వెంకన్న ఒక రాత్రి పొరుగూరినుంచి దొంగతనంచేసి వచ్చేస్తున్నాడు. ముగ్గురు మనుషులు ఆ చీకట్లో పెద్ద కొండపోతులతో తారసపడ్డారు. పోతులు యెర్రయ్యవని పోల్చుకొని, వాళ్ళతో చేతిలోని బాణాకర్రతో యుద్ధానికి లంఘించుకున్నాడు. ఆ దొంగలకి దెబ్బలు బాగా తగిలాయి. ఒకడికి కాలు విరిగింది. వెంకన్నకు కవుకు దెబ్బలు తగిలాయి.

ఆ రాత్రిమీద పోతుల్నీ, కాళ్ళు విరిగిన మనిషిని మోసుకొచ్చిన వెంకన్నను చూసి, అంతా 'సెభాష్' అన్నారు. ఎర్రయ్య కృతజ్ఞతగా రెండు పూటలు ఇంట్లో భోజనం చేసేమన్నాడు.

అదే చిక్కు తెచ్చింది. నీటితీరువలేని సారమైన భూమికి కాలవ నీరు వచ్చింది. వెంకన్న తనతో వుండకపోతే బలవంతాన చచ్చిపోతానని సూరమ్మ మొరపెట్టింది.

ఊళ్ళో గుసగుసలు బయలుదేరాయి. రానురాను వెంకన్న బస యెర్రయ్యయిల్లు అయిపోయింది. ఏం ఫలితం కోరకుండా పనిపాట్లలో సహాయం చేస్తున్నాడని యెర్రయ్య సంతోషించాడు. సూరమ్మకు ఒక్క క్షణం వెంకన్న లేకపోతే బ్రతకటం దుర్భరంగా వుంది. ఈ తిండితో కండలు పెరిగిపోయాయి. విచారంలేదు. నలుగురిలో నాయుడిగా చెలామణి అయిపోతున్నాడు. కొందరు "పెద్దచెరువు నీటికి, పెద్దింటి రంకుకు" పోల్చారు. కొందరు "పడుచుకున్న యిల్లు తుడుచుక్కుపోతాదని" లోలోన అనుకున్నారు. ఎవరో గుసగుసలాడు కుంటున్నారని, ఎర్రయ్య విసవిసలాడాడు. కానీ పెళ్ళాం ఏడ్చుకుంటుందని కరగిపోయాడు.

సూరమ్మకు కొడుకు పుట్టాడు, వూళ్ళో వెంకన్న రూపేనని గుసగుసలాడుకున్నారు. సూరమ్మ ఒకే ఒక కొడుకు రాజన్న నూనూగు మీసాలప్పుడు వెంకన్నను ఇంటినుంచి పొమ్మన్నాడు. చాలా రభస జరిగింది. ఆ మాటల పోరాటంవల్ల వెంకన్న రెండురోజులు ఎర్రయ్య ఇంటికి వెళ్ళకపోవటంతో సూరమ్మకు జ్వరం పట్టుకుంది. యెర్రయ్య కొడుకుని మందలించాడు. "మీ అమ్మతో నువ్వు తగలక. అది వచ్చింది. ఉన్నసిరి ఇట్టే పొంగిపోయింది. అది బతికినంతకాలం ఈ ఇంట్లో లచ్చిందేవి ఉన్నాదే" అని చెప్పాడు. కొడుకు అప్పటికి ఊరుకున్నాడు. ఎర్రయ్య వెళ్ళి వెంకన్నను పిలిచాడు. రాజన్నాయుడు ఉరఫ్ రాజిగాడికి పెళ్ళయింది. పెళ్ళాం, అత్తలాంటి చక్కని రూపుకాకపోయినా, బింకమైన మనిషి. వారంరోజులు, కాపరంచేశాక ఈ సంసారంలో మాటలతోనే చిచ్చుపోసింది.

"బలే కుటుంబం! చెట్టంతకొడుకుని పెట్టుకొని......మాతల్లి....మా అత్తకి సిగ్గులేకపోతే ......నీకు లేదా?"

ఈ ఎగతాళితో ఆ రాత్రంతా రాజన్నకి నిదరపట్టలేదు. పెళ్ళాం అంతతో వూరుకోలేదు. "నాకు ఈ రగడ తెలిస్తే, ఈ ఇంటికి కోడలిని కాకపోదు" నంది. తండ్రిదగ్గర భయంవున్న కొడుకు, యింకా వోర్చాడు. ఒకనాటిరాత్రి "ఎందుకంత పెద్దమీసాలు" అంది. దానితో రాజన్నకు బ్రహ్మాండమయిన పౌరుషం వచ్చింది. నిర్మొహమాటంగా చెప్పేశాడు. వెంకన్న ఇంట్లోకి అడుగుపెట్టడానికి వీల్లేదని. ఈ కేకలు ఇరుగు పొరుగుకి ప్రాకి ఊరంతా ప్రాకిపోయినాయి. తల్లిపోలిక కూతురికి వస్తాదిగాని కోడలి కెందుకొస్తాదనుకున్నారు కొందరు. సూరమ్మ సగం చచ్చిపోయింది, ఈ గలాటాలో "నీ వెవ్వరికి పుట్టావురా కొడుకా!" అని అందామన్నంత పౌరుషం వచ్చేసింది. కాని కొడుకంటే యెడతెగని ప్రేమ. ఒకప్రక్క వెంకన్న, ఇంకోపక్క కొడుకు. ఎటూ మాటాడలేక కుమిలిపోయింది. వాడు పోకపోతే నేను వేరే వుంటానన్నాడు కొడుకు.

వెంకన్నకు ఆత్మాభిమానం కలిగినా సూరమ్మను విడిచి తనూ బ్రతకలేదు, మాటలుపోయి చేతులు పైకికెత్తారు. రాజన్నాయుడిని పడదొయ్యడానికి ఒక్క చెయ్యి చాలు.....కానీ......ఆగిపోయాడు..... వెళ్ళిపోవాలనుకున్నాడు. కానీ ఆమెను విడిచి వుండలేదు!

ఒకనాటి అర్ధరాత్రి – చీకటిరాత్రి! ప్రకృతి నల్లగుడ్డ కప్పుకొని, నిద్రపోతోంది. ఆ నిశ్శబ్దంలో వుండి వుండి, దూరదూరాన్న చలిబాధకు ఆకలిబాధకు ఓర్వలేని ఓ ముసలినక్క యేడుస్తోంది. పెరటిలోవున్న పెంటమీదనించి గాలి దుర్గంధాన్ని మోసుకొస్తోంది. వెంకన్న ఒంటిగా ఎర్రయ్య యింటి పెరటి కొట్టు అరుగమీద దుప్పటి కప్పుకొని పడుకున్నాడు. చాలాసేపటివరకూ నిద్దరపట్టలేదు. ఎప్పుడూ లేనిది. జరిగిన రోజులు నెమరువేసుకున్నాడు. తన ఒళ్ళు కోస్తే రక్తంఅంతా పాపమే అనుకున్నాడు. తనే యెర్రయ్య అయితే, రాజన్నయితే సూరమ్మ చేసినపనికి యేం అయ్యేవాడు? మళ్ళీ పాపిష్టోడు జరిగింది, జరగబోయేది ఆలోచించకూడదనుకున్నాడు. పడుకునే ముందర తనదగ్గర యెవరో వున్నట్లనిపించింది, లేచి చూశాడు. దెయ్యమా? వంద దెయ్యాలు రానీ – ఒంటిగా వల్లకాటిలో పడుకుంటాను. మళ్ళీ ఏదో కదిలినట్లయింది. పెరటి సాలలోని పోతులు ఇంకా తెలివిగానే వున్నాయ్. ప్రక్కనేవున్న ఆవు కునుకుపాట్లు పడుతోంది. పడుకుంటూ ఆకాశంలో చుక్కలవేపు చూశాడు. ఆకాశంలో చిన్న పెద్ద సుక్కల్ని వుంచాడు, భూమిమీద నాలాంటివోళ్లని యెర్రయ్యలాంటివోళ్లని పుట్టించాడు. దేముడు బలేవోడనుకున్నాడు.... అలా మగతనిద్దర కమ్ముకొచ్చింది.

నలుగురు చుట్టుముట్టారు. నోటిలో గుడ్డలు – కాలుచేతులకు బంధం! అమ్మో అంతా సరి! అనబోయాడు. ఆ యేడుపు గుండెలో ప్రతి ధ్వనించింది. అంతా చీకటి. జగమంతా చీకటి, తన సూరమ్మ యెలా వుంటుందో, యిప్పుడు వూహించుకోవాలి. పొడిచిన కళ్ళనించి రక్తం కారుతూంది. తను వెంకన్నాయుడు కాడిప్పుడు – గుడ్డి వెంకన్న, గట్టిగా ఏడవబోయాడు. నాలుగు సింహాలబలం పౌరుషం వచ్చింది.....పోతులూ ఆవులూ కట్టచుట్టూ తిరుగుతున్నాయి. ముసలినక్క ఏకకంఠంతో అరుస్తోంది.

చిన్న చప్పుడుకు సూరమ్మ బుడ్డి పట్టుకొచ్చింది. కొడుకు, మరి ముగ్గురూ! హో! అంది.....మరి మాటాడలేదు. చూసింది...తన ప్రియుడి కళ్ళవెంబడి రక్తం కారుతోంది. నిట్టూర్పులతో మీదపడిపోయింది. కళ్ళవెంబడి కన్నీరు మున్నీరుగా కారుతోంది......కొడుకు తల్లిని కాళ్ళతన్ని వుమ్మివేసి వెళ్ళిపోయాడు.

నోటిలో గుడ్డలు తీసింది. వెంకన్న, జంతువు కదలిక పసిగట్టి ఆకలిగొన్న సింహంలా వున్నాడు. కానీ కళ్ళల్లో మేకులు గ్రుచ్చుకుని, గ్రుడ్డిచేసాయి. సూరమ్మను నొక్కివేస్తూ యేడుపులోనే రౌద్రాన్ని, వెళ్ళగ్రక్కుతూ "రాజిగాడి రక్తం త్రాగకపోతే!" తొడచరిచాడు.

ఆమె కీళ్ళన్నీ ఒక్కసారిగా విరిగిపోయినట్లయినయ్. అలా వంగుతూ వెంకన్న పాదాలమీద పడిపోయి కన్నీటితో పాదప్రక్షాళనం చేస్తోంది..

ఈ స్త్రీ భార్యకంటె తల్లిగా పరిపక్వం చెందిం దిప్పుడు ఒక్కగాని ఒక్క కొడుకు–కడుపు వెర్రి అయిపోతోంది...... ఈ సింహంలాంటి మనిషి తలుచుకుంటే యేమైనా చెయ్యగలడు. కొంతసేపటికి వెంకన్న "సూరీ! నా పాకలో దిగబెట్టు" అన్నాడు. ఈ గొంతుకలో యిదివరకు భీకరంలేదు. ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

"ఒక అడుగు, రెండడుగులు, తీసుకు పద – అగకే సూరీ! నాలుగడుగులు వేస్తే నరకం! నడే సూరీ!"

ఇప్పుడు కన్నీరు కారిపోతూంది. నడుస్తూనే సూరి భుజాలు, మోము, ముక్కు.....తల.....తాకుతున్నాడు!

మళ్ళీ తన పాక! అంతా మత్తుమందు తిన్నట్లు.......కొత్తగా తాగినవాళ్ళలా నిద్రపోతున్నాడు.

కూర్చున్నాడు. చీకటి! ఆ చీకటిలో తన ప్రేమమూర్తిని తాకితే, మళ్ళీ యౌవనం ఆమెలోకి చొచ్చుకున్నట్లయింది.

"సూడు! నేనొక్కటి కోరతాను.....కాదనకు!"

వెంకన్నకు ఆ వెన్నెలరాత్రి జ్ఞాపకం వచ్చింది.

"సెప్పు" అన్నాడు.

"ఇద" అని చెయ్యి చాపింది. వెంకన్న మళ్ళీ బాధలోనే యౌవనాన్ని అంకురింపచేసుకున్నాడు. ఈమె యీసారి సుఖం కోరాలనుకున్నా కోరలేదు. కళ్ళల్లో నీరు ఉబికి రాలుతోంది. "అడు పశువయ్యాడు. నా కొడుకు కాదు, నీ కొడుకే.....అడికి యేం కీడు సెయ్యనని...." ఆమె గొంతుక పట్టుకపోయి ఆవేదనతో వెంకన్న ఒడిలో తలెట్టి వెక్కి వెక్కి ఏడవడానికి ఉపక్రమించింది. గుడ్డి వెంకన్న మెల్లగా ఆమె చెయ్యి అందుకున్నాడు. సేతిలో చెయ్యివేసి వచ్చే దుఃఖాన్ని బలవంతంగా అపుకొంటూ "సూరీ! అంతా ఋణానుబంధం!" వెంటనే మాట రాలేదు. కాసేపు అగి మెల్లగా "నాను చేసినదానికి శిక్ష యిది.....నీ కొడుకీ శిక్ష యేయలేదు....అడెవడు వేయడానికి.....? భగవంతుడే యీ శిక్ష యేశాడు.....సచ్చిపోను......బాగా బాధపడతాను....." ఏడుపు అపలేకపోయాడు. కన్నీరు ఆమె తలమీద చుక్కలు చుక్కలు పడుతోంది, "అతీగతీలేక ఈదిలో కుక్కలా సస్తాను – ఎళ్ళే సూరీ!"

ఆమె ఎంతసేపటికో లేచి మౌనంగా పాదాలను తలమీద పెట్టుకొని వెళ్ళిపోయింది. వెళ్తూ "నా దేవుడా!....." అని లోన మొక్కుకొని వెళ్ళిపోయింది. ఇంత జరిగినా తిరిగి వెళ్ళేసరికి మొగుడు వీధరుగు మీద కుంభకర్ణుడిలా నిద్రపోతున్నాడు. తెల్లవారేసరికి ఆ వూళ్ళోనే కాదు – ఇరుపొరుగూర్లలో కూడా గుబ్బుమన్నాయ్. ఎర్రయ్య కూడా పలుకరించడానికి వెళ్లాడు.

"రాత్రిమీద ముళ్ళడొంకమీద పడిపోయాను. ముళ్లు గుచ్చుకున్నా" యన్నాడు. కొందరు నమ్మారు. మరికొందరు "దొంగతనం అడి పుట్టుకతోనే వచ్చింది. వెళ్ళివుంటాడు. ఎవరో కళ్ళు పొడిసి యింటికి దిగబెట్టేశారేమో" అని అనుకున్నారు. ఉన్నది వూడిపోతేగాని వేదాంతం రాదని మరి కొందరు గొణుక్కున్నారు.

సూరమ్మ అరోజునుంచి వెంకన్న ముఖం చూడలేదు. రోజురోజుకు బెంగతో చిక్కిపోయి – ఆరునెలలు తిరగలేదు – ఈసారి యిదివరలా అత్తారింటికి కాదు– యమసదనానికి – వెళ్ళిపోయింది.

సూరమ్మ చచ్చిపోయి అప్పుడే అయిదేళ్ళయింది. వెంకన్న ఆమె చచ్చిపోయిన మరుసటి రోజునుంచీ గిన్నెపట్టుకు వీధిలో పడ్డాడు.

# 9

నీలి – గంజీ గడుగూ, అంబలీ సంబలీ త్రాగే కడుపుకు దంపుడు బియ్యం అన్నం తగలటంచేత, నరాలలో జవసత్వాలు జేర్కొన్నాయి. యౌవనం బలిసి ఒళ్ళంతా సర్దుకుంది. అందం అన్ని అవయవాల్లో మూర్తీభవించి వక్షంలో కేంద్రీకరించింది. ఆమె యిప్పుడు విడిన గులాబీ, విరితేనియ!

పుల్లయ్య అనుకున్న సమయం. తనలా కండలు తిరిగిన వస్తాదు, పెళ్ళం బక్క చిక్కినట్లుంటే, పట్నంలో బుగతేమనిపోతాడు? ఇప్పుడు పెళ్ళం – తన ఒళ్ళుకు సరిపడ్డ వొళ్ళు – మనసు కలిసిన మనిషి – మాటలో మాట – తన పెళ్ళం!

గుడ్డెలోని బీరకాయలు, అనపకాయలు, చెరుకుముక్కలతో తట్ట నిండిపోయింది. మొగుడూ పెళ్ళాలు ముస్తాబులయ్యారు. నీలి యెర్రటి అంచుగల తెల్లటి చీర కట్టింది. తల దువ్వుకుని మెట్టవేసి కళ్ళ నిండుగా కాటుక పెట్టింది.

పుల్లయ్య బస్తీకి వెళ్తున్నాడుగదా! చేతికి కాశీతాడు కట్టాడు. తెల్లని పలాచని కళ్ళీలాల్చీ, లోపల నలుపురంగు బనియను, బనియనుమీద తెల్ల దారంతో కుట్టిన రావియాకు, వోణీతో వారతలపాగా చుట్టాడు. మెడలో కాశీతాడు, చంకన బాణాకర్ర, గేరా గిరజాల చివరల వెంబడి కారేటట్టు నూనె, ముంగాలు వరకూ పంచెకట్టు. అద్దంలో బాగా చూసుకున్నాడు బయలుదేరేముందు.

రోడ్డు ఎక్కారు యిద్దరూ. ప్రొద్దుటెండ వీపుకు తగిలి వెచ్చగా ఉంది. ఈ మాట ఆ మాట ఆడుకొని కదిలిపోతున్నారు దంపతులు.

నాలుగు క్రోసుల దూరం ఎంతసేపు.

ఇక బుగత సంగతి! ఆయనపేరు సీతారామస్వామి బి.ఎ.బి.ఎల్. ప్లీడరు. ఈయనతండ్రి నవిరి గ్రామకరణంగా వుండేవాడు. ఆ గ్రామంలో సగం భూములు, ఆ రోజుల్లో ఒక మాలుకోదారివి. ఆయన పట్నంలో ఉంటూ అంబారం వగైరాలు వసూలుచేసే బాధ్యత యీ కరణంగారిమీద వదిలివేసేవాడు. కొన్ని సంవత్సరాలు సవ్యంగానే వెళ్ళిపోయింది. మాలుకోదారువలన కొంత రాబడి సంపాదించుకొన్నాడు. కరణం బ్రతకడానికి లోపం లేకుండా సరిపోయేది. ఒక సంవత్సరం మాత్రం దగా చేశాడు.

ఆ యేడు దక్షిణాదిన కరువు పుట్టింది. ధాన్యం ధరలు వుండివుండి పెరిగిపోయాయ్. పెరిగిన ధరకి అమ్మి. ధరలు పెరగకమునుపే అమ్మానని, మిగతా డబ్బు కాజేశాడు. భూములు కొన్నాడు. కొడుకుని పట్నం పంపించాడు. పెద్ద చదువు చదివించి కలెక్టర్ని చేస్తానని వూరంతా చాటాడు. కొడుకు వాగ్దాటి విని కొడుకు తప్పక కలెక్టరవుతాడని నమ్మాడు. నోటికీ బుర్రకీ ఎక్కడా సామ్యం కుదరలేదు. దండయాత్రలు సాగించి ఎలాగో మద్రాసులో చదివి ప్లీడరుపట్టా సంపాదించుకున్నాడు కొడుకు.

కొడుకు స్వగ్రామానికి దగ్గరనావున్న పట్నంలోనే ప్రాక్టీసు పెట్టాడు. సంపాదన శూన్యం. ముసలివాడు మదుపు పెట్టవలసి వచ్చేది. రెండు కుటుంబాలు దివ్యంగా

గడపటానికి సంపాదన కోసం – అందులో మిగిల్చి ఆస్తి చెయ్యటానికి – ప్రజలను తుడిచేసేవాడు. భయం, భక్తీ ప్రజల్లో వుండేది. ముసలాడి మాటలకు అడ్డూ అపూ వుండేది కాదు. ఆ బాబుకి అనుభవించాలని వుంది, అనుభవిస్తున్నాడు. మనకి రాతలేదు – లేదు. ఒకడికి వున్నాదని యేడిస్తే రెండు కళ్ళూ పోతాయని సమాధానపరచుకొనేవారు. అసూయ అనేది అనాటి ప్రజల్లో సాధారణంగా వుండేది కాదు. ఆ తరం సరి.

సీతారామస్వామి తరం వచ్చింది. ఈయన పట్నం మకాం ఈ పల్లోలోని ఇంటిని మట్టిలో కలిపింది. పట్నంలో తండ్రి ఉన్నప్పుడే పెద్దయిల్లు కట్టించుకున్నాడు. ఆ రోజుల్లో కూలీలు బళ్ళతో ఇటికలు రాళ్ళూ, సున్నంకూడా నవిరినుండే, ఖర్చు లేకుండా వెళ్ళాయి. ఇంత యిల్లూ అయిదోవంతయినా ఖర్చుకాకుండా తయారయిపోయింది. ముసలాయనకు యింట్లో పెళ్ళం, వీధిలో ఉంపుడుకత్తె వుండేది. సీతారామస్వామికి అది లేదుకానీ, ఆడవాళ్ళంటే కొంచం పిచ్చి వుండేది. తల్లీతండ్రికి ఒకే సంతానం ఆయన పెళ్ళం. ఆస్తి కలసివస్తూందని ముసలాయన సంబంధం చేశాడు. భార్య పల్లెటూరునుంచి వచ్చినా ఆ రోజుల్లో పెద్దయింటి ఫేషన్లు తెలుసు. మణికట్టు వరకు చేతులున్న జాకెట్టు వేసేది. పట్నంగాలి తగలటంతో పలుకుకూడా వచ్చింది. ఒకవిధంగా మొగుడ్ని మించేసింది ఆమెకు సెక్షన్లతోసహా కేసుల విషయమై పల్లెటూరివాళ్ళతోనూ, ఆడవాళ్ళతోనూ నచ్చచెప్పటం తెలుసు. ఇదెంతలో పని! ఆయన నోరెత్తారంటే మునసబుకూడా ఆశ్చర్యపోతాడని క్రిమినలుకేసులన్నీ మొగుడివేనని చెప్పటంలో, భర్తకు సహాయం చేస్తున్నాననుకొని చెయ్యలేకపోతుంది. పడకగదిలో మొగుడు చెప్పిన సెక్షన్లు వప్పచెప్పగలనని గర్వం వుంది ఆమెకి. సీతారామస్వామి మొదట సన్నంగా వుండేవాడట. పెళ్ళాం నాజూకుగా వున్నా యెత్తయిన పుష్టయిన విగ్రహమే. అత్తగారికి అల్లుడిలా వుండటం నచ్చక నేటివు మందులు తినిపించింది. కానీ, మనిషి అలానే వున్నాడు.

సీతారామస్వామి జాతీయ పోరాటంలో పాల్గొన్నానని చెప్పుకుంటాడు, తన భార్యకూడా పాల్గొన్నదని తను చెప్పడు కానీ, తన భార్య చెప్పుకుంటుంది. అలా ఆమె చెప్పుకోవటం తనకు ఇష్టంలేదు. ఆ రోజుల్లో స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం వుండాలని వాదించినాడు, ఈ రోజుల్లో వాదనకు వస్తే భార్య వినకుండా వుండకూడదనే అంటాడు. తన జీవితంలో ఈ సంబంధమైన దేదో బాధ వుంది. బహుశః అది అనుమానం వల్ల వచ్చివుండవచ్చు. ఒకటి రెండుసార్లు ఆత్మహత్య చేసుకొందా మనుకొన్నట్లు జ్ఞాపకం. కాని పురుషుడనని, ధరలో రెండు తెరగుల నుత్తముడనని. భార్యను అదుపాజ్ఞలలో ఉంచడానికి, ప్రయత్నించాడు – సఫలుడయ్యాడు. కాని ఈ యాభైయ్యోపడిలో ఆమెదే పైచెయ్యి అయిపోయింది. ఆమె నోరే తన వాగ్ధాటిని మింగగలదు, ఆమె గీసిన గీటు దాటకూడదు. భార్య పెట్టిన హద్దులను మనసులోనే దాటడం అలవాటయ్యిం దిప్పుడు. ఒక్కొక్కప్పుడు తన దృక్పథాన్ని ఆమె ఆమోదించటం జరుగుతూ ఆశ్చర్యాన్ని కలిగిస్తూంటుంది.

సీతారామస్వామికి క్లయింటులు చాలా తక్కువనే చెప్పాలి. తండ్రి గడించింది లేకపోతే, బోర్డు తీసేసి యే ఆఫీసులోనో గుమాస్తాగా చేరవలసిందే, కానీ తనకున్న

ప్రాక్టీసువల్ల యెక్కడకు వెళ్ళడానికి వీలులేకపోతూందని వచ్చిన కొద్దిమందితోను చెప్పకుండా వూరుకోలేకపోతున్నాడు. తనలో గొప్పతనం, రాబాయే విషయాలని గ్రహించే దూరదృష్టేనట. దానికి తను ఎన్నైనా ఉదాహరణలు యివ్వగలడు! తన ఒకేఒక కొడుకు విషయమే ఉదాహరణ, కొడుకు పేరు వెంకట అప్పల రామనరసింహారావు – దేముడు. తల్లి, తండ్రి అందరిపేర్లు ఈ పేర్లో కలిశాయి. ఈ రావూ ఒక ప్లీడరే. తండ్రీ కొడుకు బోర్డులు గేటుకు రెండువైపులా ఉంటాయి. రెండూ ఒకే సైజువి కానీ, ఇద్దరు మనుషులూ వేరేసైజు – చెట్టుమొదలు – చీపురుపుల్ల! తండ్రికి నోరున్నాది, బుర్రలేదు – కొడుక్కి బుర్రున్నాది, నోరులేదు అంచేత అర్జన లేదు. ఆస్తిపాస్తులమీద ఆధారపడి వుండవలసి వస్తోంది.

వెంకట అప్పల రామనరసింహారావుకు – అన్నీ మనసులో పెట్టుకోవటం అలవాటు. తండ్రి ఒక సంబంధం చూశాడు. ఆ పిల్ల స్కూలుఫైనల్ వరకు చదువుకుంది. శరీర పొందికలో తనకు తీసిపోదు. ఈ రావు కండలు తగిలిన వెచ్చని కౌగిలికోసం తహతహలాడేవాడు. కానీ తండ్రికి ఇష్టంలేదని చెప్పలేదు. ఆ అమ్మాయికి ఒకేఒక తమ్ముడు వుండేవాడు. అమెలానే చీపురు పుల్లలా వుండేవాడు. రావుకు పెళ్ళయిన పదినెలలకే ఆ అర్భకుడు చచ్చాడు. ఆ ఆస్తంతా కోడలికి కలవబోతోంది. తన దూరదృష్టికి నిదర్శనం ఇదైనా, సాధారణంగా పై వాళ్ళతో చెప్పడు. ఈ రావుకి పెళ్ళం కాపురానికి వచ్చాక నాలుగు సంవత్సరాల్లో ముగ్గురు ఆడపిల్లలు పుట్టారు. అంతా యించుమించు తల్లి రూపే – పోతే ఒక పిల్లకు మెల్లకన్ను; ఇంకోపిల్ల నల్లగా వుంటుంది. వీళ్లు పెద్దయి, చెల్లడానికి ఆ కలసిన ఆస్తి చాలదని అంచనా వెయ్యొచ్చు.

పుల్లయ్య తాతలకాలంనించీ నీళ్ళతో సంబంధం వుంది. పుల్లయ్య తాత రెండెకరాల పొలం రావు తాతదగ్గర అంబారానికి పుచ్చుకున్నాడు. పుల్లయ్యతండ్రి మల్లునాయుడు మా పౌరుషంకల మనిషి, సీతారామస్వామి కొద్దిగా అలస్యానికి ఒప్పుకోక మాటంటే, స్వంతభూమి అమ్మి పంట పోయినా అంబారం కొలిచాడు. ఆ నాటినుంచీ అంత సవ్యంగానే సాగిపోతూంది.

పుల్లయ్య పెళ్ళాంతో పట్నం చేరేసరికి పొద్దు చుర్రుమంటోంది. ప్లీడర్లిద్దరూ యింటిలోనే కోర్టు సృష్టించారు. భార్య వాదిస్తోంది యేదో విషయంమీద. కొడుకు మాటాడకుండా వింటున్నాడు. పుల్లయ్యను చూడగానే పెద్దప్లీడరు "ఏంవోయి పులుపు అయ్యా" నవ్వుతూ అన్నాడు.

"వా డెక్కడ? తియ్యటి మనిషి కాబట్టే బంతిలాంటి పెళ్ళాన్ని కట్టుకున్నాడు." అందుకుంది భార్య. దండం మ్రొక్కి ఇద్దరూ కొద్దిగా సిగ్గు పడ్డారు. చిన్న ప్లీడరు చూపు ఒకసారి నీలిమీద పడింది. మనసు ఇక పని చెయ్యటానికి పూనుకుంది. విరామమెరగని పని! "ఆ రాత్రి వాళ్ళు ఉండిపోతే పుల్లయ్యకు మత్తునిద్ర పట్టే.... .తను యేదో పుస్తకం పట్టుకొని వరండా గదిలో, రాత్రి పంద్రెండు గంటల వరకూ తెలివేసుకొనివుంటే....నీలికి నిద్దరపట్టదు....ఆ వెలుతురువేపు కళ్ళుంటాయ్....తను లేవలేడు....ఆమె! అందం పల్లెవనితల సొత్తు..... రోజంతా అద్దం ముందున్నా......ఈ పట్నంలో అందం అరనిముషంలోనే అరగిపోతుంది!......అయితే నీలికి నిద్రపట్టదు,"

కోడలు వంటయింటికి వెళ్ళింది. పుల్లయ్య చిన్న సిగ్గుతో "బాబూ! ఆడమ్మ లేని ఇల్లు. ఏ ఉండావండూ...... నోరు చచ్చిపోయింది. ఇదిగో యీ సిన్నదాన్ని....."

"మంచిది – మంచిది." తల పంకించాడు పెద్దప్లీడరు. "నీ పేరేం?" అన్న యజమానురాలి ప్రశ్నను పుల్లయ్యే "నీలమ్మ – ఊరంతా నీలి అని పిలుస్తా"రని అందుకున్నాడు.

"శుభ్రంగా పనిపాటలు చేసుకుంటుందా?"

"ఓ! మనిషి కనబడ్డంలేదూ? పని సెయ్యకపోతే మనిషెలా సేవతేరతాది? పెద్దలు అంటారు – కూకున్న కూతురు కూలిపోయింది, చేసిన కోడలు సేవతేరిందని."

పుల్లయ్య మాటలకు పెద్దప్లీడరు పకాలుమంటూ "మా యింట్లోనా వంటపుట్టి – యిద్దరు నౌఖర్లునూ...." అన్నాడు.

పెళ్ళాం కాస్త తీక్షణంగా చూసిందని కామోసు ఆగిపోయాడు. కానీ పెళ్ళాం నోరెత్తింది. "మా కేంటోయ్ పుల్లయ్య! ఆయన జడ్జీ ఉద్యోగం ఇస్తానంటే యెందుకొద్దన్నారో తెల్సా?"

"చిత్తం! చిత్తం!"

"మనకు స్వతంత్రం వుండదోయ్! రేప్రొద్దున వోట్లగాడవాస్తే మరి ఆయన మంత్రి అయిపోరా?"

"చిత్తం! చిత్తం!"

"కూర్చో అమ్మీ!" పెద్దప్లీడరు నీలివేపు తిరిగి అంటూ అంగడికి వెళ్ళిపోయాడు. నీలి చీర సర్దుకొని ఆ పెరటి వరండా గచ్చునేలమీద కూర్చుంది. వరండాకు ఆనుకొనివున్న గదిలో చిన్నప్లీడరు కుర్చీమీదనుంచి, ఒళ్ళంతా కళ్ళు చేసుకొని నోరావలించి నీలిని మింగేస్తున్నాడు.....ఆలోచన......అన్నీ దాటి.....చీరలోనుంచి చొచ్చుకొని వెళ్ళిపోతోంది.

పుల్లయ్య అంగటికి యజమాని సైగచెయ్యటంతో వెళ్ళాడు. రెండు నెలల జీతం యింకా ఇవ్వలేదని కామోసు కోడలితో చెప్పి నొచ్చుకొంటున్నాడు వంటపుట్టి. తిండికివుంటే శేరున్నర బియ్యం దండుగని, పెద్ద యజమానురాలు వీళ్ళని వేగం పంపించేద్దామని చూస్తోంది.

ఇటూ అటూ వరండాలో పచారుచేస్తూ సీతారామస్వామి అన్నాడు: "బాగుంది! భేషైన పిల్లని పెళ్ళిచేసుకొన్నావ్ కానీ. ....." ఆగిపోయాడు.

"ఏం బాబో?"

"నివ్వు చెప్పిన మాట వింటాదా?"

"వినకేం బాబూ?" చిన్న సిగ్గుతో " నా నెంతంటె అంత!" అన్నాడు.

"అలాగా......అయినా ఆడజాతిని అదుపులో ఉంచుకోవాలి – నమ్మలేం!"

పుల్లయ్యకు ఈ మాటల్లో అంతర్యం అర్థం కావటంవల్ల కామోసు నవ్వి, "తమరన్నది తెలిసింది. ఏ దొచ్చినా ఆడవాళ్ళనించే వస్తాది" అన్నాడు,

"బాగా పోల్చావు! వాళ్ళని పొయ్యిదగ్గర – పిల్లలతోటి ఉంచాలి కాని, ఇళ్ళు కదిపితే......"

ప్లీడరు వుండి వుండి పెరటి వరండావైపు చూస్తున్నాడు, పుల్లయ్య అన్నాడు: "ఆడదానిని మొగోడు, మొగోడిని ఆడదీ నమ్మకపోతే – యీ పెపంచకం యెలా నడుస్తాది బాబో! అలూ మనలాగ పేణం వున్నోలేనా? యాత్రకి, జాత్రకీ.....యెల్లి సూడకపోతే....."

"ఓయి పిచ్చోడా! రానురాను నీకు తెలిసొస్తాదిలే.....నా మాట విని.....పిల్లా జెల్లా అయ్యేవరకూ పెళ్ళానికి అధికారం ఈయక!"

పుల్లయ్య చిన్న నవ్వు నవ్వాడు. పెద్ద ప్లీడరు "నా మాటలు నీకు నచ్చలేదులే! ఎన్ని వందలమందో ముందు జరగబోయేది చెప్పేజ్ఞానం నాకు ఉందని ఒప్పుకున్నారు.....నేను కోర్టుకి వెళ్ళనక్కర్లేదు.....నా కాళ్ళదగ్గిరికే వస్తారు."

"చిత్తం! చిత్తం!"

"ఇంతకీ నేను చెప్పే దేమంటే, ఆడవాళ్ళు దగా చేస్తారు జాగ్రత్త అని!"

పుల్లయ్య మాటాడలేదు, అత్తా కోడలూ పెరటిలో యేదో విసవిసలాడుకుంటున్నారు – అత్తకు తెలియకుండా వాళ్ళకోసమని వంటవాడిచేత బియ్యం కడిగించిందని!

పొద్దు తిరిగింది. యిద్దరూ శలవుతీసుకొని బయలుదేరారు. ఇంతవరకూ కొండంత సృష్టించుకున్నాడు రావు. నడుం విరిగింది, త్రోవంట పెళ్ళాం ఏవో ఏవో అడుగుతోంది. పుల్లయ్య మనస్సు అదోలా ఉండటంచేత యేదో జవాబు చెప్తున్నాడు. మొగు డలా ఉండటం ఆమె కేం నచ్చలేదు. బుగత యింటివాళ్ళంతా మంచివారని చెప్తోంది – ఇంకా పొగుడుతోంది – పుల్లయ్య వోరచూపు చూసి – "బడాయికి బచ్చలికూర తినకపోతే తోటకూర" అన్నాడు.

"ఏం అలాగ అంటున్నావ్?" అంది.

"సంసారం గట్టి, మెడ ఒట్టి!" అన్నాడు.

చలికాలపు పొద్దు వేగంగా సముద్రానికి దిగిపోతోంది. రోడ్డుమీద నాటుబళ్ళు గడగడ చేసుకొంటూ సంతనుంచి తిరిగి వచ్చేస్తున్నాయ్. ఒక బొగ్గు బస్సు బొక్కు బొక్కు లాడుకుంటూ వెళ్ళిపోయింది పట్నంవైపు. మర్రిచెట్టునీడలు దాటివస్తూంటే, రోడ్డుప్రక్కనే అంతదూరంలో చెరువు కనబడింది. చెరువు నానుకొని పల్లపుభూములు, వాటి నానుకొని మెట్టభూమి, ఆ చెట్టు నానుకొని చిన్న గుట్ట!

మాటాడకండా మొగుడన్న మాటల్లోని అర్థాన్ని గ్రహించిన నీలి మెల్లగా అన్నది: "మనం పెడితే పెళ్ళికోరటం – పెట్టకపోతే చావు కోరటమా? ఒకరి మంచితో మనకి సంబంధం కానీ, ఒకరి సెడ్డతో లేదని మా మామ్మ సెప్పింది. ఆ బాబు బతకటానికి ఆదరువు సూపించాడు కదా! యెందుకలా అంటావు?"

పుల్లయ్య యింక పౌరుషంతో దాచలేకపోయాడు. "అత్తాకోడలూ అలాగయి పోయారే? మనం కూడు కెళ్ళామే! ఆ బాబు నిన్ను నమ్మొద్దంటాడు – దగా సేస్తావట!"

మరి కోపంతో మాటరాలేదు. ఎదరగా చెరువు కనిపిస్తోంది. చెరువు దగ్గర ఆగి కాళ్ళూ చేతులు కడుక్కొని పడమటివైపు తిరిగి ఒక క్షణం కళ్ళు మూసింది. మళ్ళీ మొగుటివెంటపడ్తూ "పెద్దబాబు... ఆ మాట ఎందుకొచ్చిందో. ...మన చేతిలో ఏం వున్నాది! అన్నిటికీ ఆ దేముడున్నాడు!" అనుకుంది.

పుల్లయ్య వోరచూపు చూశాడు.

# 10

పండిన వరిచేలు కొయ్యకుండానే పెసర విత్తనాలు చల్లారు. చలికాలం ప్రతిభ చూపిస్తోంది. అడ, మొగా, పిల్లా, పిచ్చికా, దుప్పట్లు, కోకలూ గెంట్లు వేసుకోవటం మొదలుపెట్టారు, ముసలమ్మలు కుంపట్లు ముందుంచుకొని అడ్డ పొగచుట్టలు కాలుస్తూ వెచ్చగా ప్రొద్దున్న సాయంత్రం మూలకూర్చునేవారు. చుట్టూ చేరిన పిల్లలకు ముచ్చట్లూ, పేదరాశి పెద్దమ్మ కథలూ చెప్పేవారు. ఎండప్పుడు వాళ్ళూ పొలాలకు కొడవలి పట్టుకొని వెళ్ళేవారు.

కోతలు సాగుతున్నాయ్. అందరికీ తీరుబడిలేని పని. లేనివాళ్ళూ, పిల్లలూ, కలవారి పొలంవెంబడి అక్కడక్కడ పడిన ధాన్యపు వెన్నులు యేరుకొని బుట్ట నిండాక ఇంటి కొస్తున్నారు. లేచిన పెసర మొక్కలు ఇస్తున్న లేత పచ్చదనంతో పొలాలన్నీ మనోహరంగా కన్పిస్తున్నాయి. ఓమూలనుంచి జంటజంటలు పదాలు పాడుకుంటూ చేస్తున్న పనివల్ల కొద్దిగానైనా అలసటలేకుండా ముందుకి సాగిపోతున్నారు. ఓమూల కోసిన పొలాల్లో కుప్పలు పెట్టిస్తున్నారు. ఇంకోప్రక్క బళ్ళతో కుప్పలను దగ్గరగావున్న కళ్ళాల్లో వేస్తున్నారు.

ఎక్కడ చూసినా ఉత్సాహమే. నీలికూడా పొలాలలో పదాలు పాడింది. పుల్లయ్య అప్పుడప్పుడు వంతపదం పాడేవాడు. ఇలా సరదాగా పొలంలో పంట కళ్ళానికి వచ్చింది. కళ్ళంలోనించి ఇంటికి, ఇంటినుంచి బుగతగారింటి కెళ్ళాలి.

కొడవలి చేనులో దోపిన దగ్గరనుంచి కొత్త ధాన్యం పుడకబోసి యెండాక దంచి, ఆ బియ్యం అన్నం తినటం చాలామందికి పరిపాటి, నీలికి ఇంటి పెద్దరికం వచ్చింది. మొగుడికి యిష్టంలేకపోయినా చెయ్యికి తిరుగులేదు. చాకలికి, మంగలికి పంటమోపులు యిచ్చింది. ఊరి బడిపంతులుకు ఇచ్చేటప్పుడు పుల్లయ్య కలుగచేసుకున్నాడు.

"మనకేం పిల్లలున్నారు చదువుకి? పందుం ధాన్యం అంటే యేంటనుకున్నావ్?" అన్నాడు.

"పాపం! పిల్లలుకలోడు ఆ బాబు! నలుగురూ నాలుగు పందుంలిస్తే బతుకుతాడు" అంది.

మూతి బిగించి పక్కకు తిప్పుకున్నాడు మొగుడు. మార్పులు అయ్యాయి. పొలిబెంటు నుండీమీద పెట్టారు. ఎగరబోత అయ్యాక రాసి తోశాడు, ధాన్యం పొలిబెంటు చేటలో వేసి పొలంకు వెళ్ళాడు. కొంటికర్రతో పొలంలో బెడ్డ తీశాడు, గొయ్యిలో ధాన్యం పోశాడు; దండం పెట్టాడు. ఆ బెడ్డ వినాయకుడిని కళ్ళంలోని రాసిమీద పెట్టాడు. కయిలునాడు రాసట్లు చేసింది నీలమ్మ, ఉప్పు, బెల్లం వెయ్యని ఆ అట్లు వినాయకుడు అరగించాడు. కొబ్బరినీటితో అభిషేకం చేయించుకొని, ఇంట్లో ధాన్యపు గాదిలో మొదట కూర్చున్నాడు – ఇక ధాన్యపురాసి కళ్ళంనుంచి వచ్చి పడింది గాదిలో – గాదిలోంచి పట్నం బుగతగారింటికి కదలాలి!

గంగిరెద్దువాళ్ళ కిదే సమయం! ఊళ్ళో కోమటిపేరయ్య గడించటానికి ఇదేకాలం – మందలి సోదెమ్మకూ ఇదే టైము.

"ఓయమ్మ - వాతనొప్పులకి మధువాయనొప్పులకి మందు - మంచి మంచి ఔషధాలున్నాయ్ -"

ఒళ్ళంతా ఇత్తడి సరుకులు. మెడనిండా పగడాలపూసలు - చంకన పిల్లడు - చేతిలో తంబుర - నెతిన బుట్ట!- నోటినిండా మాట - మందలి సోదెమ్మ!

"సంతానంలేదు".....పొరుగమ్మ అందుకుంది....నీలిపైపు చూసి సోదెమ్మ "లేక పోవడమేంటి తల్లీ - పద్దెనిమిది గాడిదలమీద వచ్చిన పురండాలు (పురాణాలు)- కన్ను పోయినా, కాలు పోయినా, పిల్లలు లేకపోయినా, అన్నింటికి ఆ దగ్గర లేనిదిలేదు - కొలిసి ముప్పయికుంచాలు కొలక ముప్పయి కుంచాలు - ఇది గురువాగ్య, తల్లి! గురవాగ్య - గురువాగ్య - తప్పినోడు గుర్రవై పుట్తాడు - గనమెరికి బతకనోడు గాడిదై పుట్తాడు!"....

"ఒక్కదాని కింత కర్చా -" పొరుగమ్మ ముక్కుమీద వేలు వేసుకుంది, లోనుంచి ముసలమ్మ అందుకుంది - "నీలమ్మా! నువ్వు ముసలిదానవా, ముతకదానివా? మందులోని మరల్లో పడక!"

సోదెమ్మకు కోపంవచ్చింది. ముఖం ముందుకుతోస్తూ అభినయంతో,

" ఓ యాగరెప్పలదాన - సీపి కల్లదాన
పెట్టిన కూటిలో బుగ్గిపోస్తావా?
వీకానికి యెల్తే వానలుండవు -
దిగానికి వస్తే పంటలుండవు -"

ఈ సాప్యంపెట్టి మందివ్వకండానే వెళ్ళిపోతూంది - సోదె సెప్పకండానే పారిపోతోంది. నీలి పిలిచింది - రాలేదు. మళ్ళీ పిలిచింది......

"నాడి తెలిసినోడే మందులోడు - కీలకం తెలుసుకోవాలి.....గురువాగ్య!" అంటూ తిరిగి వచ్చింది.

"సూడు సోదెమ్మా! నాకెందుకు మందు -ఇంద - తీసుకువెళ్ళు..." అంటూ అడ్డెడుధాన్యం పోస్తూంటే పొరుగావిడ ముక్కుమీద వేలు వేసుకుంది. సోదెమ్మ "మళ్ళా యీరోజులనాడు రానా....పండులాంటి కొడుకు నెత్తుకోవా తల్లీ!" అని దీవించింది.

పుల్లయ్య బుగతకు అంబారం కొలవగా మిగిలినదానిలో వూరిలో రివాజు ప్రకారం అదెమ్మప్ప దగ్గర పెళ్ళికి తీసుకున్న డబ్బుకి వడ్డీ ధాన్యం కొలిశాడు. అదెమ్మ అల్లుడు, డబ్బుకి పద్దు రాయించుకొన్నాడు. ఆ డబ్బు యెలాగ తీర్చడం? మిగిలిన ధాన్యంతో యెలాగో సంవత్సరమంతా గడుపుకోవాలి.....ఇన్నాళ్ళూ ఒకేప్రాణం. యిప్పుడు మూడుప్రాణాలు! అందులో పెళ్ళానిది చిక్కని చెయ్యికాదు! నీలి కాళ్ళూ చేతులు లేవా అన్నది.

పుష్యమాసం సాతానివాళ్ళ పదాలతో బంతీచేమంతుల వాసనలతో వుషారెక్కి వూగుతూ వెళ్ళిపోయింది. వచ్చింది మాఘం. శుద్ధ వీకాదశినాడు కొండమీద యాత్ర! నవిరికి దక్షిణాన - క్రోసున్నరదూరాన వున్నదా కొండ - సాలెహొండం. చరిత్ర ప్రసిద్ధికెక్కినదది - ఆ కొండమీద విష్ణ్వాలయం. ఆ చుట్టుపట్ల వూళ్ళనించి ఆడా మొగా, పిల్లా జెల్లా - బయలుదేరారు - తెల్లవారి ప్రొద్దు లేచింది - చలిగాలి

వీస్తోంది. కొండకు ప్రక్కగా పారుతున్న వంశధార నదిలో వేలకొలది జనం స్నానాలు చేస్తున్నారు - స్నానఘట్టంనుంచి కొండకు వెళ్ళేవరకూ, యిరువైపులా గుడ్డలుపరచి, భిక్షుకులు బారులుతీర్చి కూర్చున్నారు. స్నానాలస్థలంలోనే భజనలు చేసేవారు. తప్పెడిగుళ్ళు వాయిస్తూ ఆ యిసుకలో పరవశమై నాట్యంచేసే గుంపులు! ఆ పాటలు అమడదూరం వినిపిస్తున్నాయ్! జనసమూహం దూరాన్నుంచి చూస్తుంటే, బారులుతీరి పోతున్న చీమల సమూహంలా వుంది. సాధువులు సమూహంలో చేరి, విభూదిబొట్లు ప్రజలకు పెట్టి సత్కారం పొందుతున్నారు.

నీలి, పుల్లయ్య కలిసి జాతరకు వెళ్ళారు. తలకు స్నానంచేసి కాంతి నిచ్చే తండ్రికి ఒకమ్రొక్కు మ్రొక్కి కొండవైపు బయలుదేరారు. కొంగులో పోసిన బియ్యం, దారికి రెండు వైపులా పరిచిన గుడ్డలమీద వేసుకుంటూ నీలి ముందూ, వెనుక పుల్లయ్యా నడుస్తున్నారు. పట్నం నుంచి మంచి కళాకారులు, కిళ్ళీ దుకాణం మనిషికూడా వచ్చారు. పట్నంలో కనబడని అందం యిక్కడే ఉంది. ఈ పల్లెయువతుల కూటమిలో స్వాభావికమైన వంపులతో కూడుకున్న సొంపుఖ తిలకించడానికి.....వచ్చారు! ఓ మూల కూర్చుని, అమాయికంగా ముందుకి నడుచుకుపోయే - అతివల శరీరపు బిగువులలోనికి తీక్షణంగా చూస్తున్నారు కొందరు. యౌవనం తొణికిసలాడుతున్న కాళింగ వనితలు - బంగారు ఛాయతో శృంగారంగా అందాన్నంతా జీర్ణించుకొని, ముందుకు సాగిపోతున్నారు - చూచేవాళ్ళకి కనుల పండువుగా ఉంది.

పసుపు రాసుకున్న ముఖాన పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుంది నీలి - పళ్ళూ, కాయలూ కొని కొండమీదకు ఎక్కుతున్నారు - అక్కడక్కడ పందిళ్ళు వేసి ఉన్నాయ్ - ఆ కొబ్బరి పందిళ్ళమీదకు పళ్ళు విసురుతున్నారు. అక్కడక్కడ నిల్చుని పదాలు పాడే భిక్షుకులు - వెనకనే పకాలున నవ్వుతూ, వెంటపడే పట్నపు కుర్రాళ్ళు - ఆ నవ్వును వినకండా పల్లెప్రజ ఒకటే దృష్టి - కొండమీద దేవుడు - ఆ తండ్రి దర్శనం దొరకాలి - జన్మ తరించాలి! రాతి విగ్రహంలో రమణీయత చూస్తారు. అందులో జీవి కళకళ్ళాడినట్లుంది. వాళ్ళ ప్రార్థనలు విని మనో ఈప్సితాలు అర్థం చేసుకుంటుం దా విగ్రహం! తాము తమ భక్తిని అర్పించామనే తృప్తికి నివాళిగా ఈ పళ్ళూ, కాయలూను! విశ్వాసంలో బ్రతుకుతారు - విశ్వాసమే వాళ్ళ పరమావధి - ఆ విశ్వాసంలోనే ఆనందం పొంది తరిస్తారు.

ప్రజ మీదికి కదిలిపోతున్నారు. ఈ దంపతులు భక్తితో తన్మయులై ముందుకు సాగిపోతున్నారు - ఒక సాధు దగ్గరగా ఎత్తున గౌరీపార్వతులు నందివాహనంమీద కూర్చున్న బొమ్మ ఉంది - శంకరుడు నవ్వుతున్నాడు - అదిగో హాలాహలం మింగిన నీలకంఠుడు - చిరునగవు వలకబోస్తున్నాడు - నందివాహనారూఢుడై ముందుకు వస్తున్నాడు. భక్తితో ఇద్దరూ తలలు వంచారు. సాధువు ఇద్దరి తలలపై చేతులు అన్చి "పండ్లు దానం చేశారు! పండులాంటి కొడుకు పుట్తాడు!" అని దీవించాడు. పుల్లయ్య ఒళ్ళు జలదరించింది! కొడుకు - ఈ మధ్య పెళ్ళం వలపు తళుకుల్లో, లీనమై కొడుకు విషయమే మరిచిపోయాడు. కొడుకు కోసమే కదా తను పెళ్ళాడింది! నాయంకీ నీతికీ కట్టుబడేవాడు - దొంగలను పట్టే దొర - తనకంటే గరిడీలో ఘటికుడు తన కొడుకు - కనిపిస్తున్న పిల్లలందరిలోనూ,

తన కొడుకు అగుపిస్తున్నట్లుంది – "నా కొడుకు ఇంత తెల్లగా వుంటాడేమో! ఇంతకంటే మొఖం బాగుంటుంది – ఈ కొండ యిలా యిట్టే ఎగబ్రాకేస్తాడు."

కొడుకు తలపుతో కొండ ఎక్కిపోయాడు. కోవెల దగ్గర జనం త్రోసుకుంటున్నారు. ఆ సమూహంలోనికి చొచ్చుకపోవటం బ్రహ్మాండమైనపని. తనైతే వెళ్ళగలడు. నీలి, తనూ ఇద్దరూ వెళ్ళాలి. మనసుతీరా మ్రొక్కాలి. ఎంతోమందిలా వీళ్ళూ కోవెలమీదకు అరటిపళ్ళు విసిరేశారు. దేముని దర్శనం అయిందికాదు మొదట. కానీ అలా వోర్చి వుండేసరికి, ప్రొద్దు తిరిగిపోయింది. చలికాలపు ప్రొద్దు గబగబ దిగిపోతూంది. జనం ఎద్దడి తగ్గాక స్వామిదర్శనం చేసుకొని, రెండోవైపునించి కొండ దిగారు. పట్నంనుంచి రకరకాల వస్తువులు, దుకాణాలు, కాఫీ హోటళ్ళు, పల్లెల నుంచి చెరకుబళ్ళు, పండరి భజనదళాలు వచ్చాయి. ఒక మూల గారడీ జరుగుతోంది. ఇంకోప్రక్క రంకులరాట్నం! సంబరం అంతా చూశారు. అప్పుడే జనం పల్చబడుతున్నారు. సెనగలు, ఖర్జూరం, చెఱుకులు కొన్నారు. ఎంత బలవంతం చేసినా నీలి అట్టే ఏమీ తినలేదు. ఒళ్ళంతా త్రిప్పుతున్నట్లుంది. అయినా మొగుడితో చెప్పక వెంట నడిచింది. అటువైపునుంచి నవిరి రావటానికి రోడ్డు వుంది ఆ రోడ్డుమీద కొంతదూరం వచ్చాక అడ్డత్రోవలో పొలాల గట్లపైనుంచి నడుస్తున్నారు. నీలి కుంటుపడుతోంది. వాళ్ళను దాటుకొని వెనక బయలుదేరినవాళ్ళు ముందుకు వెళ్ళిపోతున్నారు.

సాయం సమయం! పడమటి ఆకాశం తెలుపు ఎరుపుల కలయికతో మనోహరంగా వుంది. అక్కడక్కడ చెదరిన మేఘాలు, కుంకుమలో తరిచిపోయినట్లున్నాయ్. ఒకే ఒక తాటిచెట్టు ఆకాశంలోకి చొచ్చుకపోయింది. పక్షులు ఎర్రటిపళ్ళతో నిండిన వటవృక్షమని కామోసు, అటువైపు యెగిరిపోతున్నాయ్! దిగువ పెసరచేలు ఇంపుగా ఆకుపచ్చని రంగు పూశాయి. ఒంటిగా ఒకే గుట్ట భల్లూకంలా భానుణ్ణి మింగేస్తోంది!

ముందుకు చూస్తే యేరు! మెల్లగా ఈ అందమైన అందివ ప్రకృతిని నములుతూ దిగువకు కదిలిపోతోంది. అవతలి ఒడ్డున గుబురుగా యెత్తుగా లేచిన సరుగుడుచెట్లు సరాగాలాడుకుంటున్నాయ్. ఒంటరిజాలరి వలను చేపలమీదకి విసురుతున్నాడు!

ఆ దృశ్యాలన్నీ మధురాతిమధురంగా ఉంటే పుల్లయ్య కాళ్ళు గబగబ పట్టాన్నాయ్! నీలికి ఏదో ఒళ్ళంతా వెర్రి అయిపోయినట్లుంది. ఇంక నడవలేక కూర్చునిపోయింది – ఆ దగ్గరగానే పాములపుట్ట!

"ఓపిక చేసుకో – అదిగో కన్పిస్తోంది మన వూరు!"

నీలి మాటాడలేదు వెనక వచ్చే జనం అట్టేలేరు. చీకటి పడడానికి ఇంకెంతో సమయంలేదు. చలిగాలి అప్పుడే వీస్తోంది. చంద్రుడు మెరుగులు దిద్దుకోడానికి సన్నాహం చేస్తున్నాడు.

నీలికి కడుపు తెమిలేసి పెద్ద వాంతి అయ్యింది. పుల్లయ్య గాభరా పడ్డాడు. నీలి ఫరవాలేదంటున్నా, ప్రక్కల నిల్చొని పెళ్ళాం చెంపలు గట్టిగా నొక్కి పట్టుకున్నాడు. ఆ పుట్టప్రక్కనుంచి పాము వాళ్ళని చూడనట్లే వెళ్ళిపోతూంటే నీలి గతుక్కుమని లేచింది. ఇద్దరూ నమస్కారం చేశారు. ఆ సర్పరాజం వీళ్ళవేపు చూడకుండానే అలా పొలంగుండా పెసరుచేలలు చీల్చుకుంటూ వెళ్ళిపోయింది.

ఇద్దరూ ముఖాలు చూచుకున్నారు. మెల్లగా భర్త భుజం పట్టుకొని నడుస్తూంటే మళ్ళీ కడుపు తెమిలేసింది. అప్పుడే ఒక ముసలమ్మ, మనవడూ యాత్రనుంచి అగి ఆగి వస్తున్నారు. గాబరా పడ్తూన్న పుల్లయ్యవైపు నవ్వుతూ చూసి బోసినోటితో, "ఎన్నాళ్ళయింది నాయనా పెళ్ళయి?" అని అడిగింది.

సమాధానం చెప్పటానికి ఆ మాటలు వినిపించుకుంటేగా? మెల్లగా ముందడుగు వేస్తూ వేస్తూ నీలి ముఖంలోకి చూస్తూ చూస్తూ చిన్న నవ్వుతో "పండులాంటి పిల్లాడిని ఎత్తుకుంటావులే!" అంది.

పుల్లయ్య ఆ మాటలు వినగానే ఒక్క ఎగురు ఎగిరాడు. నీలి చిరునగవు మెరుపుతీగలా ఒక్కసారి మెరిసింది!

# 11

ఆ సంవత్సరం చలి మామూలుకన్నా హెచ్చుగా ఉంది. వార్తాహరుడైన పీస పట్నంనుంచి చలి హెచ్చవటానికి కారణం తెలుసుకు వచ్చానన్నాడు. "జపానోడు వోడిపోతూ అవుసుబాంబు యేసేసి నోడట! అది గాలిలోన కలిసిపోయి ప్రపంచకమంతా సుట్టేస్తోంది!" చాలామంది ఈ వార్త నిజమని నమ్మారు.

ఈ బాంబు ప్రభావం గుడ్డి వెంకన్నకు గన్నెమ్మలాంటి గతిలేని ముదుసలికి బాగా చూపించింది. నీలి, కొద్దిగా చిరిగిన కోక యిచ్చింది. "నా తల్లి ఆ రోజుకి మనవడి కింద యేయడానికి ఒక గుడ్డపాత యిచ్చుకొంటానే" అన్నది గన్నెమ్మ. నీలి చిన్న నవ్వునవ్వి "మనవరాలు పుట్టే?" అంది. పుల్లయ్య విని, "నోరుముయ్" అని కేకవేశాడు. "నా కొడుకు నాలాగ గరిడీలో ఘటికుడు.....దొర!" అన్నాడు దర్పంగా.

నీలి బదులు చెప్పలేదు. పుల్లయ్య ఊహలో పడ్డాడు. కొడుకుకు ఏయే విద్యలు యెలా నేర్పాలో! ఏడాదికే యెగిరి మొగ్గలెయ్యడా అనుకున్నాడు!

పీస జోస్యం చెప్పాడు. "ధరలు పెరిగిపోయి మనుషులు గంజిలేక మలమల మాడిపోతారు! పట్నంలో అప్పుడే రాసనింగు వచ్చింది!.......మనకీ వస్తాది. ఉన్నాడు లేదంటాడు; లేనోడు బతకలేడు. మనకు లేకపోయినా మువ్వా నాను ఒకటని వుంటున్నాం. అప్పుడా! నీకు నువ్వే నాకు నేనే! పట్నం అసలు అధ్వాన్నం మరీ అధ్వాన్నం అయిపోతున్నాది! ఎగిరేపిట్టను పంజరంలో పెడ్తామంటాడు, గవర్నమెంటోడు! రేప్పొద్దున్న పండ్లూ గవర్నమెండోడే తోమాలని అర్జీలు పెట్టుకుంటారట!"

అంతా చిత్రవిచిత్రంగా ఈ మాటలు విన్నారు. తలోలా అనుకున్నారు. గుడ్డిదాసుడు, తన అగ్రపీఠాధిపత్యం నిలుపుకోవాలని సాయంత్రం నీలమ్మగుడిలో శివాలు వేశాడు. "ముందుకి ముసలం వున్నాది మనిషికి – మనిషికి పులిపంది వోరడి అవుతాది! అకాసాన మేఘాలుండవు. దిగవని పచ్చని జాగా వుండదు: దూతలు ప్రజలమీదపడి నొల్లేస్తాయి. కళకళ్ళాడిన వూళ్ళే దిబ్బలయిపోతాయి–"

చుట్టూ మూగినవారు చేతులు జోడించారు. "తల్లీ, నువ్వే మొండి చెయ్య

చూపిస్తే, పిల్లల కడుపులు మాడవా? నువ్వు తలుసుకుంటే ఆకాసాన మేఘాలు కరువా? నీ పిల్లలు పచ్చగావుంటేకదా నీకు సంబరం చేస్తారు!"

దాసుడు గొంతుక గగనానికి వినిపిస్తోంది: "ఓరీ నాయనలారా! నేను దూతలతో దెబ్బలాటకు దిగానురో! నా బిడ్డలకి అన్నానికి దూరం చేస్తానా? ఎవరు సెప్పిన జోస్యం మీరు నమ్మకండి, తిమ్మన్నలాగ అత్తోరికుండంటే యెత్తేటం - కన్నోరికుండంటే మోయటం సెయ్యకండి! అంతా ఒకటే అని - గద్దుకాలానా, వున్నోలు పేదారోదకి సూశారంటే - మనిషిని మనిషి నమ్మారంటే - ఆకాశం బద్దలైనా, భూమి భుగభుగ మండిపోయినా.....ప్రజకి డోకా లేదురా!"

దాసుడు తన పని నిర్వర్తించాడు. ఇక కోమటి పేరయ్య యిదివరకు పెద్దసోలతో ధాన్యం కొలిసి, చిన్నసోలతో వుప్పుయిచ్చి కొసరువేసేవాడు. ఇప్పుడు కొసరవెయ్యటం మానివేయటంతో, వూరంతా ధరలు పెరుగుతున్నాయని తెలిసింది, చిన్నపిల్లలు యేది కొనడానికి వెళ్ళినా బెల్లంపిసర లంచం దొరికేది, అది ససేమిరా యిప్పుడు లేదు. తక్కెడ గుళ్ళు కొద్దిగా అరగదీస్తున్నాడు!

ఆ వూరికి మిలిటరీకి వెళ్ళిన ఒకే ఒకడు తిరిగి వచ్చాడు. రకరకాల వస్తువులు తెచ్చాడు. వూరంతా వాడిమాటలు చెప్పుకున్నారు! జపానోడితో యిలాంటోలంతా దెబ్బలాటపెట్టి ఓడిపానారకున్నారు! పీస ప్రశ్నలుకూడా వేశాడు, టాంకు ఆకాశంమీదికి రెక్కలుంటే ఎగిరి పోతాదా అని అడిగాడు. అది భూమిమీదకే అంటే - రామాయణంలో పుష్పకం - భారతంలోని అస్త్రాలు గురించి చెప్పుకొచ్చాడు. మన భారతంలోని అస్త్రాలు.....వరుణాస్త్రం.... నారాయణాస్త్రం, పాశుపతాస్త్రం....యివన్నిటి కిటుకు జెర్మనీవోడు, యేనాడో అంకించుకొన్నాడు. అదు ఆ కిటుకుమీద బాంబులు, టాంకులు, యియన్నీ సేస్తేకదా - ఇంగిలీషోడు, అమెరికన్నోడు, జపానోడు నేర్చుకున్నారు!

పీస మాటలకు తెలివికి వూరంతా సంతోషించారు, "ఎంత పట్నాలు తిరిగి, యుద్ధం సేసివచ్చినా, గేనం ఒకరోజుకి వచ్చేస్తాదా?" అని అక్కడక్కడ చెప్పుకున్నాడు పీస.

ఇంకో కొత్త విశేష మేమిటంటే, పట్నంలో వున్నలాంటి చిన్న కాఫీ హోటలుకూడా లేచింది రోడ్డుమీద! ఇక్కడ దక్షిణాదిమంచి దిగుమతి అయిన యిడ్లీ సాంబారు తయారులోకి వచ్చింది. కోమటి పేరయ్య కొడుకు తన తండ్రిలా మూడు మణుగుల బరువు బస్తా భుజంమీద వేసుకొని, అన్ని దినుసులూ అమ్మకానికి, వూళ్ళోనూ, పొరుగూళ్ళోనూ తిరగగల సత్తువలేక యేదైనా సూక్ష్మపద్ధతిమీద డబ్బుచేసుకోవట మెలానో ఆలోచించి, ఈ కాఫీ హోటలు పెట్టాడు. ఊళ్లో ఎవరూ త్రాగుతారనికాదు, త్రోవపొయ్యే వాళ్ళెవరైనా చేరుతారని! రష్యన్ వోడ్కాని, ఫ్రెంచి ద్రాక్షసారాయిని మించిన పులిసిన చద్దన్నం చల్లని అంబలి మరిగిన ఈ పల్లీయులు కాఫీహోటలుకు పరుగెత్తే పరిస్థితి మొదట రాలేదు. కొన్నాళ్ళువరకూ హోటలుకు బేరాలు లేకపోవటం చూసి అరువులు బలవంతాన ఇచ్చాడు. తీరుబడి వున్నప్పుడు రోడ్డుమీదకు వెళ్తున్న రైత్వారీ ప్రజ వెచ్చగా తియ్యగా వాసనగా అందులోనూ అరువు - కొద్దిగా రుచి చూచేవారు - రామురాను పొద్దున్న ఈ పులిసిన చల్ది అన్నం ఈ

కొత్త రుచ్యముల యెదురుగా అగలేకపోయింది! వూరిలో వయసువస్తూ యేపుగా పెరగవల్సిన పిల్లలు ఈ అలవాటులో కొద్దా గొప్పో పడటం నేర్చారు.

రోజు లిలా కొద్ది కొద్ది మార్పులతో, దొర్లుకపోతున్నాయ్. యుద్దకాలంలో పెరిగిన కాగితాలు ఇదివరకెన్నడూ, కాగితాల ముఖం చూడనివాళ్ళుకూడా చూస్తున్నారు, కాగితం రూపాయి చెల్లదని పుచ్చుకోని ముసలమ్మలుకూడా ఈ వూళ్ళో వున్నారు!

నీలి, పుల్లయ్య ఈ మారేపరిస్థితులలో ఇరుక్కోక తప్పిందికాదు చూలాలు యింట్లో వంట వగైరా పనులతోబాటు, భర్తకు పనిపాట్లలో సహాయం చేస్తాంది.

నవిరికి పడమరగా, ఉత్తర దక్షిణాలుగా ప్రవహిస్తున్న నది వూరుదాటాక కొద్దిగా తూర్పుకు తిరిగివుంది. అక్కడ నవిరివేపువున్న ఒడ్డు యిసుకమయమై, ఆ భూమీమ్మీద సరుగుడువనం, జీడితోటలు, విస్తారంగా వున్నయ్. అక్కడక్కడ యెత్తయిన తాటిచెట్లు – ఎక్కడో ఒక్కొక్క మర్రిచెట్టుకూడా వున్నవి. ఈ తోటలో ప్రక్కనే లంకలున్నయ్. ఆ భూములకు నీటి సరఫరా, తూర్పువైపునుంచి కాలవగుండా రావటంచేత, శీతాకాలంలో వరిపైరూ, మిగతకాలంలో కాయగూరలు బాగా పండుతాయి. ఈ భూమికి మూడువైపులావున్న యెత్తైన సరుగుడు తోటలు.....తోటలనుంచి వచ్చే సన్నని సరాగాలు........అ ప్రక్కన మెల్లగా ప్రవహించే నది...జీడితోటల్లోని రకరకాల పక్షులు సరుగుడు తోటలోవున్న పచ్చని చిలకల గుంపుల కిలకిలలు....మర్రి చెట్టుమీద పగలంతా నిద్రపోతున్న గబ్బిలాలు – ఒంటి ఈతచెట్టుమీద గూళ్ళలోవున్న బంగారు పిచ్చుకలు – ఏపుగా ఆకాశానికి అంటుకున్నట్లున్న బూజు, తాటిచెట్టుమీద ముసలి గుడ్లగూబ జడిపింపు – సాయంత్రం అయితే బిలంలోనుంచి బైటకువచ్చే నక్కలు – అదిగో దూరాన తూర్పు కనుమలపాయలు ఎంత నునుపుగా వున్నాయో......హోరుమనే బంగాళాఖాతపు ధ్వని – యిటురాకండా అడ్డుతున్నాయ్ కామోసు!

ఈ జంట కలిసిమెలిసి ఈ భూముల్లో పనిచేస్తూ......అప్పుకొంత తీర్చుకోవాలని తాపత్రయపడుతున్నారు. సంతలో ముందు పండబోయే కూరగాయలు అమ్మాలని, యిప్పుడే భూమిని గత్తంలో నింపి, ....పుచ్చపాదులు తగిలిస్తున్నారు.

వేసవికాలం వచ్చింది, ఏటిలో నీరు పారటంలేదు. అక్కడక్కడ చిన్న చిన్న గుమ్మలున్నయ్. వాటిలో పశువులు, మనుషులుకూడా స్నానాలు చేస్తున్నారు. జాలరివాళ్ళు యెండుతున్న చెరువులు వూడ్చాక, పనిలేక వలలు అల్లుకోవడానికి నూలు సరిగ్గా దొరకలేదని వాళ్ళల్లో వాళ్ళు గుసగుసలాడుకోవటమేగాని, ఇంకా బయటకు అనటంలేదు. ఊళ్ళో సాలివాడు బట్టలమీద ఖరీదు హెచ్చించటంలో వూరంతా గుప్పుమంది. నూలు దొరకలేదని.... పాటినూలు ఖరీదు హెచ్చిందని రాట్నంవున్న ముసలమ్మ సంతోషం కొంతసేపైనా లేదు నూలుతోపాటు దూది ధరకూడా పెరిగింది కాబట్టి.

నీలి ఇప్పుడు నిండు చూలాలైనా ఒకమూల కూర్చోలేదు. ఒకరి సహాయం లేకుండా ఇంటి పనిపాట్లు చేసుకుంటోంది. పుల్లయ్య కొడుకుకోసం రోజూ కలలుకంటున్నాడు. పలవరిస్తున్నాడు, నిద్రపోతున్న పెళ్ళంవైపు దీక్షగా చూసేవాడు. “కదులుతున్నాడు కడుపులో – నా కొడుకు! ఈడు పుట్టిన్నాడు. జలజల చినుకులు రాలవా? వీడు మాటాడిన్నాడు పక్షులు పలకవా? వీడ్ని నా గుండెమీద వేసుకొని పెంచనా?....అవును

నా కొడుకు! మీసాలుత్రిప్పిన మొనగాడై...వూళ్ళోనూ....పొమ్మార్లోనూ......నాయం నిజం సెప్పే పెద్దమనిషైతే...... తనూ బంగారం, ఊరూ బంగారం- కొడుకో!....." అనుకున్నాడు.

ఒకనాడు యిలా అనుకొని పొంగిపోయి ఒక్కగెంతు వేశాడు. నీలికి తెలివివచ్చి "ఇంకా కునకలేదా?" అంది.

"ఎందుకు కునుకుతాను? సూడు నా కొడుకు. అయ్యా అని పిలుస్తాడు......అమ్మా అని పిలడే!"

నీలి నవ్వకుండా "నాకు కలొచ్చింది" అంది.

"నాకు తెలుసు. కలలో యేనుగగుపించింది కదూ! బలే కొడుకు పుడ్తాడులే"

"కాదు.....ఆడపిల్లే పుట్టి, అమ్మా అమ్మా అని పిలుస్తున్నట్లు...."

నీలి మరి మాట్లాడకుండా కళ్ళు మూసుకుంది. పుల్లయ్య "సూద్దాం! మా అయ్య మల్లునాయుడు - మా పౌరుషమైన మనిషి. సచ్చినప్పుడేమన్నాడు! మొగోడే పుట్టకపోతే - పీకపిసికేనూ....?" అంటూ పెళ్ళం ప్రక్కన రెండుచేతులు ముందుకుతోస్తూ కూర్చున్నాడు.

"ఎవరిపీక పిసుకుతావ్?" అంది.

పుల్లయ్య "ఎవరిదా?" అని జవాబులేక ఆగిపోయి, భార్యవైపు చూశాడు, నీలి కళ్ళు విప్పింది, ఆ లేత వెలుగులో ఆ చిరునగవు నిండిన ముఖం ప్రదీప్తంకాగా, పుల్లయ్య అలా చూస్తూ, మాటాడటం మరచిపోయాడు. ఆమె తన చేతిమీద చెయ్యివేసింది. మెల్లగా నిమురుతూ, "సంతోషంవస్తే అపలేం! ఏడుపొస్తే ఓదార్చలేం" అంది.

"ఎవరికీ?" అన్నాడు పుల్లయ్య.

"నీక్కాదులే. సూడు. యిలాగ యెగిరిపోతున్నావుకదా! మన రాత సరిగ్గాలేక అడపిల్ల పుట్తే నువ్వు ఇంటికొస్తావా? బెడ్డయినా బిడ్డయ్యాక వదిలేస్తామా? కండే కొండవుతాది! - కొడుకుపుట్తే నాలుగు బిరుదులు తగిలించుకోగలవా? వాడు పెరగాలి. నలుగురిలో సెభాస్ అనిపించుకోవాలి? అప్పుడు నువ్వు నాలుగు బిరుదులు తగిలించుకో! పిల్లలు పుట్టగానే సరా! పువ్వు పుయ్యాలంటే చెట్టుకి బలమైన గెత్తం యెయ్యడం సంగతి మరిచిపోతే యేం లాభం?"

పుల్లయ్య మాట్లాడలేదు. ఇంతసేపూ పెళ్ళం మాటాడుతున్నట్లు అనుకోలేదు. ఆకాశంమీదమంచి యెవరో అంటున్నట్లనిపించింది, అలా తల నిమురుతూంటే నీలి నిద్రపోయింది.

ఆ మరుచటి రోజు రాత్రి పెద్దవీధిలో, బుడబుక్కల పాటకు, నిండు చూలాలు నీలికూడా వెళ్ళింది. మంచు పడకుండా దగ్గరగా ఉన్న యింటి అరుగుమీద కూర్చుంది.

బుడబుక్కల పద్మనాభం స్త్రీవేషం వేశాడు. కొండముచ్చులాంటి ముఖం, మీసాలు ఉన్న స్త్రీ - యెర్రటి నారచీర కట్టాడు, మాసికలున్న జాకెట్టు!

"ఒకవేపు మూత. ఒకవరం పూత, ఒక సిర్తవేత, ఒక తీపుతీత!" బుడబుడక్ మంటోంది! నడివీధిలో పాతిన కొయ్యకు రెండువేపుల కిరసను నూనె బుడ్లు

– మధ్య. నూనెపోసే గల్లా! వెనుక పాటకులు ఇద్దరు. నూనెపోసే వాడొకడు – ఈ బృందం వీధినడుమకు వచ్చేసరికి, ఊళ్ళో పిల్లా పిచ్చికా, చిన్నా పెద్దా నిండిపోయున్నారు!

ఈ నారచీర కట్టిన మీసాలుగల నారీరత్నం ప్రార్థనకు లంఘించుకున్నది.

కమ్మని గొంతుక ఆలాపనతో –

"మము గన్న తల్లీ. ఓ మంజువాణీ!" డొక్కు డబడబలాడుతోంది – వెనుక పాటకులు, ఈమె అడుగుల్లో అడుగులువేస్తూ అభినయం చేస్తున్నారు.

తనకొచ్చిన పాండితిని వెలగబోస్తున్నది ఈమె.

"ఈ సభాయందున్న బూసురోత్తములునూ, రాజులునూ, వైశ్యరత్నంబులూనూ, మీరు సెలవిస్తే, పూర్తిగా పాడతాను."

పెద్దరైతు "నీ కేయే కథలు వచ్చునురా?" అనడిగాడు.

"కాకమ్మ కథ, శశిరేఖా పరిణయం, బాణాసురుని యుద్ధం.....ఇంకా...!"

జనంనుంచి "శశిరేఖా పరిణయం" అంటూ కేకలు వినవచ్చాయి. మొదలుపెట్టి కొంతవరకు వచ్చాడు.

"సుదతు లానందింప చూలేరుపడెను.
నడక మందంబాయె నాభి గన్పడుచుండె
నగలు భారంబాయె మిగుల వేవిళ్ళు
చనుమొనలు నలుపెక్కె సతి మేను తెలుపెక్కె
సమ్నతాంగి సాల మన్ను తినగోరె,
మందయానకు నవమాసములు నిండె....
సుభదినంబున....."

అర్ధరాత్రి దాటిపోయింది. నీలి వింటూ వింటూ, కథ పూర్తి కాకుండానే ఇంటికి వెళ్ళిపోయింది. పుల్లయ్య వెంట వెళ్ళాడు.

ఇటు వీధిలో శశిరేఖ విరహం –"నన్నిడిచి పెట్టావా నా బావా......నాబావో....." అటు నీలికి చిరాకుగా ఉంది. గదిలో ఆదెమ్మప్ప యిరుగుపొరుగు అడమ్మలు దూరిపోయారు.

అంతా వాళ్ళింట్లోనే జరుగుతున్నట్లు, పుల్లయ్యకి, నీలమ్మ పుట్టుకకి యే మంత్రసానో, ఇప్పుడూ అదే! పెద్ద బుట్టలాంటి పండిన జుట్టుతో వచ్చి నలుగుర్ని ప్రక్కకు తోసింది. ఆమెకు ఇది ఏ వెయ్యో పురుడు పొయ్యటమో!

పుల్లయ్య పైన అటూ ఇటూ పచారుచేస్తున్నాడు. ఉండి ఉండి చిన్న మూలుగు వినిపిస్తూంటే, పుల్లయ్య బేజారెత్తుతున్నాడు. వేకువఝాము తూరుపు తెలతెల వారుతోంది. "కయ్" మన్న యేడుపు – పుల్లయ్య గతుక్కుమంటూనే ఒక్క ఎగురు ఎగిరాడు. అప్రయత్నంగా "మల్లూ!" అని నోటి వెంబడి వచ్చేసి ఒక్క మొగ్గ వేశాడు.

లోనుంచే ఊరు మంత్రాసాని "మల్లమ్మ!" అంది. "అలాగయితే పెపంచకం తిరగబడ్తాది!"

లోనుంచి తలుపు తియ్యకండానే ఆడమ్మలంతా పకాలుమన్నారు. "నాలుగు బిరుదులు తీసేసినాడు పుల్లయ్య."

ఈ మాటల వెనువెంటనే కొద్దిక్షణాల వెనుకనే ఏడుపుతో ఇంటి పైకప్పు ఎగిరిపోతోంది. కొంతసేపయ్యాక అదెమ్మప్ప బైటికివచ్చి నవ్వుతూ "ఏడుస్తుంది గానీ......కూతురు ఎంత సక్కని సుక్కరా....ఎలాగుందంటే...... తోడకూరలా జుత్తు....." అంటున్నది.

పుల్లయ్యలోని యేదో బలమైన కోరిక నమ్మిక – "లేవండి–సూస్తాను....మల్లు నాయుడు.....మా అయ్య.... సొరగానికి పొయి మోసం సేస్తాడా? కొడుకే – నాను నమ్మను.....లేవండి!"

తోసుకొని లోపలికి బలవంతంగా వెళ్ళిపోతుంటే అదెమ్మప్ప చెయ్యి పట్టుకుని "మంచీ చెడ్డా సూసి వెళ్తువుగాని...." అంది.

"ఏ సెడ్డా లేదు....." అంటూ లోపలికి వెళ్ళిపోయాడు.....ఆడమ్మలు పక్కకు తప్పుకున్నారు. ముసలమ్మ వెర్రినవ్వు నవ్వుకొంటూంది, ఇంకా బుడ్డిదీపం వెలుగుతూనే ఉంది......ఆ వెలుగులో నులకమంచంమీద నీలి – ఆ ముఖం – తుఫాను మధ్యనుంచి ఒడ్డుకు చేరిన స్త్రీలాగ – ప్రక్కనే.....నిజంగా పండులాంటి కొడుకే! పుల్లయ్య కండలు తిప్పుతూ, నవ్వుతూ......ఒక్కసారి మీసాలు త్రిప్పాడు......

కొడుకు ఇప్పుడే ఇలా ఉన్నాడుకదా......తనకంటే వస్తాడు....ఘటికుడు కాడా? ఆ చూపు మెల్లమెల్లగా నీలి అమాయకపు చూపులో కలిసింది – కళ్ళు బాసలాడుకున్నాయ్! స్త్రీ కింకేం కావాలి? ఇంతవరకు యౌవనంతో మురిసిపోతూ మొగుడ్ని ఆరాధించింది. ఇప్పుడు పండులాంటి సంతానం! ఆమె చూపుల్లో లేశమాత్రం గర్వం కలవాలి – నిజానికి కలసింది!

## 12

రాత్రి పాటంతా అయ్యాక సభను తిలకించి "మీ దయ" అన్నాడు పద్మనాభం. అనగానే లేచినవాళ్ళు లేచిపోయారు. మిగిలినవా రిచ్చినదంతా కూడితే పావలాడబ్బులు కాలేదు. కిరసనూనెకే అరణాలయ్యింది. ఉదయం ఊళ్ళో ఇంటింటికీ తిరిగి దండుకుంటూ పుల్లయ్య గుమ్మంలో కాలుపెట్టాడు.

"భారతం అంతా విప్పితే, ఒక ముసలోడు, ఒక కుర్రాడే! ఆ కుర్రోడి పదం యిన్నాడు, నల్లని పొద్దున భూమిమీద పడ్డాడు! అంతటోడు కాడా?" అన్నాడు పుల్లయ్య.

పుల్లయ్య పద్మనాభుడ్ని సత్కరించాడు ఆ పొగడ్తలకు మీసాలు మెలివేశాడు. "ఒరే పద్మనాభం! చినుకులు రాలాయిరా....?"

"సల్లదనం, సల్లదనం!" బుడబుడక్క మవిపిస్తూ ముందుకు నడిచిపోయాడు.

నీలి ఐదురోజులనాడే వంటయింటికి వెళ్తూంటే, ముసలమ్మ వద్దనలేదు. పదకొండో రోజునాడు ఇంట్లో పనిపాటలు చేసుకుంటోంది. ఇరవయొక్కటో రోజు వచ్చింది. నీలిని కొందరు పేరంటాళ్ళు పసుపు కుంకుమతో నదిఒడ్డుకు

తీసుకువెళ్ళారు, ఇసుక మూడుపోగులు పెట్టి పూజ చేయించారు. మా పిల్లడిని కాపాడమని కోరారు, దీనినే "కప్ప మొక్కడం" అంటారు. నీలి తరువాత కడవతో నీళ్ళు తెచ్చింది ఆవేళనుంచీ పనిపాట్లు పొలంలో కూడా చేసుకొంటోంది. సర్కారు సరుగుడు తోటలోకి వెళ్ళి తొక్కునొల్లి రావటం, పంట చెయ్యటం, పిల్లడిని చూసుకోవటం, అంతా మామ్మూలుపని అయిపోయింది. బయటకు వెళ్ళేటప్పుడు ముసలమ్మ మనుమడిదగ్గర ఉంటోంది.

పిల్లడికి రోజువిడిచి రోజు నీళ్లు పోస్తున్నారు. జుత్తు తోటకూరలా పెరగటంచూసి నలుగురు ముత్తైదులు ముద్దులవర్షం కురిపించి; "అడపిల్లనే!" అన్నారు. ఆ మాటంటే మంట పుల్లయ్యకి. తండ్రి ముట్టుకుంటే, పిల్లడు యెండిపోతాడని ముసలమ్మ వద్దంటుంది. దోసపండులా వున్నాడని, అయ్యకంటే అరురెట్లు పెరుగుతాడని ఇలా ఊళ్ళోవాళ్లు తలోలా అంటూంటే, ముసలమ్మ దిష్టితియ్యడానికి ఎక్కడలేని బొగ్గులూ, చీపురుపుల్లలూ, మిరపకాయలూ చాలటంలేదు, పిల్లడికి నీరు పోసేటప్పుడు దగ్గరేఉండి కడవలోని అడుగునీరు ముందు పొయ్యొద్దని, మనవరాలిని మందలించేది, అడుగునీరు ముందు పోస్తే పిల్లలు అడుగంటిపోతారని.

నెలకు మూడురోజులు తక్కువలో పిల్లడిని ఉయ్యాలలో వేశారు. పుల్లయ్య పెద్ద సంబరంలా చేశాడు. లోకం అంతా పచ్చగా మనోహరంగా వుంది. తన జీవితంలో ఎన్నడూలేని గర్వం వచ్చిపడింది. ఉన్నకొద్దీ గొప్పా ఆవేళ ఖర్చుపెట్టడానికి జంకలేదు. వూళ్ళో అప్పుడే "రాసనింగు" అంటున్నారు. "వోరు ఫండు" కి డబ్బిచ్చితీరాలని గ్రామనాయుడు (మునసబు) ఖచితంగా చెప్పి వెళ్ళిపోయాడు. "దానిని తరువాత సూడొచ్చు! కొడుకుని నలుగురూ దీవించాల!"

వచ్చినవాళ్ళు ఏకకంఠంతో దీవించారు. పిల్లాడివైపు చూస్తూంటేనే దీవించ బుద్ధివేస్తోంది. నాలుగు నెలల పిల్లాడిలా నెలరోజులు పూర్తికాకమునుపే కనిపిస్తున్నాడు, అగస్టు నెలాఖరు రోజులేమో ఎండలు తగ్గి భూమి చల్లబడింది. పొలాల్లో పైరు నాటుకొని, భూసత్తువను లాగుకొని, మీదికెగసిపోతూ, గాలికి అడుతున్నది, రైతువారీ ప్రజలకు కావలసినంత తీరుబడి. అదెమ్మప్పదే ఈ సంబరమంతానూ. మళ్ళీ పెళ్ళిచేసిన్నాటివలె నుదుంకట్టింది. ఈ కొద్దిరోజుల్లోనే ఇంట్లో ఆమె పెద్దరికం తగ్గి, అల్లుడిది హెచ్చింది. ధాన్యం ధరలతోపాటె మిగతా వర్తకపు పంటల ధరలు పెరగటంతో, దానధర్మాల పరిమితి తగ్గించవలసి వచ్చింది. ఈ పరిస్థితికి ఆదెమ్మప్ప తట్టుకోలేకపోవటంతో పెద్దరికం అల్లుడు తీసుకొన్నాడు. ఆర్థికంగా చేతులు కట్టివేసినా, మాట మంచితనం చూపిస్తూ పెద్దరికం చేస్తోంది. చేస్తూనే "ఎందుకు పనికొస్తాను నాయనా? నా చేతిలో యేం వుంది? మనవడికి బిళ్ళల మొలతాడైనా చెయ్యించలేకపోయాను!" అంది బాధగా.

నీలి మాటందుకుంది. "ఇచ్చినంత మాటన్నావప్పా! యింకా ముందుకి అవ్వని అడించడా?"

లోకప్ప, ఆదెమ్మప్ప నవ్వుతూ "అదెంతటివాడు పుట్టుకొచ్చాడు. యింటిదగ్గరే కాదు, వీధిలోనూ మెప్పుతెచ్చాడు. సచ్చి సొరగాన వున్నాడు కానీ.......!" అన్నారు.

పుల్లయ్య తండ్రి పేరెత్తటంతో ఒళ్ళు పొంగింది. ఇంతలో కొడుకు కిలకిలలాడి

నట్లనిపించింది. ఒక్క యెగురెగిరి "అప్పా! అప్పా! అదిగోయె కిలకిల్లాడుతున్నాడు – మల్లునాయుడి మనవడు.....మల్లూ!" ఉత్సాహం ద్విగుణీకృతంకాగా కొడుకుని తీసుకోబోయాడు. అదే పేరు పెట్టడం అయిపోయింది.

ఆ క్షణంనుంచీ "మల్లు" అంటే ప్రాణం, తల్లిపాలతో బిడ్డడు దిన దినవర్ధమాను డౌతున్నాడు. భార్య యిదివరలా తనవైపు మధురాతి మధురమైన చూపులు విసరకపోయినా, ఆ అమృతతుల్యమైన స్పర్శ అట్టే తగలకపోయినా.......పెరుగుతున్న కొడుకుని చూసి అన్ని అనుభూతులు పొందుతున్నాడు.

గుడ్డివెంకన్న మనవడికి యేమీ ఇవ్వలేకపోయానని గిజగిజ గింజుకుంటున్నాడు. గన్నెమ్మ పాతరోజులు జ్ఞాపకం తెచ్చుకుని యేడ్చుకుంది. కొడుకుని వుయ్యాలలో వేసిననాడు నీలి వాళ్ళకి కడుపునిండా పెట్టింది. వాళ్ళ బాధను గ్రహించిన నీలి "అయ్యా! దేముడిదగ్గరికి పళ్ళూ, కాయలూ తీసికెళ్తేనే వుందా? పువ్వేసి మొక్కినోలకి మోక్షం నేదా? ఇంత మంచి మనుషులు మీరు. నా కొడుకుని దీవించండి! చాల"ని కొడుకుని దగ్గరగా తీసుకువెళ్ళింది.

వెంకన్న పిల్లడిని తడుముతూండగానే యేదో కోరిక మనసును క్షోభపరిచింది. ముద్దులాడుతూ "పాపిష్టోడ్ని తల్లీ! కళ్ళుంటే......!" అన్నాడు గాద్గదికంగా.

గన్నెమ్మ పిల్లడ్ని వర్ణించడం మొదలుపెట్టింది, వెంకన్న వింటూ "తల్లీ! చేసిన ధర్మాలు వుట్టినేపోతాయా? నీ కొడుకు యెలాంటి వంశాన పుట్టాడు! నే నెందుకనాల? నలుగురూ సెభాష్ అనరా! "అలా అంటూనే భూమిమీద కుడిచెయ్యి యిటూ అటూ రాస్తే చేతికి ఒక మంటి బెడ్డ దొరికింది. దానితో మనసులో యేదో ఆనందం పొంగి, చిరునగవు వెలగబోస్తూ, పిల్లడిచేతిని తడుముతూ పట్టుకొన్నాడు. పిల్లవాని అరచేతిలో బెడ్డపెట్టూ "మనవడా! మల్లూ! మనిషికి భూమిమీద పడిన దగ్గరనుండి దీనితోనే వున్నాదిరా!" అన్నాడు.

గన్నెమ్మ ఖస్సుమంటూ "బంగారం భాగ్యం యివ్వలేకపోతే, వూరుకోవాలిగానీ......" అంది.

ఆనందంతో గుడ్డి వెంకన్న కళ్ళు నీరుతో నిండిపోయాయి. ఈ కటిక పేదవాని కరుణాతిశయాలు పూర్తిగా అర్థంచేసుకున్న నీలికి పెన్నిధి దొరికినట్లయి, కొడుకుచేతిలోని బెడ్డతోనే పట్టుకొని యింటిలోనికి తీసుకపోయింది, ఆ బెడ్డను భద్రంగా కొడుకుతలవైపున వుంచింది.

రోజులు తిరిగిపోతున్నయ్. పుల్లయ్య యీ మధ్య భార్యతో సంబంధం లేనట్లుగా ఆ కొడుకుతోనే వుందన్నట్లు మెసుల్తున్నాడు. నీలి ఆనాడు పొలానికివెళ్ళి వేగంగా వస్తూన్న పుల్లయ్యవైపు చూసింది. క్రీగంటి చూపు చూసి మందహాసం చేసింది. పుల్లయ్య చూడలేదు. ఉయ్యాలలోవున్న పిల్లాడిని వూపుతూ.....జోలపాట పాడుతోంది.....

"ఎత్తుచెవులని ఏనుగుని వద్దంటి
గుదికాళ్ళని గుఱ్ఱాన్ని వద్దంటే.....
పడగతలనీ పామునీ వద్దంటే....
కోతినీ పెల్లాడి కొడుకునీ గంటే ......జో....జో – "

పుల్లయ్య పెళ్ళంవైపు నిదానించి చూస్తూ......కోతిలా మూతిపెట్టాడు. మళ్ళీ వలపుతలపులు, వగలు కులుకులు యిద్దరిలోనూ ప్రవేశించాయ్.

## 13

చలికాలం ఒకరోజు సాయంత్రం, చీకటిపడ్డాక పొలంనుంచి నీలి పుల్లయ్యా వస్తూంటే. నీలమ్మ గుడిదగ్గర దాసుడు శివాలు వేస్తున్నాడు. ఇద్దరూ బయటనిల్చునే మొక్కుమొక్కారు. ఈ సంవత్సరం పంట ఉత్సాహంగాలేదు, మిడతలదండు హోరంపట్టే సమయానికి వచ్చిపడింది, చేను యేపుగా పెరిగి కంటికి కనిపిస్తోంది కానీ, సగానికి సగం పొల్లే. బుగత అసలే కఠినుడు, అందులో రోజుకిరోజు పెరిగే ఈ ధరలలో ఒక గింజ తగ్గించనంటున్నాడు. ఇద్దరూ ఈ విషయాలే మాట్లాడుకుంటూ పొలం నుంచి వచ్చారు.

గుడివేపు, గుడిలోని విగ్రహాలవేపు, విగ్రహాలని ఆరాధించే దాసుని వేపు చూస్తూంటే, మనుష్యుల్లో ఏదో మార్పు వచ్చినట్లు స్పష్టమౌతోంది. రెండేళ్ళకీ ఇప్పటికీ తేడా ఎంతోవుంది. దాసుని శివాలకి భయపడ్డవాళ్లు లేరనికాదు. అలా భయపడ్డవాళ్ళ చేతుల్లో యే అధికారం లేదు. నాయుడు, పెద్దరైతు ఆ దరికి చేరరు. ఎవరైనా శివాలవిషయం చెప్తే వినిపించుకోరు. ఇప్పుడు వాళ్ళకి వినిపించుకోవడానికి వ్యవధిలేదు. దాసునితోపాటు విగ్రహాలు, విగ్రహాలతోపాటు గుడీ ఈ క్రొత్త సంఘంలో అప్రధానమై పోయాయ్. సంబరాలు సెయ్యండన్న దాసుని గోల గాలిలోకి కరిగి పోతూంది. అంతే!

ఒంటిమీద కప్పుకోడానికి బట్టలేని దాసుడు శివాలు వేస్తున్నాడు. చుట్టూ చీకటి, గుడిలోనే చిన్న నూనెదీపం! అదీ ఆరిపోవటానికి సిద్ధంగా వున్నట్లుంది.

కదిలిపోవటానికి సిద్ధంగావున్న ఈ జంటవైపు చూసి దాసుడు చెయ్యిసైగచేశాడు. ఆగినవాళ్ళదగ్గరగా వస్తూ "యిన్నారా ఆ తల్లి యేం అన్నాదో, యెల్లి ఆ నాయుడితోనూ పెద్దరైతుతోనూ సెప్పండి. నేను సెపితే నాకు మతిపోనాదంటారు." అన్నాడు.

అలాగే అన్నట్లు తలలూపారు. దాసుడు గుడితలుపులు వేస్తూ వెంటబడ్డాడు. వృద్ధాప్యం వచ్చిపడ్డట్లు ఒళ్ళు వణుకుతోంది. తనకీ చెప్పుకోడానికి యెన్నో కష్టాలున్నాయ్. వాడు యే కొడుకుమీద ఆశలు పెట్టుకున్నాడో, వాడే తనకు సరిగ్గా గంజి పొయ్యలేదు. దిగువవీధిలో కంపి ఆడతాడు. ఓడిన్నాడు ఇంట్లో అందరిమీద లేస్తాడు. గెలిసిన్నాడు దొంగసారాకొట్లో కూర్చుంటాడు తాగివచ్చి తండ్రిమీద లేస్తాడు. దాసుడు ఎవరో తనను దగా చేసినట్లు బాధపడిపోయాడు. అలా మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ "అమ్మా! నీలమ్మా! సూడు! ఈ గరికిమీద నడుస్తున్నాం, గరికతిన్న గాడిద సస్తాదిగాని, గిరిక సావదు! నాను సచ్చిపోతాను. నాలాగే నా కొడుకూ సచ్చిపోతాడు – నాను కమీజు ఎప్పుడూ యేసుకోలేదు. నా కొడుకు యేసుకుంటున్నాడు. ఆడికొడుకు పట్నంబాబులాగ బొత్తావులకోటు యేసుకుంటాడు మొకం తేటా, మొల గజ్జీ అయితే యేంలాభం అమ్మా? అలాగే వూరు

తయారైపోతూంది. లచ్చి లక్షణాలను తెస్తుందంటారు. డబ్బు పొంగి పోతూందని, గుండెని దాసేస్తున్నారు. అమ్మా! బతికున్నప్పుడు రెండు సచ్చాక రెండూ ఉంటాయే!"

నీలి యిల్లు వచ్చింది. దాసుడ్ని నీలి లోనికి పిల్చింది. చిన్న బుడ్డి దీపం మంచందగ్గరగా తలవైపు వెలుగుతోంది. కాళ్ళవైపు ముసలమ్మ కూర్చుని మనుమడివైపు చూస్తూ ముసిముసినవ్వు నవ్వుకుంటూంది. మూడునెలలు దాటిన పిల్లాడు దీపంవైపు చూస్తు మూతి విరుస్తున్నాడు. నవ్వుతున్నాడు.

"ఒరే తాత!" అన్నాడు దాసుడు. మల్లు కాళ్ళుచేతులు ఆడిస్తూ వూసు లాడుతున్నాడు. పుల్లయ్య, నీలి చెరోవైపు నిల్చున్నారు. దాసుడు మంచంమీద కూర్చుని పిల్లాడి ముఖంలో ముఖంపెట్టి నవ్వాడు; ముద్దులాడాడు. నిర్భయంగా వూసులాడుతున్న పిల్లాడ్ని తాకుతూ, "అప్పుడే అమ్మా అంటున్నాడు!" అన్నాడు.

పుల్లయ్య చప్పున "అమ్మకాదు – అయ్యంటున్నాడు!" అన్నాడు.

దాసుడు నవ్వుతూ "పంది పదిపిల్లలు కాస్తాది. ఏనుగు ఒక పిల్లనే కాస్తేనేం? ముందు ముందు మరి గడ్డురోజులున్నాయ్ నాయనా! మెతుకు మూడుభాగాలు సేసైనా పెంచుకొస్తే నీ కొడుకైనా, యీ బలిసిపోతున్న అన్యాయాన్ని నరుక్కొస్తాడు!" అన్నాడు.

దంపతుల ముఖాలు యీ బ్రహ్మదీవనతో వెలిగిపోయాయి వెళ్ళిపోతూ "ముసలమ్మా! మనవడి పెళ్ళి సూడవా?" అన్నాడు. ముసలమ్మ "ఒరే రాముడూ! నా తలమీద గొడుగేనాడు పోయిందో ఆనాడే సచ్చిపోనానురా!" అంది.

ముసలమ్మ మొగు డెలాంటి మూర్ఖుడో తెలిసిన రాముడు ఫక్కున నవ్వాడు. ఆ నవ్వు గుర్తించి "యెంత సెడ్డోడని లోకం అన్నా, నమ్మిన దానికి ఆడు మంచోడే! లోకాన ఎవరినో ఒకరిని నమ్మాల. ఆడు యెలాంటోడవనీ, ఆ నమ్మికతోనే సవ్వాలి! అదే పున్నెం," అంది.

దాసుడు ముసలమ్మకు దండమెట్టి వెళ్ళిపోతూ "నాయనా నలుగురూ బత కాలంటే ఒకరితోనైనా సెడవ్వాల! ఈ కోపరేటు బోర్డు పెట్టించాడు ఆ నాయుడు పెద్దరైతు, కరణం, మీసాలు మెలేసినోరుకూడారా. నాయం అడవిలోకి పరుగెత్తిపోతూంది. గవర్నమెంటోడు మంచి పారా యిచ్చేడు. ఈ దొంగ సారాతో పెద్దలు బతికిపోతున్నార్రా. నా కడుపు కమిలిపోతుంది నాయనా! ఆ తల్లి పాదాలు పట్టుకొని బతిమాలుతున్నాను," అన్నాడు.

పుల్లయ్య "సస్తారులే!" అన్నాడు.

"వద్దు నాయనా! వాళ్ళు నూరేళ్ళు బతకాల, అలు సస్తే మనకేం రాదు. అలిని మంచిమనుషులు సెయ్యమ్మా, డబ్బుతోనే హాయిగా బతకనీ యెవురొద్దన్నారు. ఎదుటోలవేపు ఒక సూపు సూడాలా. ఎప్పుడులాగ తల్లికి అలనా పాలనా జరిగితే – పంటలు బాగా పండుతాయి – ప్రజా సుఖపట్తారు!"

దాసుని సాగనంపి తిరిగి వచ్చాడు పుల్లయ్య. నీలి మల్లుకి పాలు యిస్తోంది. ముసలమ్మ ఒకమూల నడుం వాల్చింది. మంచంమీద కూర్చుని, ఈ తతంగం ఏం బాగాలేదన్నాడు.

"ఏమిటేమి"టంది నీలి.

"సూడు, ఈ రేసినింగుపేరుపెట్టి మనపేరకారుడు – మనకు అంబలి! నాయుడింట్లో బియ్యం కొట్టు! ఈసారి కార్డు ఇస్తానంటే యిస్తానో? పట్టపోడొచ్చి, ఈలదగ్గర బట్టుకొని రెట్టింపు ధరలకి అమ్ముతున్నాడులే! ఎదవలు మేడలు కోటలు కట్టేస్తున్నారు!"

నీలి మాటాడలేదు. పిల్లడ్ని మంచం మీద వేసింది. అప్పుడే బొమ్మలపడ్డానికి ప్రయత్నిస్తున్నాడు. భోజనాలయ్యాక పుల్లయ్య అరుగుమీద కూర్చున్నాడు. నీలి వంటయింటి పనులు పూర్తిచేసుకొని – కొడుకు దగ్గర కూర్చుంది. పిల్లడు వూసులాడుకుంటున్నాడు. ఇంతలో సంజీవి అలా వెళ్ళిపోతూ "పుల్లిగా" అన్నాడు. "ఏంరా?" అంటే వచ్చి దగ్గరగా కూర్చున్నాడు. సంజీవి ఆ వూళ్ళోకి పొట్టిమనిషి. గరిడీలో ఘటికుడు. వంగపండుచాయ శరీరం, గేరాగిరజాలు – మూతినిండుగా మీసాలు; చేతిలో బాణాకర్ర ఎప్పుడూ ఉంటుంది, వయస్సు పుల్లయ్యకంటే పదేళ్ళు హెచ్చు. పొట్టోడికి పుట్టెడు బుద్ధులని అంతా అంటారు. క్రితంలో సర్కారునే ఎదిరించి చుట్టుపట్ల పేరు సంపాదించాడు. ఆ రోజుల్లో సారాబట్టీలు పెట్టి, ఉద్యోగులకు చాలా పని కల్పించాడు. కొంతమంది వీపు చదును చేశాడు. వీడి ఉనికి కనుక్కోలేక ఎన్నో తిప్పలు పడేవారు. సంజీవిని పట్టియిచ్చేవాడికి అయిదువందల బహూమానం ప్రకటించారు. సంవత్సరం వరకూ దొరకలేదు. ఒక తెలివైన యిన్స్పెక్టరు వూళ్ళో నాలుగురోజులు మకాం వేసి సంజీవి విషయం గుట్టులాగడానికి ప్రయత్నించి కృతకృత్యుడయ్యాడు. ఒక గ్రామనాయుడితో కూడి, ఆ చుట్టుపట్ల పది గ్రామాలలోను దండోరా వేయించాడు. ఉత్తరదేశంనుంచి ఒక పైల్మాను వచ్చాడని వాడిని ఓడించే మీసంగల మొగోడెవడైనా ఉంటే ఫలానా గ్రామ నడిబొడ్డున ఫలానారోజున కలుసుకోమనీ. నిజానికి ఆ పైల్మాన్ని చూడగానే చాలామంది భయపడ్డారు. నలుగురూ నాలుగువిధాల తననుగురించి అనుకోవడం సంజీవికి నచ్చలేదు. ఊరుపేరు నిలబెట్టాలని రంగంలోకి ఉరికాడు. నలుగురూ సెభాష్ అన్నారు. ఇన్స్పెక్టరు అనుకొన్నట్లు ఆ పైల్మాను ఇట్టే వోడిపోయాడు. కానీ సంజీవి పోలీసులకి చిక్కిపోయాడు. ఊరంతా గుప్పుమంది. పోలీసులు తుపాకులు చూపించారు. మూడేళ్ళు కారాగారం అనుభవించి వచ్చాడు. నలుగురిలో తలెత్తడానికి సిగ్గు వేసింది. ఇంత గడసరీ ఎంతో బాధతో కుమిలిపోడానికి అవకాశం, తన ఉంపుడుకత్తె యిచ్చింది. ఇంకొకర్ని చూసుకోవడంతో దాన్ని చంపుదామనుకున్నాడు. అయితే అది హేళనగా అన్నది – "సంపడానికొచ్చావు? ఏం తిని బతకమని కయిదులో కూర్చున్నావు? మచ్చ పెట్టుకొన్నావు! ఆ జీడిమరక వూడుతాదా? ఆ యిల్లాలి యేడుపే నీకు మచ్చ పెట్టింది. దాన్ని సరిగా యేలుకోరా యదవా" నిజానికి ఆ సంబోధన బాగానేవుంది. సంజీవికంటె ఆమె కొద్దిగా వయస్సులో పెద్ద. తను ఆమెను చంపలేనని తెలుసు. చంపగలిగినా చంపాలని లేదు. ఆ కత్తి నడియేటి లోనికి విసిరాడు. ఆ రాత్రికి రాత్రే చలిలోనే "దిమ్మదిరగా" మునిగేశాడు. ఇంటికి తడిబట్టలతో వచ్చి తలపు తట్టాడు. భార్య తీసింది. ఆమెను బిగియార కౌగలించుకొని యేడ్చేసాడు. ఎప్పుడూ యింకో ఆడదాన్ని సూడనని ఒట్టేసుకున్నాడు.

పెళ్ళెం కళ్ళు తుడిచింది. ముద్దెట్టుకుంది. హృదయానికి హత్తుకొని సంతోషంతో కన్నీరు కార్చింది.

ఆవేళనుంచి గ్రహం మారిందని చెప్పుకొనేవాడు. ఒళ్ళు వంచి పొలంలో పని చెయ్యటం – ఇది నాది అనే మమకారం యేర్పడడం – జరిగి సంవత్సరంలో ఒక కొడుకుని ఎత్తుకొన్నాడు. ఇలా పాడైపోతున్న ఇల్లు నిల్చింది. సంసారం బాగా గట్టిపడింది. భార్య చిక్కదనంవల్ల, ఆమె అదుపాజ్ఞలలో తను వండడంవల్ల, వూర్లో తనూ ఒక ఘరానా మనిషిగా అయిదారేళ్ళలోనే పేరుపొందాడు. ఇప్పటికి ముగ్గురు పిల్లల తండ్రైనా. ముఖం బుగ్గమీసాలతో నిగనిగలాడుతూనే వుంటుంది. పులివేషం వేసి, ఇల్లెక్కి కోడిపుంజు పీకను పళ్ళతో కొరికే సత్తువుంది.

అలాంటి సంజీవి పుల్లయ్యను పలకరించాడు. ఇద్దరూ వూర్లో జరుగుతున్న అన్యాయాలను గురించి మాట్లాడుకున్నారు. నిరుడికి ఈ యేటికి ఎంతగా ధరలు పెరిగిపోయాయి? లేని ప్రజలు యెంతగా బాధపడుతున్నారు? ఉన్నవాళ్ళు చెయ్యి దులపకండా ఉన్నారు, నాయుడ్ని, పెద్దరైతులని గట్టిగా అడగాలని పుల్లయ్య అన్నాడు.

ఇంతలో నీలి పిల్లాడ్ని యెత్తుకుని అరుగుదగ్గరకు వచ్చి "అంతా యింటున్నాను. రేపు నాయుడు మీ 'రాసను' తీసుకోమంటే మీ బట్ట కొనుక్కోమంటే వూళ్ళో ఎందరిదగ్గర డబ్బున్నాది?" అనడిగింది.

"నిజం సెప్పినావు కూతురా!" అన్నాడు సంజీవి.

పుల్లయ్య "నిజవా! రైతోడికి అక్కర్లేకపోతే తిరిగి గవర్నమెంటోడి కిచ్చేస్తే యింకొకరి కిస్తాడు. మనపేరు సెప్పి మనకడుపు కొట్టి ఆడు గడించాలా? అంతా బేకే – అంతా బేకే!–"

ఆవేశంతో లేచిపోతున్న మొగుడివైపు చూస్తూ చిన్ననవ్వు నవ్వింది. పుల్లయ్య ఖస్సుమంటూ "రేపెల్లి టోరుదగ్గర కూర్సుంటాను, వచ్చిపోయినోలతో ఈ అన్యాయం సెపతాను" అన్నాడు.

"నాయుడు కొన్నోలని సూపించమంటే?"

"ఎందు కడుగుతాడు? గవర్నమెంటోడికి సెప్పనా?"

సంజీవికి స్టోరులో కొంత పలుకుబడి వుండటంవల్ల "పుల్లిగా! కూకోరా!" అంటూ తను లేచిపోయాడు.

"అమ్మీ! నీలమ్మీ! గడ్డికుప్పదగ్గర కుక్కేంసేస్తాది? గడ్డి తినదు; తిననియ్యదు. పుల్లిగా! ఊర్లో పెద్దలదగ్గర పరపతిమీద బతుకుతున్నావు. ఎందుకు వూరికే ఆ పరపతి సంపుకుంటావు? తల్లి తండ్రిపోతే బతకొచ్చుకానీ, పరపతిపోతే బతకలేం. రేప్పొద్దున్న ఈ లేనోలంతా నీకేం సాయం చేస్తారులే, చేస్తే పెద్దోడే సెయ్యాలి కాని" అంటూ వెళ్ళిపోయాడు.

పుల్లయ్య మాటాడలేదు. మీసాలు మెలేస్తూ పెళ్ళెంవేపు చూస్తూ కొడుకును అందుకున్నాడు. అరుగుమీద జార్లడుతూ కొడుకుని గుండెమీద పడుకోబెట్టుకుంటూ "మల్లూ! నీ తాతకొడుకు – నీ అయ్య – కడుపు మాడినా నీతికి నిలబడతాడు.....నువ్వో?" అన్నాడు.

కొడుకు పకపకా నవ్వినట్లు, ఒళ్ళు గిలిగింతలు పెట్టినట్లయింది.

# 14

సంక్రాంతి వచ్చింది. మల్లు బొమ్మలు పడ్తున్నాడు. ఇల్లంతా పాకేస్తున్నాడు. పుల్లయ్యకేసి చూసి ముసిముసి ముద్దునవ్వులు వొలకబోస్తూ తూలుతున్నాడు. ఆనందంలో అదోమాదిరిగా అయిపోయి పుల్లయ్య కొడుకు యెదరగా గెంతులేస్తూ "ఛినక్ ఛినక్ సో... ఝుంజిన కడి.....ఝుంజినకడి...." కొడుకు చేతులాడిస్తున్నట్లు......నోరు పెగిలిస్తున్నట్లు భ్రమ పడుతున్నాడు, ఒక్కసారి ఆకాశంమీదికి కొడుకును ఎత్తుకుంటే, పిల్లాడు యేడవలేదు. కానీ ముసలమ్మ కోపంపడుతూంది.

"ఎవడనుకున్నావ్ – నీ కళ్ళతోనే సూడవా? నాను మొగ్గేస్తే....ఎగ్రాకి మీద నిల్చోడా?"

మల్లుకి ఆరునెలలు దాటలేదు...కూర్చుంటున్నాడు. "అదిగో అదిగో కూర్చుంటు న్నాడు. గోడపట్టుకొని నిలబడ్డానికి యెగబడుతున్నాడు.....నా మల్లు.....నా మల్లు" అని ఒకటే ముద్దులవర్షం కురిపించాడు.

ముసలమ్మ బోసినోటి నవ్వుతో, "వయసుకుతగ్గ బువ్వ – బువ్వకు తగ్గ ఒళ్ళు – నీ కొడుకు వచ్చేయేటికి కుండలే కాళీచేస్తాడు....అయ్యో! పాడుదాన్ని.....నానే దిష్టయేస్తన్నాను...." అంది.

కుర్రాడు రోజుకురోజు వెలుగుతెచ్చి మనసుల్ని ఆనందంతో పుర్రూతలూగిస్తున్నాడు.

పైరుపంటల్లో పెసలు కొద్దిగా పురుగుపట్టినా, ఒకవిధంగా బాగానే రాలింది. ధాన్యం బుగతకి కొలవగా ఆ భూములవల్ల మిగిలింది పెసలే, పుల్లయ్య స్వంతపొలంలో పండిన గింజలతో కాలం వెళ్ళిపోతూంది. అది జాగ్రత్తగా వాడకపోతే రాసనికి డబ్బెక్కడిది? రాట్నం యిచ్చిన నూలు అమ్మగా వచ్చినది చెప్పుకోతగ్గ డబ్బుకాదు. పనిపాట్లు మళ్ళీ వేసవి దాటితేగాని యేమీ వుండవు. చోడిపంట వేసవికికానీ అందిరాదు.

బ్రతుకుతెరువులు ఇలా వున్నా కొడుకు మల్లు ఆ విషయం ఆలోచించడానికే తండ్రికి అస్కారం యీయలేదు సాలలోనున్న పోతులవైపు చూసి అవి అరుస్తున్నా జడవలేదు; చందమామను చూసి చెయ్యి ఆడించటం నేర్చుకొన్నాడు. రావిచెట్టుమీద పిట్టలు అరుస్తుంటే అటువేపు దీక్షగా చూడటం, తల్లినిచూసి, తండ్రినిచూసి నవ్వటం, ఒకోసారి తీసుకోపోతే ఏడవటంకూడా చేస్తున్నాడు. చిన్న పన్ను వచ్చింది. నవ్వుతూంటే ఆ పాల పన్ను ఎంత అందంగా కనిపిస్తూంది!

ఆ సంవత్సరమే ప్రభుత్వం ధాన్యం సేకరణ మొదలుపెట్టింది. ఊళ్ళో మూలనున్న ముసలమ్మకుకూడా ఇంగ్లీషు వచ్చింది. "ప్రొక్యూరిమెంటు" అంటే అందరికీ ఏదో భయం పుట్టించింది, కొందరెందుకిస్తాం అన్నారు. మా చెమట – మా యిష్టం – గవర్నమెంటోడికి నాయం లేదన్నారు కొందరు. పీస చాలా అలజడి చేశాడు. వాడిమాటలు మూడొంతుల ముప్పాతికమంది నమ్మారు. "లెక్కలన్నీ పంట ఫొలంలో ఉండగానే తయారయిపోయినాయి యిప్పుడా దొంగరాతల్ని నమ్మి గవర్నమెంటోడు పోలీసుల్ని, ఎఫ్ ఎస్ ఓని, టి. ఎస్, ఓని పంపి, యిస్తావా సస్తావా అని బెదిరిస్తాడు. పెద్ద కబుర్లాడితే కైదే!"

పుల్లయ్య మీసాలు మెలివేశాడు. "ఎలాంటోడు నా కొట్టు ముట్టాడో సూస్తాను, ఉన్నోడికొట్లు కాళీసేసి, లేనోడిదగ్గరకి గవర్నమెంటోడురానీ – అడే అడికి కలిగింది. యిస్తాడు."

"ఈ యేటి కిలాగయిపోయిందిలే. గవుర్నమెంటోడు, వచ్చే యేడుముందే మిడతలదండులాగ వచ్చేస్తాడు" అని జోస్యం చెప్పాడు పీస.

గ్రామకరణీకం శాశ్వత వారసత్వపుహక్కు ప్రకారం పట్నంలో వున్న. ప్లీడరు సీతారామస్వామివారి సంతతి చెయ్యవలసింది. కాని వారీ హక్కును పది సంవత్సరాలకని నాలుగువందలు పుచ్చుకొని, వూర్లోవున్న పట్వాయడుకు యిచ్చారు. ప్రస్తుతంవున్న కరణం ముప్పయియేళ్ళవాడైనా ఆరుగురు పిల్లలతండ్రి. తన తండ్రి ముసలి పండునక్క. గొప్ప వ్యవహారస్తుడు. భూ సంబంధమైన వ్యవహారాలు కుదిర్చిబెట్టి డబ్బు సంపాదించుకుని బ్రతుకుతున్నాడు. కొడుకుకు కరణీకంతో తనకు అధికారం వచ్చింది, అయితే యీ అధికారం యిదివరకు భూక్రయ విక్రయ తనఖాదుల సమయాల్లోనే డబ్బుచేసుకోడానికి పనికివచ్చేది. కానీ ఇప్పుడు ప్రొక్యూరుమెంటు అసలైన అధికారాన్ని యిచ్చింది.

ఈ ముసలినక్క ఒకప్పుడు చాలా పరపతివున్న మనిషి. పదెకరాల పల్లం, నిక్షేపంలా పండేది. పది గ్రామాల్లోను, హోషుకా, మాలుకోదారుగా చెలామణీ అయిపోయేవాడు, ఉన్న ఒక్కకూతురు పెళ్ళి అయిదు రోజులు బ్రహ్మాండంగా సంతర్పణలతో చేశాడు. జలుమూరు మాలుకోదారులంటే, ఆ రోజుల్లో చక్రవర్తుల్తో సమానం. వాళ్ళ రాబడికి తగ్గట్టు యింట లక్ష్మీ సరస్వతులు తాండవమాడేవి. అలాంటి కుటుంబం ఆ తరంతోనే సరి వాళ్ళపిల్లలు, ఖర్గపూరులో రైల్వే వుద్యోగాలు చేసి రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితులలో వున్నారు. ఆ మాలుకోదార్లను గురించి యిప్పటికీ ఆ చుట్టుపట్ల గ్రామాల్లో చెప్పుకుంటారు, భట్రాజులు ఆ పొగడ్తలు యింకా మరిచిపోలేదు. అలాంటి వాళ్ళతో ఆ రోజుల్లో సంబంధం చేశాడు. కత్తిపీట నుంచి పందెరకోళ్ళ గిలక మంచం వరకు సారెయిచ్చి పల్లకీతోనూ, పద్దెనిమిది యెడ్లబళ్ళతోనూ, నూటొక్క కావిళ్ళతోనూ కూతుర్ని అత్తవారింటికి పంపించాడు. ఆ రోజుల్లో కట్నాలుండేవికావు. కట్నం అంటే యేవగింపు. కొన్ని సంవత్సరాలవరకు ఈయన చేసిన పెళ్ళిగురించి ఆ చుట్టుపట్ల అనుకోకుండా వుండలేకపోయారు. ఈ కీర్తి తన పదెకరాలను అమ్మించింది.

ఈయన ఇప్పటికీ, తన జీవితంలో ఈ ఒక్క ఘనకార్యం చేశాను. చాలని మురిసిపోతూంటాడు. కూతురు అత్తవారింటి కెళ్ళాక ఒక్క సంఘటన జరిగింది, పదిహేనేళ్ళయినా నిండని యీ పిల్ల తెలివిని అత్త, విధవాడపడుచూ పరీక్షింపచూశారు. వేపుడుకు, ముద్దకూరకు, పులుసుకు కావలసిన కూరగాయల్ని తరిగి ఒక జంగెడలో కలిపివేసి వంటయింటి దగ్గర పెట్టేశారు. మాలుకోదారు భార్య, కూతురు నౌకర్లున్నా వండవలసిందే. వచ్చిన చుట్టాలకు వడ్డించవలసిందే! కోడలుకూడా ఆ యింటి తరహాను మన్నించాలి. దేనికి కావలసిన కూరగాయలను ఆమె వేరు చేయటంతో యిద్దరూ గర్వపడ్డారు. పొయ్యిమీదినుంచి కుండదించటానికి నల్లగుడ్డ లేదని ఆ యిల్లాలు అత్తగారిని అడిగింది! అత్తగారు పరిహాసంగా, కన్నవారు యివ్వలేరా

అని ప్రశ్నించింది. ఆమె వెంటనే కట్టుకొనివున్న పట్టుచీరచెంగు చింపి నల్లగుడ్డగా వాడింది. ఈ ఘటన యిప్పటికీ ఈ తండ్రైన ముసలాయన. యెందరితోనో చెప్పి తన పరువు కూతురు నిలబెట్టిందని సంతోషిస్తుంటాడు.

భూమి పోగానే రాతకోతలతో బతుకుతూ కొడుకును కరణంగా చేసుకున్నాడు. ఆ కరణంచెవుల్లో ఈవూర్లో అడుతున్న గుసగుసలు దూరాయి! ఇటు జీతం హెచ్చించలేదని గవర్నమెంటుమీద, అటు తనకు మామూలు చెల్లించలేదని రైత్వారీ ప్రజలమీద అక్కసు హెచ్చయింది. రోజుకోలెక్క, రోజుకోడొక్క, మొత్తంమీద సర్కారువారి బలవంతం అంతగా లేకపోవటంవల్ల యిచ్చిన కొద్దిధాన్యమే సేకరణ చేశారు. వేసవిలో చోడిపంట బాగా పండింది. మళ్ళీ వరి వూడుపులు పూర్తయ్యాయి.

పదేళ్ళక్రితం గరిశె అరవై రూపాయలువున్న ధాన్యం. యిప్పుడు అరువందలైంది! ప్రపంచం తల్లక్రిందులై పోతోందని బీదాబిక్కీ, పేదారోదా అనుకున్నారు. బ్రతుకుభారం మోయలేక, చావలేక దేవునిమీద భారంవేసి, క్రుంగుతూ కృశిస్తూ వున్నారు. ధాన్యంతోసహా వుప్పూ పప్పులూ రోజుకోధరతో ముందుకు పరుగెత్తుతున్నాయ్. కోమటి పేరయ్య అడ్డకు అణా హెచ్చితే; ఐదణాలు హెచ్చిందని కేకలు వేస్తున్నాడు. నాయుడు, పెద్దరైతు వగైరా పెద్దల అవసరాలు అన్నీ కోపరేటివ్ స్టోర్సు కంట్రోలు ధరలకి యీయగా, మిగిలినది మళ్ళీ రాత్రికి రాత్రి రెట్టింపుధరకి పట్నం నడచిపోతూంది.

దాసుడు శివాలకు దరిచేరేవారు లేరు. దాసుడే ఆకలితో అలమటించిపోతున్నాడు. అయినా సాయంత్రమైతే నీలమ్మగుడి తలుపుతీయటం మానటంలేదు. ఒక్కోసారి ఏడ్చేవాడు. ఆ కన్నీరుతో తల్లి బాధ విన్నదనే తృప్తితో కడుపు కొంత నిండేది. ఊర్లో కాలుపెట్టి నలుగురితోను తల్లికి సంబరం చెయ్యండి, ధరలు తగ్గుతాయంటే, లేనివారు గ్రామ పెద్దలకు చెప్పమనేవారు. పెద్దలు పకపకా నవ్వేవారు. దానితో మళ్ళీ ఆకలితో ఒళ్ళంతా మెలుచుకుపోయేది. నోరెత్తి అడగటానికి అభిమానం వేసింది. ఒకనాడు చీకట్లో వెళ్ళిపోతూ ఆ రాత్రి తను పస్తువుండాలని జ్ఞప్తికి వచ్చేసరికి కాలు ముందుకు పడలేదు. ఆ త్రోవపోతున్న పుల్లయ్యవేపు చూసేసరికి ప్రాణం వచ్చింది. ఇదివరకు రెండుసార్లు పెద్దలను అడిగి వాళ్ళ అగ్రహాలకి పాత్రుడయ్యాడు పుల్లయ్య. మళ్ళీ అడిగించినా లాభంలేదు. అయినా భుజంమీద చెయ్యివేసి వెంటపడ్డాడు. నరాలన్నీ చుట్టుకుంటున్నా ఓపికచేసుకుని మెల్లగా అడుగులు వేస్తూ వేస్తూ పుల్లయ్య ఇంటికి వచ్చి మౌనంగా కూర్చున్నాడు. మల్లు అప్పటికి నడుస్తున్నాడు. "అత్త.....తాత" అంటున్నాడు. అడుకుంటూ తనదగ్గరకు వచ్చాడు. ముఖంవేపు చూశాడు. బుడ్డీదీపం వెలుగులో, నల్లగా మాసినగెడ్డంతో, డొక్కులా ఉన్న దాసుడు మల్లుని చేరదీయటానికి చేయిచాచాడు. మల్లు దగ్గరగా వస్తూ "తాతా....." అన్నాడు.

"ఆ తల్లి రచ్చించాలి......చీకటిలో పొద్దు – సంవత్రంలో ఓడలాంటోడౌతాడమ్మా!"

పుల్లయ్య కొడుకు యెదురుగా ఛినక్ ఛినక్ సా అని గెంతాడు. కొడుకు నవ్వుతూ గెంతబోయాడు. కాని దబ్బున పడిపోయాడు. ఏడుస్తాడనుకుంటే మళ్ళీ లేవబోతున్న కొడుకుని యెగరవేసుకొని గుండెకి హత్తుకున్నాడు. ఇప్పుడు

"అమ్మ......అత్త" అని నత్తినత్తిగా అంటున్న కొడుకు మాటలన్నీ "అయ్య" అన్నట్లుగానే పుల్లయ్యకు వినిపిస్తున్నయ్.

దాసుడుమనసు తెలుసుకున్న నీలి, చోడిపిండితో చేసిన రొట్టెముక్క ఇచ్చింది. కళ్ళకు అద్దుకున్నాడు. నీలమ్మని తలుచుకునే, అలా కూర్చునే, నమిలి మింగేశాడు. క్షణంలో బలం వచ్చింది. మల్లుని ముద్దాడి మెల్లగాలేచి ఇంటివైపు నడుస్తున్నాడు. పుల్లయ్య కొడుకుతో ముచ్చట్లలో పడ్డాడు.

నడివీధిలో ఏదో గొడవగా ఉన్నట్లుంది. పీసచుట్టూ ఎంతోమంది మూగివున్నారు. పెద్ద గొంతుకతో పీస వార్తలు చెపుతున్నాడు.

"మీరంతా యిన్నారో లేదో!.....ఆ కృష్ణపరమాత్మకి అర్జునుడులాంటోడు నెరూ! గ్రాంధీమహాత్ముడున్నాడే. దేముడేకదా – ఆ దేముడు, పట్టుపడితే అలాంటి అక్షోణీలక్షోణీల సేనలతో ఉన్న వీరుల కౌరవబలమే ఓడిపోయింది కదా – ఈ తెల్లోడు ఒక్క లెఖ్ఖా? రేపటినుంచి తెల్లోడిరాజ్యం పోయి – నల్లోడి రాజ్యం వస్తోందిట...ఇంక చూడండయ్యా.....!"

ఇంకా ఆ ధాటికి ప్రజ గుమిగూడిపోతున్నారు. దాసుడు ఆ దరిదాపుల్లో పెద్దరైతు డాబా ఇంటి అరుగుమీద / కూర్చుని వింటున్నాడు పీస అభినయంతో – "ఇప్పుడున్నదంతా మారిపోతాది....ఈ కాంగ్రెసోలకి పెద్దోడా నెరూ! ఎక్కువ పిల్లలున్నోలకి ఎక్కువ పొలం, తక్కువున్నోలకి తక్కువిస్తాడు."

"పిల్లలు లేనోలకో?" ఎవరో గుంపునుంచి ప్రశ్నించారు.

"అలాంటోలకి గవర్నమెంటోడు సాలా సాలా తక్కువ భూమి ఇస్తాడు." పీస గొంతుక సర్దుకొని, "పట్నంలోను సందడి యింతా అంతా కాదు. నీ కొడుకూ, నా కొడుకూ కలెక్టరు లవుతారు."

"పో పోరా!" అన్నా డెవడో.

"నూతిలో కప్పలాంటోడివి నీకేం తెలుసు? తెలివైనోడు, నా కొడుకైతేనేం నీ కొడుకైతేనేం అడికి పెద్దపని అవుతాది – నాను పెద్దోడ్ని కాకపోయినా నా కొడుకు తెలివైనవోడైతే పెద్దోడవుతాడట! మనిషికి మనిషికి తేడా ఉండదు. సాకలోడి కూతురి మంగలోడి కొడుక్కు, మంగలోడి కూతురు బాపనయ్య కొడుక్కి పొల్చాడొచ్చు! వద్దన్నోలని గవర్నమెంటోడు కైదులో పెట్తాడు!"

"ఏ మా రాజు వచ్చినా ఈ కరువు పోగొడ్తాడా?" అని ముసలమ్మ ప్రశ్నించింది,

"ఈ కరువు పెట్టినోలందరికి కైదే! – దానితో కరువు పటాపంచలై పోతాది. మనోడు గవర్నమెంటోడు – మనమంచి సూడ్డా! అంతా మేజిక్‌లా పని ఇంక జరిగిపోతాది – సూడండి – సూడండి!"

ఈ మాటలు చాలామందికి నచ్చాయేమో కాని, దాసుడికి నచ్చలేదు. మెల్లగా లేచి ఆ సమూహందగ్గరకు వెళ్ళాడు. వెళ్తూండగానే అక్కడవున్న కొందరివైపు చూస్తూంటే, ఒళ్ళు మండిపోతోంది. ఆ గ్రామానికి ఇప్పుడు పెద్దలనుకున్న కుర్రకుంకలంతా అక్కడే వున్నారు. వీళ్ళకి దొంగసారా త్రాగటం తెలుసు. పట్నం పదిసార్లు బయస్కోపులకు వెళ్ళడం, సిగరెట్ పొగ రింగురింగుల్లా వదలటం అలవాటు. బింకంగా పసందుగావున్న అమ్మాయిలమీద కన్నేసి కార్యం నెరవేర్చుకోవటం తెలుసు.

ఇప్పుడు వీళ్ళు గ్రామానికి నాయకులు. వీళ్ళ తల్లిదండ్రుల మాటలు చెల్లుబడి కాకుండా పోతున్నాయ్.

వీళ్ళంతా భేష్ అంటున్నారు. దాసుడు యెందుకో ఉగ్రుడైపోయాడు. పీస యేవో కల్లబొల్లి మాటలాడుతున్నాడని స్ఫురించింది. సమూహం చేరగానే "పీసా!" అని అరచాడు. ఈ అరపుతో నిశ్శబ్దం ఆవరించింది – "ఎవడ్రా నీకు చెప్పాడు మేజిక్‌లా అయిపోతాదని?" పీస యేదో చెప్పటానికి వస్తూంటే, అవకాశం యివ్వకుండా దాసుడు "మనసులబట్టి మనం! ఎవుడొచ్చినా మనలో నీతి నాయం లేకపోతే ఇంతకంటె వూరు అధ్వాన్నం అయిపోతాది–" అన్నాడు.

నాయుడు యెర్రగించి చూశాడు. దాసుడు పెద్ద గొంతుకతో "ఈ పెద్ద మనుష్యుల్లో యెందరికి నీతి ఉన్నాది? ప్రజ ఇలాగ మాడిపోతుంటే, డబ్బు దోసుకుంటున్న ఈ తాగుబోతులంతా పెద్దమనుషులా పీసా?" అన్నాడు.

"నోరు ముయ్ మంగలి వెధవా?" అరిచాడు నాయుడు.

దాసుడు మతి చల్లించినట్లయింది. తన ఉనికినే మరిచిపోయి "మూస్తాను మూస్తాను – అడదాని యేలుబడి – నివ్వేం నాయుడివి? ఊరి పెద్దయితే యే నాడో ఆ తల్లికి సంబరం చెయ్యిద్దువు. ఈ కరువులు, కాటకాలు తీరును!"

దాసునితల వ్రూడినట్లు ఒక్కదెబ్బ పడింది. త్రాగుడు వాసన చుట్టూ వెదజల్లే నాయుడితో సహా కూడిన యువకుల చేతులు దాసుడిపై పడ్డాయి. పడుతున్నా దాసుడు తన నిందావాక్యాలను యేక కంఠంతో అరుస్తున్నాడు. మీరే ఒక తల్లీ తండ్రికి పుట్టివుంటే ఆ బేకులో గడించిన డబ్బుతో బీదా బిక్కీ ఆకలితో చచ్చిపోకుండా ఉండనిచ్చేవోరని, నీతిలేని మనుషులనీ అరుస్తున్నాడు!

ఈ అరుపులు పుల్లయ్యచెవిలో పడగానే పరుగెత్తాడు. అప్పటికే కొందరు జోక్యం చేసుకుంటున్నా పుల్లయ్య నలుగురినీ నాలుగువేపుల త్రోసి క్రింద కూర్చున్న దాసునివేపు చూశాడు. ఆ కళ్ళల్లో రౌద్రం ఒక్కసారి పుల్లయ్యను చూడగానే అభిమానంతో నిండి అశ్రువులుగా మారిపోయింది.

పుల్లయ్య ఆ పెద్దలందరినీ ఉద్దేశించి "మీరంతా దున్నలు! వాటి కయినా నీతి ఉంటాది. దాసుడిమీద మళ్ళీ చెయ్యి వేశారంటే ఒక్కొక్కడి పీక తెగేస్తాను – పోతారా లేదా? – ఊరికి పెద్దలు – గోచిపాతలు–" అన్నాడు.

"ఎవడూ?" మూలిగాడు కోపంతో నాయుడు.

"నేను పుల్లయ్యని! నాయుడైతే నాయుడిలా ఉండు." మధ్యను రాజిగాడు పో పోరా అన్నాడు. పుల్లయ్యకు మండుకొచ్చి, వాడిచేయి పట్టుకొని అంతదూరం విసిరేశాడు. అక్కడనుంచే వాడు నీ పని పట్టకపోతే యెర్రయ్య కొడుకునే కాదన్నాడు. "పోరా యెధవా! నువ్వు యెర్రయ్యకు పుట్టినట్టే మాటాడతావు. గుడ్డెంకన్నరా మీ అయ్య!"

పరిస్థితి విషమించేదే, నలుగురూ కూడి రాజిగాడ్ని, వాళ్ళ ఇంటివైపు త్రోసుకుపోతూంటే, "మేక పులిని కరుస్తాదా? నీ బతుకంటే యెంత?" అన్నాడు.

పుల్లయ్య దాసుడ్ని లేవనెత్తి, చెయ్యి పట్టుకొని వాళ్ళ యింటివైపు నిడిపించాడు. దాసు దుఃఖంతో మాట్లాడలేదు. త్రోవలో ఒక ఇంటిదగ్గర గుమ్మంలో గుడ్డి వెంకన్న,

గన్నెమ్మ కూర్చునివున్నారు. అక్కడ జరిగిన సంగతి వూరంతా ప్రాకిపోయింది. ఆ ఇంటి ఇల్లాలు గంజి పోస్తుంటే వెంకన్న అన్నాడు;

"తల్లీ! ఆ దాసుడు సంబరం సంబరం అని కొట్లాడిపోతున్నాడు. ఈ పెజల్లా ఆ నీలమ్మతల్లిలోనూ నీతి సచ్చింది. ఆ తల్లికే నీతుంటే ఈ గేమ పెద్దయిల్లల్లో నలుగుర్ని లేదనిపించదా?"

దాసుడు "ఛా ఛా" అన్నాడు. "ఆ తల్లికి నీతి ఉంది కాబట్టే కొడుకులకు గేనం లేకపోయినా భరిస్తున్నది!"

అంతే, మరి మాటాడలేదు. ఇల్లు దగ్గరగా వస్తోంది. ఊడినజుత్తయినా ముడి వేసుకోలేదు. ఆకాశాన చుక్కలవెలుగు. వీధిలో మరెవరూ నడవడం లేదు. దాసుడు ఆగి, "నాయనా పుల్లిగా," అన్నాడు. "నానూ మొదట అబద్దాలాడేవోడ్ని. లేనిపోని వేసాలు వేసేవాడ్ని. ఆ తల్లిని కొలిచాను. నాకు మంచిగతి దొరికింది. ఈలంతా...." పుల్లయ్య చప్పున "నువ్వేమీ జడిసిపోక" అని అందుకున్నాడు.

దాసుడు చిన్న నవ్వు నవ్వి "జడుపా! నీతికోసం కడుపుమాడి సస్తే యేం? నలుగురిసేతా దెబ్బలు తింటే యేం? నాయనా, యేడ్చేవాడినే ఆ తల్లి ఓదారుస్తాది, నా గుండెలో ఏ కుళ్ళూ లేకపోతే నన్ను యెవరు యేం చేసినా నాకు తగలదు – ఎళ్ళు నాయనా – సంబరం సెయ్యండని నా పాకులాట యెందుకు? నువ్వు గరిడీ మరిసిపోతే అంతా సరి – ఆ పుట్టినోళ్ళు బతకక్కర్లేదు!" అన్నాడు.

పుల్లయ్య వెనుకకు తిరిగాడు. దాసుడు మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ యిల్లు చేరుకునేసరికి కొడుకు అగ్నివర్షం కురిపించాడు. "కయ్యం సరికి సరితోని ఆడుతావా? వూరంతటితోని ఆడుతావా? నా పరపతి పోయింది. వేరే వుండు" అన్నాడు చివరికి కొడుకు.

దాసుడు ఆ క్షణంలో మినుకు మినుకుమనే చుక్కలవేపు చూస్తున్నా నీలమ్మ తల్లి పాదాలు కనిపించటంచేత కామోసు, చిన్ననవ్వు నవ్వాడు.

## 15

వీరావేశంతో యింటికి వెళ్ళిన రాజిగాడు పెళ్ళంమాటలు వినక తప్పింది కాదు. భార్య నోరెత్తగానే నాయుడు కిక్కురుమనకుండా వూరుకున్నాడు. రాజుగాడి పెళ్ళం పుల్లయ్యను సమయంవస్తే కాళ్ళమీద పడేటట్లు చేయిస్తానని మొగుడికి హామీ యిచ్చింది. తండ్రి వాడితో దెబ్బలాట ఎందుకన్నాడు. నాయుడితండ్రి, దాసుడ్ని సమర్థించగానే కోడలు కస్సుమంది. తను సంవత్సరమైంది, యే విషయాల్లోను జోక్యం లేనట్లుగానే మెసులుతున్నాడు. ఒకప్పుడు ఏం కావాలన్నా, ఏం చెయ్యాలన్నా తన కోరిక సాగదు. అలా కోడలు పోసిందేదో త్రాగవలసిందే!

ధాన్యం ధరలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయ్. గంజికూడా తాగడానికి లేక కొన్ని కుటుంబాలు తహతహలాడిపోతున్నయ్, ఉన్నమటుకు "పిసరపిప్పీ" అమ్మివేస్తున్నారు. ఇంకా కోతలు పట్టలేదుకాబట్టి ఎక్కడా పనిపాట్లు లేవు. ఆకలి అబద్దాలు ఆడించి కొందర్ని వూరినుంచి పట్నం పొయ్యేలా చేసింది. అక్కడ కూలీనాలీ దొరకకపోతే

దొంగతనం చేయడమే పద్ధతి. ఏమైనా చిక్కితే యింటికి రావటం, లేకపోతే ఖైదు సంతోషంగా అనుభవించటం! ఇలాంటి దారుణ పరిస్థితులు రావటంతో, పీస చెప్పినమాటలు అబద్ధాలని ఎందరో ఎత్తిపొడిచేవారు. పీస అసలు బాధ పడ్తున్నాడు, రాత్రులు తిండివుంటే తినేవాడేకాని పిల్లలబాధ కొంతలోకొంతైనా తీరుతుందని "ఉపవాసం వుంటున్నాను–" అనేవాడు. "పుట్టగానే పిల్లడు నడిసేస్తాడా మాటాడేసినాడా? ఓర్సండి. మన గవర్నమెంటోడు పెద్దోడయితే మనను యిలా వుంస్తాడా? పోషించడా?" అని నలుగుర్కీ నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తే, కొందరు "గవుర్నమెంటోడు తలుసుకొంటే యేంకాదు? నందిని పంది చేస్తాడు? పందిని నంది చేస్తాడు! కరువు పోవాలని గట్టిగా పట్టుపట్టే పోదా?" అని ప్రశ్నిస్తే –

"ఓరయ్యో! కంట్రోళ్ళు ప్రజ బతుకుతారని పెట్టాడు, దానిపేరు సెప్పి అవతల గవర్నమెంటోడి సిబ్బంది, యిటు యేపారం సేసినోడు పెజల కడుపుమాడ్చి మూటకడుతున్నారు! కట్టనీ – ఎలాగొచ్చింది అలాగే పోతాది! సెమటోడ్చి గడించిందే నిలవదు. అలాంటిది ఇదంతా నీటి బుడగలాంటిదిరా! ఏ తిప్పిరీలోపడి బుడగ పేలిపోదురా? ఆ గజేంద్రుడు మొరపెట్టేకదా దేవుడు నిలబడ్డపాటున వచ్చేశాడు. నీకూ నాకూ సావుంది కానీ, నాయం నీతికి సావు లేదురా?" చెయ్యి గట్టిగా గుండెమీద వేసుకుంటూ "నా గవుర్నమెంటోడు పెద్దోడయితే, నాను సుఖపడనా! యీలందరూ మొర్రోమని ఏడవరా? చేసినపని సెరిపేగలమా? ఇలాగ నీతికి పట్టుపడి సచ్చిపోతాను గాని..... అన్యాయానికి నెట్టుకుంటానురా?" అన్నాడు.

అక్కడేవున్న పుల్లయ్య వొళ్ళు పులకరించి "బలేబాగా సెప్పావురయ్యా! ఇలాగ చచ్చిపోతాంగాని...... అన్యాయానికి మొక్కుతామా? ఈ గేమపెద్దలు యేం సేస్తారో సూద్దాం," అన్నాడు.

సరేసరే అంటే సరే అన్నారు. అలాగా వస్తూన్న రాజిగాడు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. "ఏంరా పీసా, రేసను తీసుకెళ్ళలేదు......నీకు వద్దంటే, కారుడుయిస్తే యింకొకలికి పనికిరాదా?" అన్నాడు నాయుడు.

"నాను యివ్వను. నాకు కానీపరక కలిగిన్నాడు కొంటాను. లేనినాడు వూరుకుంటాను."

"నీ కారుడు యివ్వకపోతే – మరి పని జరగదు" అనుకుంటూ చేతి వాచీ చూచుకుంటూ వెళ్ళిపోయాడు నాయుడు.

పుల్లయ్య పోల్చుకుని "పీశా! టీ. ఎస్. ఓతో సెప్పాలిరా ఈ వైనం!" అన్నాడు.

"అంతా ఒకటేనిరా.... అడుకూతురి పెళ్ళని, తాలూకాని దోసేశాడు! బురదనీరు పారేకా మంచినీరు పారదా? రారా! ఎవరుచేసిన కర్మ వారనుభవించరా? నీ కళ్ళూ నా కళ్ళూ మూస్తారు. వాళ్ళకళ్ళూ, వాళ్ళ కళ్ళకి కళ్ళయిన దేముడికళ్ళూ మూసేస్తారా?" అంటూ పీస వెళ్ళిపోయాడు.

పుల్లయ్య యింటికి వెళ్ళేసరికి కొడుకు నవ్వుతూ, ఎగురుతూ, ముందుకు వచ్చి స్వాగతం ఇచ్చాడు, తండ్రి ఎత్తుకోగానే కిలకిల్లాడి, ఒళ్ళు ఆడించాడు. వరిచేలు కోతకి వస్తున్నాయ్. చులకనలు అక్కడక్కడ కోస్తున్నారు. ధాన్యం కంట్రోలుధర

గరిసె మూడువందలే. కానీ ప్రజానీకానికి ఆ ధరకి దొరకలేదు, నల్లబజారులో 600, 650, 700 వరకూ పెరిగిపోతూంది.

ఈ సంవత్సరం బాగా పండింది. పొలాలనుంచి కళ్ళాలకు పంట వచ్చినా ఎవరూ ఇదివరలా, ఒక వెన్ను ఎవరినీ ముట్టనివ్వడంలేదు, ధాన్యం బంగారంలా చూస్తున్నారు. నీలి ప్రతిసంవత్సరంలానే ఇవ్వవలసినవాళ్ళకు ఇస్తూంటే పుల్లయ్య ఎగిరిపడ్డాడు. ధాన్యం ఇప్పుడు బంగారంతో సమానం కాబట్టి చూసుకొని పెద్దరికం చెలాయించమన్నాడు. నీలి నవ్వి, "యిది బంగారం అని చేతులు నరుక్కోమంటావా? అంతా నాకే అనుకొంటే, ఆ కాలానికి సూసినోల్లెవ్వరూ వుండరు. మా మామ్మ సెప్పింది. నూతులుండి సేదలు లేకపోయినా, సేదలుండి నూతులు లేకపోయినా బతకలేమని!" అంది.

పుల్లయ్య మరి మాటాడలేదు. బుగత ఈ సంవత్సరం పర్మిట్ తీసుకొని వచ్చి ధాన్యం కొలిపించుకున్నాడు. కళ్ళానికి కొడుకు రావటం వల్లనే ధాన్యం బాగా రాలిందని పుల్లయ్య పెళ్ళాంతో చెప్పుకున్నాడు.

1948 వ సంవత్సరం ప్రవేశించింది. పొలాల్లో పెసరవుంది. పెద్దపండుగకి కొడుక్కి మెళ్ళో వెండి అత్తికర్ర చేయించాడు. మల్లు మొదట పీకినా తరవాత అలవాటుపడి వూరుకున్నాడు. అప్పుడే తల్లిని విడిచిపెట్టి తండ్రిదగ్గర చనువు ఏర్పరుచుకుంటున్నాడు. రాత్రుళ్ళు నీలి మత్తుగా నిద్రపోతూంది. ఏడుస్తే, పుల్లయ్యే ఎత్తుకుని త్రిప్పి, గుండెమీద వేసుకుని నిద్రపుస్తున్నాడు. చెయ్యి మీదవుంటేగాని నిద్రపోడు. పుల్లయ్య చెయ్యి తీసివేస్తే "కయ్" మంటున్నాడు. ముసలమ్మ. పిల్లడు వరుసగా నాలుగు రోజులు నిద్రలేకండా యేడవటంతో, ఏ గాలి సోకిందోనని ముల్లున్న రణభేరి కాయున్న కొమ్మను పెణకలో దోపింది. ఇప్పు డంతగా ఏడవటంలేదు. ఒక్కోనాడు పెద్దల పేరంటాలను తల్చుకొని మనవడికి యేం రాకండా చూడమనేది! ఒక్కోసారి కింకపెట్టేవాడు. తండ్రి ఓదారిస్తే కొంత నయం, లేదా అంటే తండ్రి వచ్చేవరకూ తగ్గేదికాదు. ఒక్కొక్కసారి తండ్రితో వెంటపడేవాడు. తీసికెళ్ళకపోతే ఏడుపు!

ముసలమ్మ పిల్లాడి ఏడుపు విని యేవో పాటలుపాడేది. ఐనా కింక వదల్లేదు. ఏవైనా బాలారిష్టాలేమో అని, మట్టిబొమ్మ చేసి, ఐదు కొమ్మలు, ఐదు ఆకులూ, ఐదు ఖజ్జాలూ, నల్లటిగుడ్డ, జుత్తు. అన్నం, దీపంతో చేటలో పెట్టి – వూరికి దక్షిణవేపున పోయించింది. ఏడుపు తగ్గింది. కాని పిల్లాడు చిక్కినట్లే వున్నాడు. పడమటి ఆకాశంలో రక్తం వర్ణంతో మేఘాలు రోజూ కనిపించాయ్. ఏదో అనర్థం వస్తుందని ముసలమ్మ అనుమానపడసాగింది. "మా రోజుల్లో యీ కంట్రోళ్ళూ యివన్నీ యెరగం! కలిగిన పొరుగమ్మ వున్నదాంట్లో యిరుగమ్మకు ఆకో పాకో యిచ్చేది. కానీ ముఖం సూడకండా బతికామంటే యెలాగ మరి!"

నీలి వున్న గంజీగడుగూ, వెంకన్న గన్నెమ్మలాంటి అనాధులకు పోసేది. ఒకనాడు పుల్లయ్య పొద్దుతిరిగినా ఇంటికి రాలేదు. మొగుడికోసం అన్నం వుంచింది. అడుక్కునే కుష్ఠరోగి వచ్చాడు. చూడటానికి భయంకరంగా వ్యాధి శరీరం అంతా వ్యాపించివుంది. "ఊరు ఆ చివరనుంచీ అడుక్కుని వస్తున్నాను. ఏ తల్లికి కనికరం కలగలేదు... రెండురోజులైందమ్మా......నోటిలో బుక్కెడు గంజిపొయ్యలేదు. యిలా

వెళ్ళి ఆ యేటిలో పడిపోయి ఛస్తాను. నా శవాన్ని యే నక్కలో పీకి, రాబంధులో తింటే కొంత పుణ్యమైనా వస్తాది" అన్నాడు.

"రామ రామ" అంది నీలి.

"నానేంపాపం యెరగను తల్లీ! నాకీ కష్టం వచ్చింది. ఇలాగ వచ్చిందికదా అని దేముడ్ని తిడతానా? ఏ జన్మలో యే పాపం చేశానో, యీ జన్మలో అనుభవించేస్తే వచ్చే జన్మలో ఒకమాట ఆడేవోడిగా పుడ్తాను."

నీలి వాడి సిలవరి గిన్నెలో మొగుడికోసం వుంచిన అన్నంలో సగం వేసింది. నిల్చొనే ఒక్క నిముషంలో లేదనిపించాడు! మరి కొద్దిగా తెచ్చింది. ఇక మొగుడికి మరి లేకపోయింది. వాడు "తల్లీ! ఈ కడుపాక సముద్రం అమ్మా! ఆకలి అగ్గిలాంటిది. అగికి యేదో ఆహారం వెయ్యకపోతే, మనిషినే కాల్చేస్తాది. ఒక పేణం నిలిపావు తల్లీ! నీ ధర్మమే నీకు గొడుగై కాస్తాది" అని దీవించాడు.

పెళ్ళం పొయ్యి వెలిగించి వండుతోంది. కానీ శరీరమంతా ఏదో తిప్పుతున్నట్లుంది. పుల్లయ్య గబగబ వణికిపోతూ వచ్చాడు. కొడుకు యెదురై నవ్వుతూంటే ఏమీ అనకండా ఇంటి నులకమంచంమీద కూర్చుని బొలబొలా కన్నీరు కారుస్తున్నాడు. పెళ్ళం వచ్చి ఆశ్చర్యంగా మాటాడలేకపోయింది. ఒక్కసారి ఘొల్లుమన్నాడు. మల్లు తండ్రిని చూసి ఒకటే గోల. వీళ్ళిద్దరి ఏడుపుతో నీలి కళ్ళంట నీరు చిమ్మి మెల్లిగా రాలుతున్నాయ్! ముసలమ్మ కళ్ళు మసకలు కమ్మాయ్! అంతలోనే వూరంతా అట్టుడికిపోయింది. చిన్నా, పెద్దా, పిల్లా, పిచికా కళ్ళల్లో నీరే కనిపిస్తోంది. ఈ ఏడుపు హృదయంలోంచి వుబికి వుబికి వస్తోంది. జాతి, వర్ణ, వర్గ భేదాలు లేకుండా అందరూ ఏడుస్తున్నారు. లోకం తల్లకిందులై పోతూంది. ఇంక మనం వుండి దేనికి? మనం అంటూ వుంటామా అని ఎవరికి వారే అనుకుంటున్నారు. కుష్టురోగి కూడా, విషయం తెలుసుకుని తల మొత్తుకొని యేడ్చాడు.

ఊరంతా నీలమ్మ గుడిదగ్గర సమావేశమైనారు. సరి! ఆ తెలివితక్కువ వెధవెవడో ఆ దేముడ్ని పేల్చేశాడు. ఆ దేముడు ఆ రూపులో లేకపోయినా, మనవెంట వుండనేవుంటాడు. దేముడు లేకపోతే ఈ పెపంచకం వుంటాదా – అని తలోలా అన్నారు. ఆయన ఆత్మశాంతికి ప్రార్థించారు. పదో రోజున నీలమ్మ గుడియెదరగా వూరంతా కలిసి బీదలకు అన్నదానం చేశారు. అంతా ఏకమై కలిసిమెలిసి బరువుగుండెలతో ఈ పని నెరవేర్చారు. ఈ సమయంలో దాసుడు నీలమ్మగుడి తలుపులు తెరిచి, గుమ్మందగ్గర సంతోషంతో నిటారుగా నిల్చున్నాడు. తింటూన్న బీదల ముఖాలను చూస్తూంటే తన కెంతో జాలివేసింది. నీలమ్మ తల్లివైపు చూశాడు. ఆనందంతో నవ్వుతున్నట్లు స్ఫురించింది – కనిపించింది! ఒక్కసారి ప్రజల నుద్దేశించి "నాయనలారా సూడండ్రా! ఆ తల్లి సంతోషం ఇంతా అంతా కాదు! ఆ గాంధీమహాత్ముడు దేముడు – దేముడిపేరు సెప్పి మీరు మంచి పని చేస్తారు – మంచిపనిచేస్తే దూతలు దూరం అయిపోవా? ఆ తల్లికి సంతోషంకదా?" అన్నాడు.

పీస లేచాడు. "ఆ దేముడిని, ఆ రూపకంతో మరి సూడం – కానీ ఓ రయ్యల్లారా! ఆ దేముడు పెట్టిన ఒరవడినపోతే, ఈ బీద, బిక్కికి ఆ

పెద్దరైతోళ్ళనాగే యేళ్ళన్నీ నోటిలోకి యెల్తాయ్. ఇంటిలోను ఒకడు కడుపునిండా తిని తందానలాడి, మిగతావోలకి కడుపు మాడితే ఆ ఇల్లు ఇల్లేనా? ఆ తిన్నోడు మేనిషేనా? ఎక్కువ పండిందాకా, ఉన్నదే నలుగురికి సర్దినోడు మనిషి – అదు తినకండా ఎదరోలకి ఇచ్చినోడు పెద్ద. అందరూ పెద్దలెలాగయిపొతారు?"

పెద్దలు మూతులు త్రిప్పారు. చిన్నలు శ్రద్ధతో విని నిజమే అనుకున్నారు. ఇంతలో సంజీవి చెవిలో నాయుడు ఏదో చెప్పాడు, గబగబ పీసచెయ్యి పట్టుకొని "కబుర్లు చెప్పాదువుగాని రారా! పదుగురికి పట్టెడన్నం వడ్డించరా!" అన్నాడు.

పీస విదలించుకొని పులుసు దాక పట్టుకొంటూ, "బాలనాయకం. బహూనాయకం" అని గొణుక్కున్నాడు.

# 16

కొడుకు తన మెడను చేతులతో చుట్టివేయగానే, పుల్లయ్య అలా చిన్న పరుగు నడకలతో వీధిలో పడ్డాడు, కొడుకు సంతోషంతో నవ్వుతున్నాడు, మళ్ళీ మెల్లిగా నడుస్తూంటే "ఊ! ఊ! అయ్యా....." అని పరుగెత్తమనే వుబలాటాన్ని వ్యక్తంచేస్తున్నాడు. అలా ఆగుతూ, పరుగెత్తుతూ అదెమ్మప్పయింటికి చేరుకున్నాడు.

అదెమ్మ కడుపునొప్పితో యేడుస్తూంది. వాము, జీలకర్రలు ఇప్పుడు పనిచెయ్యటంలేదు. పొరుగూర్లో వున్న నేటివ్ వైద్యుడు లవణం పొట్లాలిచ్చాడు. కొద్దిగా తశ్మాంతిగావున్నా మళ్ళీ ఒక్కొక్కసారి ఉధృతంగా నొప్పి వస్తోంది.

చుట్టూ చేరినవాళ్ళు మనిషోలా అంటున్నారు. "పట్నం తీసికెళ్తే పోటో తీస్తారు. ఏమున్నాదో తెలిసిపోతాది" అని పీస సలహా యిచ్చాడు. ఏ సలహాలు అల్లుడు వినలేదు. అసలే పిసినారి. అందులో పెద్దరికం వచ్చింది. "ఎందుకర్రా, ఆ వైదుగుడు, ఢంకామీద దెబ్బకొట్టి నయంసేస్తానంటూంటే, తొందర పడకండి" అని తమాయించుకొస్తున్నాడు.

మందు ఒక పొట్లాం వెయ్యగానే కొంతసేపటికి నొప్పి సర్దుకుంటుంది. అదెమ్మప్ప ముఖం మల్లుని చూడగానే కొంచెం తేరుకుని అలా నులక మంచంమీద దొర్లుతూనే, మల్లుని దగ్గరగా చేర్చుకుంది కానీ వాడు తండ్రివేపు ఉరకలు వేసుకుంటూ వచ్చేశాడు. మళ్ళీ మెడను ఆ చిన్ని చేతులతో చుట్టివేసి తండ్రితో ముద్దులాడుతున్నాడు.

అనుకోని మాటలు అల్లుడి నోటినుండి వచ్చాయి. పుల్లయ్య పెళ్ళికి పుచ్చుకున్న రెండువందలూ వేగంగా తీర్చేమన్నాడు. 'కొండ కొదాలు' కొనే అవసరం వచ్చిందనీ, డబ్బు రొక్కంటంగా వుందనీ చెప్పాడు. పుల్లయ్య బదులు చెప్పలేదు. అదెమ్మప్ప "తొందర పెట్తే ఎలాగరయ్యా" అంది. "వాడి అవసరానికి యిచ్చేటప్పుడు మన అవసరం చూడాలంటావా లేదా? నిన్ను మూరు రూపాయలున్న కొదాలు ఈ వేళ నూటపాతికై పోతున్నయ్. పుల్లయ్యా! యేగం ఏదో సూసి, అప్పు తీరిస్తే నాకేవతల నష్టం వుండద"న్నాడు.

తల ఆడించి యించికి వచ్చి పెళ్ళంతో అన్నాడు. "ఆడికి యెవడో సెప్పిన మాటలు కాకపోతే, దాన్నెం గరిశె ఏడొందలకి అమ్మేడు – డబ్బునేదా?..."

నీలి ఓ క్షణం వూరుకొని "ఇన్నాళ్ళు వూరుకొన్నారు - ఇంకొకరైతే వూరుకొంటారా?" అంది.

"మాకు వూరికినే యిచ్చారే? వడ్డీ దాన్నం ఈ రోజుల్లోనూ తగ్గించకండా ఇవ్వలేదా?"

"ఈ బంగారం వుండి. యేం సెయ్యాల?......" అంటూ ఉన్నదంతా వూడ్చి, మొగుడిచేతబెట్టి, బలవంతాన కంసాలి చిన్నోడి దగ్గరికి పంపించింది. తిరిగివచ్చి "నాశిరకం బంగారం అని తులం దగ్గర నాలుగు రూపాయలు గుంజుకోవాలని సూస్తున్నాడు. పట్నం తీసికెల్దాంలే" అన్నాడు.

నీలి "ఊర్ని కనిపెట్టి బతుకుతున్నోడ్ని మాని, పొట్టపొడిచి పోషిస్తామా? పిల్లలుగలోడు. కక్కుర్తి పడ్తున్నాడు. మనం కొన్న ధరకంటే ఎక్కువ డబ్బు వస్తోంది కదా....ఈడికే యిచ్చీ...." అని బలవంతం చేసి మొగుడ్ని పంపించింది.

అప్పు తీర్చేగా మిగిలిన డబ్బుతో బట్టలు కొందామంటే, కోపరేటివు స్టోర్సులో బట్టలేదు. ఏదో వాదిస్తే "ఏనాడో నీకు డబ్బు కలుగుతాదని బట్ట దాసిపెడ్తామా?" అని హేళన చేశాడు స్టోర్సులో ఉన్న నాయుడు

ముసలి సాలిపాపయ్య దగ్గరకెళ్తే, నూలుధరలు పెరిగాయనీ కంట్రోలు నూలన్న పేరేగాని దొరకలేదని, వాడి కష్టసుఖాలు చెప్తూ, చీరలు చూపించాడు. మిగిలిన డబ్బుకి తనకొక చాపు, పెళ్లానికి ఓ కొక, ముసలమ్మకొక తాను వచ్చింది. అనాడు రెండు రూపాయలు కోక ఈనాడు పది రూపాయలు! ఊరిని కనిపెట్టుకున్న సాలిపాపయ్య దగ్గర కొన్నందుకు నీలి సంతోషించింది.

నీలి కొత్తబట్టలు పెద్దలు పేరంటాలకు చూపించింది. ముసలమ్మ బోసినోటి నవ్వుతో కొత్త తాను కట్టుకుంది. మనవడ్ని ముద్దు పెట్టుకొంది. పొలంనుంచి వస్తున్న తండ్రిని చూడగానే ముసలమ్మ చేతులనుంచి జారిపోయి, గబగబా గెంతులేసుకుంటూ, నవ్వుతూ ఎదురెళ్ళాడు. తండ్రిమీదికి ఎక్కగానే, పుల్లయ్య అలా అరుగమీద కూర్చునే కొడుకుని ఆడిస్తున్నాడు. కొత్తపంచతో కొడుకుని కప్పాడు ముందు. బోసినోటి నవ్వు చూసి, పైకి లేవనెత్తగానే పెణక అందుకున్నాడు మల్లు. ఉయ్యాల్లా ఊగిస్తూంటే ఏడవలేదు. కొడుకుని గుండెకు హత్తుకుంటూ, "భళి! భళి!" అన్నాడు. రోజుకి రోజు మల్లుకి అయ్యతోనే సంబంధం హెచ్చుగా ఉంది. రాత్రిళ్ళు ఏడ్చేటప్పుడు అయ్యదగ్గర ఉంటే చాలు ఏడుపు పోతుంది. ముసలమ్మ హాస్యానికి "అదు అయ్యకొడుకుగానీ! అమ్మకొడుకా?" అంటే పుల్లయ్య "ఎవడైనా నీ మనవడేలే!...." అంటే ముసలమ్మ ఆనందంతో, పళ్ళులేని పెదాలతో నవ్వుతో మురిసిపోయింది. వంగిన ఆ నడుం ఎక్కడ వాల్సినా ఆ మనమడి వేపే కళ్ళు - ఎక్కడ ఆ శుష్కించిన దేహం ఉన్నా మనసు ఆ మనమడి వేపే.....!

ఒక్కసారి గతం జ్ఞాపకం వచ్చేది. ఆ దేముడు - నా అయ్యా? అనుకొని మురిసిపోయేది. దేనికీ ఆమె విసుక్కోని యెరగదు. దుఃఖంతో కుమిలిపోలేదు. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బవలేదు. మనుమడు పొలానికి వెళ్తున్న తండ్రి వెంట బడటానికి అడుగులు వేస్తూంటే, పట్టుకుంది....విరుచుకపడ్తూ మామ్మజుట్టు పీకేస్తున్నాడు. అప్పటికీ వదలకపోవటంతో, గుంజాటనపడుతూ విడిపించుకొన్నాడు.

ముసలమ్మ ఫకాలుమంది. "ఏ చెట్టు ఇత్తనం!" తండ్రి కనపడకపోవటంతో యేడవటానికి లంఘించుకున్నాడు. ఎవరు ఎంత బోధపరిచినా లేదు. ఏడుస్తూ ఏడుస్తూ పండుకుండిపోయాడు.

పుల్లయ్య పొలంనుంచి వచ్చేసరికి, నేలమీద పడుకున్న కొడుకుని చూసి యెత్తి మంచం మీద వేస్తూంటే, తెలివి వచ్చి "అయ్యా" అంటూ ఒక్క కేక వేశాడు అయ్యను చూడగానే ప్రాణం వచ్చింది. ఒడిలో నిల్చుని మెడను చేతులతో చుట్టివేశాడు.

గ్రామకరణం తండ్రికి, పోయిన ఆస్తులను గడించాలనే కోరిక ఉన్నా లేకపోయినా. కొడుకు తన కుటుంబాన్ని పోషించుకోడానికి సరిపడే భూవసతైనా ఈ కంట్రోలురోజుల్లో గడించాలని ఉబలాటపడ్డాడు. రాత్రికి రాత్రి రోడ్డు వెంబడి, అడ్డుత్రోవంట నల్లబజారులో కొన్న ధాన్యాలు నడిచి పోతూంటే, కరణం అపకండా వుండటానికి కొంత డబ్బు మొదటే చేరుతోంది. కోపరేటివ్ స్టోర్సువల్ల కొంత డబ్బు కూడుతోంది. ఇక వ్యూళ్ళో ప్రొక్యూరుమెంటు లెక్కల గొడవల్లో దొరకవలసింది బాగా దొరుకుతోంది. ఇంతవచ్చినా ముసలాడికి తృప్తి కలగలేదు. వచ్చినది పొదుపు చెయ్యడం కోడలికి తెలియదు. పెళ్ళంకి అంతకన్నా తెలియదు. నెలకు అంతకన్నా పెద్దకుటుంబాలున్న యింటికి రెండు అడ్డలు మంచినూనయితే, వీళ్ళకి ఐదు అడ్డలు చాలటంలేదు. కేకలు వేసినా ముసలడిని వాళ్ళు లక్ష్యం చేయలేదు. ఇంత వచ్చినా యింట్లో సరిగ్గా జరుగుబాటు లేనేలేదు.

పుల్లయ్యకు పంపవలిసినవేవో పంపేమని అడిగితే, నాకేం వుందన్నాడు. ఈ విషయం నీలికి తెలియదు. ప్రొక్యూరుమెంటు ఈ సంవత్సరం, ఏప్రిల్, మే నెలల్లో చాలా తీవ్రంగా జరుగుతోంది. ఏజంట్లు వస్తున్నారు. ధాన్యం కంట్రోలుధర, గరిసె మూడువందలు. ఆ ఏజంటే, రాత్రిమీద నల్లబజారులో గరిసె ఏడువందలకి కొంటున్నాడు. ఈ తతంగంలో ఉద్యోగుల సహాయం బాగా దొరుకుతుంది. ఇదివరలో డబ్బు కళ్ళకు హత్తుకొనేవారు. ఇప్పుడు నోట్ల కట్టలు మామూలు కాగితాల కట్టలులా చూస్తూ, ధాన్యాన్నే కళ్ళకు హత్తుకుంటున్నారు. కరణం లెఖ్ఖలవల్ల పధి గరిసెలు పండే పెద్దరైతు, ఒక గరిసె ప్రొక్యూరుమెంటుకి కొలుస్తున్నాడు. ఒక గరిసె పండే చిన్నరైతు సగం కొలవాలి. ఇది అన్యాయం అంటే, పెద్దరైతు కూలీకీ, తిండికీ, పశువుల ఆహారంకీ ధాన్యం తియ్యగా మిగిలింది ఒక్క గరిసే! ఆ గరిసే ప్రొక్యూరుమెంటుకి కొలుస్తున్నా డంటున్నారు! ఈ వాదాన్ని పోలీసుల సహాయంతో, ఒక్కొక్కసారి వస్తున్న ఆఫీసర్లవలన, పెద్ద రైతులు ఉద్యోగుల పక్షాన ఉండటంవలన, చిన్నరైతులెవరూ మాట్లాడలేకపోతున్నారు.

పుల్లయ్య వంతు వచ్చింది. పదిహేను పుట్లు (పుట్టికి 20 కుంచాలు) కొలవాలనీ, "నా కొట్లో ఉన్నది పది పుట్లేనా లేదు. ఇంకో ఏడాదంతా తినాలి – ఊడుపులకీ, దుక్కులకీ, కోతలకీ, కూలికి యేం ఇస్తాను? నాను కొలవ"నని పుల్లయ్య భీష్మించాడు. కొలవక విధిలేదని నాయుడు, కరణం పట్టుబట్టి ఇంటికి వెళ్తే, బాణాకర్ర పట్టుకొని "ఎవడు వచ్చి నా కొట్టు ముట్తాడో సూస్తా"నని కొట్టుదగ్గర నిల్చున్నాడు.

అంతదూరం నుంచే అంతా వెనక్కి వెళ్ళారు. ఆ సమయానికి నీలి ఇంట్లో లేదు. ఏటికి వెళ్ళింది. రాగానే ముసలమ్మ జరిగింది చెప్పగానే, చప్పున కరణం యింటికి పరిగెత్తింది. కరణం వూళ్ళో బాలనాయకులతో పేకాటలో నిమగ్నుడైవున్నాడు. ప్రాధేయపడుతూ ఆపదనుంచి తప్పించని బ్రతిమిలాడింది. కరణం వినిపించుకోనట్లుగానే వుంటూ "నివ్వెంత చెప్పినా లాభంలేదు. ఆ బుద్ధి నీ మొగుడికి వుంటే ఈ గొడవంతా వచ్చేదా? ఈ రోజుల్లోనూ మంచిగా ఉండి బతకగలమా?" అన్నాడు.

నీలి ఏం సెప్పినా కరణం పేకాట గొడవలో "వెళ్ళు, వెళ్ళు...." అన్నాడు తృణీకారంగా. ఇంటికి వచ్చింది. ఏమి వస్తుందో అని భయపడ్తూంటే. పుల్లయ్య వెటకారంగా, "ఇంక కొట్టుదగ్గరికి వస్తారే" అంటూ మీసాలు మెలివేశాడు.

కొడుకుతో అప్పుడే కుస్తీలకు దిగుతున్నాడు. మీసాలు మెలివేయటం. తొడచరచటం నేర్పిస్తూంటే, నీలి అలా చూస్తూ కూర్చుండిపోయింది. "ఈసారి కొట్టుదగ్గరికి ఎవడైనా వస్తే, నాదాకా యెందుకు - మల్లు సాలడా?" అంటూ బిగ్గరగా నవ్వుతూ కొడుకుని ఎత్తుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఈ సంఘటన జరిగిన నాలుగో రోజునే వూళ్ళోకి పోలీసులు, ఎఫ్. ఎస్. ఓ., టి. ఎస్. ఓ లు వచ్చారు. చిన్నచిన్న రైతులు వీళ్ళని చూడగానే ధాన్యం కొలిచారు. కొలుస్తూనే కళ్ళంట నీరు కారుతోంది.....ధాన్యంకు వచ్చిన కాగితాలు క(ర)పెట్టెల్లోకి విసిరారు కొందరు.

పుల్లయ్య మీసాలు తడుముకొని, క(ర)పట్టుకొని, అరుగుమీద కూర్చున్నాడు. ముసలమ్మ పెరటి గడ్డిమేటిదగ్గర పిడకలు చేస్తూంది. మల్లు ఉయ్యాలలో నిద్దరపోతున్నాడు. నీలి ఆకులు తొక్కి నొల్లటానికి తోటకు వెళ్ళింది.

ఈ దండుకుదండు పుల్లయ్య ఇంటిమీదకు వచ్చారు. టి. ఎస్. ఓ "నువ్వేనోయ్ పుల్లయ్యా?" అన్నాడు.

"సిత్తం!"

"నువ్వు కొలవవలసిన పదిహేను పుట్లు కొలుస్తావా? లేక జైలులో కూర్చుంటావా?"

"ఎందుకుబాబు అలాగా కళ్ళెర్రచేస్తావ్?"

"నీ ఉద్దేశం?"

"కొలవను!"

"నువ్వు కొలవకపోతే మేమే కొలుచుకుని, నీ డబ్బు నీ ముఖాన్న పారేస్తాం" అని ముందుకు వస్తూంటే, పుల్లయ్యకు ఒళ్ళంతా రౌద్రంతో మండుకుపోయింది. బాణాకర్ర పట్టుకొని నిల్చుంటూ "అక్కడే ఆగండి. నా కొట్టుమీద సెయ్యిపడిందీ అంటే, మీ వీపులు సదునై పోతాయి. పది గరిసెలు పండినోడూ నానూ ఒకేలా కొలవాలా? ఈ దొంగరాతలతో మా కడుపులు మాడ్చేస్తారా?" అన్నాడు.

"ఉపన్యాసం చాలించి లేస్తావా లేదా!....." అంటూ టి. యస్. ఓ. ముందుకు చొచ్చుక పోతుంటే, పుల్లయ్య ఆటకాయించి గంభీరంగా వాడి కళ్ళలోకి చూశాడు. ఇంతలో పోలీసులవైపు అధికారి చూసి సైగచేశాడు. వారు చుట్టుముట్టూంటే, అధికారి

కొట్టుగడప ఎక్కబోతూంటే, పుల్లయ్యకు ఒళ్ళంతా పౌరుషంతో మండుకపోయి, "కొట్టు ముట్టక!" అని గట్టిగా గద్దించాడు. ఆ అరుపుకు అధికారి దద్దరిల్లినా, సగర్వంగా కొట్టును ముట్టుకోగానే, పుల్లయ్య ఒక్క వురుకు వురికి, ఆ యెత్తునుంచి అధికారిని త్రోసివేశాడు.

క్రిందపడ్డ అధికారి కళ్ళు జేవురించాయ్. "పట్టుకోండి! బేడీలు వెయ్యండి!....." అని అరిచాడు. చుట్టుముట్టిన పోలీసులను విసరితన్నాడు. మండిపోతున్న కడుపుతో, నోరు యేమంటూందో, తనేం చేస్తున్నాడో తెలుసుకోలేకో, బీభత్సంగా మెసులుతున్నాడు. ఇంతలో నీలి పరుగెత్తుకు వచ్చింది. కాలరుద్రునిలా విహారం చేస్తున్న భర్తను చూసి భయం వేసింది, ఉయ్యాలలో పిల్లాడు కేకలుపెట్టి యేడుస్తున్నాడు. ముసలమ్మ ఇటువేపు చూడలేకపోతూంది. నలుగురు పోలీసులు పటాపంచలు కావడానికి ఇంకెంత సేపోలేదు. వాళ్ళ లాటీలు పుల్లయ్య రాకెట్‌లా తిరుగుతున్న బాణాకర్ర ముందు ఆగలేకపోయాయ్! ఊరంతా మూగిపోతున్నారు!

నీలి ఆ కోలాహలంలో తలమీదగంప క్రిందపెట్టి, మొగుడుకాళ్ళు పట్టుకుంటూ, యేమంటూందో ఆ కోలాహలంలో ఎవరికీ వినబడలేదు.....ముఖంలో ముచ్చెమటలు పోశాయ్. ఆ చెమట క్రిందనున్న పళ్ళెంమీద పడుతోంది. చుట్టూవున్న ప్రజ యిప్పుడు కనిపించారు తన కంటికి. కాళ్ళ దగ్గర ఉన్నది తన పెళ్ళామేనని ఇప్పుడు గుర్తుకు వచ్చి విసిరి తన్నలేదు. ఆమెవైపు చూడగానే తనేదో నేరం చేశానేమోనన్న తలపు మనసులో చొచ్చుకపోయింది. ఇప్పుడే, ఇంతమంది మాట్లాడుతున్నా, కొడుకు ఏడుపు చెవులోకి చొచ్చుకోపోసాగింది. ఇంతవరకూ తను యీ ప్రపంచంలో లేనట్లనిపించింది. దెబ్బలు తగిలిన పోలీసులు మెల్లగా దగ్గరగా చేరుకుంటున్నారు. వాళ్ళవేపు చూడగానే ఎందుకో కనికరం వేసింది. "ఈ కండలు లేనివాళ్ళమీదనా తన బలం ఇంతసేపూ చూపించింది!" అనుకున్నాడు.

గబగబ అక్కడనుంచి కదల బోతూంటే, పోలీసులు పట్టుకున్నారు. వాళ్ళని విదిలించుకుంటూ ఇంటిలోనికి పరిగెత్తి, ఉయ్యాలలో ఏడుస్తున్న కొడుకుని యెత్తుకుని, ముద్దులాడుతూ, "మల్లూ! నిన్ను కొట్టు దగ్గర పెట్టాను కాదురా! ఈ యేల మీ అయ్య మీసం లేనోలతో దెబ్బలాడాడు – ఈ మీసం ఉండి ఎందుకు?" అన్నాడు.

కొడుకు ఇదంతా తనకే అని విని అర్థం చేసుకున్నట్లు తండ్రివేపు చూశాడు. ఒళ్ళంతా సంతోషంతో ఆడించేశాడు. కానీ ఆ నిముషంలో ఇల్లంతా ఘొల్లుమంది! చేతికి బేడీలుపడిన పుల్లయ్య, అదేపనిగా కయ్‌మంటున్న మల్లువేపు చూస్తున్నా, ఇంకా ఇంకా చూడటానికికూడా వ్యవధి లేకపోయింది, చేతులకు బేడీలతోనే నీలివైపు చూశాడు. ఆమె కళ్ళనిండా నీళ్ళున్నయ్. ఆమె కళ్ళు తనవేపు చూసి దాచగానే, తనేదో నేరం చేశావని అనుకోసాగాడు. అలానే ఇల్లుకదిలి, నడివూరుగుండా సంకెళ్ళతో నడుస్తూంటే దీని కంతటికీ కారకుడయిన రాజుగారు ఇంటి అరుగుమీద నిల్చుని చూసి సంతోషించాడు.

# 17

శ్రీ
పస, దాసుడు పట్నం పరుగెత్తారు; సాయంత్రం తిరిగివచ్చి మళ్ళీ రేపు బెయిలుకోసం వెళ్ళాలన్నారు, వకీలుని పెట్టాలన్నారు. ఇంట్లో డబ్బు లేదు. ఎవర్ని అడుగుదామా అని నీలి ఆలోచిస్తూంటే, రాజిగాడి పెళ్ళాం ఇంటికివచ్చి మంచీ చెడ్డా మాటాడి, యాభై రూపాయలు అప్పు అడగకుండానే ఇచ్చింది. నీలి కృతజ్ఞత తెల్పింది.

మరుచటి రోజు పదిగంటలకు మళ్ళీ పోలీసులు మినహా ముందురోజు బృందం వచ్చారు. వాళ్ళను చూడగానే నీలి బయటికి వచ్చింది.

నిన్న పరాభవింపబడ్డ అధికారి "ధాన్యం కొలవాలమ్మా!" అన్నాడు.

నీలి మాటాడకుండా కొట్టుతాళం తీసుకవచ్చి తలుపుతీసింది. తీశాక అధికారిముందు నిలుచుని, సవినయంగా "బాబూ! అంతా పోగా మిగిలింది ఈ కొట్టులోనే యేసుకున్నాం. మదుపులకి తిండికి యేంవుంచి రచ్చిస్తారో? పెద్దబాబులు మంచీచెడ్డా మీకు తెలీదా? మీకు నాయం అని తోసింది చెయ్యండి" అంది.

అధికారికి ఆమె వినయంతో కూడుకున్న మాటలతీరు చూడగానే మనసు కరిగింది. కొట్టులోకి తొంగిచూసి దగ్గరగా వస్తూ, "పట్నంలో మీలాంటి ప్రజే ఉన్నారు. వాళ్ళని రైత్వారీప్రజ పోషించకపోతే వాళ్ళు మల మల మాడిపోరా?" అన్నాడు.

"సిత్తంబాబూ! నలుగురూ సుకంగా ఉంటేనే పెపంచకం నిలుస్తాది!"

"నేనూ మనిషిని కానా – ఒక పుట్టెడుధాన్యం ఇయ్యి ప్రొక్యూరుమెంటుకి" అన్నాడు అధికారి.

ఆమె ముఖం వెలిగింది. "బాబూ, రెండుపుట్లు తీసుకోండి" అంది.

అధికారి సంతోషించారు. ఏజంటుకు పుట్టెడు ధాన్యమే కొలుచుకొని డబ్బు చెల్లించమని చెప్పి ఇంకోయింటి కెళ్ళాడు.

మండుటెండలో నడిచి పుల్లయ్య. పీస, దాసుడు పట్నంనుంచి వచ్చారు. బెయిలుమీద విడుదలయిన పుల్లయ్యకు వీధివెంబడి రావటానికి సిగ్గువేసింది. పెరటి త్రోవవెంట వచ్చి ఇంటిలో దూరాడు. తండ్రికోసం యేడుస్తున్న మల్లు అయ్యను చూడగానే, సంతోషంతో కేకవేసి, మీద కెక్కాడు. కొడుకుని నిమురుతూ "నా మల్లూ.....సీపురు పుల్లలా అయిపోయావురా – ఈ ఒక్కరోజుకే......!" అన్నాడు.

పీస నవ్వుతూ "నువ్వూ ఈ కొడుకుని తలుచుకొని సీపురుపుల్లయ్యావు!" అన్నాడు.

నీలి ఈ అభిమానాలు స్థాయిలో సడేవరకూ మాటాడలేదు. పుల్లయ్యకు అన్నం తినేప్పుడు యెదురుగావున్న పెళ్ళంవేపు చూడటానికి సిగ్గు వేసింది. అంతలోనే తనను అన్యాయంచేసిన గ్రామ పెద్దలమీదా, అధికార్లమీదా కోపం లోలోన పండుకుపోతూంది. కొడుకు తనతో కలిసి తింటున్నాడు. నీలి యేమీ మాటాడకుండా యెదర నిలుచుంది. ముసలమ్మ కర్రదువ్వెనతో వీధి అరుగుమీద జుత్తు

పీక్కుంటోంది. సాలలోని పోతులు తనవేపే చూస్తున్నాయ్. అన్నం తిన్నాక అంబలి పోసింది. పుల్లయ్య కొడుకు కూడా తినటానికి పోతూంటే వద్దు అని ముక్కుమీద వేలువేశాడు. కొడుకు అలా ముఖంవేపు చూస్తుంటే దగ్గరగా తీసుకున్నాడు. ఇంతట్లో పుల్లయ్య పట్నంనుంచి వచ్చాడని తెలిసి వూళ్ళో చాలామంది ఇంటికి వచ్చి పలకరించారు. వాళ్ళు వెళ్ళిపోయాక ఆత్మాభిమానం వుబికిపోయి, ఇంట్లో అటు ఇటూ పచారుచేస్తూ ఘీంకరించాడు. దీనికి కారకులైనవాళ్లని వూరకనే విడిచి పెట్టనన్నాడు. మళ్లా వచ్చి ధాన్యం యెలా తీసుకెళ్తారో చూస్తానన్నాడు. ఈ గొడవకు ముసలమ్మ "ఎందుకలా అయిపోతావు నాయనా? నువ్వు తిడ్తున్నావే వాళ్ళూ మనుషులే! మనిషికి మంచిచెడ్డ లుండక మానుకుంటాయా?" ఇంకా యేదో అనబోతూంటే పుల్లయ్య "ఊరుకో" అని ఖస్సుమన్నాడు. ముసలమ్మ మాటాడలేదు. నీలి భర్త కోపంలో యెక్కువభాగం కక్కేవరకు వూరుకుంది. అరుగమీదకు వెళ్ళబోతూ మళ్ళీ చటుక్కున జ్ఞాపకంవచ్చి పెరటిలోకి వెళ్ళాడు, చుట్టుపట్ల గ్రామాల్లో కూడా గరిడీలో ఘటికుడైన పుల్లయ్య – నీతిమంతుడయిన మల్లునాయుడు కొడుకు, నడివీధి గుండా బేడీలతో వెళ్ళాడని తెలిసిపోయింది. ఖైదులో ఒకరోజు కూర్చున్నాడు – ఇది తనకెంత చిన్నరికం? తను కలలోనైనా ఇలా వస్తుందని అనుకోలేదు. ఇది నాయానికి కాలంకాదని మనసులో కాకుండా బైటికే అనేశాడు, రాట్నం తిప్పుకుంటున్న నీలి ఈ మాటలు విని "లోకాన్ని కాలాన్నీ యెందుకంటావ్?" అంది.

"అననూ! ఊరు దిబ్బైపోదా?"

"ఊరి దిబ్బైతే మనం యెక్కడుంటాం? గేనంలేదా? యెగిరే దూది గాలిలో యెంతసేపు ఉంటాదని? పువ్వు సెట్టునుంటేనే సోబస్కారం–"

"అయితే యేవంటావే?" అన్నాడు విస్సుగ్గా. కొడుకు యీ మూల నుంచి ఆ మూలకి ఆ – ఆ – అంటూ నడుస్తున్నాడు.

"ఆ కోపం, పౌరుషం నేకపోతే యీ గొడవంతా ఎందుకొస్తాది?"

పుల్లయ్య మాటాడకుండా మీసాలు తడుముకున్నాడు. నీలి మొగుడు కళ్ళల్లోకి ఒకసారి చూసి మళ్ళీ రాట్నంవైపు దృష్టిపోనిస్తూ "నువ్వు ఏ బాబుని తోసినావో ఆ బాబే, రెండు పుట్లు తీసుకోమంటే ఒక పుట్టే తీసుకున్నాడు ఏ రాజిగాడ్ని నానామాట లన్నావో ఆడిపెళ్ళమే, యేబైరూపాయలు ఇచ్చి, నిన్ను ఇంటికి తెప్పించింది. నువ్వు ఒకరిని మంచి అనకపోతే నీ కొకరు మంచి అని యెందుకంటారు?" అంది.

పుల్లయ్య భార్యవేపు చూశాడు. ఇంకేమైనా అంటుందేమోనని ఎదురు చూశాడు కాని ఆమె మరి మాటాడలేదు. కాని ముఖంలో భర్త చేసినపనికి ఆమె అయిష్టత స్ఫుటంగా కనిపిస్తూనే ఉంది.

పుల్లయ్య రెండురోజుల వరకూ ఇల్లు కదల్లేదు. పలుకరించడానికి వచ్చేవారు వస్తున్నారు. ఇంట్లో పెళ్ళంతోనూ సరిగ్గా మాటాడలేదు. ఏం సన్నిహితంగా ఉంటున్నాడో కొడుకుతోనే, ఆ కొడుకూ తండ్రిని విడిచి పెట్టలేదు.

ఈ కేసు వాయిదాలు పడుతూ వచ్చింది. ప్లీడరుకు ఇవ్వటానికి డబ్బు కావాలి.

పట్నం వచ్చేటప్పుడల్లా యేదో ఖర్చు అవుతూనేవుంది. అమ్మటానికి తగ్గ ధాన్యంలేదు. ఉన్నమట్టుకి అమ్మివేస్తే మళ్ళీ ఈ ధరల ఎద్దడితో కొనుక్కోవటం కష్టం. ఎవరూ ఇదివరలా మాటమీద అప్పు ఇచ్చేవారులేరు. పేరుకు గవర్నమెంటు రేటుప్రకారం నెలకు నూటికి అర్థరూపాయి వడ్డీపత్రంమీద ఉంటుంది. కానీ వడ్డీ చెల్లించేటప్పుడు ధాన్యరూపంగా సంవత్సరానికి నూటికి మూడుపుట్లు చెల్లించవలసిందే. ఈ వడ్డీకి వూర్లో కోమటి పేరయ్యేకాదు, పెద్దరైతులంతా యెంత కావలిస్తే అంత ఇస్తారు, ఇది అన్యాయమని పుల్లయ్య అప్పుకి వెళ్ళలేదు. కాని వెళ్తేకానీ వీలులేని పరిస్థితి వచ్చింది. తన స్వంతభూమి అస్వాధీనం తనఖాకు పెట్టవలసివచ్చింది. రాజిగాడి పెళ్ళమే రెండు పుట్ల ధాన్యానికి నీలి బ్రతిమాలగా ఇచ్చింది.

తిరగ్గా తిరగ్గా వర్షాకాలానికి కేసులో తీర్పు ఇచ్చారు. ఈ అయిదు నెలలలోనూ రెండువందల వరకూ ఖర్చులయ్యాయి. మేజిస్ట్రేటు నూరు రూపాయల జరిమానా, అది ఇవ్వకపోతే రెండునెలల ఖైదు చెప్పాడు. ఆ రోజున కోర్టు అవరణలో నవిరివూర్లోవాళ్ళు ముప్ఫయిమందివరకు వున్నారు! పుల్లయ్యకు యెక్కడలేని పౌరుషం వచ్చింది. ఆ గద్దెమీద కూర్చున్న మనిషికి న్యాయంలేదని, ఈ లోకంలోనే న్యాయం చచ్చిందని చికాకుపడ్డాడు. ఇలాంటి సమయంలో రాజుగాడిపెళ్ళం తన అక్కసంతా వెళ్ళగ్రక్కింది. ఏమన్నా నీలి మాటాడలేదు. ఊరకే వందరూపాయలు ఇస్తున్నట్లు ఇచ్చి, "నీ మొగుడుతో ఇదంతా సెప్పతావనే అన్నాను ఎంతకాలం పద్దుమీద ఇస్తాం! స్వాధీన తనఖాపత్రం రాస్తేగాని నీ మరిది ఒప్పుకోనంటున్నాడు," అంది.

నీలి మొగుడితో ఆ సంగతి చెప్తానంది. సమయానికి ఆదుకున్నందుకు, ఆమె మేలు మరవనంది. పుల్లయ్య ఈ సారి వారం రోజులవరకు ఇల్లు కదల్లేదు. ఒక్క కొడుక్కీ తనకే సంబంధం, కానీ రానురాను పొలానికి, పోతులకి పచ్చగడ్డికి వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళేవాడు కానీ తనేదో చిక్కిపోయినట్లు, తనను అంతా వేలెత్తి చూపిస్తూ హేళన చేస్తున్నట్లుగా బాధపడిపోయేవాడు. ఒక్కొక్కసారి కొడుకును తన భుజంమీద ఎక్కించుకుని నీలమ్మగుడికి వస్తున్నాడు. అక్కడ దాసుడు శివాలు వేస్తుంటే తండ్రి కొడుకులు కూర్చునేవారు. చీకటి పడకుండా మనవణ్ణి ఇంటికి తేకపోతే ముసలమ్మ పుల్లయ్యతో కయ్యమాడేది. ఏ గాలో ధూళో సోకితే పిల్లడు చిక్కిపోతాడని ఆమె భయం.

ఇంకా వరిచేను పండలేదు. నెలరోజులకిగాని పంట అందిరాదు. కొట్లో ఒక గింజలేదు. చోళ్లుకూడా సరి. ఎవర్ని అప్పు అడగటానికీ పుల్లయ్యకు నోరు రాలేదు. నీలి రాజిగాడి పెళ్ళందగ్గరకు అప్పుకి పెళ్ళింది, అప్పటికి రూపాయకి అడ్డెడుబియ్యం ఇస్తున్నారు, కరువు హోరుమంటోంది! కంట్రోలుబియ్యం యెర్రగా మేకుల్లా వున్నాయ్! పశువులుకూడా తినవు! అవి కొద్దిగా చవుకగా వున్నాయని కొని దంచితే నూకలయ్యేయి. ఆ నూకలన్నం చూస్తూ తినలేకపోయేవారు. బయట కొనుక్కుంటే ఒక రూపాయకి అడ్డ. పైరుపంటలధరలు, ఉప్పు, పప్పు, నూనెధరలు విపరీతంగా పెరిగున్నయ్. ఉన్నవాళ్ళకి డబ్బు చేసుకోటానికి, లేనివాళ్ళు మలమల మాడిపోడానికి, కొద్దో గొప్పో ఉన్నవాళ్ళు అడుగంటిపోవడానికి ఇవే రోజులు. ఈ రోజుల్లోనూ నీలిచెయ్యి కట్టివేయబడలేదు. ఎక్కడా ఏమీ దొరక్కపోతే.

చచ్చిపోకండా ప్రాణం నిలుపుకోడానికి బుక్కెడు గంజి దొరికే నీలియిల్లు ఉందని కుష్టురోగికీ, వెంకన్నకు, గన్నెమ్మకు తెలుసు.

• బియ్యం రూపాయికి అడ్డచొప్పున, చోళ్ళు రెండడ్డలు చొప్పున ఇస్తూ, ఆ అప్పు పంట వచ్చేసరికి మూడువందల యాభై నుంచి నాలుగు వందల యాభైకి రాజిగాడు పొడిగించాడు. పల్లపుబట్టిలో ఒకమాదిరిగా పండింది. మెరకబట్టిలో సగానికి సగం రద్దు. ఆ భూమిమీద పండిన పంటలో మూడింట రెండువంతులు వడ్డీకి వెళ్ళింది. మిగిలిన ఐదు పుట్లలో ధానధర్మం, చాకలీ మంగలీ పోను ఇంటికి వచ్చింది రెండు పుట్లే! బుగత అంబారానికి సరిపోయింది ఆ పొలంమీద పంట! రెండు పుట్లతో ఒక ఏడాది గడపటమెలా! ఆ ఆలోచనలు వద్దన్నా పుల్లయ్య మనసులో చొచ్చుక పోయేవి, తను ఇదివరలా వుషారుగా లేదు, తను చిక్కిపోతున్నాడని తన పాతశిష్యులు అనుకుంటున్నారు. వాళ్ళలో వయసు వచ్చింది – కానీ ఉత్సాహంలేదు. వాళ్ళ వయసులో తను యెంత హుషారుగా వుండేవాడు! వాళ్ళు గరిడీలో ఘటికులు అనిపించుకోలేదే, చుట్టుపట్ల వూర్లలో వూళ్ళలో యే వొక్కరిపేరు యెవరికీ సరిగ్గా తెలియదు, ఈతరంవాళ్ళలో ఏదో లోటు కనిపిస్తూనేవుంది. గెంతే తనకొడుకునిచూసి గర్వించేవాడు. కడుపునిండా తృప్తిగా భోజనం చేసినట్లనిపించేది. "నా కొడుకు తరంవాళ్ళు మళ్ళా ఈ లోకంలో నాయం, నీతి నిలపరా? నా కొడుకు సుక్కల్లో సెందురిడిలా అగపడడా? ఈడుండగా నాకేం నోటు?" అని తమాయించుకునేవాడు. ఇలా గర్విస్తూనే వూర్లో కొత్తగా కట్టున్న పెంకుటిల్లువేపు చూసేవాడు. కోమటి పేరయ్య గుడిసెపోయి డాబా యిల్లయింది – పరపతివున్న పెద్ద రైతులు పెంకుటిళ్ళు కట్టించివేస్తున్నారు. ఇంటిమీద నిరుడు గడ్డివేసుకుని నేయించినవాళ్ళు కొందరు, ఈ సంవత్సరం అదీ చెయ్యలేని పరిస్థితిలో వున్నారు. మనుషుల్లో మాట నిలకడ వున్నట్లు తనకు తోచలేదు, డబ్బుతో మంచీ చెడ్డా, ఇంటా, బయటా, న్యాయం, నీతి కొలవటం జరుగుతోంది. ఇదంతా చూస్తూ తలచుకొని తన జుత్తు కూడా పండిపోతున్నదేమోనన్న అనుమానం కలిగింది. ఈ దారుణ పరిస్థితులు చూసి, దాసుడు వూరిలో రాత్రనక పగలనకు, పెద్దవారినందరినీ, ఎక్కడపడితే అక్కడే అడుగుతూంటే నలుగురూ వాడు పిచ్చివాడయ్యాడన్నారు.

పీస ఏదో ఒక పూట పుల్లయ్యయింటికి వస్తున్నాడు, నీతికి నిలబడి బుగతకు అంబారం కొలవగా మిగిలినది అయిపోవచ్చింది. ఈ పిల్లతో ఎలా గడపటమో తోచలేదు. మల్లును చేరదీసుకున్నాడు వాడితో ఆడుకుంటూంటే కొంత ఈ విచారం మాయమయ్యేది. పీస తాత భుజాలెక్కి బోసిపళ్ళతో ముత్యాలవర్షం కురిపించేవాడు, తాత ముక్కూ, మీసాలు, జుత్తూ ఒక్కొక్కసారి కోపంవస్తే పీకేసేవాడు.

శివరాత్రి వచ్చింది. ఊర్లో రువ్వవాళ్ళ కుటుంబాలు, వాళ్ళ యిష్టదేముడికి సంబరం చేశారు. అప్పుడు గుండెకు తప్పిడిగుళ్ళు కట్టుకొని ఆడాలి. వాళ్ళవి అసలే కలిగినకుటుంబాలు. ఈ ధరలో డబ్బు బాగా చేసుకున్నారు. ఆచారప్రకారం పుల్లయ్యకూడా వెళ్ళి ఆడాడు. మల్లు తప్పిడి గుళ్లు కడితేనేగాని వూరుకోలేదు. ఉపవాసంవున్న రువ్వ అప్పుడు దివిటీ పట్టుకుని ఆడుతున్నాడు. అలసిపోయినట్లున్నాడు. చుట్టూ వున్నవాళ్ళు "అలసిపోయినావా నాసామి!" వాయిస్తూ గెంతుతున్నారు.

తాళం వేస్తూ తండ్రిని అనుకరిస్తూ కొంతసేపు గెంతాడు. వడపప్పూ, అరటిపళ్ళు పంచి పెట్టారు. ఇందులో పీసకూడా పాల్గొన్నాడు, కానీ, ఎంతసేపో ఆడలేకపోయాడు. కాళ్ళు పీకెట్టిపోయాయ్. ముందురోజు రాత్రి నోటిలో మంచి నీరు పోసుకొని నిద్రపోయాడు. ఇచ్చిన ఫలహారంలో కొంతలో మిగతా యింటికి తీసుకవెళ్ళాడు.

పుల్లయ్యకు కొడుకు తప్పించి ఈ లోకంలో, మరి దేనిమీదా లేదు, నీలి వేసినదేదో తినటం, ఏదో పొలంపని వుంటే చూసుకోవటం. మల్లుకి రెండున్నరేళ్ళ వయస్సు. ఇప్పుడు తండ్రివెంట పొలానికి ఎక్కడకు పడితే అక్కడకు వెళుతున్నాడు, తల్లి అవసరమే తనకు లేదు. తిండికూడా తండ్రితో కలియబడి తింటున్నాడు. పండిన పెసలు బుగతకియ్యగా విత్తనాలకు, ఇంటి అవసరాలకు వుంచగా, మిగిలినది అమ్మివేశాడు.

ఒకనాడు చీకటి పడింది. వంట అయిపోయాక ముసలమ్మ తిన్నది. వీధిలో అరుగుమీద ముసలమ్మ. మనుమరాలు కూర్చున్నారు. పుల్లయ్య కొడుకుతో సహా వీధిలోకి వెళ్ళాడు. ఆ సమయంలో యేదో గొణుక్కుంటూ ఘీంకరించుకుంటూ, నడుస్తూనే శివాలు వేస్తున్నట్లుంది దాసుడు. అసలు ఆకలితో దహించుకుపోతున్నాడు. దీపం వెలిగించటానికి నడుస్తున్నాడేకాని తూలిపోతున్నాడు. ఆ వైఖరిచూస్తే తాగినవాడనో, పిచ్చివాడనో అనుకోవచ్చు. పుల్లయ్య ఇంటివైపు చూడగానే ప్రాణం వచ్చినట్లయింది. “నాయనా! పుల్లిగా......” అంటూ అంగట చతికిలపడ్డాడు.

నీలి “యాదిలోకి యెల్లాడయ్యా” అని జవాబిచ్చింది, ముసలితనం బాగా మీదపడినట్లుంది. మాటలు పెగలకుండా వున్నాయ్, కాని అలాచూస్తూ తడబడుతూనే “ఆ తల్లికి.... కోపంవచ్చినాదంటే.... భూ.....చక్రం....భుగ..... భుగలాడి..... పోతాది...... ఎంతకని..... యాలందరినీ సెమించమని...... పాదాలు పట్టుకోవటం..... దీపం యెలిగించి......”

ఆయాసంతో మరి మాటాడలేక పోయాడు. కొద్ది నిమిషాల్లో ఆకలి జయించింది. ఒళ్ళంతా ఆవరించిన ఆ దావాగ్ని దాసుణ్ణి మూర్ఛపుచ్చడానికి ప్రయత్నిస్తోంది. కానీ, దాసుడు చావుబతుకుల్లో కొట్లాడుకొంటూనే “తల్లీ! అంతా మాయ...... సావు పిలుస్తోంది.....తల్లీ!” అన్నాడు.

నీలి చప్పున గదిలోంచి బుడ్డితెచ్చి దాసుణ్ణి చూసింది. ప్రాణం అక్కడే ఒదిలేస్తున్నాడేమోనన్న భయంవేసింది. కళ్ళుమూస్తున్న దాసుడు చెయ్యి సైగచేశాడు. నీలి వంటయింటికి పరిగెత్తి గిన్నెడు అన్నంతెచ్చి, చప్పున కలిపి, గబగబ దాసుడినోటిలో కుక్కింది. జఠరాగ్నికి దహించడానికి ఆహారం దొరకగానే దాసుడు కళ్ళువిప్పాడు. కళ్ళంట నీరు బొట బొట కారటం మొదలెట్టింది. యెడమచేతితో కంటినీరు తుడుస్తూ, కుల్లచేత అన్నం కుడుపుతూ, ఆ విగ్రహంవేపు చూస్తూంటే, యెక్కడలేని జాలీ దుఃఖం పెనవేసుకొచ్చింది. కళ్ళల్లో తిరిగే కన్నీరు కార్చకుండా చీరకొంగుతో ఒత్తుకుంది.

దాసుడు మంచినీరు చివరకు త్రాగి, అలా గోడకు చారబల్ల ఆలసట తీర్చుకున్నాడు. ఎంతసేపటివరకో మౌనం మ్రింగివేసింది. చివరకు లేస్తూ నడవబోయి ఆగాడు, అభిమానం అంతాకూల్లకళ్ళల్లో, నీరయ్యింది “అమ్మా! నీలమ్మతల్లీ! ఈ దాసుల్లకి

యెన్నాళ్ళకు కనిపించావు తల్లీ!" అని అనుకుంటూ మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

# 18

దాసుడు వెళ్ళాక పుల్లయ్య మల్లుతో వచ్చాడు. నీలి యింకా దాసునిగురించే ఆలోచించుతూ కూర్చుంది. పెళ్ళాం యేనాడో చచ్చిపోయింది, ఉన్న ఒక్కకొడుకూ త్రాగుబోతు – పిల్లలు... కోడలేమో గయ్యాళి. ఆస్తీ పాస్తీ ఆ మంగలి పాదే. దానిని పూర్తిగా నమ్ముకుంటే బ్రతికేవాళ్ళే పాపం! ఈ ముసలికాలంలో దాసుడికి ఎంత కష్టం వచ్చిపడిందోనని నీలి విచారించింది.

మల్లు తల్లియెదురుగా గెంతులేస్తూ "ఛినక్ ఛినక్ సో!" అంటున్నాడు. నీళ్ళాడివున్న నీల ముసిముసినవ్వు నవ్వుకుంది. పుల్లయ్య చాలా కాలానికి గూటాలు త్రిప్పాడేమో ఆకలివల్ల, వేసినమట్టుకు లేదనిపించి పెళ్ళంవేపు చూశాడు. కొడుకుకూడా ఖాళీ అయిన కంచుకంచంవేపు తల్లి చూడలేదేమోనని కామోసు చూపిస్తున్నాడు. పుల్లయ్య నీలివేపు యెగాదిగా చూసి లేచిపోయాడు. మల్లుకూడా తండ్రిని అనుసరించాడు.

మనుమడిని మంచంమీద వేసి పాటతో నోరు కదుపుతోంది ముసలమ్మ. కొంతసేపటికి తండ్రి దగ్గరవుండి మీద చెయ్యివేయటంచేత మల్లు నిద్రపోయాడు. ఒక కంట భార్య యేంచేస్తున్నదో కనిపెట్టూ వున్నాడు.

నీలి వంటయింటి పనులు పూర్తిచేసి గదిలోకి వచ్చింది. ముసలమ్మ ఒకమూల దొర్లుతోంది. దొర్లుతూ యేదో "నాయుడొరి బొట్టాట నారాయణమ్మ" అంటూ పదం రాగాలు తీసుకుంటూ పాడుకుంటోంది. పుల్లయ్య పోతులకు గడ్డివెయ్యడానికి వెళ్ళాడు నీలి పెరటిలోకి కెళ్ళి నిల్చుంది. చీకటిరాత్రులు. ఆకాసమంతా చుక్కలతో నిండిపోయింది.

పోతులు విల్చొని గడ్డి నములుతున్నయ్. ఈ రాత్రికి సంతోషంగా వస్తున్న పెళ్ళంవేపు పుల్లయ్య చూశాడు. తను యెక్కువ యెందుకు తిన్నానా అని బాధపడ్డాడు. దానితోపాటు ధాన్యం ఆఖరైందనే తలపుకూడా వచ్చింది. ఆ భూమిమీద యింకా అప్పుతెచ్చి తింటే అది ఈ సంవత్సరమే మునిగిపోతుంది. తరవాత......?

పుల్లయ్యవచ్చి పెళ్ళందగ్గర నిల్చున్నాడు. ఆమెను చూస్తూంటే చూడాలని సంతోషం, గర్వం. అయ్యో యిద్దరు వస్తున్నారే అని జాలి వేసింది. ఎందుకు తినలేదని అడగడానికి సిగ్గువేసింది. కాని యేదో విధంగా ఈ ప్రశ్నవేస్తేగాని మనసు కుదుటబడలేదు. ఆమెభుజంమీద చెయ్యివేసి వెనుక నిల్చున్నాడు. నీలి కన్నెత్తి చూసింది. మెల్లగా బుగ్గ నిమురుతూ......

"కొట్టు కాలీఅయిపోనాదా?" అన్నాడు.

"ఈ వేళతో సరి" అంది.

"నాకేమీ మనసు బాగులేదు, కాలమానం చూస్తుంటే బయంయేస్తంది. ముందు ముందు బుక్కెడు గంజైనా దొరుగుతాదో లేదో?" అన్నాడు.

నీలి నెమ్మదిగా అంది: "ఎందు కలాగ సెడ్డే అనుకోవాల? ఒళ్ళు గట్టిగావుంటే ఒకరికింద చాకిరీచేసినా కడుపు జరిగిపోతాది!"

ఈ చాకిరీ అన్న పదం పుల్లయ్యకు నచ్చలేదు. తన తాతల దగ్గరనుంచీ వున్న హోషు, మంచీ మర్యాదలు తన రక్తంలో యింకిపోయినయ్. అవే బాధపెట్టున్నాయ్.

"రేపటినుంచీ మళ్ళీ ఆ రాజిగాడేనా గతి?" అన్నాడు.

భర్త గొంతుకలో నిరాశ స్పష్టంగా కనిపించడంతో నీలి చిరునవ్వు నవ్వి భర్తవేపు తిరిగింది. ఆ గిరజాలను మెల్లగా నిమురుతూ గుండెమీద తల అన్చి, సూడు! ధయిర్యమే లచ్చిందేవి అంటారు. పెసలు అమ్మిన డబ్బు పెట్టి ధాన్యం కొంటాను. దంచినబియ్యం వేపారం సేద్దాం. మిగిలిన తవుడు పోతులకీ, నూకలు జావకీ! ఏమైన బియ్యం ఉంటే అన్నం వండుకుందాం!" అంది.

"మన యింటలేదు ఈ పని" అన్నాడు.

"మనం బిచ్చమెత్తుకోలేదు కదా! వేసవిలో సోడిపంట కలిసొస్తాది. కోమార్తి ఎళ్ళి బీర ఇత్తనాలు తీసుకురా. గుడ్డిమీద పాదులేద్దాం. బీరకాయలు సంతకి తీసికెల్తే డబ్బురాదా?"

పుల్లయ్యకి ఈ మాటలన్నీ కొత్త కొత్తగా అనిపిస్తున్నాయ్. తన కుటుంబ తాహతుకు, హోదాకు తగ్గ పనులు ఇవేవీ కావనిపించాయ్.

"నాకేమీ – మనసు బాగునేదే....." అన్నాడు.

నీలి తలెత్తి భర్త కళ్ళల్లోకి చూసింది. పుల్లయ్య అన్నాడు: "ఈ రాజిగాడు మన బూమి మింగేద్దామని సూస్తన్నాడు. పిల్లలు పుట్టున్నారా? వాళ్ళకి యేం ఇస్తాం? ఊరు ఊరంతా అన్నాయంతో అట్టుడికిపోతోంది. ఈ పెద్దోలందర్ని గవుర్నుమెంటోడు కైదులో పెట్టేస్తే!"

నీలి చప్పున అందుకుంది. "ఒకరి మీద అనుకొనే బదులు మన సెడ్డేంటో తెలుసుకుంటే మంచిది. అలాగ పండితే మనకూ డబ్బుమీద ఆశ ఉంటాది. ఈడి సావు, ఆడి కైదు ఎందుకు కోరాల! పాపం వస్తాది. నా బతుకు నేను కష్టపడి బతుకుతానంటే ఈలంతా యేం సెయ్యగలరు?

"సెయ్యరా? బతకనిస్తారా?"

"ఎవరి పాపం వాళ్ళనే తింటాది. నివ్వూ, నేనూ వాళ్ళని తింటామని పాపిష్టోలమవుతామా? కాళ్ళూ, సేతులూ ఉండగా బతకలేమంటావేమిటి? కాళ్ళూ సేతులు ఆ జబ్బు తినేస్తే ఆ కుష్ఠురోగే బతికిపోతున్నాడు. అందరూ మనుషులే – అందరూ బతకడానికి ఈ మన్నున్నాది. ఒక్క సెట్టుకాయలే ఒకలాగుండవు. అంతా నీ సేతులో ఉన్నాదనుకోని, అన్నిటికి నివ్వే పెద్ద గొప్పోడివి అనుకోని ఉండబట్టే ఇలాగై పోతున్నావ్. ఒకరిమీద మనసులో సెడ్డపెట్టుకోని యేం తీసుకపోతాం! మనుషులంతా మంచోలే! నీబట్టే నా మంచి – నాబట్టే నీ మంచీ వుంటాది. ఒకరికి సెడ్డ అనుకొని సూస్తే వాళ్ళ మంచేం చూస్తావు?"

ఇంతసేపు మెల్ల మెల్లగా నీలి అంటుంటే ఒక్క మాటా మొగుడు అడలేకపోయాడు. ఆమెను తాకి అలా ఆకాశం వేపు చూస్తుంటే ఆ చుక్కలూ.....వెలుగులూ.....ఇంకా అవేవో అనుభూతులు..... ఓ క్షణం ఈ ప్రాపంచిక విషయాలూ.....వాటిపై ఆసక్తీ.....అన్నీ మరిచిపోయాడు. తనలోవున్న ద్వేషాలు పటాపంచలైపోయినట్లనిపించింది. తల వంచేసరికి భార్య మోము ఆ వెలుగులో వెలిగినట్లయింది. ఆమెను గట్టిగా హృదయానికి హత్తుకుని ఆ తలను మనస్ఫూర్తిగా నిమురుతూ కళ్ళల్లో అభిమానం అంతా నింపేశాడు!

తెలివి తెచ్చుకున్న మల్లు ప్రక్కన అయ్య లేకపోవటంతో 'అయ్యా' అని మూలుగుతూ కేకవేశాడు. చెయ్యివేసి ప్రక్కన పడుకుంటేగానీ మళ్ళీ నిద్దర పట్టలేదు. నీలి క్రింద కోక వేసుకొని పడుకుంది. పుల్లయ్యకు నిద్దర పట్టలేదు. ఎన్నో ఆలోచనలు వచ్చి పడుతున్నయ్. ఇదివరకు తను ఆలోచించి ఎరగడు. దేనికీ బాధపడీ ఎరగడు. ఇప్పుడు అన్నీ ఆలోచనలే.....ప్రతి ఆలోచనా బాధే! ఈ ముసలమ్మ టోకుర్లు తీస్తోంది. ఎప్పుడు వూపిరి ఆపేస్తుందో? దానిక్రింది దిన వారాలకి ఎంత ఖర్చు? నలుగురు కులంవాళ్ళనీ పిలవకపోతే నామోషీ కదా?

కొడుకు తినడానికి వచ్చే కాలానికి ఇలాగ పరిస్థితులు వచ్చాయే అని విసుక్కున్నాడు. పొలం అయిపోతుంది. రాజిగాడు వచ్చేయేటికి మింగేస్తాడు ఇంక బుగతపొలం ఉన్నాది. వాడు నిలకడలేని మనిషి! ధరలు వస్తున్నాయి కదా అన్ని అమ్మేస్తే – కొనుక్కోడానికి డబ్బు ఉంటే ఎంత బాగుండేది! ఆ ధాన్యం సంవత్సరం అంతా తినగా నీలి యెందరికి చెయ్యి దులిపినా సరిపోయేది. డబ్బెక్కడిది? అమ్మడానికి యెన్ని గుండె లుండాల? – ఇలా ఆలోచించగా నీలి సెప్పినదే సరయ్యినదనిపించింది. తెల్లారుజామున లేచాడు. మల్లు యింకా నిద్దరపోతున్నాడు. పెళ్లాంతో చెప్పి బీరవిత్తనాలు తేడానికి కోమార్తిగ్రామం వెళ్ళాడు.

మేల్కొన్న మల్లు అయ్యలేకపోవటంతో సాలలోనికి వెళ్ళాడు......అక్కడా అయ్యలేడు. "అయ్యేడి" అని అడిగాడు. ఒక పోతు తలాడించింది. ఇల్లంతా చూశాడు. అరుగుమీద చూశాడు గబగబ నోరు, ముఖము కడుక్కుంటున్న మామ్మజుత్తు వెనకనుంచి పట్టుకొని "అయ్యేడీ?......" అని అడిగాడు, "ఉహు!" అన్నది; ఎక్కిరించాడు. అమ్మ అలావస్తే "అమ్మా, అయ్యేడి?" అన్నాడు. "కోమార్తి పనిమీద యెల్లాడు, వస్తాడు. మామ్మముకం కడుగుతాది – యెల్లు" అంది అమ్మ.

"అయ్య రావాల!" అని భీష్మించుకొంటూ వాకిట మటం వేసుకొని కూర్చున్నాడు. పొద్దు బాగా యెక్కింది. ఇంకా అయ్య రాలేదు. కళ్ళు కాయలు కాసిపోయాయి. రానురాను ఆ కళ్ళల్లో నీరు నిండుకుంటున్నాయి. గొంతుకకూడా గురగుర లాడుతోంది. ఇంకా అయ్య రాలేదని యేడవడానికి ఇంకెంతసేపో పట్టదు – అదిగో! అయ్య అగుపించాడు. ఒక్క గెంతేసి పరుగెత్తి అయ్యమీద వాలాడు. ఎత్తుకోగానే ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. కొడుకుని యెత్తుకొని వస్తుంటే, ముసలమ్మ అంది: "వాడు అమ్మకొడుకా, అయ్యకొడుకా?"

మల్లు తండ్రివంటిమీద తూలుతూ, గెంతుతూ, నవ్వుతూ "అయ్య అయ్య!" అన్నాడు.

ఆరోజే ధాన్యం కొన్నారు. ఊరంతా పుల్లయ్య బియ్యం వర్తకం చేస్తున్నాడని తెలిసిపోయిందని పుల్లయ్యకు సిగ్గువేసింది. వారం రోజుల్లో నీలి చెప్పిన లాభాలు కనిపించాయి. పుల్లయ్య ధాన్యం దంపడం, నీలి చెరగటం... ఇలా వేసవి వచ్చింది. కళ్ళాల్లో కొట్టవలసిన కొందరి చొప్పకుప్పలున్నాయ్. ఏవో దొంగతనాలు జరుగుతున్నాయని పెద్దరైతులు అనుకోవడమేగాని, దొంగని పట్టుకోలేకపోతున్నారు. నీలి చేతితోనూ, మల్లు చేతులతోను వేసిన బీరపాదులు పువ్వులు పూశాయి. పిందెలు వేశాయి. యేతాలతో నీలు ఏటినుంచి తోడి చోడిపంట వేశారు. పుల్లయ్యకు ఈ రోజుల్లో చేతినిండా పని వుండటం వల్ల అట్టే లేనిపోని ఆలోచనలకు తావులేకపోయింది. నీలి పైవాళ్ళ చోడి వూడుపులకు, గొప్పులకు, కూలికి వెళ్ళటం పుల్లయ్య యిష్టపడలేదు. నలుగురూ ఈ విషయం యేదో హీనంగా అనుకుంటారనీ, అనుకున్నారనీ వెళ్తున్న పెళ్ళాన్ని పుల్లయ్య వద్దన్నాడు. ఆమె ఎంతో నచ్చచెప్పింది. కష్టపడి తెచ్చుకున్నప్పుడు సిగ్గెందుకు పడాలని ఆమె వాదన. ఎప్పుడోగాని రాజిగాడి దగ్గరకు అప్పుకు వెళ్ళే అవసరం రాలేదు. వరి ఊడుపులకు, దుక్కులకు, మదుపులకు అవసరం వచ్చేటప్పుడు రాజిగాడి దగ్గరకు వెళ్ళవలసి వచ్చింది. మూడు సంవత్సరాలు నిండున్న మల్లు కూడా అప్పుడే గోచీపెట్టి చేతిలో చిన్న ముల్లుకర్రతోనూ, ముక్కులో చిన్న బంగారం కమ్మి, మెడలో వెండి అత్తి కర్రలతోనూ అయ్యకు సహాయం చేసేవాడిలా బయలుదేరుతున్నాడు. పారా, బొరిగె పట్టుకొని గడ్డి తవ్వటం నేర్చుకుంటున్నాడు. వూడుస్తున్నప్పుడు "నోమీ నోమల్లాల" అని పాడే ఆడమ్మలతో గొంతుక కలుపుతున్నాడు. వరియాకు కట్టతోవలో గైరమ్మగా పెట్టి దారిన పోయేవాళ్ళను డబ్బులెయ్యండి అడుగుతున్నాడు కూడా. "హేయ్! హేయ్!" అని యేటిలోనికి వెళ్ళిపోతున్న పోతులను పిలవటంకూడా తెలుసు. బలవంతాన అయ్యచెయ్యి లాగుతూ గూటాలున్న చింతచెట్టుక్రిందికి తీసుకవెళ్ళి అయ్యను తిప్పమనడం, అయ్య గూటాలు పట్టుకొని త్రిప్పుతుంటే తను వుత్తిచేతులు త్రిప్పటం చేస్తున్నాడు. తండ్రి సంతోషంతో కొడుకుని మీదికి యెత్తి ఆ చిన్న పాదాలు పట్టుకొని గాలిలో నిల్చోపెట్టే మొదట కొద్దిగా భయం వేసినా, రానురాను ఆ భయంపోయి, ఇప్పుడు తొడ చరచటం కూడా తెలుసు. పుల్లయ్య భళీ అంటే – మల్లు "భళీ! భళీ!" అని అరుస్తాడు.

పనిపాట్లు అయిపోయాయి. మళ్ళీ కావలసినంత తీరుబడి. వర్షాలు కురుస్తున్నాయి, వెలుస్తున్నాయి. ఏరు – గెడ్డపారుతోంది. పెటేరు వచ్చేటప్పుడు జీలుగుతెప్ప పట్టుకుని కర్రలు పుల్లయ్య తీసేడు. నీలి ఒడ్డున ఉండి చెత్త పోగుచేసి అదీ, మొగుడు తీసిన కర్రలూ యింటికి మోసింది. మల్లు, అయ్యతో తెప్పమీద యెల్తానని యేడ్చేవాడు. "పెటేరు సూసి జడిసిపోవాల కదా, అలాంటిది మల్లుగాడికి యేంటి ఆ ధైర్నం!" అని మనిషోలా ఆశ్చర్యపడ్డారు. ఈలోగా ధాన్యం ధరలు, దానితోపాటు మిగతా జీవితావసరాల ధరలు పెరిగిపోతున్నయ్! గరిసెధాన్యం ధర పదమూడు వందల వరకూ పెరిగింది! అంటే రూపాయికి మూడుసోలల బియ్యం! పుల్లయ్య ఒక్కడూ రూపాయి బియ్యపు అన్నం ఒక్కపూటకే లేదనిపించగలడు. కాని జరుపుకోవడంవల్ల అదే యింటి అందరికీ ఒకరోజుకు వస్తోంది.

పీస రోజూ వస్తున్నవాడు. ఈమధ్య నాలుగురోజులు మనుమడు దగ్గరకు రాలేదు. ఐదోరోజు సాయంత్రం వచ్చేసరికి మల్లు "తాతా" అంటూ ఎదురెళ్ళాడు. మల్లుని భూజాన్నెక్కించుకొని గుర్రంలా గెంతుతుంటే పక పకా సంతోషంతో మల్లు నవ్వుతున్నాడు.

"సీతకానోడివిరా" అన్నాడు పుల్లయ్య, మల్లుని దించి అరుగుమీద కూర్చుంటున్న పీసతో. ఇంతలో నీలి ఇటు వచ్చింది. నీలిని మధ్య పెట్టూ, "సూడే కూతురా? ఆ బుగతోడిది భూమి. ధరలు సాలా పెడావుగా ఉన్నాయి. ఇది అమ్మితేకాని బుగతకూతురికి పెళ్ళికాదు! మనం ఎలాగ కాదంటామే?" అన్నాడు.

"మీ అయ్యకాలం నుంచి దున్నతున్నావు కదా.....నీదా, ఆడిదా హక్కు?" అంటూ పుల్లయ్య "బుగతను నా పొలంమీద కాలుపెట్టమను, ఎంత ఆలముత్తాతలు గడించినా?" అన్నాడు.

నీలి నవ్వుతూ "ఇంకో నూరు రూపాయిలు......"

పుల్లయ్యకు ఆత్మాభిమానం రేకెత్తి, "సూడవా! యీసారి పిల్లినైపోనులే....." అంటూ మీసాలు మెలివేశాడు. పీస నీలి నుద్దేశించి "ఆలు అమ్ముకుంటామంటే మనం కొనలేము – రాయే కూతురా–పుట్టించినోడు పెట్టకపోడు– మనల్ని నమ్మి బుగత పొలమిచ్చాడు. ఆ బాబు కవుసరం వచ్చింది, అమ్మేస్తున్నాడు. నమ్మినోడికి, ఆడెలాంటోడవనీ ద్రోహంసేస్తే మనికి జరగదే కూతురా! నాకు ముట్టసెప్పవలసిందేదో ముట్టచెప్పాడు," అన్నాడు.

నీలి తనతో ఏకీభవిస్తున్నట్టుగా ఆమె వైఖరినిబట్టి పోల్చుకున్నాడు. ఈ మాట ఆ మాట ఆడుతూ "వూర్లో దొంగతనాలు హెచ్చిపోతున్నాయే. పిల్లలగలోడ్ని. జరక్క నానే సేస్తున్నానని కొందరు గుంటకాయల అనుమానం. లేదమ్మా! ఇలా రెండురోజులకి బుక్కడు గంజి చట్టెడు అంబలి తాగి యెందుకు బతుకుతున్నానని. నాకింతమంది పిల్లలా – ఈలంతా కష్టపడ్డానికి భూమీ పుట్రో, ఉద్యోగం సద్యోగం ఏదో నా గవుర్నమెంటోడు పెద్దోడైతే సూపించడా! ముందుకున్నాయే కూతురా మంచిరోజులు....." అన్నాడు.

ఆ విశ్వాసంతోనే జీవిస్తున్న పీస చాలా సేపటివరకూ మనుమడితో ఆడుకొని యింటికి వెళ్ళిపోయాడు.

## 19

నీలికి కూతురు పుట్టింది. కొడుకు పుట్టినప్పుడు ఉన్నంత వుత్సాహం గాని, పరిస్థితులు గాని యిప్పుడు లేవు. "పిల్ల నల్లగా వుంటాదని" అందరూ అంటున్నారు. పుల్లయ్య కూతుర్ని ఒక్కసారే సరిగ్గా చూశాడు. "దీనికి మంచి మొగుడిని సూడాల" అనుకున్నాడు. ముసలమ్మ ఆనందం ఇంతా అంతా కాదు. "ఇంటికి పేరు తెచ్చినా, కీడు తెచ్చినా ఆడపిల్లే తెస్తాది. ఫలానోల బొట్టె బీదా బిక్కని ఒక కంట చూస్తుందంటే ఆ తల్లీ తండ్రికి ఇంకేం కావాల?" అని

ఆమె వుద్దేశ్యం. వచ్చినవాళ్లెవరైనా "పెల్లిని తీసుకపోతారా?....." అని అంటే మల్లు కర్ర పట్టుకొని గుమ్మం దగ్గర కాస్తున్నాడు.

ఇంకా కోతలు పట్టలేదు. ఊర్లో పరిస్థితులు చాలా అధ్వాన్నం అయిపోతున్నాయ్. దొంగతనాలు హెచ్చువుతున్నాయని పెద్దవాళ్ళంతా అంటున్నారు. కానీ దొంగలు దొరకలేదు. సరుగుడు తోటల్లో చెట్లకు చెట్లే రాత్రులు మాయమౌతున్నాయి. ఒక యింట్లో అన్నం వండిన కుండతో సహా మాయమయిపోయింది. ఇంకో యింట్లో వాకిట వేసిన కట్ట కట్టలాగుండే, లోన సగం పెసలు ఖాళీ అయిపోయాయి. కోడిపెట్టలు, పుంజులు లెక్కలేనన్ని అగుపించలేదు. నాయుడు సరియైన కట్టుబాట్లేమీ చెయ్యలేదని అనవలసినవాళ్ళు అన్నారు. ఉన్న ముగ్గురు తలారులనూ వూళ్లో రాత్రులు తిరగాలని నాయుడు పెళ్ళాం అర్డరు వేసింది. ఇద్దరు తల వూపారు. మూడోవాడు మాల రామిగాడు కాదన్నాడు. పొడుగ్గా. భారీగా ఉంటాడు. పిల్లలు తిండి తినకపోతే వీడిపేరు సెప్తేసరి, తిండి కడుపులోకి పోతుంది. ఏమాటైనా యధార్ధంగా యెదురుగుండానే అనేస్తాడు – అది తహశీల్దార్ అవ్వనీ – నాయుడు పెళ్ళమవ్వనీ తనకేం ఖాతరు లేదు. ఊరి ఈ చివర కేక వేశాడంటే ఆ చివరకు వినబడవలసిందే! తన కొడుకు వ్యవసాయం చూసుకుంటున్నాడు. మనుమడు ఉద్యోగం సెయ్యడానికి చదువుకుంటున్నాడు. రామిగాడు ఒకరి నొక దమ్మిడీ అడుగడు. తనదగ్గర ఏమున్నా యెవరడిగినా లేదనడు. దీనివల్ల పెళ్ళం, కొడుకూ యేకమైపోయారు. పెళ్ళాం మొట్టికాయలు పెట్టినట్లు మాట్లాడినా ఆ పెద్దనోరుతో పకపక నవ్వుతాడు.

"దొంగనుపట్టి ఏం సేయమంటావు తల్లీ?" అని అడిగాడు ఆమెను.

"ఈడ్చుకురా – పంచాయితీ పెట్టించి......"

"పెట్టించి కొరడాదెబ్బలు కొట్టిస్తావమ్మా? రాయమ్మా ఈ కడుపు కాలనంతసేపూ అంతా నీతే – కాలితే తెలుస్తాది. గెంజితాగి బతకటానికి ఎవడు దొంగతనం చేసినా ఆడిమీద ఈగ వాలడానికి వీల్లేదని" ఖచ్చితంగా చెప్పాడు. ఇలా చెప్పినా తను రాత్రుళ్ళు తిరగడం మానలేదు – మిగతా ఇద్దరూ ఒకప్పుడు యెవరినైనా పట్టితే విడిపించటానికి.

వారం రోజులు తిరిగారు. దొంగతనాలు వూళ్లో తగ్గాయి. కాని తోటల్లో జరుగుతున్నాయ్. ఇద్దరు కాయలేని నౌకర్లు రానురాను ఇంట్లోనే కాపలా కాశారు. అలా నెలరోజులు గడిచిపోయాయి. ఎప్పుడు కోతలు మొదలు పెట్తారా అని వ్యవసాయపు కూలీజనం యెదురు చూస్తున్నారు.....వెంకన్న గన్నెమ్మలవంటి అనాధుల పరిస్థితి చాలా విషమంగా ఉంది. నీలి దగ్గరకు వెళ్ళటానికి వెంకన్నకు మనసు పుట్టలేదు. అమ్మా అని వెళ్తే ఆమె వుంచుకోకుండానే ఉన్నది పోసేస్తుంది. పోసి, నోటినిండుగా అభిమానంగా మాటాడుతుంది. అది బుక్కడు గంజైనా కడుపు నిండిపోయి హాయిగా ఉంటుంది. గన్నమ్మ మాత్రం మొగమాట పడలేదు. నీలి ఒక్కసారీ విసుక్కోలేదు. రాజిగాడి పెళ్ళంకూడా నలుగురి బీదా బిక్కీకి లేదనకుండా ఒకకంట చూస్తాదని విన్నాడు. కాని వెంకన్నకు ఆ గుమ్మంలో దేహీ అని వెళ్ళటానికి యిష్టంలేదు. అక్కడకెళ్తే తనకు జరిగినదంతా తలుపుకు వస్తుంది. తను గుడ్డివాడైనా అంతా కనిపిస్తుంది. ఒళ్ళంతా దుఃఖం, పౌరుషంతో ముడుచుకుపోతోంది.

ఒకనాడు అప్పుడే చీకటిపడుతోంది. ఆకలితో వెంకన్న, గన్నెమ్మ బాధపడుతూ నీలమ్మగుడిదగ్గర పలకరాయిమీద కూచున్నారు. ఇంతలో దాసుడువచ్చి గుడిలో దీపం వెలిగించాడు. శివాలువెయ్యక మౌనంగా కళ్ళుమూసి తల్లియెదురుగా కూర్చున్నాడు. తిరిగి వెళ్ళిపోయేటప్పుడు ఇద్దర్నీ పలుకరించాడు. "ఈ కరువు యెప్పుడు పోతాది?" అని అడిగింది దాసుడ్ని. "లోకంరాత బాగునేదే? అంచేత మంచోలకీ సెడ్డబుద్దులే పుడ్తున్నాయ్! ఆనాడు యెంత బతుకు బతికావు? నీ రాత తిన్నగా లేకకదా అడుక్కుంటున్నావు" అంటూ కదిలాడు.

గన్నెమ్మ ఒకప్పుడు గొప్పబ్రతుకే బ్రతికింది. యెంతో భాగ్యభోగాలతో తులతూగింది, గొడ్డుసంసారం. మొగుడు పిసినారి. అంతకంటే రెట్టింపు తను. మెడనిండా బంగారం, కొట్టునిండా ధాన్యం. యెంగిలి చేతితో కాకిని కొట్టలేదు. చుట్టాలెవరూ వారింటికివచ్చిన పాపానపోలేదు అథవా వచ్చినా భోజనంవేళవరకు ఉండనూలేదు. డబ్బుకూ ఆమెకూ లంకె. ఆ డబ్బునే వరించింది. ఇలా వుండగా మొగుడికి జబ్బుచేసింది. అదే పోతుందని వూరుకుంటే మోపుచేసింది. కషాయాలు, గిషాయలతో తనకు తెలిసిన వైద్యం చేసింది. మంచంపట్టాడు. పొరుగూరి నేటివ్ వైద్యుడు డబ్బు గుంజటానికి ప్రయత్నించాడని వాడ్ని వదిలించి, బైరాగి చిటకాలతో జబ్బు నయం చేయబోయింది. రోజుకు రోజు పరిస్థితి విషమించింది. యెవరో నాటు వైద్యుణ్ణే పెట్టింది. నలుగురూ పట్నంనుంచి పెద్ద వైద్యుడ్ని తెస్తే జబ్బు నయం అవుతుందని చెప్పారు. కానీ యెవరిమాటా లక్ష్యపెట్టలేదు. మొగుడు చివరికి వచ్చేమాటా, రానిమాటతో "నలుగురూ అంటున్నారు. ఆ పట్నం వైదిగుడ్ని తీసుకరమ్మ"ంటే, "ఈలంతా నీవు బతకాలని చూస్తున్నారా? నీ సేత వూరకే డబ్బు గంగలో కల్పించాలని చూస్తున్నారని" మొగుడికి చెప్పింది. నలుగురూ నాలుగు విధాలంటుంటే "వచ్చినోలు వచ్చినట్టుండండి. మీరంతా వైదిగులా, ఇప్పుడు మందిచ్చినోడు వైదిగుడా? ఆడికి నాకూ ధైర్యం వున్నాది, మీకెందుకర్రా?" అని అరిచింది. నాటువైద్యుడు వారంరోజులకి జబ్బు యెగిరిపోతాదని చెప్పాడు. వారం రోజులకి మనిషే ఎగిరిపోయాడు.

వూరంతా ఒకే కంఠంతో యీ ముండను తిట్టిపోస్తే యేడుస్తూనే "నన్నెందుకర్రా అంటారు! మీకు ఆ రోజువస్తే మీరూ వుండిపో"రంది. దానినోట్లో నోరెందుకు పెట్టడం? దానికే తెలిసొస్తాదని వూరుకున్నారు. బంగారం కాసులు కూడబెట్టింది. ఆశ అంతస్తుల్లా పెరిగిపోతోంది. ఎవడో దూరపు చుట్టం దాపరించాడు ఆ ఆశను మరింత వృద్ధిచేశాడు, మాటల చమత్కారంతో నమ్మించాడు — పొంగించాడు. చాలా ఘరానాగా వ్యవహరించాడు. వ్యాపారం గురించి ఆ లాభాలు గురించి చెప్పుకొచ్చాడు, ఆశ పుట్టింది. ముందు వందరూపాయలే తన వాటాగా వ్యాపారంలో పెట్టమని యిచ్చింది. నెలరోజుల్లో నూటయాభై తెచ్చియిచ్చాడు. నెలకు వందకు లాభం యేభయిరూపాయలే! కళ్ళు జిగేల్ మన్నాయ్! అడక్కుండానే ఐదు వందలిచ్చింది. దానికీ లాభమొచ్చింది. ఆ చుట్టం దేముడులా అగుపించాడు! వ్యాపారం రానురాను పెద్దదైపోయింది. పట్టణాలలోకికూడా వాళ్ళ సరుకులు వెళ్తున్నాయి. నలుగురూ చెప్పుకుంటున్నారు. ఆ చుట్టం చుట్టంలా లేడు, ఇంటిమనిషికంటే యెక్కువ — అలాంటివాడ్ని పూర్తిగా నమ్మింది. నీ పేరను లారీ కొంటాను. లాభం నూటికీ

నూరూ వుంటా దన్నాడు. ఒప్పుకున్నాది. ఇంట్లోను, ఒంటిమీదావున్న బంగారం అమ్మింది. వున్న ధాన్యం అమ్మింది, ఇంకా చాలకపోతే భూమి తాకట్టు పెట్టింది. ఆ తాకట్టు పైవూర్నించి తనే కుదిర్చాడు. ఒక కాగితం, లారీ తెచ్చి చూపించాడు. భద్రంగా ఆ కాగితం యెవరికీ చూపించకుండా దాచింది. లారీమీద కూర్చొని పట్నంకూడా వెళ్ళింది, సినిమాలకి, కాఫీ హోటళ్ళకి తీసుకవెళ్ళాడు. ఆ రోజుల్లో యివన్నీ జమీందారులకే చెల్లుతాయి! యెంతో మెచ్చుకుంది చుట్టాన్ని. లాభాలు వస్తున్నాయి. అప్పుడప్పుడు వ్యాపారం ఓడవ్యాపారమంత కాబోతోందని తెలిసి భూములు అమ్మింది. ఆ డబ్బు తిరిగి రాలేదు. ఏదని అడిగితే లారీమీద తీసుకువెళ్ళి గోదాంలోని సరుకులు చూపించాడు. కావాలంటే ఇక్కడే ఇల్లు కట్టిస్తాను, వుండిపో అన్నాడు. అంత నమ్మకం వుండగా తనెందుకు వూరు వదలాలి?

ఒకనాటి ఉదయం..... మంచిరోజున చిప్పచేతికిచ్చాడు. గొల్లుమన్నాది! కాగితాలన్నీ అందరికీ చూపించింది. నోటికిరాని తిట్లు తిట్టింది, తలబాదుకున్నాది, నూతిలో గెంతడానికి పరుగెత్తింది. ఊరంతా ఓదార్చారు. తలోలా అనుకున్నారు. గొడ్డు కసాయివాణ్ణే నమ్ముతుందన్నారు కొందరు. చేతులారా మొగుడ్ని చంపేసింది. అలాంటి ముండకు ఇంతకంటే మంచిగతేం వస్తుందన్నారు.

ఉన్న యిల్లు కొన్నాళ్ళకి కూర్చుని తినగా అప్పులకింద పోయింది. వయసుమళ్ళిన కాలంలో ఎవరూ దగ్గిరకి చేరనివ్వలేదు. ఒకరికి పెట్టివుంటే ఆ ఒకరు ఇప్పుడు కనికరించేవారు. ఈ రోజుకి నడ్డివంగినా, మమకారం పోదు. లేనిపోని ఆశలు పెట్టుకొని వీళ్ళని దూషిస్తూ, వాళ్ళని దూషిస్తూ బతుక్కొని వస్తూంది.

☆ ☆ ☆

కోతలు మొదలుపెట్టారు, చేను కళ్ళాలకు వచ్చింది. కొట్లో వేయకుండానే ఈసారి పుల్లయ్య బుగత అంబారం కొలిచేశాడు. అటునుంచి వచ్చిన దగ్గరనుంచి మనసు మనసులో లేదు. మల్లు గరడీకని చెయ్యిలాగు కొని వెళ్ళినా వెళ్ళలేదు. రాజుగాడిదగ్గర తెచ్చిన డబ్బుకు వడ్డీ ధాన్యం యిస్తే, నెలరోజులకు తప్పించి గ్రాసం వుండదు. అంచేత నీల వడ్డీరూపాయలలో కట్టుకోమని బ్రతిమలాడింది. ఈ ధరల్లో ధాన్యం కట్టడానికి ఒప్పుకోలేదు. ఇప్పుడు గరిసె బ్లాకులో వెయ్యివున్నా ముందు ముందు పదిహేనువందలు కాకూడదా అని ప్రశ్నించాడు. నీలి బ్రతిమలాడింది. ఈ మాత్రం ఉపకారం చెయ్యకపోతే పిల్లలు తిండిలేక మాడిపోతారని ప్రాధేయపడింది. చివరకు భూమి స్వాధీనం తనఖా వ్రాస్తే ఒప్పుకుంటానన్నాడు. అంతేకాకుండా ధరలు హెచ్చుగా వున్నాయి కాబట్టి వడ్డీ వందకి రెండుపుట్లునుంచి కొద్దిగా తగ్గించి మిగతాధాన్యం వచ్చేయేటి నుంచి నేనే మీకిస్తానన్నాడు. ఆ భూమిమీద పైరుపంటలు మీరే పండించుకోండన్నాడు. నీలికి చాలా సబ బనిపించింది, ఒప్పుకున్నాది. పుల్లయ్యకు నచ్చలేదు. యెలాగో ఓలాగ యీ మాగాణి దక్కించుకోవాలని వాడు చూస్తున్నాడనీ, ఇంకా ఏడాదిలో తనకే అయిపోతాదని అన్నాడు. నీలి బలవంతం మీద రెజిస్ట్రేషరు అయిపోయింది.

వేసవి వచ్చింది. ఒకనాటి సాయంత్రం మల్లు తన ఈడూజోడూ పిల్లల్ని పోగుచేసి వాళ్ళకి గరిడీ నేర్పుతున్నాడు. "ఛినక్ ఛినక్ సో....." అంటూ

అడుగులు సరిగ్గా వేస్తుంటే అంతదూరంనుంచి చూస్తున్న పుల్లయ్యకు యెక్కడలేని గర్వం వచ్చింది. పులి పంజా ఆడిస్తున్నట్లు ఆడిస్తున్నాడు అరచేతిని. అడుగులు సరిగ్గా పడుతున్నాయ్! పుష్టిగావున్న శరీరంలో యే కీలు కా కీలు వొంగుతోంది. డప్పులుంటే ఎంత బాగుండే దనిపించింది పుల్లయ్యకి. అలాగే వెళ్ళి పిలి మొగ్గ వేస్తే.....కొడుకు ఎగ్రబాకి పాదాలమీద నిల్చుని! దిగవాడి కొడుకే మీదోడు! మళ్ళీ ఆ రోజు జ్ఞాపకం వచ్చింది. ఆ ముసలాడిగాలేని ముసలాడు....వయసులో ముసలాడు – ఉత్సాహంలో కుర్రాడు.....బొక్కిపళ్ళ నవ్వుతో ఆ రెండే మాటలతో.....తనను పెళ్ళికొడుకు చేశాడు....... మా అయ్యని పుట్టుకు రప్పించాడు.......నాకు మల్లు నిచ్చాడు..... ఆ ముసలాడు యెక్కడున్నాడో...... యేమయ్యాడో?

"నాను మొగ్గేస్తే" అనుకున్నాడు పుల్లయ్య. కొడుకు యెక్కమంటే యెక్కుతాడు. తను కాసుకోగలడా? లేనేమోనన్న పిరికితనం వేసింది. వేసుకోలేకపోతే...... నా కొడుకు అంతమీదనుంచి పడితే.....కాలుగానీ చెయ్యిగానీ విరిగితే......అమ్మో! అంతపని చెయ్యననుకున్నాడు. మెల్లగా కొడుకును సమీపించాడేగాని, మల్లు ఆటలో మునిగిపోయివున్నాడు. తనలాగే నలుగురూ వీధినిపొయ్యేవాళ్ళు ముచ్చటగా చూసి మురిసిపోతున్నారు. ఒకమ్మ యేటి నుంచి నీళ్ళకడవ నెత్తిన పెట్టుకొనివస్తూ "అలాంటోడు ఒక్కడైతేం!" అంది. పుల్లయ్య ఒళ్ళంతా పులకరించింది. కొడుకు తండ్రినిచూచి పరుగెత్తుకొచ్చి మీదెక్కాడు. ఇంటివైపు నడుస్తుంటే "అయ్యా, మాయమ్మకి జొరం – సచ్చిపోతాదా?"

ఇంత సంతోషం ఒక్కసారి మాయమై ఆలోచనలో పడిపోయాడు పుల్లయ్య.

"శివ్వడమ్మ సెప్పిందట – యెవడో యెనుబోతుమీద వచ్చి.....పేణాలు తీసుకపోతాడట! యెప్పుడొస్తాడయ్యా? కర్రపట్టుకొని కూకుంటాను మాయమ్మదగ్గర!" అన్నాడు.

చిన్ననవ్వు నవ్వాడు. "లేదయ్యా – ఆడు నిజంగా సెప్పనేదు."

మల్లు వెనువెంటనే తండ్రి ముఖంవేపు చూస్తూ అయ్య సెప్పింది అయ్యకే 'నిజం సెప్పనేదు..... శివ్వడు కళ్లు పోతాయి" అని అప్పజెప్పాడు.

ప్లీడరు సీతారామస్వామిగారు ముందుచూపు మళ్ళీ కొడుకుపెళ్ళి తర్వాత యీనాటికి చూశారు. తాను అలా చూడటానికి పరిస్థితులు యేమంటే ముందుకి ఎలక్షనులు వస్తున్నాయ్. అప్పుడే వివిధపక్షాలూ కొద్దోగొప్పో ప్రచారం చేసుకుంటున్నాయ్. హెచ్చు వోట్లు పల్లెలోనే వున్నాయి కాబట్టి పల్లీయులను ఆకర్షించే విధానాలలో ప్రచారం చేయాలి. అంచేత దున్నేవాడిదే భూమనే నినాదం లేవదీశారు. యేదోవిధంగా అన్నిపక్షాలూ ఈ వాదం సబబనే అంటున్నాయ్. ఈ వాదంద్వారా స్వలక్ష్యాలను – అంటే పార్టీలకు ఎలక్షనులో గెలవటం; పెట్టుబడిదారు యీ సమ్మంధమైన సినిమాతీసి చిత్తుగా డబ్బు ఆర్జించుకోవడం, ఈ యిత్తృత్తంలో లేని పోని సంఘటనలు కల్పించి నాటకం ఆడి భూకామందులపై లే[illegible] [illegible]ర్ష్యను అమాయక ప్రజలలో సృష్టించి, వాళ్ళమీద తిరుగుబాటు చెయ్యించ [illegible]నటం – తద్వారా నాటకం గిట్టుబాటైందని అనిపించుకోటం – ఇలా ఆ లక్ష్యాలను యేదో ఒక స్థాయిలో సాధించుకుంటున్నారని చెప్పాలి. ఈ పరిస్థితులు చాలామంది

భూకామందులకు తమ ఆస్తిపాస్తులు కాపాడుకొనే అవసరం వచ్చిందని కట్టుదిట్టాలు చేసుకోనిచ్చింది. రైతులను తొలగించి కొందరు స్వంతసేరీ పెట్టుకున్నారు. ఆ రైతులు అడుగంటిపొయ్యారు. ఆకలితో అలమటించి కొందరు బ్రతుకు మీద ఆశతో ఆత్మహత్య చేసుకోలేక, అడుక్కొని పొట్ట పోషించుకుంటున్నారు. ఈ విపరీతమైన ధాన్యంధరలవల్ల కొల్లలుగా డబ్బుకూడ బెట్టి, యెలాగ వినియోగించాలో తోచని పెద్దరైతులు ఈ పై వూళ్ళలో వున్న భూకామందుల భూములకు పోటీలపై ధరలు పెంచుకొంటున్నారు. కొన్నాక సొంతసేరీ చేసుకోడంవల్ల మొదట ఆ భూమి అంబారానికి దున్నతున్న చిన్నరైతు కూలిపోతున్నాడు. ఇలా లెక్కలేనన్ని సంఘటనలవల్ల అక్కడక్కడ రక్తపాతం జరుగుతోంది. ఊళ్ళలో కొనేవాడి - పార్టీ దున్నేవాడి పార్టీలు లేచిపోతున్నాయ్. డబ్బుగలవాడిదే జయం. ఆ పార్టీ బలం యెక్కువ.

సీతారామస్వామి ఈ పరిస్థితిని యేనాడో వూహించాడు. కానీ పుల్లయ్య నమ్మకంగా ధాన్యం తెచ్చియిస్తాడని భార్య కూడా అమ్మడానికి ఒప్పుకోలేదని ఊరుకున్నాడు. సంవత్సరం పోయాక అయ్యే యెల్లక్షనులకు ఇప్పుడే హడావిడి మొదలైంది. ఆ పరిస్థితులు చూస్తుంటే వచ్చే ప్రభుత్వం అక్షరాల దున్నేవాడిదే భూమి చేస్తుందని తను నిర్ధారణ చేసుకున్నాడు. అదీకాకుండా పట్నంలోనే ఏదో కొంపకొని అద్దెలకు ఇచ్చుకుంటే భద్రత, రాబడీ అధికంకూడా అవుతుందని భార్యకు ఒక రోజంతా నచ్చచెప్పాడు. ప్రపంచమంతటా ఇంత పెద్ద జిల్లా లేదు. వచ్చే ప్రభుత్వం దీన్ని ఎలాగూ ముక్కలు చేస్తుంది, చూస్తే జిల్లాకేంద్రం ఈ పట్టణంలోనే వుంటుంది. అప్పుడు ఇంటి అద్దెలు రెట్టింపవుతాయి. ఇదంతావిని ప్లీడరుభార్య పుల్లయ్య దున్నతున్న రెండెకరాల పల్లంపొలం అమ్మడానికి ఒప్పుకుంది, ఆ అమ్మే డబ్బుతో ఒక యిల్లు ఏర్పడుతుంది.

ఈ రెండెకరాల పొలంలో ఒక యెకరం రాజిగాడు; ఇంకో యెకరం ఇంకో పెద్ద రైతూ కొనడానికి నిర్ధారణ అయిపోయింది. పుల్లయ్యను ప్లీడరు పిలిపించాడు, డబ్బు అవసరం వచ్చింది. ఈ భూమి అమ్మితేగాని వీల్లేదని చెప్పాడు. పుల్లయ్య "మా తాతలకాలం నుంచీ దున్నుతున్నాం బాబూ! ఏనాడూ పందుంధాన్యం వుంచుకున్నామా? పైరుపంటలుకూడా మీ పాలు తెచ్చియిచ్చేవాడ్ని. మీ అవులకి గడ్డిమేట్లు తెచ్చివేస్తాను. మాతాతల కాలంనుంచీ యిలా జరిగిపోతున్నదికదా, మీరిలాగ అంటే ఏ గంగలోపడిపోమంటారు?" అన్నాడు.

ఈ మాటలు శాంతంగా ప్రాధేయపడుతూనే అన్నాడు. ప్లీడరుగారు అప్పుడే కొంత డబ్బు కొనవలసినవారి దగ్గర పుచ్చుకొని అమ్మితీరాలని నిశ్చయానికి వచ్చారు కాబట్టి, పుల్లయ్య యెంత బ్రతిమాలినా లాభంలేకపోయింది. ప్లీడరు ప్రాధేయపడుతున్న పుల్లయ్యకు ఏదో కొంత ముట్టచెప్తానన్నాడు. "ఆ అంబారం పొలం కొనేవాళ్ళకు కొలుస్తాను. అలాగ ఏర్పాటు చేయించం"డన్నాడు ఆ కొనేవాళ్లు ఫలానావాళ్ళనీ, వాళ్ళే రైతులనీ, కాబట్టి ఇంకొకరి కెలా ఇస్తారని ప్లీడరు ఖచ్చితంగా చెప్పాడు.

ఇలా ప్రాదేయపడడంపోయి పౌరుషాలవరకూ వచ్చింది. ప్లీడరు పెద్ద మాటలాడగానే పుల్లయ్య ఛర్రున లేచాడు. "లా పోయింటులూ, గీ పాయింటులూ లేవు బాబూ –

మా తాతకాలంనుంచీ ఆ పొలం దున్నుతున్నాం. యే గవర్నమెంటోడు సాగుహక్కు లేదంటాడో చూస్తాను. మీ రెన్ని కోర్టులు తిరుగుతారో తిరగండి. నాను భూమి మాత్రం వదలను" అని వెళ్ళిపోతుంటే ప్లీడరు గట్టిగా అన్నాడు: "యేటా ముచ్చళ్ళాలు వ్రాశారోయ్. సాగుహక్కు ఎక్కడ వచ్చిపడింది? మీలాంటోళ్ళెందరిని చూశాను! ఎందుకు తుప్పాన గెంతుతావు. తరువాత ఈ డబ్బుకూడా దొరకదు."

"రా బాబో! నీ కాగితాలమీద నాయం లేకపోలే, నా వూరంతా కచేరీలో నిజం సెప్పరా, సాగుహక్కు అప్పడెలా రాదో నానూ చూస్తాను" అంటూ ఇంటిముఖం పట్టాడు.

పుల్లయ్య వెళ్ళేక రాజిగాడు. ఇంకోరైతూ ప్లీడరు ఇంట్లోకి వెళ్ళారు. "ముందర పత్రం రాసేయండి. మీరు విడిపించకపోతే నాను ఇడిపించుకుంటాను. ఆడికి రోజులు దగ్గరపడ్డాయి" అని రాజిగాడు అనగానే ప్లీడరుకు కోర్టుకెక్కటం తప్పిందని సంతోషంగా రెండెకరాలు అమ్మేసి రిజిష్ట్రేషను చేయించేడు.

నవిరి పెద్దవీధిలో పీస ఇంటిదగ్గర ఈ విషయంపై మాటలేవో పడ్డాయ్. పుల్లయ్య జరిగినతంతు తెలియగానే అగ్గయిపోయాడు. పీస ఓర్పు మాటతో "అయ్య పుల్లిగా, దేముడున్నాడురా!" అన్నాడు.

"దేముడా! పొలంగట్టుకు యెవడొస్తాడో సూస్తాను! ఆడి బుర్ర బద్దలవదా?"

"వాళ్ళకి మనుషుల బలం, డబ్బు బలం రెండూ వున్నాయి. కాసులు గలవాడు దాసీదాని కొడుకైనా రాజే! నీ పక్క నాయం వున్నాది. నాయమే దేముడు. దేముడికి సావునేదని సిన్నపిల్ల నడిగినా సెప్పతాది!"

పీస సర్ది అంటున్న మాటలకు పుల్లయ్య మరీ విజృంభించి "ఎప్పుడూ దేముడు దెయ్యమని కూర్చుంటావురా? దేముడు—! ఇదేనంట్రా నాయం – లోకం మండిపోతున్నాదిరా అన్నాయంతో – ఆ దేముడే మూలసస్తన్నాడో? దేముడున్నా డంటున్నావు .దేముడు!" అన్నాడు.

పీస ప్రశాంతంగా "ఉన్నాదురా, నీ ముకంలా నా ముకం యెందుకు నేదు? నీ బతుకులా నా బతు కెందుకు నేదు? మనిషికొక ఆకారం మనిషికొక బతుకు యెందుకున్నాది?—" అన్నాడు.

ఇంక పుల్లయ్య పీసను చెప్పనివ్వకండా "రెప్పొద్దునే పొలాన యేరువూస్తాను. ఏ మీసంగల మొగోడువచ్చి యేరిప్పతాడో సూస్తాను" అని మీసం మెలిపితే, మీసంలేని కొడుకుకూడా మీసం త్రిప్పేశాడు!

ఈ రగడంతా వింటున్న, చూస్తున్న కుష్ఠురోగి కాళీడ్చుకొని వస్తూంటే రాజిగా డెదురయ్యాడు, వాడికి అప్పుడే అంతా తెలిసిపోయింది. సంజీవితో "ఎలాగ యేరు వూస్తాడో నానూ సూస్తానని" మీసాలు మెలివేసి అంటుండడం విన్నాడు. తిన్నగా నీలిదగ్గరకు వెళ్ళి "అమ్మా తల్లీ! రేపు పొలంలోకి పుల్లిబాబు యెల్లాడంటే బతకడమ్మా..... ఆ రాజిగాడూ గట్టిపట్టే పట్టాడు. భూములు డబ్బుపోసి కొనుక్కున్నాడా? ప్రజా ఆడియేపే అంటారు – గవర్నమెంటోడూ ఆడియేపే మాటాడుతాడు కానీ, బగవంతుడు నేడా?" అన్నాడు.

నీలి కొద్దిగా కంగారుపడినా సర్దుకుంది. రాత్రి నిద్దరపోయేవరకూ ఈ విషయాలేమైనా మొగుడు చెప్తాడేమోనని యెదురుచూసింది. పుల్లయ్య మౌనంగా గంభీరంగా ఉన్నాడు. ముసలమ్మ జ్వరాధిక్యతవలన ఒకమూల పడి మూలుగుతోంది. చంటిపిల్ల అప్పుడే లేచి కేకలుపెట్టి యేడుస్తోంది. ఏమో తల్లిపాలు చాలటంలేదు. ఈ నెలల పిల్లకు అన్నం పిసికి కూడా పెట్తోంది, పాలు కొనడానికి డబ్బు సరిగ్గా చేత ఆడలేదు. పిల్లకు పాలు యిస్తూ, యిటూ అటూ నిద్రపట్టక కదులుతున్న పుల్లయ్యవేపు చూసింది. ఆ నాడు చింతచెట్టుక్రింద బలవంతంచేసిన పుల్లయ్య...... పెళ్ళినాడు తను చూసిన ఓరచూపుకు ప్రత్యక్షమైన మొగుడూ......పట్నం ముస్తాబై ఇద్దరూ కలిసి వెళ్ళిన్నా డగపడ్డ ఈ వస్తాదుకీ...... ఈ వేళ బాధతో, దిగులుతో, పౌరుషంతో అట్టుడికిపోతున్న రైతూకూ యెంత తేడా! ఆమెకి చూస్తునే మొగుడిమీద కనికరం వేసింది. ఇదంతా తనకెందుకు చెప్పలేదో ఆమెకు తెలుసు! ఎంత మెత్తనిగుండె!

కొద్దిసేపటికి పిల్ల నిద్దరపోయింది. ముసలమ్మ మూలుగుతూంది. మల్లు తండ్రిపక్కనే పడుకున్నాడు. నీలి బుడ్డిదీపం తగ్గించి మెల్లగా వెళ్ళి మొగుడుప్రక్కన కూర్చుంది. భార్య కూర్చున్నట్లు ఆమెచెయ్యి తన నుదుటి మీద పడేవరకూ పుల్లయ్య పోల్చుకోలేదు. ప్రేమతో చూస్తూ మెల్లగా, కమ్మగా, తియ్యగా చిరునగవు నవ్విన నీలివేపు ఒకసారి చూశాక మళ్ళీ చూడలేకపోయాడు.. ఆమె ఆ చేతిని మెల్లమెల్లగా ఆ గీరా గిరజాలలోకి పోనిచ్చి, తలదించి ముఖంలో ముఖం పెట్టింది. పుల్లయ్య శరీరం ఎందుకో కంపింపసాగింది, ఆమె అతి మెల్లగా సహజ శాంతస్వరంతో "ఇంత జరిగినా వూరంతటికీ సెప్పి, నాదగ్గరేనా దాపరికం?" అంది.

పుల్లయ్య మాటాడలేదు. శరీరం గగుర్పాటు చెందసాగింది. ఏదో నేరస్థుడిలా అయిపోయాడు. కానీ ధైర్యం చిక్కించుకొనిచూస్తూ "ఊరందరి దగ్గర నాకు బయంనేదు!" అన్నాడు.

నీలి మొగుడుప్రక్కనే ఒరుగుతూ, మొగుడితలను తన వక్షానికి అదుముకుంది. అభిమానానురాగాలు కట్టలు త్రెంచుకొని ప్రవహించటంచేత ఇద్దరికళ్ళల్లోనూ కన్నీరైంది. కొంతసేపట్కికి గానీ మాటలురాలేదు. నీలి గోడకు చారబడి కూర్చుంటే ఒడిలో తలపెట్టుకున్న మొగుడికళ్ళల్లోకి చూడకండానే "రేపు ఇల్లు కదలకు. పౌరుషాలువస్తే మనుషులు పశువులై పోతారంటారు, మనరాత అలాగవుంది. యేంచేస్తాం? కాళ్ళూ సేతులూ గట్టిగా.....ఉన్నాయి కదా!" అంది.

ఆమె బహుశా దుఃఖం ముంచుకు రావడంవల్ల కామోసు మరి మాటాకలేదు. కానీ ఆమె కళ్ళనీరు కారి భర్తమీద పడలేదు. మౌనంగా ఆమె బాధను అర్థం చేసుకున్న పుల్లయ్య "నలుగురికీ మనకి అన్నాయం జరిగిందని తెల్సిరావద్దే" అన్నాడు.

"ఈ పిల్లల ముకంచూసి పౌరుషం తగ్గించావంటే బతుకుతాం. ఎవరికీ అస్తి పాస్తులుండిపోవు – ఎవరూ ఈ లోకాన్న ఉండిపోరు! మంచీ చెడ్డా మిగిలిపోతాది. ఒక కంట నీరుకారితే ఇంకో కన్ను నవ్వితేనే బతుకు – నీ యిష్టం!"

ఆమె మరి మాట్లాడలేదు. మెల్లగా లేచి మంచంమీదున్న పిల్ల ప్రక్కన వెళ్ళి పడుకుంది.

తెల్లవారింది. పొద్దు మీదకు లేచింది. పుల్లయ్యకు రాత్రంతా జరిగింది కలలా అయిపోయింది, కొద్దిగా గెంజి త్రాగాడు. చల్లని అంబలి జుర్రాడు అప్పుడే ఊరంతా ప్రాకిపోయింది. పుల్లయ్యకి రాజిగాడికి ఈ వేళ యేదో గలాటా వుందని, బుర్రలు పగుల్తాయని కొందరు అనుమానపడ్డారు. మొదట వెళ్ళటం మానివేస్తే అనుకున్నాడు. మీసాలు తీసేశానేమోనని అనుమాన పడ్డాడు. ఇన్ని కటుర్లాడి "ఛా! సస్తే సస్తాను. పిరికిపందనై పోతానా? మల్లు నాయుడి కొడుకు. మాట అన్నాడంటే జరిపించుకోవలసిందే, పెజల్లో ముఖం నిటారుగా సూసించవలసిందే!" అనుకున్నాడు.

చంకన బాణాకర్ర పెట్టాడు పోతులను విప్పి నాగలి భుజానవేశాడు. వెనువెంట కొడుకు వున్నాడు – నీలి మౌనంగా ఈ పనులన్నీ చేస్తున్న భర్తవేపు చూస్తోంది. పుల్లయ్య పెళ్ళంవేపు చూడలేదు. సరే, బయలుదేరాడు. ఇంట్లో మంచంమీద పిల్ల కెవ్వున కేకలు వేస్తోంది. ముసలమ్మ మూలుగుతూనే మనమడ్ని పట్టుకోబోతే జుత్తుపీకి, కొట్టి మరీ విడిపించుకొని అయ్య వెంటపడ్డాడు. నీలి మొగుడు యేమంటాడో అని చూసింది. మాటాడకండా వెళ్ళిపోతున్నవాని వెంటపడి వెనకనించి చంకలోని బాణాకర్ర పట్టుకొంది. వెనుతిరగబోతే నాగలిపూాదు నీలితలకి టక్కున తగిలింది. ఆమె కళ్ళవెపు చూశాడు – కర్ర వదలి ముందుకు అడుగులు వేస్తున్నాడేగాని కళ్ళు వెనుకే ఉన్నాయ్.

పొలంగట్టు చేరాడు. తన చిన్నతనంనుంచీ ఈ గట్టు తనదే అనుకున్నాడు. గొఱ్ఱెపిల్లకూ, పందెంపోతుకూ, పశువులకు యెత్తుగా ఈ గట్టుమీద పెరిగిన గడ్డికోసి మేపేవాడు. తనలా తన కొడుకూ కోసి మేపుతాడనుకుంటే, ఇప్పుడిలా వచ్చింది. తన తల్లీ తండ్రిమీద యెంత మమకారమో ఈ భూమిని చూస్తే అంతకు రెండింతలు – ఇలాంటి మన్ను తనది కాదట!

నాగలి దించాడు. కొడుకు చిన్న బెత్తంపట్టుకుని పోతులను ఆపాడు. కాడి కట్టాడు. పొలం తూర్పుదిక్కుకు తిరిగి నాగలిమొన పెట్టాడు. ఇంతలో పీస పరుగెత్తుకొచ్చాడు. "అయ్యా, అలు మందలు మందలు కర్రలు పట్టుకొస్తున్నార్రా! నా మాట విని పుల్లిగా, పదరా యెళ్ళిపోదాం..... వచ్చేస్తున్నారు..... అదిగోరా తోటదాటిపోనారు..... అదిగోరా వచ్చేస్తున్నారు. నాయనా.....నా నాయనా పుల్లిగా – నీ కాళ్ళు పట్టుకుంటానురా....! నాయనా......"

పీస భయంతో అలసిపోతున్నాడు, పొలసిపోతున్నాడు. ఇందులో ఒక్కమాటా వినిపించుకోనట్లుగా పుల్లయ్య పొలం దున్నుకుంటున్నాడు. వాళ్ళు వచ్చేశారు..... అదిగో ఒకరు యిద్దరుకారు..... పొలం చుట్టుముట్టేశారు. పీస ఆతృతగా "వచ్చారర్రా ఒక్కడిని కొట్టడానికి..... యిందరు..... కర్రలు పట్టుకరావాలా? మీరంతా మనుసులేనా? నాయం వున్నోళ్ళే లేదు......ఆడవిలోకి యెళ్లిపోయింది," అన్నాడు.

రాజిగాడు పొలంలో కాలుపెట్టి పీసను యీడవబోతే పీస తప్పించుకొని మల్లుని ఎత్తుకొని బయటకు పోడానికి వచ్చాడు. మల్లు యేడుస్తూ తాతనుకొట్టూ విడిపించుకున్నాడు, ఆ చిన్న గోచిపాత వూడిపోయింది. గోచీ సర్దుకొంటూ మళ్ళీ అయ్యవెంటపడ్డాడు, రాజయ్య పీసను పొలంఅవతలకు త్రోసివేశాడు. అవతలనుంచి పీస కేకలు వేస్తున్నాడు: "నాయనా పుల్లిగా.....తొందరపడకు!"

రాజిగాడు పోతుల యెదరగా వెళ్ళి ఆపాడు. పుల్లయ్య పోతుల్ని అదిలించాడు. అవి ముందుకు పోబోతుంటే కర్రలు పట్టుకు మరి యిద్దరు ముందుకు వచ్చారు, పోతులనాపి కన్నెలను విప్పేశారు, పుల్లయ్య వళ్ళు బిగబెట్టాడు, చుట్టూ ప్రజని తను చూడలేదు. ఒళ్ళంతా రాజుకుపోయింది. కళ్ళు మండుకుపోతున్నాయ్ ఆ యెండలో తల జిగ్గున పొడుస్తోంది. కోపంతో మసకలు దేరిన కళ్ళతో పోతులవిప్పిన రాజిగాడివైపు చూశాడు. కళ్ళు మసకలు కమ్మాయేమోనని కళ్ళు తుడుచుకున్నాడు. ఇంకా ఆ కంటికి నీలే కనిపిస్తోంది.....యేమిటీ? నా పోతు లిప్పింది రాజిగాడు కాడా? నీలా!.... నీలమ్మ.......

యెక్కడలేని పిరికి సహనం బాగా నిండిపోయింది –· మల్లువేపు చూడగానే మరింతగా అసహాయుడై పోయాడు. చేతిలో కర్రలేదు, కర్రవుంటే పెళ్ళాన్నా తను కొట్టేవాడు!

ఆ స్థలం విడిచి వెళ్ళని పోతులకు గట్టిదెబ్బలు కర్రతో రాజిగాడు వెయ్యడంతో పొలం బయటకు పరుగెత్తాయ్ మల్లుకు పౌరుషంవచ్చింది. "యెవడవురా....మా పోతుల్ని బాదావు?" అంటూ చేతిలోని బెత్తంతో రాజిగాడ్ని కొట్టాడు. రాజిగాడు కోపంతో మల్లును పొలం బయటకు యీడ్వబోతుంటే గట్టిగా రాజిగాడితొడ కరిచి విడిపించుకొని అయ్యదగ్గరకు పరుగెత్తాడు.

రాజిగాడు వుగ్రుడైపోయాడు. నాగలి విసిరేస్తూ "పొలంనుంచి కదుల్తావా లేదా" అంటూ ఒక తిట్టు విసిరాడు.

పుల్లయ్య సర్వనాడులూ విజృంభించాయ్! ఒక ఎగురు ఎగిరి సింహంలా వాడిమీద వురికి పడబోయాడు. కాని ఆ గెంతడంలో యేదో అసహాయత... కాలుజారి దున్నినభూమిలో చారబడిపోయాడు. అంతలోనే లేచి పరుగునవెళ్ళి మీద పడబోయాడు. ముగ్గురు అడ్డుగా కర్రలు పెట్టూ "ముందుకు అడుగేశావంటే తల పగులుతా" దన్నారు.

అలా నిల్చోని పుల్లయ్య ఆ కర్రలమధ్య నుంచి చూశాడు. యెదురుగా యెందరో వున్నారు, రాజిగాడుకూడా వున్నాడు. కాని వాళ్ళందరూ కనబడలేదు – యెవరిది? నీలి.....నా నీలి.....నా నీలినా సంపబోయాను?

ఆ ముగ్గుర్లో యిద్దరు తన రెండుచేతులూ పట్టుకున్నారు. కొడుకు నింకొకరు పట్టుకున్నారు. రాజిగాడు చెప్పినట్లు బయటకి యీడ్చుకవస్తుంటే ఆ పొలంమీద తండ్రీకొడుకు లిద్దరూ రాలిన మన్నును ముద్దుపెట్టుకుంటూనే పొలం అవతల పడ్డారు. పరుగెత్తి దగ్గరగా వచ్చిన పీస పుల్లయ్యకంటిలో నీరుచూసి "నా పుల్లిగా....నివ్వా నాయనా యేడుస్తున్నావ్? పుల్లి పిల్లి అయిపోయిందా తండ్రీ! యేంగతి వచ్చిందంటా" అని నెత్తిబాదుకొని గట్టిగా బొలబొలా యేడ్చేశాడు.

## 20

ఆరోజే మధ్యాన్నం.....ఎండ తీవ్రంగా కాసి.....కాసి...ప్రొద్దు తిరిగాక అకాశమంతా మబ్బులు కమ్మాయ్, అక్కడక్కడ చిరుచినుకులు రాలాయి; రానురాను గాలి

వీచింది, మేఘాలు పడమటి దిక్కునకు ప్రయాణం చేసి కొండల్లో కేంద్రీకరించాయి. సాయంత్రానికి కొండల్లో మెరుపులు మెరిశాయి.

ఆ సమయాన నీలమ్మ గుడిదగ్గర పలకరాతిమీద గుడ్డి వెంకన్న ఒంటిగా కూర్చున్నాడు. చేతిలో బాణాకర్ర వుంది. గన్నెమ్మ పుణ్యమా అంటూ తన కోరిక నెరవేర్చింది. ఇక్కడ విడిచిపెట్టి వెళ్ళిపొమ్మంటే తీసుకొనివచ్చి విడిచిపెట్టి వెళ్ళిపోయింది. కర్ర ముందుకు వేసుకొని కూర్చున్నాడు.

చిన్న చప్పుడు కాగానే "యెవరయ్యా" అన్నాడు. "గుడ్డోడా సీకటి పడ్తంది యిక్కడేం వున్నావ్" అని సంజీవి అడిగాడు.

"అయ్యా! దాసుడు శివాలేస్తే యినిపోదామని....."

"ఆకలితో సగం సచ్చాడు జొరంతో సస్తంటే ఎలాగొస్తాడు? రా, యీాదిలో వదిలేస్తాను."

"వద్దయ్యా! దాసు డెలాగైనా వస్తాడు...." అంటూ సర్దుకొని కూర్చున్నాడు.

ఏరు జలజల పారుతున్న శబ్దం వినిపిస్తోంది. వారధిపై గంటలతో పరుగులెత్తే యెడ్లబళ్ళ చప్పుడు, అప్పుడప్పుడు "పాప్పాయ్ం" అన్న బస్సుల అరుపులు..... వీటన్నిటిమీదకు భల్లూకంలా మీదపడి మ్రింగడానికి వచ్చే చీకటి!

పాదాల చప్పుడు.

"ఎవరయ్యా?"

జవాబులేదు.

"పేరు సెప్పు."

చిన్న మూలుగు.

వెంకన్న కర్రయెత్తి "సెప్పకపోతే మీదపడ్తాది" అన్నాడు.

"నేనురా....దాసుడ్ని."

"అయ్యా, వూరుకోని కొంప ముంచేద్దువు! రాజిగాడు యిలాగొస్తాడనీ కాశాను."

దాసుడు మౌనంగా గుడితలుపులు తీశాడు. ఈవేళ చిరిగిన మాసిన వస్త్రాలు, తడిసి అరవేసి మడికట్టుకొని వచ్చాడు. నిన్న వీటితోనే వచ్చాడు. కొడుకు నిన్న మధ్యాహ్నమే జ్వరంతో పడున్న తండ్రిని చూసి మెల్లగా ఆ మేదరి బుట్టలోని పట్టువస్త్రం......వూరంతా కలిసి దాసునికి కొనియిచ్చిన ఆ నేరేడుపండు రంగు పట్టుపంచె – కాజేసి, త్రాగడానికి డబ్బుకోసం అమ్మేశాడు. కోమటి పేరయ్య నాలుగోవంతు ఖరీదుకు కొనేశాడు. ఆ పంచె పోవడంతో దాసుడు నొచ్చుకున్నాడు. జ్వరం అధికమైంది. ఆ పంచె పోయింది – తన బ్రతుకూ సరే అనుకున్నాడు. లేవలేని పరిస్థితి. కానీ కడప్రాణం వున్నంతవరకూ తల్లికి తనచేత ఆలనా పాలనా జరగవలసిందే! నెమ్మదిగా లేచి బట్టలు మార్చుకొని.....అడుగులో అడుగు వేసుకుంటూ ఆయాసం రాగా ఆగి – మళ్ళీ నాలుగడుగులువేసి ..... ఇలా చాలసేపటికి నీలమ్మగుడి చేరుకున్నాడు. అక్కడకు వచ్చేసరికి ఆయాసం రావటంచేత వెంకన్నకు వెంటనే బదులు చెప్పలేకపోయాడు.

దీపం వెలిగించి కూలబడిపోయాడు. శివాలు వెయ్యటానికి శక్తిలేదు. ముదుసలి ముద్దలా గజగజ వణికిపోతున్నాడు. పండిన జుత్తు, గెడ్డం.....ఆ మధ్యను బక్కచిక్కిన

ముఖం - పల్లురాలిన నోరు.....లోతు కళ్ళూ..... గోడకు జార్లబడిపోయాడు.

వెంకన్న తడుముకొని మెల్లమెల్లగా గుడిగుమ్మం బయట కూర్చున్నాడు. దాసుని మూలుగు వినిపిస్తోంది.

"అయ్యా!" అన్నాడు వెంకన్న. దాసుడు సమాధానంగా మూలిగాడు. "ఆ రాజిగాడు పసిపిల్లడు మల్లుని యాడ్పించాడు. ఆ పుల్లయ్య భూమీ పుట్రా దోసినాడు. బతుకులు యెందరివో కూలుస్తున్నాడు, అదు - అడిరక్తం చూస్తేగానీ బుద్దిరాదు. అందుకేనయ్యా కాశాను!"

దాసుడు మూలుగుతూ "నాయనా! పులా - సింగమా! మనుషుల్ని సంపుకు తిననంతసేపూ మంచోడేనురా!....."

"మంచోడా? నాయం వూర్లో వుండాలా, ఈ గేమం గంగలో కలిసిపోతంది. సూడయ్యా! నివ్వు ఈఅలందరికీ యెంత సెప్పినావు! ఏల? నాలాంటి గుడ్డోడు కన్నుమూసి సూసినా కన్నిప్పి సూసినా ఒకటే!"

దాసుడు మెల్లగా ఆగి "ఎవరిగెపోల......బట్టి.....అళ్ళ.....బతుకులు .....నడుస్తాయి! సీకటి నేకపోతే... యెలు గెవడిక్కావాల? సెద్ద నేకపోతే...... మంచినేదు!" అన్నాడు.

నాలుక లాగుతోంది. మాటలు తడబడుతున్నాయ్. కానీ ఉన్న కొనవూపిరితో మాటలు మెల్లగా దొర్లుతున్నాయ్.

"పడమట.....పొద్దుగుంకితే.....తూరుపున లేవదా? ఒకరోజు వేడి.....ఇంకోరోజు సల్లన. సస్తాం..... పుట్తాం! సావు మనక్కాదు, పెపంచకం నిలబడడానికి."

ఒక్క మూలుగు మూలిగాడు. కొండల్లో ఉరుములు గంభీరధ్వని చేశాయ్. మెరుపులతో మేఘాలు ఇటువేపు వురుకుతూ పరుగెడుతున్నయ్. అకాసం దద్దరిల్లిపోతోంది!

వెంకన్న "అయ్యా" అన్నాడు. మాటలు లేవు. తల్లి వాలింది అనుకున్నాడు. మౌనంగా "నరుడా" అన్న గంభీరశబ్దం వినడానికి చెవులు రిక్కించి చేతులుకట్టుకొని కూర్చున్నాడు.

ప్రమిదలో నూనె ఉంది. వత్తి ఎత్తేవారెవరూ లేరు. రానురాను.....ఓనిముషంలో వత్తే కాలి దీపం ఆరిపోయింది. చీకటి! ఎటుచూసినా చీకటి! కానీ వెంకన్నకు మనసులో ఆనందం! నీలమ్మ తల్లి మాటలు వింటాడు!

హోరున గాలి వీస్తోంది. వర్షం ముంచుకొస్తోంది......ముంచుకొచ్చింది! దబదబ పడుతోంది. వెంకన్న మెల్లగా తడుముకుంటూ గుడిలోనికి కాలు పెట్టాడు.

తలుపులు వేయడానికి ప్రయత్నించాడు. గాలి తలుపులను తెరుస్తూ వర్షపుజల్లును గుడిలోనికి కొట్టుతోంది. లోన గడియలేదు. తలుపులు కొట్టుకుంటున్నాయ్. ఉరుముల శబ్దం గుడిలో ప్రతిధ్వనిస్తోంది. సాష్టాంగపడ్డాడు. ఆ పడటంలో మోచెయ్యి ప్రమిదలో పడింది. చప్పున లేచాడు. గుడిలోనికి గాలి బాగా కొడ్తోంది.......తను తడిసిపోతుంటే కూర్చునే తడుముకొంటూ ఒక మూలకు పోతుండగా చేతిని యేదో తగిలింది. మెల్లగా చేతితో తడిమాడు చల్లగా తగిలింది. అలా చేతితో ఒళ్ళంతా తడిమాడు. దాసుడు చచ్చిపోయాడని నిర్ధారణ చేసుకోడానికి ఒక క్షణమయినా పట్టలేదు. ఆ శవాన్ని..... ఆ తలని రెండుచేతులతో గట్టిగా పట్టుకొని గుండెకు

హత్తుకొంటూ బెక్కాడు. ఏడుపు వుద్భృతంగా వచ్చేసింది. కన్నీరు కాలవలై దాసునిమీద పడజొచ్చింది. ఆ యేడుపుతోనే "నిన్ను అకలితోనే సంపేశారు.....అ అయ్యా.....మా దాసయ్యా! నిన్ను అకలితోనే సంపేశారురా!.......మా తల్లికి యింక దీపం యెవురు పెట్తారు? శివా లెవరేస్తారు?" ఒకటే ఏడుపు! ఆ గోల అంతా వురుముల భీకరధ్వనిలో కలిసిపోయింది. ఆ కన్నీరు దాసునిమీదనుంచి జారి ప్రకృతి చల్లిన వానలో చేరిపోయింది!

# 21

మరుచటిరోజు ఉదయం – వర్షం వెలిసి ప్రకృతి ప్రశాంతంగా ఉంది.....విరిగిన చెట్లు, ఎగిరిన యింటి కప్పులు బీభత్సపు అవశేషాలుగా అగుపిస్తున్నాయ్. దాసుడు ఈ మట్టిలో పుట్టి, ఈ వూరు మన్నునే నమ్ముకొని బ్రతికి, చివరకు ఏటివొడ్డున బుగ్గయిపోయాడు.

మధ్యాన్నమయ్యేసరికి పేటేరు ముంచుకొచ్చింది. హోరుమనే ఆ ప్రవాహపువడి వూరి చివరకు వినిపిస్తోంది. రెండు ఒడ్డులు తీసి పారి ఎదుట ఒడ్డునవున్న భైరి గ్రామంలోకి కూడా ప్రవాహం చొచ్చుకుపోతోంది. ప్రజలు ఇల్లు వాకిలీ విడిచిపెట్టి దగ్గరగా ఉన్న గుట్టమీదకు వెళ్ళిపోతున్నారు. నవిరి గ్రామంకు ఆ ప్రమాదం లేదు – ఒడ్డు యెత్తుగా ఉండటం, దక్షిణపు వేపు ఇసుక దిబ్బలు, దిబ్బలపై సరుగుడు తోటలు ఉండటంవల్ల యేరు ఎంతవచ్చినా వరదబాధ ఉండదు.

ఏరు రానురాను పొచ్చయి బొబ్బలు పెట్తోంది. చెట్లూ, పశువులూ, కలపకంపనూ త్రిప్పుతూ త్రోసుకుంటూ పోతోంది. జిగులుతెప్ప లేకుండా ఎటువంటి గజయీతగాడూ యేటిలో దిగలేకపోతున్నాడు, గంగమ్మతల్లి రానురాను రౌద్రస్వరూపిణి అవుతోంది. ఒడ్డును దభీమని కూల్చేస్తోంది. వంతెనను గజగజ లాడిస్తోంది. తెప్పల మీదనున్న మనుషుల్ని కూడా తిప్పిరీలలో గిరగిర త్రిప్పి ముంచబోతోంది – ఏమిటీ బీభత్సం? ఎందుకీ ప్రళయాకారం? ఎందుకింత ఒడుదుడుకులు? – ఏవమ్మా – మొన్ననే వెన్నెల్లో సొగసుతో, సొంపుతో, మువ్వల రవళులతో నృత్యం చేసినదానివి, ఇంతలో యీ బీభత్సం దేనికమ్మా? ఎప్పుడూ ఆ మాధుర్యం నీలో ఉంటే – కంటికి యింపై నీ ఒడ్డున ఉన్నవాళ్ళలో భావోద్రేకాలు కలిగించి కమ్మగా రాగాలు కలకాలం తీయించేదానవే!

ఏరు నవ్వింది! కారుచీకటిలో ఒకమూల చిన్నవెలుగు, నిరాశలో ఆశారేఖ, గతం జ్ఞప్తికి తెప్పించింది. ఒకప్పుడు యేరు బీభత్సంగా వచ్చింది. రానురాను తగ్గి చూపుకు పసందుగా ప్రశాంతంగా పారజొచ్చింది. వేసవిలో యెండి స్తబ్దురాలైంది. పెనుగాలికి ఇసుకరేణువులే యెగిరాయ్. తాగడానికి నీటిబొట్టు ఇవ్వలేని నికృష్ట నిర్జీవియైంది! మళ్ళీ బీభత్సమైన వరద వస్తేగాని ఆమెలో ప్రాణం తొణికిసలాడలేదు!

ఏ దేశ చరిత్రకైనా, ఏ వ్యక్తి బ్రతుకుకైనా, వేనే ప్రతిబింబమని తెలుసుకోలేక పోయినందుకే కామోసు యేరు నవ్వింది! ఆ బీభత్సమే లేకపోతే ఆ మనోహరమైన ప్రశాంత జీవితానికి అస్కారం ఉండేదా!

జీవితంలో నిటంగా ఒడుదుడుకులతోనే దాసుడు జీవించాడు. సుఖంగా స్తబ్ధుగావుంటే తనలో ప్రాణంవుండీ లేనట్లే అయ్యేది. ప్రాణంలేని మనిషి, అలాంటి మనుషులున్న జాతి యెలా వర్ధిల్లుతుంది?

నవిరిగ్రామంలో యెందరో పుట్టారు – ఎందరో గిట్టారు. లోటు కనపడలేదు. కానీ దాసుడులేని లోటు కనిపిస్తూనే వుంది. నీలమ్మ గుడిలో దీపం పెట్టేవారు లేరు. బాధగా బరువుతో ఉన్న గుండెలను యే మాటలు తేలికచేసేవో, ఆ మాటలు అటువంటివాళ్ళకు వినిపించలేదు. ఆపదలో, ఆవేశాలలో యే హృదయం సామెతలతో, మంచి మాటలతో లేశమాత్రమైనా అసూయలేని అపూర్వమైన అభిమానంతో, ప్రేమతో లాలించేదో ఆ గుండె కరువై పోయింది. దాసుడు చనిపోయాక కూడా జీవించాడు. కోడలు కోపంతో యెగిరిపడి మాటలు విసరడానికి మామ ఇక లేడు. కొడుకు కొఱుక్కునీ, పీకీ తినడానికి తండ్రి లేడు. ఆమె కోపాన్ని, వాడి రాక్షసత్వాన్నీ చల్లగా భరించే కుండ పగిలిపోయింది. ఇప్పుడు చెదిరిన కోపాలు. విహరిస్తున్న రాక్షసత్వం వాళ్ళనే బాధ పెట్టజొచ్చినయ్. ఆ ముసలాడు యెంత మంచోడు! కొడుకునకు యిప్పుడు అయ్య జ్ఞాపకంవస్తే బావురుమని యేడుస్తాడు.. కోడలు తను యెంత అన్యాయం చేశానని నొచ్చుకుంటుంది. ఆ యేడుపు రాకుండా ఉండాలంటే తను ఇలా అయ్యను జ్ఞాపకం తెచ్చుకోకూడదు. జ్ఞాపకం రాకుండా వుండాలంటే తన మనసు ఇంకెవరి అధీనంలోనో ఉండాలి! అంచేత దొంగతనంచేసో, పనిపాట్లుచేసో, పేకాట ఆడో యేంచేసి యేం వచ్చినా ఊర్లో దొంగసారాకొట్లో పోసి తండ్రిని మరచిపోతున్నాడు. పెళ్ళాం కూలీ నాలీ దొరికినమట్టుకు చేసి, లేనప్పుడు పెద్దిళ్ళల్లో అడుక్కొని పిల్లలను పోషిస్తోంది.

ఒకనాటి సాయంసమయాన నీలి వంట అయ్యాక వీధి అరుగుమీద పత్తి బాగుచేసుకుంటోంది. ముసలమ్మ ఒకమూల కూర్చోలేదు. ఏదో పనిపాట్లు చేసుకుంటోంది. కాస్త అలసట రాగానే రెండేసి రోజులకి జ్వరం వస్తోంది. ఈ వేళ జ్వరతీవ్రత లేకపోవటంవల్ల మనుమరాలుకు ఏకులు చెయ్యటంలో సహాయం చేస్తోంది. దగ్గర నీలి కూర్చుంది. అప్పుడే వెంకన్నకు కొద్దిగా గంజి పోసింది. వెంకన్న తింటున్నాడు. ఇంతలో పీస గొంతుక గట్టిగా వినిపిస్తోంది. వీధిలో యెదురుపడ్డవాళ్ళని ఆపి "ఒరయ్యో! శూద్రపోడ్ని పప్పు తినమంటే యెలాగరా! అందరూ పప్పుతింటే రేప్పొద్దున్న పై దండు వస్తే కత్తీ తుపాకీ పట్టుకోగలరా? శూద్రపోడి బతుకే మాంసం. అదు తుపాకీ పట్టుకోవాలంటే దేముడూ సారా రెండూ వుండాలంటావా, లేదంటావా?" అనడుగుతున్నాడు.

నవ్వుతూ వాళ్ళు ఒప్పుకున్నారు. పీస గొంతుక మరింత హెచ్చింది అభినయంతో "ఆ గవర్నమెంటోడు మంచిసరుకు ఇచ్చేవోడు తక్కువ ధరకి! ఈ దొంగనాయులంతా సెడ్డసరుకు ఎక్కువ ధరకిచ్చి మనుసుల్ని యేగంగా సంపేస్తున్నార్రా! నాకు తెలుసును.....నా కంతా తెలుసును.....యిది నా గవుర్నమెం ోడుపని కాదులే!"

గుంపులో ఒకడు "మరెవడిదిరా? చూశావా? అదు యెగిరే పిట్టల్ని పంజిరంలో పెట్టానంటే యేం అవుతాది! ఏనాడూ తాగనోడివి నివ్వు తాగావా? పదిమంది

జబ్బులొచ్చి సస్తన్నారు – నాయుడూ, కరణాలు, పైనున్నోలు సారాకొట్టోడు బాగుపడిపోతున్నారు!" అన్నాడు.

పీస పకపక నవ్వుతూ మళ్ళీ చప్పున నవ్వునాపి, "ఏమన్నావయ్యా! నా గవుర్నుమెంటోడిని నాలోంటోలనీ అంటావా? ఛా ఛా......మీద నున్న నా గవర్నమెంటోడు, కిందనున్న మనం మంచోలమే – ఈ మధ్య నున్నోలే – దేముడు వరం ఇచ్చినా పూజారి ఇవ్వడురా! అయ్యా, నందిని పంది సేస్తారు....పందిని నంది సేస్తారు! సూశావా? కరణం దొంగ లెక్కలు రాసేసినాడా! పుల్లయ్యని కైదులో పెట్టేసినారా.....నిన్నటికి ఈ యేళకీ నివ్వు మారిపోనావు – అలాగే రావా మంచిరోజులు," అన్నాడు.

ఆ దగ్గరలోనే నీలి ఇంటిదగ్గర వున్న వెంకన్న ఉత్కంఠం ఖస్సు మనటంతో పీస ఇటువేపు వచ్చాడు. వెంకన్న మాడిన కడుపు పూటుదేరటంతో శక్తివచ్చి నిల్చోనే "వస్తాయి! ఊరంతా యీ పెద్దనాయకులంతా పెట్టిన కాటకంతో మాడిపోతూ గొట్టెలయిపోనారు? దేముడు కళ్ళు యిచ్చినాడు కాదు!" అన్నాడు.

పీస దగ్గరగా వచ్చి నీలని చూడగానే "ఏం అమ్మీ! ఈ గుడ్డోడు తక్కువ పాపాలు చేసినాడా, ఏమయినాడు? అలాగే యెవురిరోజు వాళ్ళకి వస్తాది. మనం అందరినీ పీకడం యేల? ఆ కర్మే రాబందై పీకుతుంది," అన్నాడు.

గుడ్డి వెంకన్న "వస్తాను తల్లీ" అంటూ కర్ర సహాయంతో చిన్న చిన్న అడుగులు వేస్తూ ఆగి గట్టిగా "ఎవుడిపాపం వాడినే తింటాదని ఆ పిల్లులకి రొయ్యల మొలతాళ్ళు కట్టండి! ఆ కుక్కలకి పెత్తనం యిస్తే యీ పేదోలింటి కుండలన్నీ కెలకవా? దాతా దైవంలేని కొంపలాగ ఊరంతా అయిపోతూంటే కళ్ళున్న ఈ మనసులంతా గొట్టెలయిపోతున్నారు! అందరూ కూడి ఈ నలుగుర్ని కట్టి పంచాయితీ పెట్టించండి!" అన్నాడు.

కొడుకు మామ్మ నేర్పిన సామెతలు అంటుంటే, సంతోషంతో పుల్లయ్య "ఏంరా గుడ్డోడా, అలా గరుస్తున్నావ్?" అని పలుకరించగానే వెంకన్న ఆగి "నాయనా పుల్లిగా! నా తరవాత నివ్వే ఊరిపేరు నిలబెట్టావ్, నాను గుడ్డోడినయ్యాను. నీకు కళ్ళున్నాయ్. పేణంపోయినా నీతికి నిలబడాలరా! ఊరిలోపున్న బీదా బిక్కీ పడుకున్నారు! ఆలని లేపి, నాయనా! పచ్చినోలకి ప్రాణంపోసి, బతికి బగమంతుడ్ని సూపించు! ఆలు అప్పుడు మనుసులవుతారు. ఏ నాడు ఆలు మనుసులయ్యారో, అనాడు శవాలను పీక్కు తినడానికి వున్న ఈ రాబందులన్నీ ఎగిరిపోతాయి!" అన్నాడు.

వెంకన్నకు ఉద్రేకంతో ఒళ్ళు పులకరించిపోయింది. పుల్లయ్య బదులు చెప్పలేదు. మల్లుమాత్రం వాళ్ళ మామ్మ అనే సామెతల్లో ఒకటైన "నోరూ నోరూ నొల్లావా.....వీపూ వీపూ కాశావా?" అంటున్నాడు. పుల్లయ్య "రేపు సూద్దాంలే!" అంటూ వాకిట అడుగుపెట్టినా పీస మాటాధలేదు. మల్లు పీస తాత మెడను చుట్టివేసి "నోరూ నోరూ నొల్లావా......వీపు వీపూ కాశావా" అంటున్నాడు.

"బాగుందిరా తాతా" అన్నాడు పీస. ఆ పొగడ్తతో మల్లు తన తెలివిని విప్పుతున్నాడు. "బుద్ధి బుద్ధి బాగున్నావే - బువ్వా నీవు తింటున్నావే!"

పీసకు యెంతో ముచ్చటవేసి మనవడ్ని ముద్దులాడాడు. నీలి చప్పున కలుగజేసుకుని "అయ్యా! తాగావా?" అంది.

పీసను ఈ ప్రశ్న మేలు కొలిపింది. ఇంతవరకూ మౌనంగా వున్న యీ గొంతుక యీ ప్రశ్నతో మైకాన్ని పటాపంచలు చేసింది. వెంటనే జవాబు చెప్పలేకపోయాడు. కొంతసేపటికి "అమ్మా" అన్నాడు. మళ్ళీ నోరు పెగల్లేదు, వాస్తవిక పరిస్థితులలో పడ్డ పీసకు దుఃఖం ముంచుకొచ్చి "పిల్లా జెల్లా మాడిపోతుంటే సూడలేక.... సేతకాక.....ఆ మంగలోడు పట్టిస్తే.....ఓ సెణమేనా యియన్నీ మరిసిపోతే.....పేణానికి సుకమని....." అన్నాడు.

కాస్సేపు నిశ్శబ్దంగా వుంది. పుల్లయ్య "నీలాంటి రోజులు యింక మాకూ వస్తాయిలే" అని అనబోతూ పెళ్ళంవేపు చూసి వూరుకున్నాడు.

# 22

ఒక సెంటు జాగాయైనా తన స్వాధీనంలో లేనిది పోతులు వుంచుకొని యేం చేస్తాడు? కొనేవాళ్ళు వస్తున్నారు. ఐదేళ్ళయి దొడ్డిలో ఉన్న పోతుల్ని విడిచిపెట్టడం కష్టమనిపించడంవల్ల ధర హెచ్చు చెప్తున్నాడు. బేరం కుదరటం లేదు. ఇలా వుంచుకొని లాభ మేమున్నదంది నీలి. మరి కొద్దిరోజులు పోతే అవి ఆకలితో వుండాలా? అమ్మెయ్యమని బలవంతం చేసింది. విధిలేక ఒప్పుకున్నాడు.

వాటిని కొన్న పొరుగూరి రైతు సాలనించి పోతులువిప్పటం చూచిన మల్లు త్రోవ కాశాడు. చేతిలో బెత్తంవుంది. యజమానివైపు చూస్తూ కదలని పోతులు, మీద కొరడాతో దెబ్బలు పడగానే సాలనుంచి బయటకు పరుగెత్తాయ్, కొత్త యజమాని వెంటపడ్డాడు. మల్లు పోతులు వడిగా నడుస్తూ తనవేపు వస్తున్నా కదల్లేదు. "హేయ్" అని అరుస్తున్నాడు. ఈ అరుపు పుల్లయ్యకు వినపడి పరుగెత్తాడు. పోతులు మట్టివేస్తాయని తోచింది. త్రోవలో లేవమని అరిచాడు. క్రొత్తయజమాని కంగారుపడుతూ ఇంకోవేపు పోతులను త్రోలటానికి ప్రయత్నించాడు. కానీ పోతులు మల్లు మాటలు విని ఆగిపోయాయి. అలా పుసులుకట్టిన కళ్ళతో మల్లువేపు చూస్తూ తలలు ఆడించాయ్. "అయ్యా! పోతులు కట్టు" అన్నాడు. అయ్యవచ్చి కొడుకుని ఎత్తుకొని దారి తప్పుకున్నాడు. ఆగిపోయిన పోతులు కదల్లేదు. మళ్ళీ కొరడాదెబ్బలు చర్రు మనగానే ముందుకు పరుగెత్తాయ్. అయ్యచేతుల్లో ఉన్న మల్లు చేతిలోని బెత్తం ఆడిస్తూ ముందుకు పరుగెత్తాలని గుంఝాటన పడుతున్నాడు. పుల్లయ్య కొడుకును గట్టిగా పట్టుకొని ఇంటివేపు ఒక్కొక్క అడుగు వేస్తుంటే కొడుకు గోలపెట్టి యేడుస్తున్నాడు.

పెరటి వాకిటలో కూర్చున్నాడు. క్రిందకు దించిన కొడుకు కాళ్ళూ చేతులు కొట్టుకొని యేడుస్తున్నాడు. పుల్లయ్య మారు మాటాడకండా అలా సాలవేపు చూస్తున్నాడు. కంటికి పోతులు కనిపిస్తున్నట్టున్నయ్ కాని తేరిచూస్తే కనిపించలేదు.

తన చేతులూ కాళ్ళూ విరిగినట్లున్నయ్. ప్రియాతిప్రియమైన యింటి మనుష్యులు మళ్ళీ తిరిగిరాకుండా వెళ్ళిపోయినట్లనిపించింది. తను ఇక రైతుకాదని జ్ఞప్తికి వచ్చి దుఃఖం ముంచుకొచ్చింది. గర్వంతో నిండిన రైతురక్తం పల్చబడిపోయినట్లనిపించింది. బాధతో, బరువుతో నిండిన గుండెతో లేచాడు. కొడుకుని లేవనెత్తి గుడ్డతో ఒళ్ళంతా తుడిచాడు, అయినా యింకా మన్ను అంటుకొనేవుంది. "దుక్కికి తీసుకెళ్ళాడు, రేపు రేపు మన పోతులు మన సాలలోకి వస్తాయి" అని ఓదార్చాడు.

ఏటికి వెళ్ళి ఇద్దరూ బుడకపెట్టారు, ఆ దగ్గరగానే పోతులు కడిగే వాళ్ళలో ఒకడు "పోతులు ఎంతకమ్మావు పుల్లిగా!" అని అడిగాడు. "నూట అయిదురా" అన్నాడు. అలా అంటున్నప్పుడు కొడుకు తండ్రివేపు చూస్తున్నాడు. ఇంటికి వెళ్తుండగా త్రోవలో వెనుకకు తిరిగి "అయ్యా, పోతులు రానేరావు......అబద్ధం ఆడితే కళ్ళు పోతాయి కదూ!"

పుల్లయ్య జవాబు చెప్పలేదు. కానీ యెత్తినతల దించాడు.

ఊడుపులయ్యాయి. ఈ సంవత్సరం పైవాళ్ళ పనిపాట్లకు వెళ్ళాడేగాని పొలంలో ఉన్నంతసేపూ మనస్సు మథనపడేది, కొడుకు వెంట ఉండి యెంతో సహాయం చేస్తున్నట్లు ఉండి మధ్య మధ్య వింతవింత ప్రశ్నలు వేస్తూంటే యెక్కడలేని దుఃఖమూ వచ్చేది, ఒక్క యెకరం పొలం ఉంటే చెమటతోనే పండించేవోడ్ని అనుకొనేవాడు. ఊడుపులయ్యాక పనిపాట్లు లేవు. పోతులమ్మిన డబ్బు బియ్యం కొనటంతో సరి. కొడుకు తను తింటే గానీ తినడు. తను చిక్కిపోయినా ఫరవాలేదు. తన కొడుకుమాత్రం చెక్కు చెదరకూడదు. ఈ సారి అప్పుకు వెళ్తే రాజిగాడు ఇంకేం వస్తాదన్నాడు. ధర కట్టించి యేంవచ్చినా తీసుకపొమ్మన్నాడు. పుల్లయ్యకు పౌరుషం వచ్చింది. అంతపని మాత్రం చెయ్యనన్నాడు. అలా వడ్డీతో మునిగిపోతుంది గానీ మరేం లాభంలేదని యింకోప్రక్క పీక్కుతింటోంది. నీలి వెళ్ళి పది రూపాయలు బ్రతిమాలి తెచ్చి ధాన్యంకొని దంచి వ్యాపారం పెట్టింది. రాను రాను ఒకపూట గంజికి, ఒకపూట అన్నంకూ సరిపడేటట్లు వ్యాపారం పెంచింది. కొందరికి అరువులిస్తేగానీ వీలయ్యేది కాదు. ఆ డబ్బు సరిగ్గా వసూలయ్యేదికాదు, నీలినిచూసి పది యిళ్ళవరకూ ఈ వ్యాపారంలో దిగారు. పొరుగూరికి తీసుకెళ్ళి మరీ అమ్మేవారు. నీలి బ్రతిమాలి రాజిగాడి పెళ్ళాం దగ్గర పాతిక తెచ్చి కర్రల వ్యాపారం చేయమని మొగుడ్ని ప్రోత్సహించింది, రోజు కో కావిడ కర్రలు పొరుగూరికి మోసుకెళ్తే రూపాయి వస్తుంది. పుల్లయ్యకు చాలా నామోషీ అనిపించింది. ఒకనాడు చుట్టుపట్లా పేరు పొందిన పుల్లయ్య ఒక కంబారిలా కర్రలకావిడి మోయటమా! వాళ్ళు ముఖం చూడకుండా బేరాలాడేవారు! ఏదోమాట విసిరేసేవారు. ఒక్కరోజుకే ఒళ్ళు చచ్చిపోయింది. కాని పెళ్ళాం పిల్లల ముఖంచూసి ఇంకోరోజు వెళ్ళాడు. ఇలా రానురాను అలవాటుపడ్డాడు.

ఇంట్లో పరిస్థితి చూసి పీస పరిస్థితి రాదని పుల్లయ్య సంతోషపడ్డాడు. భార్య చెప్పిన మాటలమీద తనకు నమ్మకం కలిగింది. తను కష్టంమీద బతుకుతున్నప్పుడు బాధపడడంలో అర్థం లేదనుకున్నాడు. ధరలు రోజు రోజుకూ పెరుగుతున్నా తనకు ఆ పెరుగుదల కనపడలేదు. తనూ ఇప్పుడూ రూపాయివున్న కావిడి రూపాయి పావలాకి అమ్ముతున్నాడు. పెళ్ళాం బియ్యం రూపాయికి అర్ధ అమ్ముతోంది, కర్రలు

తను ధర తగ్గించి యెందుకు అమ్మకూడదనుకున్నాడు – ఊరులోనే కాదు, అన్ని ఊర్లలోనూ ధర లిలా ఎక్కువగా వుంటే తనెందుకు తక్కువకి అమ్మాలనిపించింది. రాను రాను కావిడి రూపాయిన్నరకు అమ్మాడు. నిజానికి తనకు షావుకారుదగ్గర పన్నెండణాలకే గిట్టింది. ఒక పూటకు పన్నెండణాల కూలే – ఎంత యెక్కువ! అనుకున్నాడు. అయినా తక్కువకి అమ్మడానికి మనస్కరించలేదు, ఇప్పుడు రాజిగాడు, పేరయ్య వగైరా రాబందులనుకొనేవారు జ్ఞప్తికి వచ్చారు. ఇదివరకల్లా తనకూ వారికి భేదంవుందని – వాళ్ళు రాబందులు. తను మనిషి అనుకొనేవాడు, కాని వారిది తనలాంటి ఆశే అని జ్ఞప్తికి వచ్చి మనుషులంతా మంచివాళ్ళే అని దాసుడు చెప్పిన మాటల్లో ఎంత సత్యం వుందో గ్రహించాడు.

ఇలా మూడునెలల్లో ఇంట్లో జరుగుబాటు వెళ్ళింది. ఈ విపరీతమైన ధరల్లో డబ్బు కొల్లలుగా మూటకట్టినవాళ్ళు సద్వినియోగంకోసం వుబలాటపడుతున్నారు. ముఖ్యంగా పెద్దరైతులే డబ్బు చేసుకున్నారు. చిన్న రైతులు సర్వనాశనం అయ్యారు. చిన్నవాళ్ళ భూములు పెద్దలు కొన్నారు. ఆ డబ్బుకు ధాన్యం నల్లబజారు రేటులో యిచ్చారు. ఈ పెద్ద రైతులు యిక భూమి హెచ్చుధరలకైనా అమ్మేవారు లేకపోవటంతో మిగతాడబ్బు యెలా పెట్టుబడి పెట్టడమని వుబలాటపడ్డారు. ఒకడు వూరిలో రోడ్డుప్రక్కన ధాన్యంమిల్లు పెట్టాడు. మిల్లుకు అనుబంధంగా చిల్లర బియ్యంకొట్టుకూడా పెట్టాడు. ఒక నెలరోజుల్లో పది కుటుంబాల బ్రతుకులు గంగలో కలిశాయి: ఆ త్రాగే గంజికైనా అధారం లేకపోయింది, ఐదుకుంచాల ధాన్యంవున్నా మిల్లుకి వెళ్ళిపోయ్యేది. చౌక – డబ్బు లేకపోయినా ఆ ధాన్యంనుంచి వచ్చిన తౌడు యిచ్చి వేస్తే చాలు! దీనివలన పెద్ద రైతుదగ్గరనుంచి మూలనున్న ముసలమ్మకూడా ధాన్యంమిల్లుకే తీసుకపోయేది. ఇదివరకు పెద్దరైతుల ఇళ్ళల్లో కూలికి దంచే వ్యవసాయ కూలిజనం వృత్తులు పోయాయి. పరిస్థితి మరీ అధ్వాన్నం అయిపోయింది. ఈ మిల్లుబియ్యం అన్నం మల్లెపువ్వులా వున్నాదని ఊరంతా సంతోషించారు కానీ, దీనివలన కొందరి వృత్తులు పోయాయి. ఒక పెట్టుబడిదారు మరింత భాగ్యవంతుడయ్యాడు. పెద్దరైతు భార్యకూడా యిదివరకు ధాన్యందంపులో పాల్గొనేది – అటువంటి శ్రీమంతుల స్త్రీలకు సుకుమారత్వం అబ్బి, రానురాను కొన్నాళ్ళకు ఊర్లో వైద్యుని అవసరం హెచ్చయింది. పొరుగూరి వైద్యునిదగ్గర క్రొత్తగా చేర్చుకున్న వైద్యుడు ఊర్లో మకాం వేశాడు. ఈ వైద్యునికి ఇంజెక్షను ఇవ్వటంవచ్చు కానీ ఆ ఇంజక్షను అన్నమాట ఆ పల్లీయులు అన్నట్లుగానే "ఇండీషను" అనే అంటాడు. సూదిమొన శరీరానికి తగిలితేకానీ డబ్బుపడదు. అంచేత గజ్జి కురుపుల నుంచి విషజ్వరాల వరకు సూదిమందు తగుల్తోంది. అవసరంలేచి వాటికైనా "డిష్టిల్డువాటరు" ఇంజెక్షను ఇచ్చినా మూడు రూపాయలు పుచ్చుకుంటున్నాడు. ఆ పల్లీయులకు కావలసింది గాజుబుడ్డీ (అంపోలు) కోస్తున్నాడా లేదా అన్నదే గాని అందులో మందుతో వాళ్ళకు సంబంధం లేదు.

నీలి పుల్లయ్యకూడా ఇందులో చిక్కుకున్నారు. బియ్యం వ్యాపారం సరి. కర్రల వ్యాపారం కొద్దిగా సాగుతోందనుకుంటే అటువేపుకూడా పోటీ వస్తోంది. విడిగా చెట్లు అమ్మటంలేదు – తోటకు తోటలే కాంట్రాక్టు పాడి డబ్బున్న ముగ్గురూ మరింత డబ్బు చేసుకుంటున్నారు. పుల్లయ్యలాంటి చిల్లర వ్యాపారులకు వచ్చేవి చెట్లు

కొట్టగా వచ్చిన మొదళ్లు. ఇసికప్రదేశం అవటం వల్ల ఆ మొదలుచుట్టూ పెద్దగొయ్యి త్రవ్వి అందులో దిగి గొడ్డలితో కొట్టి మొదలు బైటవెయ్యాలి. ఇది అంత సులువైన పనికాదు – దీనివలన జరుగుబాటు తక్కువైనా కష్టం హెచ్చవుతోంది. పుల్లయ్య వారం రోజులకే చిక్కిపోయాడు.

ఒకనాటి పగలు పదిగంటలప్పుడు గొడ్డలి, పార భుజాన వేసుకొని ఊరికి దక్షిణ దిక్కుగావున్న సరుగుడు తోటలోనికి వెళ్ళాడు. అప్పటికి మల్లు ఇంట్లో లేడు. వీధిలో ఎవరో సాయెబు గారడి చేస్తుంటే పిల్లలతో పరుగెత్తాడు!

పుల్లయ్య గమ్యస్థానానికి చేరుకున్నాక పార, గొడ్డలి అక్కడ వేసి పంచె యెగగట్టి లంగోటి లాగి కట్టాడు. గేరా గిరాజాలు మూడివేశాడు. పార పట్టుకొని సరుగుడు చెట్టు మొదట్లో గొయ్యి తియ్యటానికి మొదలుపెట్టాడు. పనిలో నిమగ్నమైపోయాడు, రానురాను యెండ హెచ్చుతున్న కొద్దీ చెమట జారి గోతిలో పడ్తోంది. ప్రక్కనేవున్న సరుగుడుతోట గీమంటోంది – చిలకలు గుంపులు గుంపులుగా ఆ చెట్లపై వాలి యెగిరిపోతున్నాయ్. అంతదూరంలో లంకలోని వరిచేలు పచ్చగా నిండుగా వుండి తలలూపుతున్నయ్. ఎక్కడో ఒక మూల ఒక మనిషి వుంటున్నాడు. ఒక బొరియనుంచి నక్క యింకో బొరియవేపు పురుగులు తీస్తోంది.

పుల్లయ్య వీటివేపు చూడనేలేదు. ఈ శబ్దాలు వినిపించుకోనేలేదు. అల్లంతదూరంలో యేరు పారుతోంది.

నిలువెత్తు గొయ్యి తియ్యటం పూర్తయేసరికి ప్రొద్దు నెత్తిమీదకి వచ్చింది. గొయ్యిలోనికి దిగేముందు చుట్టూ చూశాడు. మనిషిజాడలేదు. గొడ్డలి భుజానవేసి మెల్లిగా మొదలుపట్టుకొని గోతిలోనికి దిగాడు. మీదికి చూశాడు. ప్రొద్దు కంటిమీదపడి జిగేల్‌మన్నాది కళ్ళుమూసి తెరచేసరికి యేదో గొంతుక వినిపించినట్లయింది. నూతిలో గొంతుకలావుంది. ఎవరో అనుకొన్నాడు. ఆ క్షణంలోనే చచ్చిన అప్పన్న జ్ఞాపకం వచ్చాడు. అప్పన్న బ్రతుకంతా కళ్ళయెదుట ప్రత్యక్షమైంది; అప్పన్న బ్రతుకు తన బ్రతుకుతో పోల్చుకోసాగాడు!

అప్పన్న తనలాగే కష్టజీవి. బుగతభూమి తీసుకున్నాడు. ఉన్న యెకరం ఒక పెద్దరైతు పాట్టనపెట్టాడు. ముగ్గురుపిల్లలు, పెళ్ళం! పెద్దకొడుకు మల్లులాంటివోడే! అయ్యా అని పిలిసే అప్పన్నకూడా కొడుక్కి అయ్యా అని పిలిచేవాడు. తనలాగే కావిడివేసి కఱ్ఱలు అమ్మేవాడు. నిరుడు వేసవిలోనేకదా యీ దగ్గిరే అదిగో ఆ తోటదగ్గిరే ఇలాగే గొయ్యితీశాడు.....యింతగొయ్యే – యిలాంటి మిట్టమధ్యాహ్నం అప్పుడే......నాలాగ గొడ్డలిపట్టుకొని.....మొదలు నరుకుతుంటే......యిలాంటి ఇసికటడ్డంతా మీద కూలి పోయింది......ప్రేణంతోవున్న మనిషిని పాతివేసింది.....అయ్యా......అని అరిచాడట! తియ్యండర్రో అని అరిచాడట! యెండప్పుడు ఒంటిగా యీ త్రోవ యెవరు వెళ్ళినా యీ కేక వినిపిస్తోందట.....అవును, వాడే అరుస్తున్నాడు....ఒంటిగా వున్నాను, వాడే. ....గొంతుక రానురాను పెదద్దవుతోంది....తనవేపే అరుస్తూ అప్పన్న వస్తున్నట్లున్నాడు......ఈ యిసికటడ్డంతా తనమీద పడిపోతుంది. దెయ్యం! తన పీక పిసికేస్తాడేమో.....నాలాంటోడు – అదు నా పీకెందుకు పిసుకుతాడు? పుల్లయ్యని నానా దయ్యానికి భయపడ్తున్నానా?" ...తమాయించుకోబోతూ గొడ్డలితో మొద్దు

మీద గట్టిగా రెండు నరుకులు వేశాడు. పై నుంచి ఒడ్డు కొద్దిగా కూలి యిసిక తలమీద పడింది. తల దులుపుకొని మీదికి చూశాడు. అయ్యో అన్న పిలుపు వినిపిస్తోంది...... ఆ పిలుపు అలసిపోయి సొలసిపోయి అరుస్తున్నట్లుంది. అప్పన్న మరీ దగ్గరగా వచ్చినట్లు, అప్పన్నలా తనూ యెక్కడ చచ్చిపోతానోనన్న భయం, పిరికి ఆవరించాయి. తను చచ్చిపోతే తన పెళ్ళాంపిల్లలూ అప్పన్న పిల్లల్లా వీధిలోపడి అడుక్కోవసిందే!

ఈ తలపుతో గోతిలో వుండలేకపోయాడు, ఈవేళ యిదికొట్టి కావిడి వేసి అమ్మితేగాని - రాత్రికి పస్తువుండవలసివస్తుందని తోచినా ఓ క్షణమైనా వుండలేకపోయాడు. ఆ పిలుపు తన గుండెకు సూటిగా తగుల్తోంది. పైకి వచ్చి చుట్టూ చూశాడు. పిలుపు తప్పించి యింకెవరూ కనపడలేదు, భుజాన గొడ్డలి, పారవేసుకొని యింటివేపు నడుస్తుంటే పిలుపు దగ్గరగా వినిపిస్తోంది, పదడుగులు వేసేసరికి గతుక్కుమన్నాడు. ఆ పిలుపు యిప్పుడు వింటుంటే యెక్కడలేని వుత్సాహం వచ్చేసింది. పరుగెత్తి ముందుకు వెళ్ళాడు. ఎత్తైన యిసుకదిబ్బ. వేడెక్కిన యిసుక దిబ్బ సగానికి యెగబ్రాకి యిసుకలో కాళ్ళు దూర్చుకొని పైకి యెక్కడానికి శక్తిలేని మల్లు, యెండకు కాళ్ళుమాడిపోతుంటే అయ్యకోసం బాధతో కేకలు వేస్తున్నాడు. పుల్లయ్య ఒక్క గెంతుగెంతి కొడుకును మీదికెత్తి గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు. తండ్రీకొడుకుల చెమటలు కలిసిపోయాయ్!

# 23

రోజుకు రోజూ పుల్లయ్య చిక్కిపోతున్నాడు ఎప్పుడూ తనకి అంటని విచారం నీడలా తన వెంటనే వుంటోంది ఊర్లో పనిపాట్లులేవు. కష్టపడి కర్రలు అమ్ముకున్నా జరుగుబాటు కావటంలేదు. తనతోపాటు పిల్లలిద్దరూ చిక్కిపోతున్నారు. ముందుకేంగతి అన్న ఆలోచన తననింకా పీడిస్తోంది.

నీలిమాత్రం మనసులో యెప్పుడైనా తప్పి జారి యిలాంటి ఆలోచన వచ్చినా వెంటనే సర్దుకుంటోంది. ఒక క్షణం వూరకపోకండా రాట్నం త్రిప్పటం, ఇంటిపనులు చేసుకోవటం సాగిస్తోంది.

సమయానికి వూర్లో అప్పుపుట్టకండా వుంది. ఇదివరకు వీళ్ళదగ్గర అప్పు తీసికెళ్ళిన వాళ్ళుకూడా "తీర్చడానికి యేం వుందని అప్పుయిస్తామని" పైకి అనకపోయినా, లోన అనుకొని లేదంటున్నారు. కోమటి పేరయ్యను ఒకపూట రెండడ్డలు బియ్యం అరువీయమంటే, ఇంటినుంచి బయటకు గబగబ వచ్చి "ఇంట్లోవుండి లేదంటే మాలాడిని" అన్నాడు. ఈ అంతరార్థం గ్రహించిన పుల్లయ్య చెప్పిన ఒళ్ళుమండి "నివ్వు లంకమాలాడివే" అన్నాడు. దానికి పేరయ్య వూర్లో నలుగురు పెద్దలతో చెప్పి నానాహంగామా చేశాడు. ముఖ్యంగా మల్లు చిక్కిపోతుండటం చూడలేకపోతున్నాడు. ఒక్కో పూట తిండిదగ్గర మల్లు అల్లరి చూసి "అయ్యో! నా కొడుకు యేపుగా యెదిగేటప్పటికి ఇలా వచ్చిందే కదా!" అని మనసు పరిపరి విధాల పోయేది.

ఊర్లో తనకు ఇదివరకున్న గౌరవంలో ఘూరోవంతైనా లేదు. వయసులో చిన్నవాడైనా యిదివరకు యే సంబరాలైనా గరిడీలైనా తనే నడిపించాలి. తనకు యిదివరకు మిగిలిన ధాన్యం అంతా యిలా ఊర్లో వినోదాలకు సంబరాలకింద ఖర్చుపెట్టడంవలన పెళ్ళికి అప్పుచెయ్యవలసి వచ్చింది. తను యిప్పుడు ఒక కూలివాడు. నలుగురి వ్యవసాయపు పనులు వాళ్ళు చెప్పినట్లు చేసి సాయంత్రం బుట్టపట్టుకొని కూలిధాన్యం కొలిపించుకోడానికి వెళ్ళాలి! తనే యీ పరిస్థితికొస్తే తన కొడుకూ కూలివాడే అవుతాడు గాని వూరికి ఘనం తెచ్చే పెద్ద యెలా ఔతాడు? ఈ తలపులన్నీ కలిసి తనను రాత్రులుకూడా బాధపెట్టేవి. ఏంచేస్తే తన కొడుకు యేపుగా పసందుగా పెరుగుతాడు? దొంగతనం చెయ్యగలడు – కానీ ఆ డబ్బు యెంతకాలం? ఆకలితో చచ్చిపోతాడుగాని అలాంటి పాడుపని చేయనని భీష్మించుకున్నాడు.

అప్పుడప్పుడూ మనసు చిరాకుతో కుమిలిపోయేది. నలుగురు పెద్దలనీ దుయ్యబట్టేవాడు. తన పొలంమీద యింకేం రాదన్న రాజిగాడి మీదకు వురక బోయాడు. చిన్నవాళ్ళు సహాయం చెయ్యలేరు. పెద్దవాళ్ళు ఈ కేకలవల్ల సహాయం చెయ్యకపోవటమేకాకండా యెలా వీడిచేత చిప్ప పెడ్దామని చూస్తున్నారు.

ఒకనాడు పీసయింటిదగ్గర వాదోపవాదాలయ్యాయి. గుడ్డి వెంకన్న “ఊరంతా పోగయితేగానీ రోజులు మారవ”న్నాడు. నాలుగు ఖూనీలైతేగానీ పేదోళ్ళకడుపులు నిండవన్నాడు. దానికి పుల్లయ్య కాదనలేదు.

పీస నవ్వుతూ “ఎవడో వచ్చి మన పిల్లాజెల్లని యెత్తుకొని పోలేదు మనం తలొంచడానికి, ఊళ్ళో పదుగురికీ ఆశ ఆకాశానికి అంటించాలని తాపత్రయం! నాయనా ఆకాశానికి అంతుటుందా? ఆశ దబ్బున ఒక్కసారి కూలిపోయి ముక్కలు చెక్కలై పోదా? ఓర్పండి నాయనా ఓర్పండి – ఓరిస్తే కోడిగుడ్డు. వీశెమూ సంపడ్డ పుంజవదా? ఓరిస్తేనే మనిషి! అలాగ ఓరుపుమీద వచ్చిన ఫలసాయం సాలాకాలం వుంటాది,” అన్నాడు.

ఇదేమీ నచ్చలే దిద్దరికి. ఊరు బాగుపడాలంటే యీలంతా సగానికి సగం ధరలు తగ్గించాలి. మంచిమాటలతో చేస్తారా? చెయ్యరని వీరి వాదన.

వెంకన్న ఇంటింటికీ వెళ్ళి చెప్తుంటే “అలవాకిటికి గెంజిపొయ్యమని యల్లకపోతే నీకు జరగదు. కళ్ళులేవు నీకెందుకూ, ఒకమూల పడుండక” అని సమాధానాలు వస్తున్నాయ్. వెంకన్న లోలోన “గొర్రెలు! వీళ్ళల్లో ఉడుకురక్తంలేదు” అనుకున్నాడు.

పుల్లయ్య యింటికివెళ్ళాడు. ఆ పూట పొయిలో అగ్గివేయలేదు. అది తెలుసుకొని కొడుకుయెదుట రాజిగాడిమీద, గ్రామపెద్దలమీద విరుచుకపడుతుంటే ముసలమ్మ అందుకుంది, “ఎందుకునాయనా నోరు జారేసుకుంటావ్? కొడుకు యెదరగా యిలా అని ఆ చిన్నమనసు పాడుచేయక, ఆలకీ నీకు తెలిసినంత తెలీదుగావాల– తెలిస్తే లేనోలకి సెయ్యిదులిపేవోరే. అయ్యో! నా అన్నలూ తమ్ములూ ఏం తీసుకపోతామనే మాటలేదే అని వాళ్ళమీద కనికారం చూపించు, నీ కడుపులో బుక్కెడుగంజి లేకపోయినా నిండినంత సుకంగా వుంటాది.”

పుల్లయ్య చర్రుమన్నాడు. "ఒకమూల కూర్చోక నీ కిదంతా యెందుకే!" అన్నాడు.

ముసలమ్మ శాంతంగా "నాయనా! మనసు వెర్రయిపోకూడదురా, మనసు వెర్రయిపోతే మనిషి లేడు. జరగవలసింది ఆపేదానికి నివ్వెవడవు? ఒకరు ఈ సెణం సేసిందాని మంచీ సెడ్డా మరికొన్ని సెణాలకి కనిపించిపోతాది. అలాంటప్పుడు యిలా నివ్వు అయిపోతే పాడయిందెవరు? మనిషికి అభిమానంకన్నా దొడ్డదింకేమీలేదురా" అంది.

పుల్లయ్య యీ మాటలు వినిపించుకోనేలేదు. కడుపు ఒకమూల మండిపోవటం మూలాన "నీకేం? ఆ పూటకి గంగో గడుగో మా కడుపులు మాడ్చయినా పోస్తోందికదా, యెన్ని మాటలైనా అంటావులే! నా పీకకి యిదొకటి సుట్టుకున్నాది" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

నిల్చున్న నీలి నిశ్చేష్టురాలైంది. ఏదో ప్రళయం వుందనుకుంది. ముసలమ్మ వేపు చూసేసరికి ఆమె బోసిపళ్ళనవ్వు మెల్లమెల్లగా వలకబోస్తోంది. కానీ నీలికి తెలుసు ఆ ముసలిగుండె కెంత సూటిగా ఆ మాటలు తగిలాయో? నిజానికి రెండు నెలలు పైగా సరిగా భోజనమేలేదు, రెండేసి రోజులకి జ్వరం వస్తుంటే పచ్చి మంచినీళ్ళయినా నోటిలో పోయటంలేదు. అలాంటప్పుడు భర్త అన్నమాటల్లో యెంత అబద్ధం వుందో ఆమెకు తెలుసు. ఆమె ఆ ముదుసలిని మొగుడుబదులుగా క్షమాపణ వేడుకోవాలని దగ్గరగా వచ్చి ప్రక్కన కూర్చుంది. మెల్లగా అతిమెల్లగా దీనంగా భయంగా మామ్మతో "ఎందుకో కోపంతో అనేశాడు.....మనసులో పెట్టుకోక మామ్మా!" అంది.

మామ్మ మెల్లగా తలత్రిప్పేసరికి మనుమరాలు కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినాయ్. ఆ నీరుచూసి మామ్మకళ్ళు తడిసిపోయాయి. మనుమరాలి తల నిమురుతూ మెల్ల మెల్లిగా ఆగి ఆగి మాటలు జారవిడుస్తోంది. నాలుగిరవైల జీవితసారం అంతా ఆ గుండెనుంచి వెళ్ళగ్రక్కుతున్నట్లుంది. "అమ్మా!....నాకు యెదుటోలిమీద సెడ్డగా సెప్పకోడానికి......సాలా ఉండేది. మీతాతమీదన్నీ – అయినా ఆ పెద్దోలందరిమీదా మంచే సెప్పకున్నాను – నాలికనుంచి కాదమ్మా గుండెనుంచే! అలాగ సెప్పకోని కష్టపడ్డానని పై వోళ్ళు అనుకోనీ – కాని తల్లీ, అలాగ అనుకోవడం సెప్ప కోవడంవల్ల నాకిప్పుడున్నంత సంతోషం సుకం యెవరికున్నాదే! లోకం అంతా కోడైకూస్తాది నాయంత కష్టం యెవరూ పడనేదని – కానీ నా అంత సుఖమైన ఆడది లోకాన వున్నదా? మట్టికుండనుంచి యీ చర్మంకుండలో పడేసుకుని యిన్నాళ్ళు బతికాను! ఇంకా కుండ పగిలిపోక యెంతకాలం వుండిపోతాది?" నీలికి ప్రతీమాటా హృదయానికి హత్తుకుంది. ఏమాటా ఆడకుండా ముసలమ్మను గట్టిగా హత్తుకొని ఆమె ఒడిలోనికి జారి ముఖం దాచుకుంది.

కొంతసేపయ్యాక, పుల్లయ్య చోడిపిండి పట్టుకొని వచ్చాడు. నీలి వంట ప్రయత్నంలో వుంది. పుల్లయ్యనిచూసి ముసలమ్మ నవ్వుతూ "నాయనా" అని పలకరించి అన్నది: "నివ్వెంత మంచోడివి కాకపోతే నా మనవరాల్ని అన్ని ఖర్చులూ పెట్టుకొని పెళ్ళాడినావు. నన్నూ సేరదీసి పెంచినావు. సచ్చి మనవరాలి కడుపులో

మొగాడినై పుట్టకవచ్చి నీ ఋణం తీర్చుకోనా?" పుల్లయ్యకు సిగ్గువేసి గదిబయటకు వచ్చేశాడు.

చీకటపడ్డాక కర్రలు అమ్మి పుల్లయ్య అప్పుడే వచ్చాడు. పీస మంచీ చెడ్డా మాటాడుతున్నాడు, ఇంట్లోవున్న హీనమైన పరిస్థితులు చెప్పకొచ్చాడేగాని బుక్కెడుగంజి పొయ్యమ్మా అని నాలికచివరకు వచ్చినా అడగలేకపోయాడు. వీళ్ళయింటిలో పరిస్థితి అంతబాగుండలేదని తెలుసు. వెళ్ళిపోయేముందు "అయ్యా పుల్లిగా, ఒక రేతిరిమీద నా యిల్లు తగలబడిపోయినా బాగుణ్ను! అక్కడే భూదేవి గజగజలాడి బద్దలయినా యింటంతా ఆలోమని సచ్చిపోదుము" అన్నాడు.

ఈ మాటలు నీలి విన్నది. వెళ్ళిపోతున్నవాణ్ణి పిలిచి "ఈ పావలా సోళ్ళుకొని అంబలైనా యీ రాతిరికి తాగండయ్యా" అని యిస్తుంటే పుల్లయ్య కొఱకొఱా చూస్తున్నాడు. ముఖం చేటంతచేసుకు పీస పరుగున వెళ్ళిపోయాడు. నీలి పీసవెళ్ళాక "నాను సెప్పాను – యిటికల పున్నంకి యిద్దరిపిల్లలనీ రెండిళ్ళల్లో కంచరితనానికి పెట్టమని, కడుపు మాడుతుంటే యింటిరాగటాసూస్తే యెలాగ? కష్టపడకండా ఆ లూరకనే యిస్తారా! ముందుకు పిల్లలుండగా సుఖపడడా?" అంది.

భార్యమాటల్లో అభిమానం పుట్టిపడగా పుల్లయ్య మాటాడలేదు, మిగిలిన డబ్బుతో పేరయ్య కొట్టుకు నీలి వెళ్ళింది. ఆ మరుచటిరోజు వుదయం ముసలమ్మ లేచి దేముడిమీద కీర్తనలు "రామ రాగవా – రచ్చించుము దేవా......రామ రాగవా!" అని పాడుకుంటోంది. మనుమడు దగ్గర కూర్చొని వెనకపాట పాడుతున్నాడు. మూడురోజులు పోయాక ఒకనాడు పొద్దు మీదికి లేవకమునుపే నడ్డి వంచుకొని ఇంటి ఇంటికి వెళ్ళింది. నలుగురి దగ్గర శలవు తీసుకుంటోంది. మళ్ళీ మిమ్మలినందరినీ నా మనువరాలి కడుపులో పుట్టి సూడనా అని చెప్పింది. రాజిగాడి ఇంటికి వెళ్ళి కూర్చుంటే మొగుడూ పెళ్ళాం చాలా అభిమానంగా చూశారు. రాజిగాడు అన్నాడు: "సూడే మామ్మా! పుల్లిగాడు మాటాడితే నామీద ఇరుసుకపడ్తాడు. నా అయ్య ఆ గుడ్డోడుట – నాకు పరువుమర్యాద లేదట! నేనేం ఆడికి అపకారం చేశాను. ఆడిని కైదులో పెట్టితే అదుకోలేదా? ఆడికి కడుపు మాడుతంటే బియ్యం కొలవలేదా? నాకైనా ఏం వుందే! ఈ నలుగురి పిల్లలకి వంతులేస్తే ఒక్కొక్కడికీ ఏం వస్తాది? ఆ పొలం మైనరుకొడుకున్నాడని ఎవురూ సూడకపోతే నావే తెగించి రాంచుకున్నానా? మంచిగావచ్చి అడిగితే రావలసినదేదో యిచ్చినా?"

ముసలమ్మ "నాయనా! ఎవరి మంచీసెడ్డా ఆలదగ్గిరే వుంటాదిరా? ఒకడి కడుపు మనం యెట్టిసేస్తే మన కడుపాకడు యెట్టిసేస్తాడు. మనం ఈ సంసారంలో కుడితికుండలో పడ్డ యెలకలా కొట్టుకుంటాం! పెమిదలో వత్తికి సరిపడ్డనూనె పోయాలా? ఆ నూనె డబ్బుకాదురా –అభిమానంరా! నా కంటికి నివ్వూ పుల్లయ్యా ఇద్దరూ వొకటే! ఇద్దరూ మంచోలే!" అంది.

వెళ్ళిపోయేటప్పుడు అంతదూరం సాగనంపగా ముసలమ్మ "నాయనా ఇంకెన్నాళ్ళుండిపోతాను? నివ్వు ఒక కొమ్ముపట్టావా?" అంటే రాజిగాడు ముసలమ్మ భుజంమీద చెయ్యివేసి "అంతా నాదేనే మామ్మా!" అన్నాడు. దోసిపళ్ళునవ్వు వొలగబడింది.

ఆ మరుచటి రోజు – నీలమ్మ గుడిబయట ద్వారంమీద తల ఆన్చి మొక్కింది. నదివేపు, వంతెనవేపు కంటికి కనబడ్డ ఆ వూర్లోవున్న అన్నిటివేపు చూసింది. ఇంటిదగ్గర వసారాలో కూర్చోని వీధిలో వెళ్ళివస్తున్న అందరిని పిలిచేది. చెప్పవలసిన నాలుగు మంచిమాటలు చెప్పేది. చిన్నా పెద్దలనీ తాకి దీవించేది – ముద్దులాడేది. అభిమానం కట్టలు తెంచుకుని యిలా వారం రోజులు గడిచింది. రాత్రుళ్ళు చాలాసేపటివరకూ వేకువజామున లేచి, వచ్చిన భక్తి కీర్తనలు పాడుకొనేది. "నాను పుట్టిన్నాడు ఉన్నావు – పెరిగిన్నాడూ ఉన్నావు – సచ్చిన్నాడూ ఉంటావు. లోకంలో మనిషైపుట్టి నేచెయ్యవలసిన పని నివ్వు చెప్పినట్లు చేస్తాను తండ్రీ!" అని సూర్యదేముడికి మొక్కింది!

ఆవేళ ఆకాశం అంతా మబ్బులు కమ్మాయి. సాయంత్రం వరకూ అప్పుడప్పుడు చినుకులు పడుతున్నాయ్. ఆరాత్రి దూరాన్న మెరుపులు అగుపించాయి. ముసలమ్మ జ్వరంతో ఒకమూల మూలుగుతూ పడుకున్నదల్లా చప్పున నడిరాత్రప్పుడు లేచింది. అంతా నిశ్శబ్దంగా వుంది. అంతా పడుకొని ఉన్నారు. లేచి తలుపుతీసి బయటకు వచ్చింది. దూరాన ఆకాశాన చుక్కలు మెరుస్తున్నాయ్. అక్కడక్కడా చిన్న మబ్బుతునకలు ఇటూ అటూ కదులుతున్నాయ్. ఆ చుక్కలు చూడగలిగే దృష్టి ఆమెకుంది. ఆ నిశ్శబ్దంలో...... ఒంటిగా..... వీధిగోడకు చారబడి కాళ్ళు చాపింది.... ఆ కొద్ది నిముషాల్లోనే మాగన్ను నిద్దరపట్టినట్లయింది...... ఏవో కలలు..... ఎవరో పెద్దలంతా అగుపిస్తున్నారు..... ఎవరో వచ్చి వెళ్ళిపోతున్నారు. ఆమె మొగుడు.... పోయిన సంతానాలు...... వీళ్ళూ వాళ్ళూ...... తనను పిలుస్తున్నారు, ఏవేవో పూలరథాలు...... గుర్రాలూ..... ఆకాశంమీద అగుపిస్తున్నాయ్..... ఇవన్నీ తన కోసమే అన్నట్లు వాళ్ళు చూపి పిలుస్తున్నారు.......

మళ్ళీ తెలివి వచ్చింది..... తెలివి వచ్చేసరికి దీపం...... ఆ వెలుగులో నలుగురూ గుమిగూడి ఉన్నారు....... మనుమరాలు ఏడుస్తోంది...... ముది మనుమడు మల్లు గోలపెట్టున్నాడు – మామ్మా అని పిలుస్తూ "కయ్" మంటున్నాడు. కళ్ళు తెరవగానే మనుమరాలు మరీ దగ్గరగా వచ్చి తలపట్టుకుంది. ఆ ముఖం ఇంకా నల్లబడిపోలేదని ఆ బోసినోటి నవ్వే చెప్తోంది. "అమ్మా...... తల్లీ..... నా నీలమ్మ....." ఒకసారి మనుమరాలి తల నిమిరింది. ఆ శుష్కించిన చేయి అభిమానంతో నిండిపోయి మనుమరాలి ఒళ్ళంతా తాకుతూ, ఆ మూసుకుపోతున్న కళ్ళల్లో చివరికి మిగిలిన నీరు ఆనందబాష్పాలై రాలసాగాయ్. "నా అమ్మా!" ఆగి మెల్లిగా..... అతి మెల్లిగా...... ఆగి మరీ ఆగి......"పెయ్యికాలితే...... కుండ ఎత్తేస్తాడు..... ఓర్పునేడమ్మా..... పుల్లయ్య! ఆ కుండ..... పడిపోకుండా.... కాయి తల్లీ!...... ఇంకేం యిస్తాను?" ఈ మాటలు చెప్తూ చెప్తూనే చివరిసారి కళ్ళు తేరి మనుమరాలి వేపు, పుల్లయ్య, మల్లు వేపు చుట్టూ చేరిన నలుగురి వేపు చూసింది. అందులో రాజిగాడు ఉన్నాడు. చిన్న నవ్వుతో అలా చూస్తుచూస్తూనే దేహాన్ని చాలించింది.

# 24

వరిచేలు పోరం పట్టుతున్నాయ్ మబ్బులు క్రమ్మి అప్పుడప్పుడూ వర్షాలు కురుస్తున్నాయ్. చలికాలం యింకా ప్రవేశించలేదుగానీ, వుండీ వుడిగీ కొద్దిగా రాత్రిళ్ళు చలివేస్తుంది.

ఒకనాటి రాత్రి... నడిరేయి చీకటి దట్టంగా ఉంది. ఆకాశం మబ్బులతో నిండి ఉంది. సంజీవి ఇంటి పెరట్లో ఒక్కసారి గోల వినపడింది. దొంగవాడి జుత్తు పట్టుకొని ఆ చీకటిలోనే సంజీవి నాలుగు తగిలించినా, దొంగ మాటాడకండా ముఖం క్రిందికి దించివేశాడు. పెళ్ళాం బుడ్డీదీపం వెలిగించబోతే గాలికి ఆరిపోయింది. చుట్టూ మనుష్యులు మూగిపోయారు. పుల్లయ్య, మల్లు కూడా పరుగెత్తారు.

మూగినవాళ్ళలో వ్యాఖ్యానాలు విసుర్లూ వరసగా వస్తున్నాయ్. "ఎవడో ఆ దొంగయెదవ – తన్నండి" అని మనిషో చెయ్యివేశారు. "మొన్న కట్టలో పెసలు వీడి పనే!" – "మా కోడిపెట్టలు వీడి పనే!" – "దొంగయెధవా! జరగకపోతే ముష్టియెత్తుకోకూడదూ?" – అంటున్నారు.

ఈ వ్యాఖ్యానాలు ఆడవాళ్ళ నోటివెంబడి కూడా వస్తున్నయ్! ఆ దొంగ మూడురోజులబట్టి ఆకలితో అలమటించిపోతున్నాడు. తనే కాదు, భార్యాపిల్లలు కూడా! ఇవన్నీ చూడలేక, భరించలేక ఆకలిపిచ్చితో అర్ధరాత్రి మీద దొంగతనానికి బయలుదేరాడు! సంజీవి పెరటి వంట యింటిలో దూరటం సులభం! చల్దిఅన్నం కుండలో గెంజిత్రాగి కుండ యింటికి మోసుకవెళ్తే పిల్లలు మరి రెండు పూటలైనా యీ భూమిమీద బ్రతుకుతారు!

కానీ దొంగ దొరికిపోయాడు! ఇన్ని మాటలూ ఈ దెబ్బలూ తనకు తగల్లేదు. అంతా కలలా ఉంది. పోరంలేని నరాలు చుట్టుకపోతున్నాయ్. అలా కూలబడిపోయాడు. కూలబడిపోతూ "ఆకలి ఆకలి" అని ఆయాసంతో అన్నాడు. సంజీవి దొంగ ఆకలి తీర్చడానికి మరి రెండు తగిలిస్తూ "వేసాలు వేసాలు – ఇలా కూలబడితే వదిలేస్తామనుకున్నావురా దొంగ నాయాలా" అంటూ రెట్టించి కాళ్ళతో తన్నాడు. దొంగ "అమ్మో" అని కెవ్వుమన్నాడు. పొరుగునే ఉన్న రాజిగాడి యింటినుంచి హరికెన్ లాంతరు వచ్చింది. ఆ వెలుగులో పీసముఖం చూసి ఓ క్షణం అంతా నిశ్శబ్దం అయిపోయింది. యుద్ధంలో బాణందెబ్బ తిని నేలకూలిన యోధునిలా ఉన్నాడు! నిజంగా ఈ పోరాటంలో ఆకలి జయించి నిర్దాక్షిణ్యంగా ఈ పీసవి నలుగురిలో యిలా కూర్చివేసింది – అయినా ఆ ఆకలిమంటలు మండుకపోవటం చేత చెయ్యి సైగచేస్తూ ఆయాసంగా "ఆకలి......ఆకలమ్మా...." అన్నాడు.

సంజీవి పెళ్ళాం గిన్నెలో అన్నంవేసి గంజిపోసి తెచ్చింది. ఉప్పు వెయ్యటం మరచిపోయింది తొందరలో పీస గడగడ త్రాగేశాడు. ఉన్న మెతుకులు నమిలాక 'అమ్మయ్యా' అంటూ ఒక్కసారి తలెత్తి చుట్టూవున్న వాళ్ళవేపు చూశాడు. దగ్గరగా మల్లు కూర్చున్నాడు. పుల్లయ్య, సంజీవి, రాజిగాడు.....ఊరంతా......! ఘొల్లుమని యేడవడానికి మొదలుపెట్టారు.....అక్కడ తను చేసిన పని జ్ఞాపకం వచ్చి దొర్లి దొర్లి

యేడవాలనిపించింది. ఇంతలో తుప్పలా ఉన్న తలపెట్టుకొని మాసిన చింకి బట్టలతో గోల పెట్టుకుంటూ వచ్చిన పెళ్ళంవేపు చూశాడు.

చూడగానే పిల్లలు జ్ఞాపకం వచ్చారు. తిన్నదంతా వాంతి చేసుకోవాలనిపించింది. ఇదంతా తనే చేశాడా అనే తలపుతో లేవబోయాడు. ఒంట్లో శక్తి కొద్దిగా కూడుకున్నా యీ తలపులు తనకు జాగిస్తున్నాయ్. పండు ముసలాడికన్నా అధ్వాన్నంలా తయారయ్యేడు. చుట్టూ చేరివున్న వాళ్ళవేపు చూశాడు. తను దొంగ! దొంగను వదిలివేయటం మంచిపనికాదు! దొంగకు శిక్ష పడకపోతే న్యాయం గంగలో కలిసిపోతుందని అనుకున్నాడు.

"ఒరయ్యా సంజీవీ!" అన్నాడు.

బాధతో కుమిలిపోతూ కళ్ళంట నీరు కారుస్తూన్న పీసవేపు చూస్తున్నారు. కళ్ళు తుడుచుకుంటూ "పంచాయితీ పెట్టించు! దొంగకు సిచ్చపడాలిరా!" అన్నాడు.

"ఎళ్లిపోరా, యేం సిచ్చ?" అన్నాడు సంజీవి.

"వద్దయ్యా! ఇప్పుడు సిచ్చ పడకపోతే – యముడు ఇనపకాకులచేత పొడిపిస్తాడు."

అక్కడ వాళ్ళెవరూ ఒప్పుకోలేదు. దగ్గరగావున్న అవుకట్టు పీస విప్పివేసి ఆ కన్నె సంజీవిచేతికిచ్చాడు. అవు కట్టుదగ్గరనుంచి కదలకండా ఈ మనిషి వేపు చూస్తోంది. వీపు సంజీవివేపు త్రిప్పుతూ "అయ్యా! ఆ కన్నెతో గట్టిగా నాలుగు వీపుమీద వేసే నాయనా!"

సంజీవి కన్నె ప్రక్కన పడవేయబోతుంటే "వేస్తావా లేదా?" అని అరిచాడు – ఇక లాభంలేదని మెల్లగా రెండు వేసాడో లేదో, మల్లు పరుగెత్తి సంజీవి కుడికాలు పట్టుకొని తొడదగ్గర కరువగానే దద్దరిల్లాడు. పీస ఆ కన్నె తీసుకొని తనంతతనే గట్టిగా కొట్టుకున్నాడు. వీపు కడుపు తట్లుదేరి పోయాయి. అప్పుడు ఆ కన్నెతో మళ్ళీ అవునుకట్టి దండంపెట్టి మెల్లగా ఇంటివేపు నడిచాడు.

తెల్లవారిపోయింది. పుల్లయ్యకు ఆరోజంతా మనసు మనసులో లేదు. కర్రలకు వెళ్దామంటే అక్కడా ఆశ లేకపోయింది. ముందుగా డబ్బు చెల్లించి మొదళ్ళు తప్పుకోమన్నాడు తోటకలవాడు. ఏమంటే ఎవడో డబ్బు యివ్వకండా మాయమయ్యాడు. నష్టం వచ్చింది. అంచేత అరువు లేదన్నాడు. అంచేత యేమీతోచక వూరుబయట వేపచెట్టుక్రింద కొడుకుని పట్టుకొని కూర్చున్నాడు. ఇంటికి వెళ్తే పస్తు. అక్కడవుంటే కొడుకును చూస్తూ నిరాశతో మనసు నిండుకపోతోంది. మాటిమాటికి రాత్రి పీసకు జరిగిన పరాభవమే జ్ఞప్తికి వస్తోంది.

ఆ రాత్రి నీలి అడిగింది: "బెంగగా అగుపిస్తున్నావు. మనసులో ఏం ఉన్నాది?"

"ఏమీ నేదులే" అన్నాడు.

అప్పుడు మళ్ళీ ఏ ప్రశ్నా వెయ్యలేదు. ముసలమ్మ లేకపోవటం ఏదో వెలితి కనిపిస్తోందని ఒకటి రెండుసార్లు పుల్లయ్యే అన్నాడు. అలా ఒంటిమీద అయ్య చేయివుంటేగాని నిద్రపోని కొడుకువేపు చూస్తుంటే, గతం అంతా జ్ఞప్తికి వస్తోంది పుల్లయ్యకు – ఆనాటిరాత్రి గరిడీ! ముసలాడిగా లేని ముసలాడు ఏమన్నాడు? "నా కొడుకు – ముచ్చటగా ముద్దుగా ఉన్న పాపడు నాలాగే గేరాగిరజాలు పెడ్తాడు. నలుగురిలో మెప్పు తెస్తాడు! దేనికీ జడవడు! నా కొడుకు – నా కొడుకు –"

అలా చేతిని నిమిరాడు. కొడుకు ముఖం ఆ లేతబుడ్డీ దీపపు వెలుగులో ఎంత ముచ్చటగా కనిపిస్తోంది. "నా కొడుకుని గరిడీలో ఘటికుడ్ని సేస్తాననుకున్నాను. దొంగల్ని పట్టే దొరని సేస్తానని – దోసిళ్ళతో దానం సేస్తాడని – మట్టిని నమ్మి సెమటకార్చి మా పరువు నిలబెడ్తాడని – అంత ఎత్తుకు యెగిరాను! నా కొడుక్కి ఏం వుంచాను? ఒంటిమీద గుడ్డపాతలేదు! కడుపునిండుగా గంజైనా లేదు! బువ్వ బువ్వని ఏడుస్తూనే పడుకున్నాడే – నా అయ్యా–"

అలా దుఃఖం యీ తలపులతో ముంచుకురాగా ప్రక్కనే చేరబడి కొడుకును చేరదీసుకుంటూ పడుకున్నాడు.

కొంతసేపటికిగానీ కళ్ళలో తడి తుడుచుకోలేదు. ఆ సమయానికి నీలి కూతుర్ని నిద్దరపుచ్చి దగ్గరగా వచ్చింది.

"ఏం అలాగా ఉన్నావు?"

జవాబు లేదు.

"నాలాగ నివ్వెలాగ ఉంటావు? ఏనాడు ఆకలంటే నీకు తెలిసొచ్చేదా? కష్టాలంటే నీకు ఏం తెలుసును? అందుకే అలాగ గాబరా పడిపోతున్నావు. కొన్నాళ్ళు కష్టాలు పడితే నీకూ ఓర్పు వస్తాది. ఇప్పుడు మనకంటే యెవురు సుకపడ్తాన్నారులే!"

ఈ చివరి వ్యాఖ్యానంతో పెళ్ళం వేపు వింతగా చూశాడు. ఆమె చిన్న నవ్వునవ్వి మొగుడివేపు చూస్తూ "ఎవరికితగ్గ కష్టాలు వారికి ఉన్నాయ్. మనకి పొలంలేక ఒక పూట ఉంటే ఒక పూట లేదు మరి ఆదెమ్మకు తినడానికేం లోటు? ఆ కడుపునొప్పితో బుక్కెడు గంజి తాగగలుగుతోందా? ఏమైనా ఏ కష్టాలైనా ఎంతకాలం వుండిపోతాయి? ఇవిగో కోతలు వస్తాయి. ఒళ్ళు గట్టిగా ఉండగా మనకేలభయం?" అంది.

అప్పటికీ పుల్లయ్య మాటాడలేదు. పరిస్థితి పోల్చుకున్న నీలి దగ్గరగా జరిగి "మాయమ్మ చెప్పింది – సెయ్యికాలితే కుండ ఎత్తేస్తావని! నా మొగుడు అంత దయిరంలేనోడా? ఆ దయిరం నీలోకి ఎప్పుడొస్తాదంటే నలుగురిలో నీ మంచి చూస్తేనే! అందరిలోనూ మంచీ, సెడ్డా రెండూ ఉంటాయి. నివ్వు యిదివరకు ఆలలోని మంచే తీసుకొనేవోడివి – ఇప్పుడు సెడ్డ తీసుకుంటున్నావు. అప్పుడు నీ మనసు ఎంత బాగుండేది – ఒకోపూట గరడీ సరదాలో తిండే మానేసేవోడివి! అప్పుడెలాగ ఉన్నావు? ఇప్పుడు ఒక పూట లేకపోతే బేజారెత్తి పోతావు! ఎంచేత! నాకెప్పుడూ యెలాగ బతుకుతామని పిరికిలేదు సుమా?" అంది.

పుల్లయ్య చల్లగా, మెల్లగా చెప్పుతున్న పెళ్ళంతో ఒక్కసారి "పీసలాంటోడే దొంగయితే......" అన్నాడు.

నీలి నెమ్మదిగా నవ్వింది. "అవును. తప్పెవరిది? పీసదే! పిల్లలున్నారు – నా గవుర్నమెంటోడు, పెద్దయితే నా పిల్లలని సూడడా అని – పెద్దోడ్ని సగం సదివించి పనీపాటుకీ పనికిరాకుండా సేశాడు? ఆడు కలెకటేరు ఎప్పుడై పోతాడు? మరి సిన్నోలని యెవరికింద కంబార్లుగా యేసినా ఏడాదికి పదిపుట్లు దాన్నెం తెచ్చుందరు."

"అదే సెప్పినావు? అంతబతుకు బతికాడు....."

"అయితే యిప్పుడు యిలా సచ్చిపోవటం మంచిదంటావా? వచ్చేయేడు మల్లు నలుగురి పశువులమంద కాయడా? నిప్పు పెద్దరైతు యింట్లో సేరావంటే యిరవై పుట్లు కొలవరా? ఏం సేసుకుంటారు?"

పుల్లయ్యకు పౌరుషం వచ్చి "నానా! పొన్నూర్లో బిచ్చం యెత్తుకుంటాను గానీ జాతోడింట్లో నౌకరీకి కుదురుతానే!" అన్నాడు.

అభినయంతో "అలాగంటే ఎలాగ?" పడుకున్నవాడు చప్పున లేచి "నాను పెద్ద ఇంటోడిని – పెద్దబతుకు బతికాను – వూర్లో పెద్దగానే ఉంటాను. అసలు నీనుంచే అల పనిపాటకి యెళ్తున్నానుగానీ......నాకు యీ కూలిపని అబ్బితే – నా కొడుక్కీ అదే అబ్బుతాది! పశువులుకాసే దద్దమ్మని సేస్తావా నా కొడుకుని? అడు దొంగల్ని పట్టే దొరొతాడు. నా పేరూ వూరిపేరూ నిలబెడ్తాడు!" అన్నాడు.

"అవును. ముందు తిని బతకాలా? సెట్టు పువ్వుపూసి కాయలు కాయాలంటే భూమిలో గత్తం వెయ్యాలా వద్దా? నీకు అంత పౌరుషం కొఅగాదంటాను."

పుల్లయ్య లేచి నిల్చున్నాడు. కడుపుమంటకు యీ మాటలు మరింత రాణించాయ్. ఇటూ అటూ అయిపోతూ "మా వంశం పౌరుషంగల వంశం. నాను పౌరుషంలోనే పుట్టాను. పౌరుషంతోనే సస్తాను. నీలీ! అలా సచ్చిపోతానుగానీ......దొంగతనం సెయ్యనే.....అడుక్కోనే.....!" అన్నాడు.

ఆవేశంతో మాటలు వేగంగా గట్టిగా రావటంలో మల్లు "బువ్వ" అంటూ లేచి కూర్చుని ఏడుస్తున్నాడు. పుల్లయ్య చప్పున కూర్చుని కొడుకుని పరుండబెట్టబోయాడు. కానీ "అమ్మా బువ్వే!" అంటూ కళ్ళు నులుపుకొని ఏడుస్తున్నాడు.

నీలి వక్షం ఉబికి పొంగిపోయింది. కానీ కొడుకు అయిదేళ్ళ వాడిప్పుడు......రెండేళ్ళ క్రితమే ఈ పరిస్థితి వస్తే కొడుకు ఆకలి తీర్చేది – పుల్లయ్య ప్రక్కకు తప్పుకున్నాడు. పడుకోబెట్టి ఇద్దరి చేతులూ కొంతసేపటి వరకూ వీపుమీద మెల్లగా పడితేగాని మల్లుకు నిద్దర పట్టలేదు. అంతసేపూ ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు. పుల్లయ్య చివరికి అన్నాడు: "ఇంక మిగిలింది అ కంచమే – రేపు పొద్దున యిచ్చీ!" అన్నాడు. నీలి మౌనం దాల్చింది.

## 25

నాలుగురోజులు గడిచాయి. ఆదెమ్మప్ప యింటి చుట్టూ జనం మూగిపోయారు. మనిషోమాట. "సావేనా రాదని" కడుపునెప్పితో బాధపడ్తున్న ఆదెమ్మప్ప యేడుస్తోంది. మనిషో సలహా చెప్తుంటే అల్లుడు విసుక్కుంటున్నాడు. పీసకూడా మధ్యన దూరాడు. జబ్బుతోనున్న కోడిపెట్టలా గిజగిజ గింజుకుంటున్న ఆదెమ్మప్పను చూసీ చూడటంతోనే "ఏయే! అల్లుడ్ని యిల్లరికం తెచ్చుకున్నావు! నీకు కష్టం వచ్చింది కదా! డబ్బుకు చూసుకుంటే ఎలాగనే! నీకు నోరులేదు ముండవి!" అన్నాడు.

"అరగని తిండి, జరగని మాటా అయిపోయింది. నా రాత నా రాత!" అని బాధతో తలబాదుకుంది ఆదెమ్మప్ప.

"రాతనేదు గీతానేదు, పట్టుకో నాలుగు వందలు, మూడురోజుల్లో మామ్మ్మాలు దానవు అయిపోతావు. నీకు యెలాంటోడినంటే అలాంటోడిని తోడిస్తాను. ఆ పుల్లిగాడున్నాడే – ఆడిముఖం సూడగానే ఆ డాక్టరు అసుపత్రిలో చేర్చేస్తాడు. ఇంతకీ అలస్యం సేసినావా సావే, ఒక్క కోతతో బాద నయం!"

"అమ్మో! కోతే!"

"ఎర్రిదానా! నీకు కోస్తన్నారని తెలుస్తాదా? బాదుంటాదా! ఢిల్లీకి పేరుపడ్డాది పెద్దాసుపత్రి! డబ్బు యిస్తేగాని తలుపులు కూడా తెరవ్వట. అందులో డాక్టర్లే – ఎముకలు యిరిగిపోతే అతికేస్తారు, మెదడు ఎరిగిపోతే మేకమెదడు పెట్టి మనిషిసేస్తారు. ఇశాపట్నం – ఇశాపట్నం – అంటే ఏమిటనుకున్నావు? అక్కడటా – మీరందరూ యానేవుంటారు అరుబారు – సిండియా కుంపెనీ – పిచ్చాసుపత్రి–ఇంక ఆకాశానికి అటుకుంటాయట మేడలు! సస్తే ఆ కళ్ళవైభోగం సూస్తావే! రేపే యెళ్ళు – బాదా నయం అయిపోతాది, పట్నమూ సూస్తావు!"

ఆదెమ్మ అల్లుని చూసింది. అల్లుడు ముఖం ప్రక్కకు తిప్పేశాడు. పీస మరింత గట్టిగా అభినయంతో – "అదిగో గారనాయుడు సుట్టుపట్ల వైదుగుల్ని సూసి యిసిగిపోనాడా? ఇశాపట్నం యెల్లిన పదిరోజులకి ముఖం డీలాగ అయి యెలిపోచ్చాడు. ఇప్పుడు ముదర గొర్రెపోతు మాంసం యియ్. ఈశెడు రెండుపూటలు సూసి తిన్నా కడుపులో నొప్పినేదు. దేనికేనా తెగింపులేని బతుకేం బతుకు? సూస్తూసూస్తూ డబ్బుకి ఆశపడి నిన్ను ఆ గన్నెమ్మ మొగుణ్ణి సంపినట్లు సంపేస్తాడు నీ అల్లుడు!" అన్నాడు.

ఈ చివరిమాట అంత మందిలో అనటంతో అల్లుడికి పౌరుషం వచ్చింది. "ఒరి పీసా, నోరు జారేసుకోకురా! నాలుగొందలుకాదు యెనిదొందలు తీసికెళ్ళమను, ఇప్పుడికి యెన్నొందలు కాలేదు, యెల్లనీ."

"అదిగోయే ఆదెమ్మ! అల్లుడొప్పుకున్నాడు. రేపే ప్రయాణం కట్టు, పుల్లిగాడు నివ్వు బతిమాలితే కాదనడు. కేవు నివ్వే కడ్తావు, తిండి పెడ్తావు. సత్రవులో దిగుతారు. పెళ్ళీగిళ్ళీ సేసినావుకాదా, అమాత్రం నీకింత సేయడా? తిరిగి వచ్చినప్పుడు సింహాదిరప్పన్నకి ఒక మొక్కు మొక్కి యెల్లిపోరాండి."

పీస మరి కాస్త హుషారుగా మాటాడి పుల్లయ్య యింటికి వచ్చాడు. ప్రయాణం విషయం చెప్పాడు. మల్లు ఎలా ఉంటాడనే బాధ! మల్లుని ఈ రాసనురోజుల్లో అక్కడికి తీసుకెళ్ళడానికి ఆదెమ్మప్ప అల్లుడు ఒప్పుకోడే. "అయ్యా, యెల్లినోడివి యెల్తావు. పట్నం అన్నిమూలలు భాగా సూసి! సిండియా కుంపెనీ – అరుబారు – ఎన్నో కుంపినీలు ఉన్నాయట – నెలజీతం వచ్చిన నౌకరీ చూసుకొని మరీ రా! నివ్వెల్లి అక్కడ ఉన్నావంటే నీ పక్కన నామూ ఏదో సిన్న పనిచేస్తాను."

"భాగా సెప్పినావ"న్నాడు పుల్లయ్య. మనసు చాలా వుల్లాసంగా ఉంది. నీళి పెరటినుంచి వచ్చి పలుకరించగానే పట్నం ప్రయాణం చెప్పాడు. ఓ క్షణం అయ్యాక పీస అన్నాడు: "అమ్మీ! నీ మాటలు ఇన్నాను గాదే. నీ మాటే యిమంటే ఆ అకలిదయ్యం నాకు పట్టి ఆడించేదా? అలనాడు ధర్మరాజు అబద్ధం ఆడినట్లు నాను యీనాటికి దొంగతనం సేశాను. పిన్నోళిద్దర్ని పశువులు కాయడానికి

యెట్టేశాను. పెద్దోడ్ని పట్నం పీడర్ని బతిమాలి అలింటిదగ్గరే పనికి పెట్టాను. ఆడు అలాగ అలింటి నౌకరీచేసి చదివితే నా గవుర్నమెంటోడు పెద్దోడైతే ఆడికి నెలజీతం వచ్చినపని యియ్యడా?"

నీల పీస మాటలుకు సంతోషంగా "మంచిపని సేసావయ్యా! కష్టపడ్తారు, తెచ్చుకుంటారు, తింటారు. దానికి సిగ్గెంధుకు పడాలి? పౌరుసాలు పెట్టుకుంటే బతకగలమా? అయ్యా! పౌరషంతో నీటిమీద యెన్న తీస్తామంటే అవుతాదా? గవుర్నమెంటోడు ఒళ్ళు ఒంగనోలకి యేం యిస్తే యేం నాబం? పనిచేస్తేనే పేణం ఉందంటారా, కూకుంటే పేణం ఉందంటారా? పేణం వున్నోలం బతకలేమా?" అంది.

పుల్లయ్య ఇంతసేపూ మిటుకు మిటుకమని నీలివేపు చూస్తున్నాడు. పీస చిన్న నవ్వుతో "అమ్మా! ఆ ముసల్ది బాగా నూరిపోసేసిందే! ఎంతైనా గుఱ్ఱం కడుపులో గాడిదపిల్ల పుట్తాదా? కడుపుమాడితే ఆ పౌరుషాలన్నీ ఆ అగ్గిలో పడి బుగ్గియిపోతాయే! అనుభవంతో సెప్తన్నాను. నీ మంచే నీకెక్కడి కెల్లినా కాస్తాది. ఈ పది గేమాల్లోనూ నీపేరెత్తితే సెడ్డోలే మంచయిపోతారే!" అంటూ లేచిపోయాడు.

పుల్లయ్య ప్రయాణం స్థిరమయ్యింది. కానీ మల్లు వస్తానని యేడుస్తున్నాడు. తీసుకపోదామంటే డబ్బులేదు. "ఆ డెందుకు అక్కడ రాసను కట్టుదిట్టంగా వున్నాదని" ఆదెమ్మప్ప అల్లుడు ససేమిరా వద్దన్నాడు. నీలి పెద్దరైతు యింటికి వెళ్ళి ఏదో పనిపాట్లు చేయటం, తీరికసమయాల్లో నూలు వడకటం చేస్తోంది, ఒక పూటకు ఉంటే ఇంకో పూటకు లేనట్లు బ్రతుకు సాగుతోంది. మల్లుకి మెల్లగా బోధపరిచాడు. మళ్లీ ఈ రోజుసరికి వస్తానని చెప్పాడు, అక్కడనుంచి బొమ్మలూ, బట్టలూ తెస్తానన్నాడు. చివరకు తల్లి వినకండా, నా నొచ్చి మీ అందరినీ తీసుకపోతా నన్నాడు. అందరం పట్నంలో పనిచేసుకొని హాయిగా ఉందామన్నాడు.

పట్నంవెళ్ళాక మల్లుకు రోజంతా అయ్యతలుపే. ఇంట్లో ఒకమూల కూర్చునేవాడు. భోజన సమయానికైనా లేచేవాడుకాదు. ఆకలేస్తే వంటింటికి వెళ్ళి ఉన్నగంజి సిలవరి గిన్నెలోనికి ఒంపుకొని గడగడ త్రాగేవాడు. వారం దాటిపోయింది. అయ్య రాలేదు. ప్రతిక్షణం అయ్యనుగురించి తలుచుకుంటూ ఒకోసారి "అయ్యా" అని యేడ్చేవాడు. వారం అల్లా పదిహేను రోజులయ్యింది. నిద్దట్లోనూ అయ్యనుగురించి పలవరింపే. ఏడుపు రానురాను హెచ్చియిపోయింది. వెళ్ళి రోడ్డుమీద కాసుకకూర్చునేవాడు! ఎంతసేపు చూసినా అయ్యజాడ కనపడేది కాదు. చీకటిపడినా కదలకపోతే తల్లి ఎత్తుకొని తీసుకవచ్చేది. తల్లి భుజంమీద కళ్ళు నలుపుకొని అయ్యా అని గోలపెట్టి యేడ్చేవాడు. ఇలా మల్లు చీపురుపుల్లలా అయిపోయాడు బెంగతో

ఒకనాటి సాయంత్రం పుల్లయ్య, ఆదెమ్మప్ప తిరిగివచ్చారు. ఆపరేషను లేకండా యేదో మందులిచ్చారు. పీస చాలా నొచ్చుకున్నాడు. "కోసేస్తే మళ్ళా దానివేషం వుండకపోను. మళ్ళా యెప్పుడో అగుపిస్తాది అయ్యా! పుల్లిగా నీ సొమ్మేం పోనాదిరా. ఒక సంచి ఆ డాక్టేరుకి తోసేవల్సింది. వెండిసెప్పు దెబ్బ తగిల్తేగానీ యీ రోజుల్లో యెవడు చూస్తాడు?"

పుల్లయ్య ఇంటికి వచ్చాడు. మల్లు తండ్రిని చూసి పెరటకు వెళ్ళిపోయాడు. కొడుకుముఖం చూడ్డానికి సిగ్గువేసింది, తనకు తెస్తాన్నవేవీ తీసుకరాకుండా వుత్తిచేతితోనే వచ్చాడు. ఐనా చప్పున వెళ్ళి యెత్తుకోగానే కొడుకు అయ్యను పట్టుకొని గట్టిగా యేడుస్తున్నాడు. ఓ క్షణం మాట రాలేదు. ఆ యేడుస్తూనే "అయ్యా, వుండిపోనావూ – వూ......" అంటున్నాడు.

"ఏడుస్తావా? అందరు యీయేళ రోజుకి అక్కడ ఉందాం."

"హో" అన్నా డొక్కసారి.

"మనవూరి పట్నం – మనం పట్టపోలం, అక్కడ రైళ్ళూ–"

"పట్నం....పట్నం.....అయ్యా, రైలా......రైలా....." ఏడుపంతాపోయి తండ్రివేపు చూశాడు.

"గుప్పు గుప్పమని అంటాది – మనం ఆ పెట్టెలో కూకనుంటే – పట్నం యెలిపోతాం."

"అయ్యా! బస్సునాగ ఉంటాదా?"

"బస్సుకంటా చాలా పెద్దది! నివ్వు ఏడిస్తే అగపడదు!"

"ఓ ఓ – యేడను......"

చంకదిగి గబగబ " మాం పట్నం పోతాం...పట్నం పట్నం....." అంటూ నులకమంచంమీదనున్న చెల్లెలిదగ్గర గెంతుతున్నాడు.

ఆ రాత్రి పీసతో తను చెయ్యదలచినదంతా చెప్పాడు. "పట్నంలో అంతమంది ప్రెజ ఉన్నారు. అన్ని కుంపీనీలున్నాయ్. ఎక్కడైనా నెలజీతం దొరక్కమానదు. కొడుకూ బాగుపడ్తాడు. ఇక్కడ కొన్నాళ్ళుంటే ఆకలితో సచ్చిపోవటమే కదా?" అన్నాడు.

పీస "మంచిదే నాయనా, ఎళ్ళు" అన్నాడు. మనిషి చాలా అతృతగా వుండి చిక్కిపోయినట్లున్నాడు. ఆ రోజుల్లో పుల్లయ్యకు ఈనాటి పుల్లయ్యకు యెంత తేడా? ఆ గేరాగిర్జాలు లేకపోతే పుల్లయ్య అని పోల్చుకోవడమే కష్టమయ్యేదేమో?

తెల్లవారేక ఊరంతా ప్రాకిపోయింది, పుల్లయ్య కుటుంబం అంతా యెత్తుకొని పట్నం పోతాడని. నలుగురూ నాలుగు విధాలు అనుకున్నారు. ఏందయిరం నేకపోతే యెలిపోతాడని కొందరూ, ఒళ్ళు వొంగనోలకి ఊరు అచ్చదని మరికొందరూ తలోలా అనుకుంటూ, కొంరదరు నీలిని పలుకరించటానికి వచ్చారు. నీలి సహజ శాంతం కనపరచింది. అంతే. కాని యెటువంటి వ్యాఖ్యానాలూ చెయ్యలేదు.

మధ్యాహ్నం అయ్యేసరికి కొడుకుతో సహా యింటికి వచ్చాడు. నీలి మెల్లగా అడిగింది: "ఊరంతా తెలిసిందిగానీ నాకు తెలియనే"దని!

దీనికి జవాబు చెప్పలేదు. మళ్ళీ ప్రశాంతంగా "ఏ ఆదరువూ నేకుండా వున్నూరు వదిలేటం మంచిది కాదు. పుట్టిపెరిగిన వూరు, అందరూ తెలిసినోలు. అపదకి ఒకరు కాకపోతే యింకొకరైనా అందుకుంటాడు. పట్నంలో యెవురికి యెవరు దిక్కు? నాకేం అని పది కాసులున్నాయి గనకనా! నా మాటిను........."

చప్పున పుల్లయ్య విసుగుబాటుతో "అందుకే నీకు సెప్పనే"దని లేచి వెళ్ళిపోయాడు.

వీధిలో పీస యింటిదగ్గర పదిమంది కూడి పుల్లయ్యపై ప్రశ్నలవర్షం కూరిపించారు. వీరందరికీ ఒకటే సమాధానం, "నా యిష్టం" అని పుల్లయ్య చెప్పగానే పీస నిల్చొని నలుగుర్నీ ఉద్దేశించి "ఒరయ్యలూ! మీ రంతా మన వూరో డొకడు ఢిల్లీకి పేరుబడ్డ ఆ పెద్దపట్నాన ఉంటాడని ముచ్చట పడకండా యిదంతా దేనికర్రా? మీకు తెలియదు, పట్నాల్లో యేం జరుగుతున్నాయో. మనం అంతా నూతిలో కప్పలం! అమెరికన్నోడట పెద్ద యిమానంలో సుక్కల్లో సెందురిడిదగ్గరకు వెళ్తాడట! అక్కడికి నువ్వూ నేనూ ముందెళ్తామా! పట్నంలో వున్న పుల్లయ్య ముందెళ్తాడు." పుల్లయ్యవేపు తిరిగి "ఒరయ్యా పుల్లిగా! అక్కడ ఈ యెళ్ళినోలందరూ యిక్కడలాగా యెవుడిబాగు వాడిబాగు అనుకోకూడదు సుమా! ఇప్పుడు సిక్కిపోయినా ఒకనాడు కండగలవోడిని, మనిషిని కానా? అక్కడ సెందురుడిలోను యిల్లూ వూళ్ళూ కట్తారు కాదా? అక్కడ నీకష్టం అందరి కష్టం, నీ సుఖం అందరి సుఖం. నా పిల్లలూ, నీ పిల్లలూ, వాడిపిల్లలూ – అంతా అందరిపిల్లలే! ఆస్తి అంటావా, కొందరిది కాదు – అందరిదీను. మనిషి జాతంతా ఒకటే జాతి? అలాంటి గవుర్నమెంటోడు అక్కడ వచ్చినట్లు సెయ్యాలి," అన్నాడు.

మల్లు యెంతో తెలిసినట్లుగా "తాతా! తాతా!" అని గెంతాడు నవ్వుతూ.

"మామా, పట్నం పోతాం!"

ఆ సాయంత్రం వెళ్ళి నీలమ్మ గుడిదగ్గర ఒంటిగా కూర్చున్నాడు. కొడుకు వీధిలో పిల్లలతో ఆడుకుంటున్నాడు. "దాసుడు వుంటే యేం సెప్పేవాడో! తల్లి దీవనలు యిచ్చి పంపించేది, మా తల్లికి అలనా పాలనా లేదే! అయ్యో! గేమం అంతా యిలాగే దేముడు, దెయ్యం అనే భయం లేకుండాపోయిందే! ఎవడి సేతి కందింది వాడిదే. పొరుగున ఒకడు కడుపుమాడి సస్తున్నాడనే కనికరం లేదు. నీతీ నిజాయితీ యెక్కడికి ఎగిరిపోయినామో! నాయంగలవోడు పెద్దకాదు. డబ్బున్నోడు పెద్ద. ఆడికే నలుగురూ కొలుస్తున్నారు. యీలాంటివూరు యెంత తయారైనా ఎందుకు తనుండాల? ఇక్కడ నాకు పాయసం దొరికినా వుండను. నాయంవున్న స్థలాన బుక్కడు మంచినీరుమీద బతికితేం?

"పట్నం పోతాను. మళ్ళీ మొదటి పుల్లయ్య నైపోతాను. నాయం నీతికి కట్టుబడి మల్లునాయుడి కొడుకుగాను, మల్లు అయ్యగాను, గంజిత్రాగి హాయిగా ఇంటా బయటా మెప్పుతో బతుకుతాను." పట్నంలో తన ఉద్యోగం, అక్కడ బ్రతుకు గురించి ముచ్చటగా తలచుకున్నాడు. సంతోషంతో మనసు నింపుకున్నాడు, నీలమ్మతల్లినీ, దాసుడుగురించీ తలుచుకున్నాడు. తల్లిని యిక్కడెందుకు, పట్నంలో పెద్ద సంబరం అవునే! మాయమ్మ నివ్వెంత పల్లని తల్లివే!... యిలా చీకటిపడిపోయింది. నీలమ్మ తల్లికి మొక్కు మొక్కుదామని లేచాడు. తలుపుసందులోనించి చూశాడు, దీపాలు వెలిగినట్లున్నాయ్! దాసుడు ఆ లేతదీపపు కాంతిలో కూర్చుని, మౌనంగా వూగుతున్నట్లనిపించింది! దాసయ్య సచ్చిపోయినా తల్లిని వదల్లేదా? ఒళ్ళు పులకరించింది. మనసులో "అయ్యా! దాసయ్యా! పట్నంపోతాను. దీవించరా?" అని అడుగుతున్నాడు. వెంటనే సమాధానం. "నాయనా!" అన్న పిలుపు తనలో మారుమోగింది. కూర్చుండిపోయాడు. తన ఉనికి మరిచిపోయాడు. కంటికి నీలమ్మతల్లి......దీపాలు అంతా అగుపిస్తున్నాయ్. దాసుడు మౌనాన్ని వదిలి "నరుడా"

అన్న కేకవేసినట్లు వినిపించింది. సాష్టాంగపడిపోయాడు పుల్లయ్య. "వెళ్ళరా వెళ్ళు! పిచ్చివాడా! నేను యీ వూర్లో యీ గుడిలోనే ఉన్నాననుకుంటున్నావా? నీలో లేనూ? ఇప్పుడు తిట్టినవాళ్ళందరిలోనూ - యెక్కడ లేనురా? యెళ్ళరా యెళ్ళు - మానిందే మందు, బతికిందే వూరు."

ఇంతలో 'అయ్యా' అన్న కేకలు వినిపించసాగినయ్. తలుపు సందులోనుంచి చూశాడు. ఏ దీపాలూ లేవు. చీకటిగా వుంది. విగ్రహాలైనా అగపడలేదు. అంతా ఒక కలలా వుంది. ఆ చీకటిలో భయం భీతి లేకుండా ఒంటిగా "అయ్యా" అనుకుంటూ గుడిదగ్గరకు వచ్చిన కొడుకును చూశాడు. సంతోషంతోను అభిమానంతోను ఒళ్ళు పులకరించసాగింది. కొడుకును గట్టిగా హత్తుకొని ముద్దులాడాడు.

# 26

పట్నంలో ఇల్లూ, వాకిలీ, ఉద్యోగం సద్యోగం చూడకుండా అంతా లేచి వెళ్ళిపోవటం నీలికి నచ్చలేదు. మొదట పుల్లయ్య వెళ్ళి కొన్నాళ్ళుండి పనిపాట్లు చూసుకొని వస్తే అంతా వెళ్ళిపోతే బాగుండేదని నీలి అభిప్రాయం ఇచ్చింది. మల్లు అయ్యను వదిలి వుండలేదు. ఒంటిగా పుల్లయ్యపోతే వేళకు తిండివుండదు. అదీకాకుండా ముసలమ్మ కళ్ళు మూస్తూ అన్నమాటలు జ్ఞప్తికి రావటంవల్ల నీలి ఖరారుగా యేమాటా చెప్పలేకపోయింది.

చీకటిపడి చాలా సేపయ్యింది. ఒంటిగా వీధి అరుగుమీద నీలి కూర్చుంది. ఆమె ఆలోచనలో పడేదేకానీ గుడ్డి వెంకన్న, గన్నెమ్మ కలసి వాకిట కూర్చొని మాటలు కలిపారు. ఇంతలో పుల్లయ్య కొడుకుతో సహా వచ్చాడు. మల్లు అయ్యచేసిన గొప్పతనాన్ని తల్లితో చెప్పడానికి అభినయంతో ఉపక్రమించాడు. నీలి గతుక్కుమని "నవ్వుతున్నావా? ఆలతో యిరోదం ఎందుకు తెచ్చుకున్నావు?" అంది.

"తెచ్చుకోనూ! ఆడిరక్తం తాగుతాను."

"అవేం మాటలు? ఎందుకు పులిలాగా అయిపోతావు? ఆ రాజిగాడు మనకేం పెద్ద అన్యాయం చేసినాడు?"

"సెయ్యలేదా? సగానికి సగం యిచ్చి అంత పొలం పొట్టలో పెట్టుకుంటానంటాడు, ఆడి పేగులు లాగి తీసుకోను నా పొలాన్ని!"

"సెబాష్‌రా అయ్యా!" గుడ్డి యెంకన్న అందుకున్నాడు. నీలి దీనంగా "అయ్యా! నివ్వూ అలాగే అంటావా? ఆడిపెళ్ళాం అడక్కుండా వచ్చి డబ్బిచ్చి కైదునించి ఇడిపించింది. మామ్మ సచ్చిపోతే ఆ రాజిగాడి వచ్చేనా అంతా సేసినాడు. ఆదు మనకేం దగ్గిరోడు సేయటానికి? ఆమాత్రం మనకు ఇస్వాసం నేకపోతే మనుసులం అని ఎలాగ అనుకుంటాం?"

"అమ్మీ, అందర్నీ మంచాలంటావే నివ్వు. పెపంచకంలో అంతా మీలాంటి అమాయకమైనోలు ఉండరే! ఆడా! కక్కులకళ్ళెం......ఈదంట యెల్లేవాళ్ళ గుండార్లులాగుతాడు."

నీలి అరుగుమీదనించి లేచి "మీ తల్లీ తండ్రికి దండమెడ్తాను. మన కెందుకు కోపం? పెదాలకి సేటు. అంతా నాకొదిలెయ్యండి. అడిగినట్లు అడిగితే ఏమంటాడు?" అంది.

"మూతిమీద కొడ్తాడే!" పుల్లయ్య అందుకున్నాడు.

"ఒళ్ళంతా ఉండగా మూతిమీదే కొడ్తాడే? అయినా అడదాన్ని – కొట్టడానికి ఆడిసేతులు రావులే!" అంటూ నీలి పెరటకు వెళ్ళిపోయింది.

అంతా ఆ క్షణం వూరుకున్నారు. వెంకన్న, గన్నెమ్మ చాలాసేపటివరకు అక్కడే కూర్చున్నారు. చీకటిరాత్రి గిన్నెలోని మెతుకులూ గంజీ వెంకన్న ముట్టుకోలేదు. గన్నెమ్మ లేచి వెంకన్నను పట్టుకుని భజనమందిరం దగ్గరకు తీసుకవెళ్ళింది. ఆ దగ్గరగానే రాజిగాడి యిల్లు. వెంకన్నకు నిద్దర పట్టలేదు. గోడకు చారబడి ఏదో ఆలోచిస్తున్నాడు.

చీకటి... వూరంతా యీ చీకటితో ముసుగు వేసుకుంది. గన్నెమ్మ వెంకన్న గిన్నెలోని అన్నం దొంగతనంగా తడిమి ముద్దకు ముద్ద నోటిలో కుక్కుకుంటోంది. అన్నం నమిలితే చప్పుడౌతోందని మింగేస్తోంది. కానీ చిన్న చప్పుడౌతోంది. ఈ చిన్న శబ్దానికి చెవులు రిక్కించగలిగిన వెంకన్నకు ఇప్పుడీ చప్పుడు వినపడలేదు. మనస్సంతా పుల్లయ్య – రాజిగాడి తగువుమీద కేంద్రీకరించుకపోయింది.

అర్ధరాత్రి... అంతవరకూ మనసు పరిపరివిధాలపోయింది. పొరపాటునైనా కునుకుపడలేదు. ఎందరినో తలుచుకున్నాడు. ఎన్నో అనుకున్నాడు. ఎంతో జ్ఞాపకం వచ్చింది. నీలమ్మ తల్లీ అని మ్రొక్కుకున్నాడు. దాసయ్యని తలచుకున్నాడు. "నాకొక నెల కళ్ళు కనిపించనీ తల్లీ!" అన్నాడు. రానురాను ఆ కోరిక ప్రబలమైపోయింది. ఉద్రేకంతో "ఒక నెల కాదే, ఒక వారమే..... వారం కాదే......ఒక రోజేనా యీయవా తల్లీ!....... నిద్దరపోతున్న వూరిని లేపేద్దునే! ఈ గొత్తెలని పులుల్ని చేస్తాను తల్లీ!.....ఒకరోజు కాదే......ఒక గంట యియ్యి తల్లీ.......ఒక గంటైనా యీయనా? ఈ అన్నాయాన్ని తుడుస్తాను......ఒక గంటమ్మా....... ఒక సెణం తల్లీ!" అన్నాడు.

లేదు, నేత్రదృష్టి రాలేదు. ఆవేశంతో వెంకన్న కళ్ళు నీటితో నిండిపోయాయి. జలజల నీరు కారసాగింది. ఎగవూపిరి తీశాడు. ఒంటిమీదనున్న ఒకే గుడ్డపీలికతో మెల్లగా కళ్ళు తుడుచుకొని నవ్వుకున్నాడు.

చీకటి – కటిక చీకటి – ప్రకృతి గాఢంగా నిద్రపోతోంది. మెల్లగా తడిమాడు. చేతికర్ర దొరికింది. లేచాడు. ఊహకొద్దీ రాజిగాడి యింటివేపు రెండడుగులు వేశాడు. ఏదో చప్పుడైనట్లుంది. ఎవరదని అడగాలనుకున్నాడు. కానీ మెల్లగా వెనక్కి తిరిగి భజనమందిరం అరుగుమీద కూర్చున్నాడు. ఓ క్షణం కూర్చున్నాడు. చప్పుడు లేదు. తడుముకుంటూ గన్నెమ్మను లేపాడు. ఎంతో నిద్దరపోయినట్లు ముసలిది లేచింది.

"హుష్! నివ్వు నాకో మేలు సెయ్యాల." మెల్లగా గొణిగాడు.

"నే నేం సేస్తాను?"

"రాజిగాడు దాన్నంకొట్టు అరుగుమీద కాపలా కాస్తాడు. మెల్లగా అడుగువేసి నిద్దరోనాడో లేదో సూసి రాయమ్మ తల్లీ, నీకు మొక్కుతాను."

"నా నెల్ల నమ్మో! దొంగతనానికి వచ్చినావంటే?"

"ముండా! ముందు ఆ గిన్నెలోని అన్నం తినీ....ఈ యేళ నాను సెప్పినట్టు యిన్నావంటే నాకు దొరికిందానిలో రోజూ సగానికి సగం నీదే!"

వెంకన్న మాట అన్నాడంటే నిలుపుకునే మనిషని ధైర్యం ఉన్న గన్నెమ్మ గిన్నెలో మిగిలిన గంజి గడగడ త్రాగేసింది.

నడ్డివంచుకుని మెల్లమెల్లగా అడుగులు వేస్తూ చూసింది. టోకుర్లు తీసుకొని ఒంటిగా రాజిగాడు కొట్టు అరుగుమీద నిద్దరపోతున్నాడు. పశువులు సాలలో పడుకున్నాయి.

వెంకన్నకు ఈలోగా ఎన్నో ఆలోచనలు వచ్చాయ్. ఇంటికి అగ్గిపెట్టామనుకున్నాడు. వాడి రక్తం త్రాగుదామనుకున్నాడు. చంపాలనుకున్నాడు.

ఇంతలో తనలో ఎవరో ప్రశ్నించారు. వాడెవడు? రాజిగాడెవడు? నీ కొడుకు కాదూ? కొడుకును సంపుతావా?.... ఆడిరక్తం త్రాగుతావా?.....సూరమ్మకు ఆ రాత్రి ఏం సెప్పావ్? దాని దగ్గర ఏమని ఒప్పుకున్నావ్? అది నిన్ను సెమిస్తాదా?

లేచి ఇటూ అటూ గాబరాగా తిరిగాడు. సెడ్డోడు కొడుకైతేనేం? ఆ సల్లని తల్లి నీలమ్మ యింటికి నిప్పెట్టాడు. బుగత భూములు కొనేసినాడు - స్వంతభూమి దగ్గరెట్టుకొని అన్నాయం చేసినాడు - ఇచ్చిన డబ్బుకి ఇల్లు యిస్తేగాని సాలదని......అల్లని సెట్టుకింద పచ్చుల్ని సెయ్యాలని సూస్తున్నాడు.....ఆడు మనిషేనా.... ఆడు నా కొడుకేనా? కాదు - కాదు......!

గన్నెమ్మ వచ్చింది. వెంకన్న ఆమె సహాయంతో మెల్లగా కొట్టు చేరుకున్నాడు - గన్నెమ్మ గబగబ వెనక్కి నడిచింది. భజనమందిరం అరుగుమీద పడుకున్నట్లు అభినయించింది.

వినిపిస్తున్నాయ్ టోకుర్లు. గాఢనిద్దర్లో ఉన్నాడు. చేతులు మెల్లగా రాపాడించాడు. చేతులతో ముఖం ఒకసారి తుడుచుకున్నాడు. అభిమానాలన్నీ ఆశయం యెదర మండుకపోయాయి. శరీరమంతా కర్తవ్య నిర్వహణలో ఉబ్బెక్కి పురకలు వేసింది. చీకటి - ఆ చీకటిలో కళ్ళు నిజంగా కనిపించినట్లయింది. జంతువు యెదురుపడ్డ మృగరాజయ్యాడు. ఒక్క ఉరుకు ఉరికాడు. "నాకు లేపకండా సేసావ్! లే.....లే.......లేరా నా కొడుకా!"

రాజిగాడు తెలివితెచ్చుకొని ఘీంకరించాడు. మీదికి లేవబోతే వెంకన్న జుత్తు పట్టుకొని అలా క్రిందనే వుంచాడు. "రండ్రో" అని అరిచాడు రాజిగాడు. గింజుకుంటున్న వాడి ముక్కుమీద తీసి ఒక్క గుద్దు గుద్దాడు. రక్తం బొడబొడా కారదొచ్చింది. ఆ రక్తంచుక్క బొట్టు పెట్టుకొని "నా కొడకా! నీ యమ్మ ముకం సూసానురా! లేదా అంటే ఈ సెణానికి యమలోకాన్న ఉందువు!"

దీపాలతో నలుగురూ చుట్టుముట్టారు. వెంకన్నను నలుగురూ పట్టుకున్నారు. బంధింపబడిన సింహం గర్జిస్తోంది. "పుల్లయ్యలాంటోల బతుకు లెందరివి కాలుస్తావురా? వదలండీ! ఇంకో గుద్దు గుద్దుతాను. తెలివొస్తాది..... .నా కొడుక్కి తెలివొస్తాది!"

"నీ కొడుకున్రా...." అని ఘీంకరించాడు రాజిగాడు. రక్తం కారుతున్న ముక్కుకు గుడ్డ అడ్డుపెట్టి పరుగెత్తి వచ్చి కడుపులో ఒక్కతాపు తన్నాడు, 'గయక్' మంటూ వెంకన్న నేలకు ఒరిగి కూలిపోయాడు. అంత మందిలో "గుడ్డోడిమీదరా నీ బలం" అని యెవరూ అనలేదుగాని అప్పుడే వచ్చిన పుల్లయ్య అన్నాడు. సరి, ప్రజల్లో

గుసగుసలు బయలుదేరాయ్. రాజిగాడు రౌద్రంతో "నాకు తెలుసురా పుల్లిగా! ఊరంతా తెలుసురా – యీ పని యెవుడు చెయ్యించాడో! ఇది వూరుగాని అడివికాదు. ఇక్కడున్నోలందరూ, సాక్ష్యం – రారా! రేపొద్దున్న పోలీసులు వస్తే యెవురు కైదులోకి యెళ్తారో చూస్తారు!" అన్నాడు.

తెల్లవారింది. "ఎవరి మద్దత్తు లేకపోతే గుడ్డాడికి అంత సాహసం వస్తా"దని వూరిలో చాలామంది అన్నారు. "ఆ పుల్లిగాడికి పోయేకాలం వచ్చింది. అసలు పొలంలో రాజిగాడు యేరు ఇప్పినదగ్గరనుంచీ ఎలాగ యీడిమీద కక్ష సాధించుదామని చూస్తున్నాడు. ఆడి నొసట కైదు రాసుంటే పట్నం యెందుకు పోతాడు?" "పెజల్లో సెడ్డయ్యాడు. దానిమంచి యెంతకాలం కాస్తాది?" ఇలా తలోలా వ్యాఖ్యానాలు చేస్తున్నారు. పుల్లయ్య కదల్లేదు. అంతా విని తెలుసుకొని నీలియే మాటాడలేదు; భజనమందిరం దగ్గర తిండిలేక కడుపులో రాత్రి తగిలిన తాపువల్ల నొప్పితో గిలగిల వెంకన్న గింజుకుంటున్నాడని తెలిసింది. నీలి వెంటనే గిన్నెలో తను త్రాగకండా గంజి అన్నం పోసుకొని వెళ్ళింది.

"అయ్యా!" అని పిలిచింది.

నీలిమాట విని సిగ్గుపడినా, నులుచుకుంటున్నవాడు లేచి కూర్చున్నాడు. దగ్గర కూర్చొని కడుపుమీద చెయ్యివేసి "పాపం! వాసిపోయిందే" అంటూ చెయ్యితో రాసింది! గుడ్డి వెంకన్న కళ్ళల్లో నీరు తిరుగసాగింది. యెదురుగా గిన్నె పెట్టి చెయ్యి అందులో పెట్టింది. ఆకలితో వున్నాడేమో గబ గబ ఆ మెతుకులు నమిలి గంజి త్రాగాడు. ఇప్పుడు నీరు కడుపులో పడిందేమో ఉధృతంగా యేడుపు వచ్చేసింది, ఏడుస్తున్న యీ సింహాన్ని చూచి కళ్ళల్లో నీరుబికినా, ఓదారుస్తూ "ఏడవకయ్యా! నిన్నటిలాగా యీ వేళ నువ్వున్నావా? నిన్నటిలాగ వుండాలన్నా వుండగలవా? అలాగే అందరి బతుకులూ? ఈ వేళ చెడ్డని ఒకర్ని సంపేస్తే రేపు మంచి అనకండా చేస్తాం! సంపి మనం మరింత సెడ్డ అవడం దేనికి? నీలాంటోలకి నాలిక మంచైతే వూరు మంచవుతాదయ్యా!" అంది.

వెంకన్న దుఃఖం యింకా ఉపశమనం కాకపోవటంవల్ల మాటాడలేదు. కొంతసేపు కూర్చున్నాక గన్నెమ్మ వచ్చింది. "మామ్మా! ఇక్కడే పడుకున్నావు కదా! ఒద్దనైనా సెప్పలేకపోనావా? ఇనకపోతే నన్నేనా పిలిసినావుకాదు. సూడు, కడుపు యెలాగైపోనాదో? నూన పిసరు తెస్తాను. రాస్తే వాపు తగ్గుతాది."

నీలి మాటలకు గన్నెమ్మ గతుక్కుమన్నా "బాగుపడేవోళ్ళకి ఒకరు సెప్పాలా? పాడయ్యేవోలకి వొకరు సెప్పితే బుర్రకెక్కుతాదా? నానేమయ్యాను....రాత రాతే తల్లీ!" అంటూ ఇంకేంమాటలు వస్తాయేమోనని అక్కడనించి నడ్డివొంచుకొని వెళ్ళిపోయింది.

ఇంతలో సంజీవి అలాపోతూ "నీలమ్మా! ఆ గుడ్డి నాయాలనా కనికరిస్తున్నావు? అదిగో రాజిగాడు నాయుడు ఇంటిదగ్గర యేం చేస్తున్నాడో సూడు! పోలీసులొస్తారు. పుల్లిగాడికి రోజులు బాగులేవు," అన్నాడు.

గుడ్డి వెంకన్న చట్టుక్కున "రానీ అయ్యా రానీ! ఇందులో యెవురు దొంగతనం సెయ్యనేదు – రంకుతునం సెయ్యనేదు. నిజం సిలకడమీద తెలీదా?" అన్నాడు.

"నివ్వు ఆడిని సంపేద్దువే – నిజం యేంటిరా గుడ్డోడా నిజం?" అంటూ దగ్గరకు తోసుకొచ్చాడు.

వెంకన్నకు మనసు మండి గట్టిగా "ఎలాంటోడు పుల్లయ్యని కైదు పెట్టిస్తాడో నాను సూస్తాను," అన్నాడు.

"నివ్వేం సేస్తావురా? ఊరినుంచే నిన్ను తగిలెయ్యాలని సూస్తుంటే!"

"నలుగురి పీకలు తీసి మరీ వూరు కదుల్తాను."

నీలి మెల్లగా జోక్యం చేసుకొని "ఎందుకయ్యా యీమాత్రం దానికి పీకలు తీసుకోవటం! కర్ర వంకర పొయ్యి తీర్సాలిగానీ నీ సేత యేవున్నాది?" అంది.

వెంకన్న చప్పున "మనం ఆ కర్రని పొయ్యిలో పెట్టొద్దే కూతురా!" అన్నాడు.

"ఆ కాలం వస్తే ఆ కర్రే పొయిదగ్గరకి వస్తాది. ఆ దేముడే దానిని తగినోడిసేత పెట్టిస్తాడు."

"ఆ తగినోడ్ని నానే కూతురా! అడి అయ్యని!"

"అయ్యా, పరిగెత్తి పాయసం తాగేబదులు కూకొని మంచినీరు తాగితే ఒంట పట్టాదంటారు. ఇలా తొందరపడ్తే వచ్చిందేమీలేదు. వచ్చినా ఎంతో కాలం నిలవదు. ఏ పని చేసినా యెదుటోడు గురించి కొంచం తలసాలంటావా? మళ్ళీ వస్తాను. నూనెరాస్తే వాపు తగ్గుతాది" అంటూ వెంకన్నకు మరి మాటాడే అవకాశం యీయకుండా వెళ్ళిపోయింది. సంజీవి కదులుతూ "ఆ కళ్ళుంటే......" అంటూ వెళ్ళిపోయాడు.

ఇంటికి చేరుకుని ఆ పుల్లిగాడ్ని ఇల్లా చేస్తాన్ అలా చేస్తానని నోరు చేస్తున్న రాజిగాడ్ని చూసి పెళ్ళం మెల్లగా "నీకు మతినే"దంది. "నాకా!" అంటూ ఆగి వెంటనే "ఏవేఁ, అలాగంటున్నావ్" అన్నాడు.

పెళ్ళం విసుక్కుంటూ "నాకేంటి, మీసం గలవోడ్ని – ఎద్దుతోనైనా పోట్లాడతానంటవ్? ఆ వెంకన్న నీ వూరునుంచి తగిలేస్తానంటావ్? ఆ పుల్లయ్యని కైదులో పెట్టేస్తానంటావు!" అంది.

"ఊరంతా నా పక్క వున్నారు. నాయం నాపక్క వున్నది."

"కోర్టు లెక్కినోడూ గాడిదెక్కినోడూ ఒక్కటే అంటారు. సూడు, పుల్లయ్య కైదు నుంచి వస్సి నిన్ను బతకనిస్తాడనా? ఆ గుడ్డోడు ఏదో సెయ్యకండా ఊరు కదుల్తాడనా? నాను సెప్పినట్టు విను."

"ఏ నాడు యినలేదే! నీ మాట యిని అడికళ్ళు పొడిసీనేదా?"

మెల్లగా చెవిదగ్గర యేదో చెప్పింది. సరే నన్నాడు. అప్పుడే వూర్లో నాయుడు కరణాలని, పెద్దలని భజనమందిరం దగ్గర పోగుచేశాడు. పెద్దమనుష్యులు పుల్లయ్యని పిలిపించారు. వాళ్ళేమడిగినా పుల్లయ్య సమాధానం చెప్పలేదు. "నివ్వే వాడ్ని ఖూనీ చెయ్యించాలని సూశావా"న్నారు. అప్పటికీ పుల్లయ్య మాటాడలేదు. వెంకన్న "రామరామ – అంతా నానే సేసానర్రా!" అంటూ వెనకనించి అరుస్తున్నాడు.

సంజీవి ముందుకొచ్చి "రాజిగా! ఆ డెలాగా పట్నం యెళ్ళిపోదామని చూస్తున్నాడు. ఇలాంటప్పుడు కైదులో పెట్టించకరా! దానిమొకం పిల్లల మొకాలు సూడరా!" అన్నాడు.

రాజుగాడు ఛీంకరించాడు. "అందరూ రాత్తిర రాకపోతే యింతేళకి నాను బుగ్గయిపోదును. అడ్ని కనికరిస్తానా?"

"అలాగంటే యెలాగరా? ఏదో నివ్వు డబ్బు యివ్వనేదని తొందరపడిపోనాడు, అదేదో పెద్దలున్నారు, తేల్చేసి, ఆడికేం రావాలో ఇచ్చీకూడదా?"

"నాకు ఆ భూమీ వద్దూ, యిల్లూ వద్దూ, నా దగ్గర పద్దులున్నాయి. నా నిచ్చింది యిచ్చీమను. ఒక్కానీ వడ్డీవద్దు."

"ఇప్పుడు ఆడిని గంగలో తోసేస్తే యెలాగ? ఎలాగో కక్కుర్తి పడ్డాడు. మైనరు ఆస్తి. అమ్మడానికి పుల్లిగాడికి యేం హక్కు వున్నాది గానీ ......యెవురు కొంటారులే....."

కరణం అందుకున్నాడు "ఎందుకదంతాను రాజిగా? ఇల్లు రాసిస్తాడు. గవుర్నుమెంటు వూరకే జాగా గ్రామకంఠంలో యిస్తామంటుంటే ఆ పాత ఇల్లు యెవడికి కావాలి? ఎలాగ పట్నం పోతున్నాడు. ఆ రైలుచార్జీలు పది పూటలు తిండికి తగ్గట్టూ యిచ్చే!"

"నా నొక దమ్మిడీ ఇవ్వను. కరీదు కట్టండీ. నష్టంగానీ నాభంనేదు" అని రాజిగాడు కచ్చితంగా అనగానే నాయుడు కలుగజేసుకొని "సచ్చిన పాముని కర్రతోను బాదుతానంటా వేమిటి? వూరూరా యిలాగ నిన్ను సంపడానికి యేసాడని తెలిసిపోయిందని ఆడే సచ్చిపోతుంటే... ఆడిపెళ్ళం ముఖం సూడు, ఊరుకొని తనే సెయ్యించినట్లు ఒప్పుకున్నట్లే. ఏదో మరో యేభై రూపాయలు ముట్టసెప్పి ఆ పొలం. యిల్లూ రాయించుకో. కీడు చేసినోడికి మేలు సెయ్యమన్నారు. ఇంతకంటే మేం యేమీ సెప్పలేం! ఏం పుల్లయ్యా?" పుల్లయ్య యిష్టమన్నట్టు తల వూపాడు.

"మీ రందరూ పెద్దమనుసులు, మరికాదని బతకగలనా? నష్టానికే వచ్చింది" అని రాజిగాడు చిన్న సోకం చేసుకున్నాడు. అంతా లేచి వెళ్ళిపోయారు. పుల్లయ్య భజనమందిరం స్తంభానికి ఆనుకొని కూర్చున్నాడు, దగ్గరే వున్న వెంకన్న "అయ్యా! నీకు నాయం కాదు, ఆలకీ నాయం కాదు" అని బొటబొటా కన్నీరు కార్చి తుచుకుంటున్నాడు.

"ఎడవకురా!" అన్నాడు పుల్లయ్య.

"ఏడవనా తండ్రీ! నేరం నీ మీ దేసుకున్నావు. వూరెళ్ళ గొట్టున్నారు నిన్ను....నా వెంత పొరపాటు పని సేసినాను?"

"నివ్వేమీ సెయ్యలేదు. నామీద అభిమానంసేత అంతపని సేశావు. పొన్నూరెళ్ళి యేం బతుకుతావ్? ఈ నేరం నీమీదే వుంటే వూర్లో యెవరూ నీకు గంజిపోస్తారా? నానే సంపడానికి పంపానని సెప్పు. పరవానేదు. మళ్ళా నేను యీ వూరి ముకం సూస్తానా?"

"నాయనా, మరి రావురా? మనవడ్ని నాను సచ్చిపోయే ముందైనా ముద్దులాడనీయవా? నా యమ్మ నీలమ్మతల్లి దగ్గరుండదా? ఆ దేముడ్ని తిట్టానురా.....ఆడికి కనికరం లేదురా.....ఆడూ నాలాగ గుడ్డోడైపోనాడురా.... ఆడు - ఆడు" - ఉద్రేకంతో మాటలు మరి రాలేదు. కానీ ఆ కళ్ళల్లోనించి నీరుమాత్రం బొటబొటా రాలిపోతోంది.

మౌనంగా యిద్దరూ కూర్చున్నారు.

# 27

పుల్లయ్య ప్రయాణం స్థిరమయ్యింది. ఊళ్లో కొందరు పులివేషంలో చుట్టుపట్ల గ్రామాల్లో పేరుబడ్డ పుల్లయ్యని ఒకసారి వేషంవేసి మరీ వెళ్ళిపోవాలన్నారు. కాదనలేకపోయాడు. ఒంటికి రంగు పులిమి, పులిబుర్ర తగిలించినా మల్లు పులికి జడవలేదు. 'నానూ పులి' అని యేడవడం మొదలుపెట్టగానే మల్లుక్కూడా రంగు రాశారు. ఒక పచ్చగుడ్డమీద పులిబుర్ర గీసి కళ్ళు, నోరూ, ముక్కుకు దగ్గర ఆ గుడ్డ కత్తిరించి తలకి కట్టారు, తోక తగిలించారు. పులిపిల్లలావున్నాడు. కొడుకే ముందు యిల్లుయెక్కి వెన్నుమీద నిల్చుని ఆడుతుంటే చూసేవాళ్ళందరూ ముచ్చటపడి యింకా ఆడమని కేకలు వేశారు. తండ్రికన్న కొడుకు ఆటే బాగుందని అంతా మెచ్చుకున్నారు. ఆ రోజుల్లో పుల్లయ్య ఆట చూసినవారు ఈనాడు "యీడు పుల్లయ్యేనా?" అని ఆశ్చర్యంజెందారు. "మనిషి బాగా పితలా అయిపోయినాడు. ఆ చలాకీకి అప్పుడు డప్పులు అగేవేకావు. ఇప్పుడు ఏం వున్నాయ్ – యెముకలు తప్పించి......" అని తలోలా వ్యాఖ్యానించుకున్నారు.

ఆట ఆడి యేటిలో స్నానంచేసి రంగులంతా వూడ్చుకొనేసరికి రాత్రయింది. ఇంటికి ఆకలితో వచ్చేసరికి గంజే వుంది. కొడుకో బుక్కెడు తనో బుక్కెడు మిరపకాయ నంజుకొని త్రాగాక యెదరగా నిల్చున్న పెళ్ళంతో అన్నాడు;

"అంత పెద్దపట్నం – అందరూ ఒక బస్తా మోస్తే నాను రెండు బస్తాలు ఒక్కసారే మోస్తాను......ఈ కడపుమంట సరిలే......"

"తినని దిరుసెందుకు సెప్పుకోవాల!"

"రాయే! ఇంకా సెడ్డరోజు లుంటాయా! కష్టపడ్తాను. నాయం నీతికీ కట్టుబడతాను. నా పిల్లలకి లోటేం వుంటాది?"

తలెత్తి పెళ్ళంవేపు చూశాడు. మరి గంజి త్రాగలేదు. కొడుకు త్రాగగా మిగిలింది నీలి గొంతుకలో వేసుకుంది.

ఊరు కదిలేవరకు ఆలోచనతోనే వున్నాడు. అందరితో చెప్పడం అయిపోయింది. నీలి గుడ్డివెంకన్నకు, గన్నెమ్మకు, కుష్టురోగికి రేపు వెళ్ళిపోతామనగా ఈరాత్రి భోజనం పెట్టింది. అన్నీ సర్దుకొనేటప్పుడు వెంకన్న మల్లుకి యిచ్చిన మంటిబెడ్డ అగపడింది. ఆ బెడ్డను పట్టుకొని కొంతసేపు మౌనంగా అలా నిల్చుండిపోయింది. ఆ బెడ్డ విసరడానికి చేతులురాలేదు. మళ్ళా యేనాటికైనా నా కొడుకు మంటిని నమ్ముకోడా అన్న ఆశతో ఆ బెడ్డను సామాన్లలో దాచింది.

తెల్లవారింది. కొద్దిగా చలివేస్తోంది. తూరుపున మబ్బుల్లో దినకరుడు దాగున్నాడు. ఏరు రెండు ఒడ్డులూ తీసి పారుతోంది, సామాన్లున్న బస్తా పుల్లయ్య భుజంమీద వేశాడు. నీలి కూతుర్ని యెత్తుకుంది. వెంట పీస, అదెమ్మప్ప. వెంకన్న వగైరా అంతా వున్నారు. ఇంటివేపు ఒకసారి చూసి ముందుకు నడిచింది. మళ్ళీ వెనుకకు తిరిగి చూడలేదు. వెళ్ళిపోతుంటే త్రోవలో ఆడమ్మలు నిల్చొని పలుకరిస్తున్నారు. నీలి తలెత్తకుండా జవాబు మెల్లగా యిస్తోంది. అదెమ్మప్ప పుల్లయ్యకు బుద్ధులు చెప్తోంది. "నాయనా! బుద్ధిగావుంటే బువ్వతింటావు. దుడుకుతనం, పౌరుషం

పెట్టుకోక. అది సెప్పినట్టు విన్నావంటే బాగుపడతావు. నాలుగురాళ్ళు గడించుకోని మళ్ళా ఈ వూరువస్తే నిన్ను కాదన్నోడు యెవుడు?"

పీస అన్నాడు: "పుల్లిగా! అంతపట్నం – యెక్కడేనా బతికిపోతావు. నా గవుర్నమెంటోడు పెద్దోడు అవుతున్నకోద్దీ బాగా పోషించడా? లచ్చి లచ్చనాలని తెస్తుంది. పట్నం యెళ్ళి మారిపోవా?"

నీలమ్మగుడిదగ్గరకు వచ్చారు. ఆగి, దంపతులు మ్రొక్కారు. మల్లుకూడ తండ్రినిచూచి చేతులు జోడించాడు. రోడ్డు యెక్కారు. పుల్లయ్య ఆగి చుట్టూ చూశాడు. వరిచేలు కోతలకు సిద్ధంగా వున్నాయ్. అంతా పసుపుపచ్చ ఆకుపచ్చల కలయికతో వేలకొద్ది యెకరాలు, ఒక పెద్ద మైదానంలా వుంది. ఇటువేపు ఊరు – అక్కడక్కడ పొగ క్రమ్ముతోంది. నలుపెక్కిన నీలమ్మగుడి తూరుపువేపు అలా యెత్తుగావున్న సరుగుచెట్లు – పడమటవేపు వారధియేరు! ఇదంతా చూస్తుంటే తనకు యింతవరకూ వున్న ధైర్యం సడలిపోసాగింది. అంపకానికి వచ్చినవాళ్ళు తిరిగిపోతూ కళ్ళల్లో నీరు తెచ్చుకున్నారు. పైకి యేడవకండా కుష్టురోగి, వెంకన్న కళ్ళలోనుంచి యేకధారగా నీరు కారుతోంది. నోటిలో గుడ్డలు కుక్కుకున్నారు.

పుల్లయ్యకు ముందుకు కాలుపడలేదు. రైల్వేస్టేషను యేడుమైళ్ళు దూరంలో వుంది. నడవాలి, కాళ్ళు పీకుతున్నాయ్ వెనుకనుంచి వూరనే అభిమానం బంధనాలు వేస్తోంది. ఎలాగున్నా నా వూరు బంగారమే! ఈ బంగారాన్ని వదిలి యెలిపోతున్నాను. మళ్ళా రాకండా....సూడకండా. ఆకలితో సచ్చిపోతే యిక్కడే బుగ్గయిపోతాను. ...పట్నం పోను......నా వూరూ! మా తల్లీ! ఉండిపోతానమ్మా......ఇలా అనుకుంటూనే ఒక్కోఅడుగూ వేస్తున్నాడు. కళ్ళలో నీరు వుబికిపోతోంది. గుండె బరువెక్కుతోంది. కాళ్ళు పీకెట్టున్నాయ్. వారధిమీద కాలుపెట్టి వెనుతిరిగి తిరిగి చూశాడు....మౌనంగా తలదించుకొని నీలి వెంట వస్తోంది. ఆమెను చూశాక యెందుకో మొదట సిగ్గువేసింది – తరువాత జాలివేసింది! అభిమానం కట్టలు తెంచుకొని వురకలువేసింది.

ఏదో అందామనుకున్నాడు – మాట రాలేదు. నీలికూడా మౌనంగా శాంతంగా ఒకసారి తలెత్తి వడిగా నడవటంతో పుల్లయ్యలో కాస్త చలనం కలిగింది. మల్లు వారధిమీద పెద్ద అంగలు వేసుకొని సిపాయిలా ముందు నడుస్తున్నాడు. అటునుంచి గొఱ్ఱెమంద వస్తోంది. గొఱ్ఱెలకాపరి "యెటయ్యా.," అంటే, మల్లే గట్టిగా సంతోషంతో "పట్నం పోతాం!" అన్నాడు.

వూరివేపు గొఱ్ఱెలు తలలూపుకుంటూ సాగిపోయాయి. బరువుతో ఆశతో వాళ్ళకాళ్ళు ముందుకు పడ్తున్నాయ్!

## 28

స్టేషను చేరుకొని చెమటలు కక్కుకుంటూ యీ కుటుంబం ఒకమూల కూలబడిపోయింది. కొంతసేపయ్యాక పుల్లయ్య లేచాడు. మల్లు వెంటపడ్డాడు. రూపాయి మార్చితే యింకేమీ మిగల్లేదు. అరటిపళ్ళు, జంతికలు వగైరా తిని

మంచినీళ్ళు త్రాగారు. ఈలోగా గూడ్సుబండి వచ్చింది. మల్లు వుత్సాహం యింతా అంతాకాదు. అయ్యను ప్రశ్నలతో చిరాకెత్తిస్తున్నాడు, ముఖం వెలిగివుంది. మధ్యాహ్నం మూడుగంటల పదినిముషాలకి రైలు వచ్చింది. జనం కిటకిటలాడిపోతున్నారు. ఎక్కడా ఖాళీలేదు. ఈ చివరనుంచి ఆ చివరకు పరుగులెత్తారు. ఒక దగ్గర త్రోసివేశారు. ఇంకో దగ్గర ఖాళీగావుంది కానీ, లోనున్న దుబ్బుమనిషి "ఇది పరుపుల పెట్టె.....ఎక్కితే కైదు" అన్నాడు. ఎలాగో రైలు కదులుతుందనగా చివరపెట్టెలో సర్దుకున్నారు. టిక్కెట్లులేని యిద్దరు ప్రయాణీకులు రైలు కదులుతుండగా ఆ పెట్టె యెక్కారు. పెట్టెనిండా జనం, క్రిందను కూర్చోడానికి కూడా జాగాలేదు. మూటమీద మల్లు కూర్చున్నాడు. పుల్లయ్య, నీలిచేతిలో పిల్లతో నిల్చున్నారు. రైలు కదిలిపోతోంది.

మల్లు సంతోషానికి హద్దులేకుండా వుంది. మూటను మద్దెలచేసి చేతులతో కులాసాగా బాదుతున్నాడు. నాలుగు స్టేషన్లుదాటి రైలు ఐదోస్టేషను చేరగానే పెట్టెలో రద్దీ తగ్గింది. రైలు ఈలవేస్తే మల్లుకూడా నాలిక మడిచి రెండువేళ్ళు నోటిలోపెట్టి ఈలవేశాడు. రైలు మెల్లగా కదులుతోంది......అయ్యా, అమ్మా మెల్లగా చోటుచేసుకొని రెండు వేపులా దిగువస కూర్చున్నారు. పుల్లయ్యకు గతమంతా జ్ఞప్తికి వస్తోంది. తన యిల్లు వాకిలీ, పొలం, తను......పెళ్ళాం, పిల్లలు... వెంకన్న.....రాజిగాడు......ఆదెమ్మప్ప.....వగైరా అంతా మనసులో తిరిగిపోతున్నారు. చచ్చిపోయిన ముసలమ్మ, దాసుడు, నీలమ్మగుడి, నీలమ్మతల్లి అంతా మనసులో కదలిపోతున్నారు. ఎప్పుడో మళ్ళీ తన వూర్లోనే బుగ్గయిపోవాలనుకున్నాడు. కిటికీగుండా పరుగులెత్తుతున్న ప్రకృతిని చూసి మల్లు ఉత్సాహంతో "అయ్యా" అని కేకవేసి, "సూడు సూడు......సెట్లూ, కొండలూ మనూరుకేసి పరుగున పారిపోతున్నాయ్!" అన్నాడు.

ఇప్పుడు పుల్లయ్యకు తను రైలుమీద పట్నం పోతున్నానని జ్ఞప్తికి వచ్చింది. మాటాడకుండా పట్నం విషయం తెలుసుకున్నాడు. బాగా కష్టపడి సుఖంగా బ్రతుకుతానని వూహించుకున్నాడు.

వాల్తేరు చేరేసరికి రాత్రి ఎనిమిదిన్నర గంటలైంది. పెట్టెపెట్టెకు తనిఖీకి చేత కర్ర పట్టుకొని చెక్కింగ్ ఇనస్పెక్టర్లు వస్తున్నారు. గేటుదగ్గర టికెట్ కలెక్టరు వీళ్ళని ఆపి 'బస్తాలో బియ్యం లేవా' అన్నాడు. పుల్లయ్య మాటాడలేదు. కానీ నీలి "కుంచం బియ్యం సెయ్యికాపు కేసుకున్నాం బాబూ!" అంది. "పోలీసు లొస్తారు వుండండి" అన్నాడు. నీలికి భయం వేసింది. వాళ్ళ పెట్టెలోనే వచ్చిన కోటేసుకున్న బాబు ట్రంకు పెట్టెనిండా బియ్యం యేసుకున్నాడు. ఆయనను ఎవరూ అడగలేదు. చకచక నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. పట్నం అంటే తొలిసారి తెలిసి వచ్చింది. నాలుగు రూపాయలు పుచ్చుకొని విడిచిపెట్టిన టికెట్ కలెక్టరును పుల్లయ్య ఏదో అనబోతుంటే నీలి వారించి "కైదు తప్పించాడాబాబు. ఆ మాత్రం పుచ్చుకోడా?" అంది.

మల్లు జిగేల్ జిగేల్ మన్న దీపాలవేపు, పరుగులెత్తుతున్న కారులు, రిక్షాలు, బస్సులు వింత వింతగా చూస్తున్నాడు. మేడలూ, మిద్దెలూ కనిపిస్తూంటే ఎక్కడ

కక్కడే ఆగిపోతున్నాడు. ఒకదగ్గర లౌడ్‌స్పీకరు నుంచి సినిమాపాట బొయ్‌మని వస్తూంటే మల్లు చెయ్యి పట్టుక లాగితేగానీ కదిలాడు కాదు. వస్తూనే "అయ్యా! అంత గట్టిగా.....పదం!......అడు పెద్ద మనిసా?" అనడిగాడు.

పుల్లయ్య "ఫూనగ్రాపు పాడతందిలే, మనిషి కాదు," అన్నాడు.

"అయ్యా ఫూనగాఫా – అదెలాగుంటుంది?"

"పెట్టె."

"పెట్టె పాడతాదా? నాకోటి కొనిపెట్టవూ?"

"పైసాలు దొరికితే అవే కరువా?"

ముందుకు నడిచారు. ఆ త్రోవ గంట వాయించుకుంటూ మిఠాయి దుకాణం బండీ వెళ్ళిపోతోంది. అయ్యా, అయ్యా అంటూ ఆగిపోయాడు. చేతిలో పొట్లాం పడ్డాక నములుకుంటూ వెళ్తుంటే అక్కడక్కడ పిల్లలు కనిపించారు, వాళ్ళంతా లాగులూ, కమీజులూ వేసుకున్నారు. ఆడపిల్లలు గౌనులు వేసుకున్నారు, తనకు లాగుంటే అనుకున్నాడు "అయ్యా, నాకు అలాంటిది, సెల్లికి యిలాంటిది" అని యిద్దరు వెళ్ళిపోతున్న పిల్లలను చూపించాడు.

"అన్నీ యీయేళే. రేపు కొందాంలే!" అన్నాడు పుల్లయ్య.

టర్నర్ సత్రంలో కాలు పెట్టగానే కుక్కపిల్ల కనిపించింది.....'చుచ్చూ' అని పిల్చాడు. పకోడీముక్క చూపించాడు. రుచి మరిగింది. వెంట పడింది. ఒక్క ముక్క తనకు యింకో ముక్క కుక్కకు...... ఈ కుక్కపిల్ల హడావుడిలో పడి అయ్యను ఇంకేం ప్రశ్నలూ వెయ్యలేదు.

సత్రంలో గదులు శ్రీమంతులకు, మధ్యతరగతివాళ్ళకు వేరువేరుగా ఉన్నాయ్. డబ్బు యిచ్చుకోలేని ప్రజలకు పెద్ద పందిరిలా ఉన్న తాటాకుల ఇల్లు ఒకమూల వుంది. అందులో ఒక మూల మూట దించాడు పుల్లయ్య. సింహాచలం పుణ్యస్థలం దర్శించి, దగ్గరగా ఉన్న యీ పట్నాన్ని చూడటానికి వచ్చిన పల్లెజనం అందులో కిటకిట లాడుతున్నారు. ఒకమూల వంటలు సాగుతున్నాయ్. చిన్న పిల్లలు నలుగురు గగ్గోలుపెట్టి ఏడుస్తున్నారు. తలలు గుండు చెయ్యించుకున్న ఆడంగులు యిద్దరెవరో నలుగురు మొగవాళ్ళతో మాటలయుద్ధానికి దిగారు. ఒక వయసుమళ్ళినవాడు చేతిలో కర్రతో కుక్కల్ని తరుముతున్నాడు. ఎక్కడికక్కడే ఉమ్ములు, ఎంగిళ్ళతో పరిసరాలు అసహ్యంగా ఉన్నాయి.

పుల్లయ్య కర్రపుల్లలు, మూనె వగైరా కొనితెచ్చాడు. నీలి వంట ప్రయత్నం చేసింది. మల్లు ఒకవేపు కుక్కపిల్లని పెట్టుకొని. ఇంకోవేపు నేలమీద దొర్లుతున్న చెల్లెమ్మను ముద్దులాడుతున్నాడు.

వీళ్ళ భోజనాలయ్యేసరికి ఇంకా ఈ పందిరలో గలాటా తగ్గలేదు. ఎవరో ఇద్దరు ఆడంగులు కయ్యమాడుకొని పాతవన్నీ యెత్తిపొడుచుకుంటున్నారు. ఇద్దరికీ మొగుడైన పురుషుడు, పెద్దగొంతుకుతో అరుస్తున్న రెండో పెళ్ళాన్ని నలుగురిలో పరువు నిలుపమని బ్రతిమాలుకుంటున్నాడు. అది అలావుండగా ఇంకో ముసలాడు ఇంకా అన్నం వెయ్యమని కోడలిని అడుగుతుంటే, ఆమె మూతిపోట్లు పొడిచిందని చచ్చిన కూతుర్ని తలంచుకొని ఏడుస్తున్నాడు. ఒకప్రక్క ఇంకా పొయ్యిలు

వెలుగుతూనే ఉన్నయ్ – ఒకమ్మ చేపలు కోసి నోరు వూరించుకొని పులుసు పెట్తోంది. ఇంకోమూల ఆసుపత్రికని వచ్చిన రోగిష్టి కడుపునొప్పితో ఏడుస్తూ అప్పుడే చచ్చిపోతున్నట్లున్నాడు. ఒక పిల్లాడు తనకు వచ్చిన పదాలు పాడుకుంటున్నాడు. ఒక యౌవనుడు యిదివరకు ముక్కూ ముఖం ఎరగని బింకమైన స్త్రీతో సరసాలకు దిగబోతున్నాడు. వీళ్ళు మాటాడితే చెయ్యి చేసుకుందామని ఆ స్త్రీతో ఇదివరకు మాటాడిన స్వగ్రామస్తుడు కోపంతోనూ, మాత్సర్యంతోనూ ఒకమూల కూర్చొని చూస్తున్నాడు. అమాయకునిలా ఒక దొంగ ఎదరగా ఉన్న కొళాయిదగ్గర కూర్చొని అలా వచ్చే ఆడంగుల మెడలవేపు కనిపెట్టి చూస్తున్నాడు. ఒక కుక్క యింకో కుక్క మీదకు ఘీంకరించి వురుకుతోంది. ఈ చిన్న లోకంలో ఉన్న నీలి, పుల్లయ్యలకు అలసి వుండటంవల్ల నిద్దర ముంచుకొచ్చింది, మధ్యను మల్లును, పిల్లను వేసి, చెరోవేపు పడుకున్నారు. మూట పుల్లయ్య తలవేపు వేసుకున్నాడు. అన్నం తిన్న కుక్కపిల్ల మల్లు కాలుదగ్గరకు వచ్చి పడుకుంది. మంచి రాత్రిమీద చలి వేసింది. పుల్లయ్య కప్పుకోవాలని బస్తాలోని పంచె తీయడానికి లేచాడు. ముడుకులు కడుపులో పెట్టుకొని పెళ్ళం పిల్లలు పడుకున్నారు.

అంతా నిద్దరపోతున్నట్లే ఉన్నారు. రోడ్డుమీదనున్న మెర్క్యురీ బల్బు వెలుతురు పందిరిలో ఒకమూల పడుతోంది. ఆ వెలుగులో మిగతా భాగం చూచాయగా కనిపిస్తోంది. 'నాయనా' అని ఎవరో తనకు దగ్గరగానే పిలిచినట్లు వినిపించింది. ఆ గొంతుక మళ్ళీ వినిపించింది. ఒక ముసలివాడు. వాడిని ఆ కీనీడలో చూస్తుంటే దాసయ్యను చూసినట్లయింది. దాసయ్యే ఈ రూపంతో తనకేదో త్రోవ చూపించాలని వచ్చాడేమోననే నమ్మిక వెంటనే కలగసాగింది. శరీరం ఒక్కసారిగా ఈ తలపుతో పులకరించి, గగుర్పాటు చెందసాగింది. వినయంతో, భక్తితో దగ్గరగా వెళ్ళాడు ప్రక్కనే కూర్చున్నాడు. మెల్లగా చెవులో ఏదో గొణిగాడు. "నువ్వు పడుకో తాతా! నాను సూస్తానులే" అని హామీ యిచ్చి పుల్లయ్య తిరిగి వచ్చాడు. పంచె తీసి కొడుకు, కూతురు మీద కప్పాడు. మళ్ళీ చారబడి నిద్దర అభినయిస్తూ ఒళ్ళంతా కళ్ళు చేసుకొని పందిరి అంతా చూస్తున్నాడు.

నిశిరాత్రి... నిశ్శబ్దంగా వుంది. ముసలాడు టోకుర్లు తీసుకొని నిద్దరపోతున్నాడు. అందరిలో తెలివితో ఉన్నావా డొక్క పుల్లయ్యే! నిద్దర పారిపోయింది. ఎదురుగా కొళాయి వెనున దాగున్న యిద్దరూ మెల్లగా పందిరివేపు రావటం చూశాడు. కొద్దిగా కూడా శబ్దంలేదు: చేతులు సర్దుకున్నాడు. ఉత్సాహం ఒళ్ళంతా అలుముకుంది.

అదిగో తలలు వంచి మెల్లగా ఒకావిడ మెడదగ్గరకు చేతులు వెళ్తున్నాయ్! పుల్లయ్య చప్పున లేచి వాళ్ళమీదకు సింహంలా వురికాడు. ముష్టియుద్ధం! పందిరి అంతా మేల్కొంది. 'దొంగ – దొంగ' అని ఒక్కటే గగ్గోలు. పట్టుకోండి – చంపండి – కేకలు – పుల్లయ్యను, నుదుటి మీద చేతిలోని కత్తెరతో ఒక దొంగ వేశాడు. రెండో దొంగ పుల్లయ్య బనియను పట్టుకొని "ఇదిగో దొంగ. అదిగో ఈ అమ్మ మెడలోనిది కత్తిరించడానికి వచ్చాడు...... ఇదిగో కత్తిర!" అన్నాడు.

"మేం సమయానికి లేవకపోతే......చూశారా ముసాఫిర్‌లా వచ్చి ఎంతపని చేశాడో!" అన్నాడు మొదటివాడు.

ఇలా వ్యాఖ్యానాలు దొర్లుకుపోతుంటే నుదుటిమీద గాయం బలంగా తగలటంచేత పుల్లయ్య కళ్ళు జిగేల్‌మనటంవల్ల వెంటనే మాటాడలేకపోయాడు. దానికితోడు నలుగురూ నాలుగు యిచ్చుకున్నారు. నీలి....."కాదు కాదు....." అని మొరపెట్టుకున్నా వినేవారెవరూ లేకపోయారు. పోలీసులకి అప్పచెప్పండని యెవరో అంటున్నారు. ఇంతలో టోకుర్లు తీస్తున్న ముసలాడు లేచి చూసుకుంటూ వచ్చాడు. దొంగలు పలాయనం చిత్తగిస్తుంటే పుల్లయ్య ఉన్న శక్తితో "వాళ్ళే దొంగలు...... పట్టుకోండి!" అని అరుస్తున్నంతలోనే – మాయమైపోయారు. ముసలాడు నలుగుర్లోనికి వచ్చి పుల్లయ్య కళ్ళల్లో కళ్ళు పెట్టిచూసి "నాయనా! దొంగల్ని పట్టావురా!......అయ్యో పాపం! దెబ్బ తగిలిందా?..... ఏరీ దొంగలు?" అన్నాడు.

పుల్లయ్య "ఒక్కడ్నీ యిద్దరికాళ్ళూ యిరగ్గొట్టా ననుకున్నాను....బళేయేసం యేసి తప్పించుకొన్నారు!" అన్నాడు అలసిపోతూనే.

కొంతసేపటికి నిజం అంతా తెలిసిపోయింది. మొగుడి తలకు గుడ్డచుట్టి కూర్చోబెట్టిన నీలి అందరిమధ్యనుంచీ తీసుకొనివెళ్ళి నేలమీద పడుకోబెట్టింది. నలుగురూ నాలుగు విధాల నొచ్చుకొంటున్న మాటలు చెవిని పడ్తున్నాయ్. ముసలాడు "నిన్న లేసిన యేలా యిసేషం బాబూ! వాళ్ళిద్దరైపోనారు..... పక్కనున్నోడినైనా లేపినావు కాదు...." అన్నాడు.

మల్లుకి యేడుపుపోయి నవ్వు వచ్చింది. కుక్కపిల్లతో సెప్పకుంటున్నాడు: "మా అయ్య దొంగలమీద పడి దబ్బుదు యేసేసినాడు....దొంగలు పారో....."

పుల్లయ్య ఈ మాటలు విని నవ్వుకున్నాడు. నుదిటిమీద దెబ్బ రక్తం కట్టింది. కొంతసేపటికి నిద్దరపోయాడు. తెల్లవారగానే నీలి "యీ యేళ పొద్దు కుంగముందే యేదో ఇల్లూ వాకిలీ సూసుకుంటేగానీ....ఇక్కడుండలేం" అన్నాది.

"ఇక్కడే వుందాం – ఈ రాత్రికి మళ్ళీ వస్తారు – ఖర్చుకి బాగా యిచ్చుకుంటా" నన్నాడు పుల్లయ్య.

"ఈ యాత్ర కొచ్చినోలంతా యెల్లిపోతారు. దొంగలు పదుగురొస్తే అంతా సరి.....వాళ్ళ ముక్కులు బద్దలుగొట్టి రక్తం కారించావు కదా, వూరుకుంటారా? అయినా ఆ ఇద్దరూ మంచోలే – ఒడిలో కత్తితీసి పొడిసేస్తే యేం సేద్దుం? సాహసం చేయరాని చోట్లుంటాయి, అది తెలుసుకోలేకపోతే యెలాగ?" పుల్లయ్య మాటాడలేదు. చద్దిఅన్నం తిన్నాక యెండలో యింటికోసం వెదకటానికి బయలుదేరాడు. కొడుకు కుక్కపిల్ల నెత్తుకొని వెంటబడ్డాడు. తాటాకు పాకలున్న వీధుల్లోనికి వెళ్ళాడు. ఎత్తుగా వరిచొప్పతో వేసిన, బాగా గాలి తగుల్తున్న ఇంటిలో వుండటానికి అలవాటుపడ్డాడేమో, దిగువుగా భూమికి చూర్లు తగిలివున్న యీ ఇళ్లవేపు చూస్తుంటేనే మనస్కారించటంలేదు. ఇవికూడా దొరకటంలేదు. చుట్టూ కుళ్ళుకాలవ కంపు, చెత్తాచెదారాలు, ఎక్కడ కక్కడే మురికి – వాటిపై కుప్పలుగా వాలే దోమలూ, ఈగలూ అంతా అసహ్యం వేసింది. మనుషులు వాటిలో యెలా మెసులుతున్నారని ఆశ్చర్యపడ్డాడు. ఒకదానివెనుక ఒకటి ఒక ఇంటికి నిప్పంటితే సరి – ఆ పేటంతా నాశనమే! తన వూర్లో యెత్తుగావున్న ఆ యిళ్ళకి అగ్ని ప్రమాదాలే లేవు – ఒకప్పుడు ఎవడో క్రోధంతో తగిలించినా ఆర్పివేయటం

యెంతో సులువు! ఇక్కడ కదలడానికే జాగాలేదు. ఏమైనా తనొక యిల్లు చూసుకోవాలి. అక్కడక్కడా ఖాళీవున్నా వాటి అద్దె నెలకు ఐదు రూపాయల నుంచి పదిరూపాయల వరకూ వున్నాయ్! ఒక నెల అడ్వాన్సు యివ్వాలి. అడ్వాన్సు ఇచ్చి వేస్తే తనదగ్గర మిగిలిందేముంది?

తిరుగుతూ, తిరుగుతూ పొద్దు తలమీదకొచ్చేసరికి సముద్రపొడ్డు చేరాడు, మల్లు సముద్రం చూడగానే భయపడకుండా గెంతుతూ సంతోషంగా "అయ్యా! అయ్యా! ఎంత సెరువో....." అన్నాడు. తొలిసారి జీవితంలో సముద్రాన్ని చూడటం. పుల్లయ్య నవ్వి "సెరువు కాదయ్యా, సవంద్రం – సవంద్రం!" అన్నాడు.

"సవంద్రం అంటే యేంటయ్యా?"

"నీరు వుప్పగా వుంటాది – ఆ నీరునుంచి వుప్పగడ్డలు పండుతాయి."

"నాగలేసి దున్నగలమా పండడానికి?"

"ఆ నీరు మడుల్లోకి పెట్తారు. అది యెండిపోయి వుప్పవుతాది."

"అయ్యా! యీ నీరు గంజిలో యేసుకుంటే – వుప్పు కావాలా?"

"నీరు ఏసుకోరులే....." అంటూ చెయ్యిపట్టుకొని సముద్రపు ఒడ్డుకు తీసుకువెళ్ళాడు. అప్పుడే హార్బరునుంచి స్టీమరు వెళ్ళిపోవటం చూసి "అయ్యా అయ్యా......సూడు సూడు.....అమ్మో......ఎంతరుంది?"

"ఓడ అయ్యా అది. అదెక్కితే రంగం యెళ్లిపోతాం!"

"అయ్యా, యెక్కుదామా?"

"ఇప్పుడు కాదులే.....పద! యిల్లు కుదరాలి – పని కుదరాలి.......అప్పుడు యెక్కిడికైనా యెల్దాం."

అంటూ తిరిగి సత్రంకు వచ్చాడు. కుర్రవాడికాళ్ళు బాగా పీకెట్టాయ్. భోజనంచేసి తండ్రి పడుకున్నాడు. కొడుకు తన కాళ్ళు తనే పట్టుకుంటూ కుక్కపిల్లతో కాళ్ళునొప్పి అని చెప్పుకుంటున్నాడు. ఆ కుక్కపిల్లి కాళ్ళొకసారి నాకింది.

పుల్లయ్య నిద్దరనుంచి లేచేసరికి పందిరిలో చాలామంది వెళ్ళిపోయారు. రాత్రిసరికి బహుశా ఒంటిగా వుండవలసివుంటుందేమో ననిపించింది! నీలితో యిల్లు దొరకడం కష్టమని, పడ్డ శ్రమంతా చెప్పాడు. దెబ్బ తగలడం వల్ల పుల్లయ్య నుదురు పొంగివుంది. నీలి నేను యెతికివస్తానని బయలుదేరితే దారి తప్పిపోగలవని మొగుడునడంతో "నోరుంటే వూరు కరువా? నువ్వెల్తే నీకే యిల్లూ నచ్చవు. మన బతుక్కి మేడలూ మిద్దెలూ కావాలంటే యెలాగ వస్తాయి? వచ్చినా అందులో ఉండగలమా? ముఖానికి తగ్గ బొట్టు పెట్తేనే కళగా వుంటాది" అని యింత సమాధానం చెప్పి ఒంటిగా బయలుదేరింది,

సాయంత్రం అయ్యేసరికి నీలి తిరిగిరాగనే పుల్లయ్యగుండె కుదుటపడి "యెతకటానికి రావాలనుకుంటే వచ్చినావు" అన్నాడు.

"పెద్ద సత్రపు యెక్కడని దారేపోయే మారాజుల్ని అడిగితే సెప్పినారు" అంది నవ్వి.

"ఇల్లు దొరికిందా?"

"ఏదో తలదాచుకోడానికి – యిరుగూ పొరుగూ వున్న కొంపేలే – యిక్కడ నాలుగు మెతుకులు నవిలేసి రాత్రిరికి వెళ్ళిపోదాం" అన్నది.

"తోవ తెలుస్తాదా?" అన్నాడు.

"ఇదిగో యెంతోదూరంలేదు! అరుబారికియెల్లే తోవలేదూ? ఆ రోడ్డు పక్కనే – కాలవున్నాది. రోడ్డుమీద మర్రిచెట్టుంది."

భోజనాలు వేగంగానే తెములుచ్చుకొని క్రొత్త యింటికి కుటుంబం బయలుదేరింది. మల్లు కుక్కపిల్లను యెత్తుకొని ముందు నడుస్తున్నాడు. కొడుకుభుజం ఒక చేతితోనూ తలమీద మూట ఒక చేతితోనూ పట్టుకుని పుల్లయ్య అడుగులు వేస్తున్నాడు. అల్లదిగో మర్రిచెట్టు అక్కడే....అప్పుడే మల్లు ముక్కు నులుపుకుంటూ "అయ్యా! అయ్యా! కంపు కంపూ" అంటున్నాడు, ఆ త్రోవంతా దుర్గంధమయం. ఇల్లు చేరేటప్పటికి పొరుగింటావిడ గగ్గోలుపెట్టి ఏడుస్తోంది. మొగుడు వారిస్తున్నాడు.

"ఏడుపుతో?" అంటూ బయట మూటదించి పుల్లయ్య చుట్టూ చూశాడు.

ఉప్పుటేరు కాలువ. ఆ కాలవలోకి వూరిలోని కుళ్ళునీటిని పెద్దకాలవలు రెండు మోసుకవచ్చి యెల్లప్పుడూ చేరవేస్తున్నాయ్. ఎదరగా మ్యునిసిపల్ చెత్తబళ్ళు వగైరా పెట్టే స్థలం. ఆ ప్రక్కనే రోడ్డు. ఆ రోడ్డు నానుకునే ఈ ఉప్పుటేరు కాలవ. ఈ కాలవడ్డునే యీ పాతిక యిళ్ళూ వరసగా వున్నాయ్. మూడేసి నాల్గేసి గదులు కలసి ఒక కొంప. గదికీ గదికీ మధ్య తడికలు – ఒక గదిలో గుసగుసలు ప్రక్కగదికి స్పష్టంగా వినిపిస్తాయి – అక్కడక్కడా జెల్లెడలా వున్న తడికనుంచి ప్రక్కగదిలో యేం జరుగుతున్నదీ చూడొచ్చు. ప్రతిగదికీ ముందు చిన్న వాకిలి పడుకోడానికి, పెరట చిన్న గుమ్మటంలో వంట – కాలవలు కుళ్ళునీరు హెచ్చు మోసుకొచ్చిననాడు, నీరు పెరటిగోడకు తగులుతుంది – ఇంటిలో నీరు వూరుతుంది......ఒకోసారి మేఘాలకి వీళ్ళమీద కోపంవస్తే ఆ కుళ్ళునీరు ఇంట్లోనే వుంటుంది!

"అద్దెంత?" అన్నాడు పుల్లయ్య అయిష్టంతో.

"రెండు రూపాయలు....." అని చెప్తూ నీలి యేడుస్తున్న పొరుగింటావిడను ఓదార్చడానికి వెళ్ళింది, ఆమెను ఓదారుస్తుంటే యేడుపు ద్విగుణీకృతమై పొర్లి పొర్లి యేడుస్తోంది. ఈలోగా మల్లు అయ్యమీద ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు. అక్కడనుంచి పోదాం అంటాడు. ఆ కంపు భరించలేకపోతున్నాడు. పుల్లయ్య వీళ్ళంతా యెలా వున్నారని ఆశ్చర్యపోయాడు – రోడ్డుమీద నుంచి కార్లూ అందులో బంగారపు శృంగారాలతో వెళ్ళిపోతున్నవాళ్ళు...... ముక్కు మూసుకుంటున్నారు....... నాగరికతకు చిహ్నాలై యెత్తైన యెదరగా కంటికి ఆగుపించే మేడల్లో నివసించే నాగరీకులు,....యివేవీ అగుపడలేవేమో అన్నట్లు యీ గృహాలు నేలకు అంటుకొని వున్నాయ్. పుల్లయ్యకు తన వూరూ ఇల్లూ జ్ఞాపకం వచ్చింది. పెరట రావిచెట్టుమీద పక్షులు కిలకిలలు – పోతులు గడ్డిమేటువద్ద చేస్తున్న చప్పుడూ..... చల్లగా ప్రశాంతంగా వుండే ఆ ఇల్లూ, వాకిలీ..... ఆ నదీ..... ఆ భూములూ..... ఆ శృంగారం...... అంతా యీ నరకకూపంలో జ్ఞాపకం రాసాగాయ్! లేనిపోని ఊహలు

పెట్టుకుంటూ విచారించుకుంటూ కూర్చుంటే మల్లు ఆ పొరుగమ్మ యేడుపుకు విసిగెత్తేమో "అయ్యో!" అంటూ చెవులు మూసుకున్నాడు.

పుల్లయ్య యిప్పుడు ఆ యేడుపు సరిగ్గా విన్నాడు. విని ఆశ్చర్యపోయాడు, ఎవరో యింట్లో పోయాడేమోనన్న తలపులోవుంటే ఇంతకీ ఆవిడ పెంచిన పిల్లి చచ్చిపోయిందని యిలా గగ్గోలు పెట్తోందేమో అని నవ్వుకున్నాడు. ఆ మొగుడు ప్రాధేయపడి సేసిన ఓదార్పులు కూడా వినిపిస్తున్నాయ్. అడగొంతుకలో నీలిది ఒక్కటే వినిపిస్తోంది. ఈ చుట్టుపట్లవున్న ఆడవాళ్ళు మనుషులు కారేమోనని అనుకున్నాడు. వారి గడపనుంచే, రెండోవేపు గదిలోవున్న మనిషి "ఏ ఊరయ్యా మీది?" అన్నాడు.

"తూరుపోలం – మా ఊరు నవిరి."

"ఎన్నాళ్ళయింది వచ్చి?"

"నిన్నే....."

"ఎక్కడన్నా పని అయిందా?"

"దానికే వచ్చినాను–"

"ఏం పట్నాలు! పేరేగానీ, ఆ పల్లెపట్టున పైసాలేకండ బతకవచ్చు! ఈ పట్నాల్లో యేం వున్నాయ్! ఈ కంపు – ఆ బొమ్మలూ....."

"బొమ్మలా?"

"అవునయ్యా......ఆ సినిమాలు సూసైనా.....మనలాంటోలం మనసులో సంతోష పడతాం......" తరువాత ఓక్షణం ఊరుకొని వెటకారంగా "ఈ సుట్టుపట్ల ఊర్లనుంచి జంగిలీవోలు వచ్చిపడిపోతుంటే మాలాంటోలికి పనులెక్కడుంటాయ్!" అన్నాడు.

పుల్లయ్యకు కొద్దిగా సూటిగా తగలడంవల్ల "సరిగ్గా మాటరానీ అబ్బాయ్!" అన్నాడు.

"సరిగ్గానే వచ్చింది. పొద్దున్న శవం యీ ఇంటినుంచి కదిలింది – అప్పుడే దిగిపోవడానికి వచ్చినావు–"

పుల్లయ్యకు ఈ మాటలు వినగానే నీలమీద యిలాంటి యిల్లు మంచీ చెడ్డా చూడకండా కుదిర్చిందని కోపం వచ్చింది.

నీలివచ్చి బుడ్డీతీసి దీపం ముట్టించి కుడికాలు యింట్లోపెట్టి గదిలోనికి వెళ్ళింది. ఆ మూట నీలే మోసుకు వెళ్ళిందికానీ పుల్లయ్య కూర్చున్న దగ్గరనుంచి లేవలేదు, తండ్రిదగ్గరే కొడుకు కూర్చున్నాడు. గడపలో పడక వేసి మల్లును పడుకోడానికి చెయ్యిపట్టుకొని లాగితే "కంపు – రామరాను" అని కేకలు వేశాడు. ప్రక్కనున్న జంటచూసి పకపకా నవ్వుకుంటున్నారు. ఇందులో నవ్వడానికి యేంవుందని నీలి అనుకొని వెళ్ళి, యింట్లో నీలమ్మ తల్లినీ మామ్మనీ తల్చుకొని నేల చారపడింది. ప్రక్కనే పిల్ల పడుకుంది. ఒకవేపు దుర్గంధంవల్ల ముక్కు నులుపుకుంటున్నా యెక్కడలేని తృప్తి, ఆనందం ఆమెలో ఆవరించి, కొంతసేపటికి నిద్రపోయింది. పుల్లయ్య చాలసేపటికి గడపలో వెల్లకిలా పడుకోగానే, మల్లువచ్చి వక్షంమీద పడుకున్నాడు. కొడుకు వీపుమీద మెల్లగా చరుస్తూ నిద్రపుచ్చాక ప్రక్కనే

వేసుకొన్నాడు. పొరుగావిడ ములుగు వినిపించి రానురాను ఆగిపోయింది, రెండోవేపున్న గదినుంచి గుసగుసలు వినిపిస్తున్నాయ్.

మొగగొంతుక: "ఇంకా దగ్గిరకురాయే...... సినీమాలో సూడు యెలాగుంటారో......"

ఆడగొంతుక: "సిలకా గోరింకల్లాగ ఉన్నాంకదా మావాఁ?"

మొగ: "రాయే, నీలాంటి సక్కనిసుక్క యెక్కడుంది?"

ఆడ: "అలాగయితే మావాఁ, నివ్వో...... మొన్న పంట్లాం యేసుకొని సిగరెట్టు కాలుస్తుంటే..... నిజంగా.....నాగేశ్వర్రావనుకొన్నాను."

కొద్దిసేపటివరకూ యీ ప్రేమఘట్టం జరిగాక కిలకిల నవ్వు వినిపించింది. తరువాత నిశ్శబ్దం!

పుల్లయ్యకు నిద్దర పట్టలేదు, ఆనాటిరాత్రి......చందామామో!.....పసందైన పల్లె వనితలు – నీలి......ఆ సొంపు...పెంపు గరిడీలో ఘటికుడు.......కండలు తిరిగిన మనిషతను.......ఆ గేరాగిరజాలలో చెయ్యిపెట్టి మొదటిరాత్రి – నీలి ....... ఆ ముసిముసి నవ్వు...... సిగ్గు.... నిజంగా పుల్లయ్యకు ఇప్పుడే అదంతా అనుభవిస్తున్నట్లుగా..... ఆనందబాష్పాలు రాలిపోయాయ్!

ఆ నవ్వులోనే...... యేదో విచారం...... ఆ విచారంలోనే యేదో తృప్తి..... "అటువంటి నా నీలి...... యీ కంపు...... యింపుచేసుకొని...... యెంత సుఖంగా పడుకుందో!...... నా కెందు కలాగ లేకపోవాలనుకున్నాడు – మనసు ఇంకా పరిపరివిధాలుగా పోయింది – నీలి అన్నమాటలే జ్ఞాపకం వచ్చాయ్ "సంతోషంవస్తే పట్టలేం – ఏడుపొస్తే ఓదార్చలేం!" అని.

పొరుగునుంచి మళ్ళీ గుసగుసలు – ఆ పిల్లికోసం యేడ్చిన మనిషి గురించి చెప్పుకుంటున్నారు.....

ఆమె: అడుసచ్చాడుకాదా? అందుకే....లోకం కళ్ళు కప్పుదామని."

అతడు: ఇంకొకడు వచ్చాడు కాదా?"

ఆమె: పొత్తుకుదరదా?"

అతడు: ఈడూసస్తే దేన్నిసంపి యేడుస్తాదో?

నవ్వు......పుల్లయ్య ఒళ్ళంతా జరజరలాడింది.......

ఇల్లు మార్చాలి అన్న ఆలోచనలలో పడిపోయాడు......ఆ ఆలోచనలన్నిటినీ – నిద్దర మ్రింగేసింది!

# 29

కొద్దిగా నొప్పిగా వుండిన నుదుట తగిలిన గాయం తెల్లవారి లేచేటప్పటికి దిగుట్లు పెట్టసాగింది. ఎదురుగా కళ్ళకి అగపడే పెద్దపెద్ద భవనాలవేపు గోదాములవేపు – కార్లమీద సైకిళ్ళమీద వెళ్ళిపోయే మనుషులవేపు ఆత్రతగా చూసేవాడు. హోర్బరు, ఓడలుకట్టే కంపెనీల బాకాలు బొయ్‌మని అరుస్తుంటే అవి తననే పిలుస్తున్నాయన్న ఆశతో ఆ బాధను లెక్కచేయకుండా కదలాలని ప్రయత్నించేవాడు. కానీ బాధతో కుమిలిపోతూ జ్వరంవచ్చిన మనిషిలా వణికిపోతుండేవాడు. కొడుకూ, భార్యా దగ్గర వుండి కదలనివ్వలేదు.

ఒకరోజు గడిచింది. ఉపశమనాలవల్ల బాధతగ్గినా రెండురోజులు గడిచాక బ్రతుకుభారం యెలా మొయ్యటమనే ఆలోచనలు గుండెకు నాటుకుంటున్నాయ్. ఆ రాత్రి దీపపుబుడ్డి గదిలో వెలుగుతోంది. మల్లు కుక్కపిల్ల కనబడలేదని యేడుస్తూ నిద్దరపోయాడు. పుల్లయ్య బాధతో మూలుగుతూ దగ్గర కూర్చున్న నీలితో అన్నాడు – "మనరోజులు బాగునేవే!" అని.

"అలాగనుకుంటే బాగులేని రోజులు బాగుపడిపోతాయా?"

పుల్లయ్య బాధతోనే ఆమె చెయ్యి తాకుతూ "సూడు! అక్కడ పొలాలు పోనాయి, ఇక్కడ కాలుపెట్టామా – దొంగలబాధ, యీ యిల్లూ .....యీ,......" అని పెద్దగా నిట్టూర్చాడు. నీలి మౌనంగా నవ్వి "కష్టాలు వచ్చాయని పిరికోలమౌతామా? రానీ! రానీ! యెప్పుడూ సుఖమే యేల కోరుతావు?" అంది. తరువాత మౌనంగా వుండి నిద్దరపోవాలని ప్రయత్నించాడు. ఆకాశం మేఘాలమయంగా వుంది. మెరుపుల.......ఉరుముల శబ్దం వినిపిస్తోంది. ఆ శబ్దానికి ఇంటి తడికెలు కదులుతున్నాయ్. నడిరాత్రి మీద వర్షం పడుతోంది, ఇల్లు యెక్కడికక్కడే కారుతోంది. చిన్నపిల్ల యేడుస్తూనే లేచింది. మల్లును ఒక మూలకు వేసింది. పుల్లయ్యకు చలివేయటంచేత ఒక మూలకు కాస్త యెత్తుగావుంటే అక్కడ అంటుకొని గజగజలాడుతూనే "ఇవి సెడ్డరోజులు కావా?" అన్నాడు. పుల్లయ్యకు యీ కష్టాలతోపాటు ఒకనాటి సుఖాలు జ్ఞాపకంరావటంవల్ల మరీ బాధవేసి కళ్ళు చెమ్మగిల్లాయి. ఇంట్లో కురిసిన నీరు తన పాదాలదగ్గిరికి వచ్చింది.

నీలి నీరు, గిన్నెతో పెరట వుప్పుటేరులోకి తోడిపోసింది.

"నులకమంచమేనా లేద"న్నాడు పుల్లయ్య.

తెల్లవార్లూ యెవరికీ సరిగ్గా నిద్దరలేదు. ఉదయమయ్యేసరికి చుట్టుపట్ల బురదమయంగా వుంది. కాలు కదిపితే బురద అంటుకుంటోంది. వర్షం ధర్మమా అంటూ కంపు అంతా తుడుచుకుపోయినందుకు పుల్లయ్య సంతోషించాడు. ఉదయం యెండ కాస్తోంది – నిద్దరలేకపోయినా గాయం బాధ అట్టే లేకపోవటంవల్ల పని వెతుక్కోడానికి బయలుదేరాడు. మామూలుగా కొడుకు వెంటబడ్డాడు. రాత్రి ఓ క్షణానికి యెందుకలా అయిపోయానని సిగ్గుపడ్డాడు. తెల్లవారేసరికి బాధ తగ్గింది – పరిసరాలు బురదమయమైనా కంపు లేకండా వుంది. ఆ మాత్రం ఓర్పు తనకెందుకు లేకపోవాలనుకున్నాడు. అలాంటి ఓర్పుతో పని సంపాదించుకొని చెమట కారుస్తానని మనసు దృఢంచేసుకున్నాడు.

ప్రొద్దు నెత్తిమీదకు వచ్చేవరకూ తిరిగాడు. హార్బరుదగ్గరకు వెళ్ళాడు. ఎందరో పనిపాట్లు చేసుకోవటం చూశాడు, వాళ్ళలో తనొక్కడైతే ఎంతబాగుణ్ణు! కూలీలు ఓడనుంచి బస్తాలు దించుతున్నారు – "అయ్యా సూడురా! ఆడు ఒక చిన్న బస్తా జూగుతూ మోస్తున్నాడు.....నానో?" అన్నాడు.

కొడుకు నవ్వుతూ "రెండు.....రెండయ్యా!" అన్నాడు.

అలా వస్తున్న మనిషి వాళ్ళలోని వాడే – మర్యాదగా అడిగాడు. కాలీలేదని చెయ్యి వూపుతూ వెళ్ళిపోయాడు. తిరిగి వచ్చాక మల్లు అయ్య రెండుబస్తాలు మోస్తాడని యెంతో అట్టహాసంగా నవ్వుతూ అమ్మతో చెప్పుకున్నాడు.

పుల్లయ్య భోజనం దగ్గర కూర్చోగానే గుండె గతుక్కుమంది. రేపటికి పని లేకపోతే యీ భోజనం వుంటాదా?..... "నాను పెద్దోడ్ని. ఒక పూట నేకపోతే ఇంకో పూట, కాని నా మల్లుకి......పిల్లకి....."

గబగబ మెతుకులు నమిలి కాలు పీకెట్టున్నా లెక్కసెయ్యక ఒంటిగా సిండియా కంపెనీ (ఓడలు కట్టె కంపెనీ)కి బయలుదేరాడు. కొడుకు అయ్యను వదల్లేదు. పరుగెత్తుతూ వెంట పడ్డాడు. అక్కడ పుల్లయ్య అత్రుతకు తగ్గట్టె మనుషులు జవాబులిస్తున్నారు. వేలకొద్దీ పనివాళ్ళు బాకా రయ్యమనగానే బయటకు వచ్చేస్తున్నారు. వాళ్ళలో ఏ వొక్కరితోనైనా పొత్తు కుదుర్చుకుంటే రేపు తనని పనిలోనికి తీసుక వెళ్తారనే వుద్దేశంతో ఒకాయన నుద్దేశించి అడిగితే వాడు పక్కున నవ్వాడు.

"ఏం అయ్యా, నవ్వుతున్నావు?"

"ఈ కంపెనీలో పనంటే యేటనుకున్నావ్ – నెల జీతం యెనభై రూపాయలకు తక్కువేనేదు....."

"అన్ని రూపాయలే!" జేబులో పడ్డట్టే ముఖంపెట్టి "అయ్యా! దూరపోడ్ని! బతికి సెడినోడ్ని! నీ పున్నెం ఉంటుంది. పిల్లలున్నారు....నీతో రేపు నన్ను తీసుకెళ్ళితే....." అన్నాడు.

వాడు నవ్వుతూ "పనవడమంటే యేంటనుకున్నావ్. ఉత్తి జంగిలీ మనిషిలాగున్నావ్!" అన్నాడు.

"అనయ్యా! పడతాను.....దొంగెత్తయ్యను. నలుగురూ సేసినపనికి రెండురెట్లు సెయ్యకపోతే నివ్వేసిన శిచ్చ పడతాను!"

"ఒరి పిచ్చన్నా" అని పెద్ద నిట్టూర్చి "మొన్న మొన్న ఐదొందల మందిని పనిలేదని తీసేసినారు! ఏసుకుంటే యీ రోజుల్లో పెట్టెలు మొయ్యడానికి సదువులు కావాలట! ఏదో కూలీనాలీసేసుకుంటే బతుకుతావుగానీ – ఎందికిలా తిరుగుతావు?" అన్నాడు.

వాడు గబగబ ముందుకు లెక్కచెయ్యకండా వెళ్ళిపోయాడు.

తిరిగి యింటికి వచ్చేటప్పటికి ప్రొద్దు క్రుంగిపోయింది. ఈ వేళ కాసిన యెండవల్ల యింటి పరిసరాలు అంత అధ్వానంగా లేవు. కొడుకూ తనూ గడపలో కూర్చున్నారు. మల్లు యీ వేళ యే పదిసార్లయినా కుక్కపిల్లను గురించి పలవరించాడు. పుల్లయ్యకు ఇంకా ఆ సిండియా కంపెనీయే తలలో తిరుగుతోంది. అందులో దొరికిపోతే తను తిని నలుగురికీ పెట్టెవోడ్ని అనుకున్నాడు. "కూలీ నాలీ చేసుకోమన్నాడు. అందుకోసమా తను పట్నం వచ్చాడు?..... ఏదో నెలజీతం పని దొరికితే......కొడుక్కి సదివించనా? నా కొడుకు....." ఆలోచనలకు అంతులేక పోయింది – మళ్ళీ రాత్రి......

గడపలోనే పడకవేశాడు. మల్లు అలసి వున్నాడేమో అయ్య చెయ్యి పట్టుకొని నిద్దర పోయాడు.....పది గంటలు దాటింది. ఆకాశాన నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. ఎదురుగుండా చెట్లకు ఉత్తర వేపున్న ఎలక్ట్రిక్ స్థంభానికి ఉన్న వీధి దీపపు వెలుగు చెట్టుక్రిందకు పడుతోంది. చెట్టు క్రింద పిల్లలు ఆడుకోవటం

పరిపాటి కాబట్టి చదునుగా ఉంది. మిద్దెలూ మేడలూ అగపడుతున్నాయ్‌గాని అక్కడ వాగే రేడియో యింతవరకు వినిపించలేదు

గడపలో పుల్లయ్య ఇటూ అటూ అవుతుంటే నీలి కాస్సేపు కాలు పట్టి పిల్ల ఏడుస్తూంటే గదిలోనికి పోయి ఓదారుస్తూ నిద్దరపుచ్చి తనుకూడా పడుకుంది. ఆలోచనలతో పుల్లయ్యకు నిద్దర రాలేదు. కుక్కపిల్ల అరచిన చప్పుడై చప్పున రోడ్డువేపు చూశాడు – చెట్టుక్రింద కుక్కపిల్ల – మల్లుదిలానే ఉంది..... ఆ పట్టుకున్న మనిషి యెవడు? అక్కడే కూర్చున్నాడే.....నిదానించి చూశాడు.....వాడి చేతిలోనుంచి తప్పించుకోవడానికి కుక్కపిల్ల పురకలు వేస్తోంది..... కాని వాడు వదల్లేదు.

పుల్లయ్య లేచి కూర్చునాడు...... కుక్కపిల్లకు ఏదో తినడానికి పెట్టినట్లుంది.... కుక్కపిల్లను అడిగి తీసుకుందామని మెల్లగా లేచి పుల్లయ్య వెళ్ళాడు. ఆ మనిషి దానివేపే చూస్తూ పుల్లయ్య ఆ దరిదాపుల్లోకి రావటం గుర్తించనట్లుంది – అంతా ప్రశాంతంగా ఉంది.....

ఆ చెట్టుక్రింద కూర్చున్నమనిషి ఆ కుక్కపిల్లవేపు చూస్తూ మాటలు మొదలుపెట్టాడు....."మీ జాతి కెంత విశ్వాసం? విశ్వాసంతోనే పుట్తారు.....దానితోనే బ్రతుకుతారు.....ఏ పరిస్థితిలోనూ ఆ విశ్వాసం విడిచిపెట్టరు..... మరి మానవజాతి?...... హోఁ హోఁ..... అంతా నటనే. ఆ జాతికి అందం డబ్బుతో అంతా ముడి......నాతో యేకీభవిస్తావు కదూ?" అంటూ దానిని మళ్ళీ ఒడిలో పెట్టుకొని ఒక ముద్దుపెట్టుకున్నాడు.

దాని తల నిమురుతూ "విన్నావా? విన్నావా నా గోడు నివ్వేనా? రెండురోజులయి నాతోవుంటూ నా కష్టాలని పంచుకుంటున్నావే.......నాకు దొరికినదానితో నీ కడుపు నింపలేకపోతే .......నాకు విశ్వాసం యెక్కడుంటుంది? ....రెండు రోజులయినా నాకు తిండిలేదే......కానీ.....నాకు......డబ్బు లేదనా? ఎంతవుండేది.......నా పెళ్ళాం......నన్ను ద్రోహం చేసిందని అనుమానం వేస్తే – నే నెక్కడ బంగారం పాతరవేస్తానో తెలుసా? – అదంతా నీకు చెప్తాలే......" అంటూ ఆ కుక్కపిల్లను యెత్తుకున్నాడు. ఒక్కసారి కట్టలు తెంచుకొని వచ్చే దుఃఖంతో "నాలో సగం అనుకున్న పెళ్ళం, నమ్మిన స్నేహితుడు కలసి ద్రోహం..... చేశారే – విశ్వాసం.....యెక్కడుంది ఆ జాతికి........" అన్నాడు.

బొలా బొలా యేడ్చేస్తున్నాడు. పుల్లయ్య నివ్వెరపోయి అలా చూస్తునే వున్నాడు – ఆ యేడుపు అలా చాలాసేపటివరకూ తనకు వినిపిస్తూనే వుంది.

తెల్లవారి లేచేసరికి చెట్టుక్రింద మనిషీ లేదు, కుక్కపిల్లా లేదు.

ఈవేళ మల్లు వెంటపడితే యెంత వారించినా వీలులేకపోయింది. మీదకు యెగబ్రాకి అయ్యమెడపట్టుకొని విడిచిపెట్టలేదు. వెళ్ళవలసిన ప్రతి చోటుకి వెళ్ళాడు. ఎక్కడా పని పేరెత్తితే ముఖావం చూపించేవారే! నీలాంటి వాడి కెక్కడ పని దొరకుతాదని కొందరన్నారు. తను ఇదివరలా కండలు తిరిగిన మనిషి, గూటాల్లాంటి దండలతో వుంటే యెంత బాగుండేదనుకున్నాడు. పాత మార్కెటుకు వెళ్ళాడు. అక్కడ ముసలమ్మలు, కుఱ్రకుంకలు బుట్టలు పట్టుకొని

కూలి చేసుకుంటున్నారు. వాళ్ళూ వాళ్ళే పోటీపడి దెబ్బలాడుకుంటున్నారు, ఛా! వాళ్ళతో చేరడమేమిటనుకున్నాడు. ఈ కూలి యెక్కడ దొరకదు? ఐనా తనలాంటి మనిషి చెయ్యవలసిన పనా యిది? మల్లునాయుడు కొడుకు. అంత ఘనంగా పదివ్వాళ్ళకి మొనగాడనిపించుకున్నవాడు యీ బజార్లలో పడిగాపులు కాసి తిరగవలసి వచ్చింది కదా అని నొచ్చుకున్నాడు.

మధ్యాహ్నం అయినా ఇంటి కేదో పని కుదిరితేగానీ వెళ్ళనని భీష్మించుకొని వెళ్ళలేదు, మల్లుకు ఉడకబెట్టిన సీమ పెండలంముక్క ఒక ముసలమ్మదగ్గర కొని ఆ ప్రక్కనే కూర్చొని తినిపించాడు. తల బాగా పండి వుంది. పళ్ళన్నీ రాలివున్నయ్.

"ఏ వూరు నాయనా?" అంది.

"తూరుపోలం – మా వురు నవిరి."

"ఏం వచ్చావు బాబూ?"

"పనికోసం."

"ఎక్కడ చూసినా కరువే నాయనా – ఇంతపట్నం! ఎక్కడా బతుకుతెరువునేదు"

"అవ్వా! నీకెవరు నేరా?" అన్నాడు.

"ఉన్నారు బాబూ – ఇద్దరూ కొడుకులు – ఆడపిల్లలు లేరు – పెద్ద కొడుక్కి సిండియా కంపెనీలో నెలజీతమే,..... నాకు కోడలు తిండిపెట్టదు, రెండోవోడికి ఎక్కడా పనిలేదు – ఒకనాడు ఘనంగా బతికాం – కూలి సేసుకోడానికి మనసొప్పదు. నేను యిలాగే పైసా పరకా తెస్తే ఇంట్లో గంజి ....ఆడికి పెళ్ళం యిద్దరుపిల్లలూ....ఒకోపూట పిల్లలు ఆకలికి..... కటకట లాడిపోతారు..... ఏం సెయ్యడం! ఆ తండ్రి ఏనాడు కరుణిస్తే ఆనాడు....."

పుల్లయ్యకి ఈ మాటలు వింటూంటే తన పిల్లలే ఆకలికి కటకట లాడిపోతున్నట్లనిపించింది. ఈ లోకంలో కష్టాలన్నీ తనొక్కడివేకావు. ఎవరికి తగ్గవి వాళ్ళకి వుండనే వున్నాయ్. ఈ ముసలమ్మ ఈ కష్టాల్లోనూ ఇంత ధైర్యంగా ఏలాగుండగలిగింది? ఆమెకు దేనిమీదో పెద్ద విశ్వాసం వుంది. ఆ విశ్వాసంతోనే ఆమె ఇన్ని కష్టాల్లోనూ సుఖంగా బ్రతుకుతోంది? తనకెందుకలా లేకపోవాలి అనుకున్నాడు.

విసుగుబాటు పోయి విశ్వాసం తనలో చొచ్చుకోవటంవల్ల మళ్ళీ ముందుకు బైలుదేరాడు.

ఒక కొట్టుదగ్గర పదిమంది మూగివున్నారు. తొంగిచూశాడు. రెండే సైకిలు రిక్షాలు కొత్తవి వున్నాయి.

ఒకటి తనకిస్తే వాళ్ళకి రోజుకు దొరికింది సగం యిచ్చి మిగతా సగంతో తను బ్రతికేసును. మళ్లీ సంశయించాడు. ఒకప్పుడు నలుగురి చేత పని చెయ్యించుకొనేవాడ్ని. మనుషుల్ని మోసే గుర్రంలా తయారవుతానా? ఆ పనిచేస్తే.... తన వూర్లో తెలిస్తే.....ఆ చుట్టుపట్లునుంచి యెవ్వుడు ఆసుపత్రి పనిమీద వచ్చేనా చూస్తే.....తన్ను కులంనుంచి వెలివేసేరా?......మళ్ళా ఆ ఊరు ముకం చూస్తానా? ఇదేం పని అనుకున్నాడు.

మరికొంతసేపు వీళ్ళన్నీ, వాళ్ళనీ కలుసుకొని గతిలేక తిరిగి అక్కడికే వచ్చాడు. ఆ యజమానిని కులుసుకున్నాడు.

"రోజుకు రెండురూపాయలు అద్దె!" అన్నాడు.

"రెండు రూపాయలే..."

"ఏరోజునైనా పది రూపాయలు దొరికితే, హెచ్చు నాకిస్తావా....రెండురూపాయలే అంటున్నావు!"

"తూరుపోడ్ని బాబూ! నాకు తెలీదు - అంతడబ్బు వస్తాదా?"

"ఒడలమీద దొరలు దిగారంటే, అందులో తాగుంటారేమో - సోబుదారి గల్లీకి తీసికెళ్లావంటే ఒకటేంటి - రెండు రూపాయల కాగితాలిసిరేస్తారు!"

"సోబుదారి గల్లీ యేంటి బాబూ?"

"అది తెలియనోడివి - నివ్వేం రిక్షాతొక్కుతావ్? అక్కడవున్న ఆడోలకేసి చూసావంటే కళ్ళు జిగేల్‌మనిపోవా?"

పుల్లయ్య కీ మాట లేవీ నచ్చలేదు. ఒకప్పుడు యెవరైనా తన కష్టానికి మించియిస్తే తనెందుకు పుచ్చుకోవాలి? ఆ గల్లీకి అసలే వెళ్ళను అనుకున్నాడు. అప్పుడే త్రొక్కి డబ్బు సంపాదించుకుందామని యజమానితో-

"సరే! గాడీ యియ్యండి. రోజుకు రెండు రూపాయలకి ఒప్పుకున్నాను" అన్నాడు.

ఈ మాటలు తెగించి అనేశాడు - ఏదో ఖూనీ చేసేడానికి వుపక్రమించినవాడిలా! ఆ యజమాని "అయితే డిపోజిట్టు పాతిక రూపాయలూ తే" అన్నాడు.

"డిపోజిట్టు అంటే?"

"తూరుపోలకి యేమీ తెలీదులే. అందులో వాళ్ళు వుత్తిజంగిలీ వోళ్ళు - దొంగతనంచేసి పారిపోతారు-"

ఈ యెత్తి పొడుపు పుల్లయ్యకి కష్టం అనిపించినా సహించి, "పాతికి రూపాయలా?" అన్నాడు.

"సూశావా? రిక్షాలు యెక్కడ దొరకలేదు. ఒకదానికి పదిమంది తగుల్తుంటే మేం యేం సెయ్యటం? నివ్వు యెప్పుడు మానిస్తే అప్పుడు పాతికి తిరిగి యిచ్చేస్తాం."

పుల్లయ్య తనదగ్గర డబ్బులేదని, యెలాగైనా కనికరం చూపించమని బ్రతిమాలాడు. కానీ లాభం లేకపోయింది. ఆతృతకొద్దీ "యెలాగో తెస్తాను. గాడీ యింకొకరికి యిచ్చేక" అన్నాడు.

"నీలాగ పదిమంది వచ్చారు. రేపు తెల్లారేవరకే షరతు. అప్పటిలోగా రాకపోయావంటే యింకెవరికైనా యిచ్చేస్తాను."

సరేనని యింటివేపు బయలుదేరాడు. "ఒక్కసారి పాతికరూపాయలే. యెక్కడ మంచి తేను? ఇంట్లో ఒక కానీలేదు, రాతిరికి యెలాగనుకుంటూంటే పాతికరూపాయ లెక్కడతేను? - ఎవర్ని అప్పు యిమ్మని అడగ్గలను? అక్కడ చెక్కా ముక్కా వుండేది. ఆ రాజిగాడికి తాకట్టు యెట్టేశాను. యిక్కడేముంది? నన్నెవడు తాకట్టుపడ్తాడు?"

నడుస్తున్నాడేగాని మనసు మనసులోలేదు. నీలితో చెప్పినా వూరుకుంది. మధ్యాహ్నం వుంచిన గంజి త్రాగాకకూడా అలా వాకిట కూర్చొని రోడ్డువేపు

చూస్తున్నాడు. కొందరి జేబులు యెత్తుగా వున్నాయ్, అందులో డబ్బుంటాది – ఒక పాతిక అప్పిస్తే – ఆ యమ్మ మెడనిండా బంగారం ఆ బరువు మొయ్యలేకపోతోంది. నాకు వడ్డీకి పాతిక రూపాయలిస్తే – ఆతృతతో లేచి అడగాలనుకున్నాడు. కానీ జవాబు తనే ఊహించి నోరు కదపలేకపోయాడు. రాత్రి ఈ చెట్టుక్రింద వున్న మనిషి – బంగారం యెక్కడ దాచాడో చెప్తే – అందులో పాతికరూపాయలకు సరిపడ్డదే తీసుకొనేవాడినే – మళ్ళీ వాడికి యిచ్చేద్దును!

నిముషం గడుస్తున్న కొద్దీ ఆతృత హెచ్చిపోతోంది. ఆతృత హెచ్చుతున్న కొద్దీ ఆలోచనలు ఒకమార్గం పట్టలేదు. ఏ గమ్యం చేరకుండానే చీకటిపడిపోయింది. యేమో రోడ్లమీద దీపాలు వెలగలేదు. బహుశః పాడైవుంటాయేమో!

అలా ముడుకులుమీద తలపెట్టి దైన్యంగా కూర్చున్నాడు. ఇంట్లో పిల్ల ఏడుస్తుంటే నీలి ఓదారుస్తోంది. అది కొంతసేపయ్యాక యిటువేపున్న యౌవ్వని. మొగుడు యింట్లో లేడని సినీమాపాట కూనిరాగం తీసుకుంటోంది. పిల్లలు యేదో అడుగూ మడుగూ వండగా తిన్నారు. నీలి మొగుడిని గంజి త్రాగడానికి రమ్మంది.

సగం త్రాగి ఒకసారి భార్యముఖంచూసి, మిగతా సగం ఆకలి వేస్తున్నా విడిచిపెట్టేశాడు.

చీకటిరాత్రి – చిన్న చలివేస్తోంది. ఐనా తండ్రీ, కొడుకూ గడపమీదనే వున్నారు. నీలి గదిలో పిల్లను వేసుకొని పడుకొంది. పది గంటలుదాటి పదకొండు దగ్గరగా అయ్యింది. మల్లు అయ్యవక్షంమీద పడుకున్నాడు, పుల్లయ్యకు ఆతృతతో, ఆవేదనతో నిదరపట్టలేదు. తలనిండా ఆలోచనలే – ఈ రాత్రి యెలాగైనా పాతిక రూపాయలు సంపాదించాలి. దీనితో తనకు బ్రతుకుతెరువు దొరుకుతుంది – అడుక్కుంటే దొరకదు. దొంగతనానికి వెళ్తే? ఛా ఛా అనుకున్నాడు.

నీలమ్మ తల్లిని, దాసయ్యని భక్తితో తలచుకున్నాడు. ఇలాంటి ఆపదలో సాయం చెయ్యమని విన్నవించుకున్నాడు. కొద్దిగా కదిల్తేసరి మల్లుకు తెలివి వచ్చేస్తోంది. ఇంతలో ఆ చీకటిలో ఎవరో వచ్చిన చప్పుడైంది. దాసయ్య ఈ రూపంతో వచ్చాడా? లేక అదెవరూ? రాత్రివచ్చిన మనిషా? వీళ్ళెవరూ కాదు – పొరుగు యువకుడు ఇంట్లోకి వెళ్ళిపోయాడు ఓ క్షణం పోయాక గుసగుసలు వినిపిస్తున్నాయి.

"సూడే!"

"హో....."

"నిన్ను ఇలాగ వుస్తానా? గొప్పోడి పెళ్ళంలాగ సిల్కుబట్టలతో ఉంచనా?"

"ఎక్కడ దొరికినాది?"

"దొరకుతాదా? వాల్తేరు టేషనుకాడ – జేబు కొటేశాను"

"పట్టుకోనేదా?"

"టిక్కెటుకోసం – రద్దీ – ఆ మందలో యెంత సులువనుకున్నావ్–"

పుల్లయ్యలో అదోలాంటి ఆవేశం వచ్చేసింది. తన బతుక్కోసం ఒక్కసారి తనూ ఆ పనెందుకు చెయ్యకూడదు? "మళ్ళీ ఈ జన్మలో ఆ పని సెయ్యను. ఆ డబ్బుకి పదిరెట్లు పేదోలకి ఆ తెలియని మనిషి పేర దానం సేస్తాను"....వెళ్ళాలని లేవబోయాడు....మల్లుని ప్రక్కకువేస్తే కళ్ళు నలుపుకుంటూ లేచి కూర్చున్నాడు......

"యీాడితో సాలాసిక్కే....." అనుకొని మళ్ళీ వక్షంమీద వేసుకొని బుజ్జగిస్తున్నాడు....

అదిగో ఈల వేసింది – రైలు వస్తుంది – టిక్కెట్లు కొనటానికి అంతా తయారవుతారు..... రద్దీ..... ఆ జనంలో తను త్రోసుకొని వెళ్ళినట్లు జేబులో పర్సు కాటేసినట్లు.....వూహించాడు.

మళ్లీ మెల్లగా మల్లుని పడకమీద వేసి లేచి నాలుగడుగులు ధైర్యంతో వేశాడు. కొడుకు యేడుస్తూ లేచి గబగబ వెంటపడ్డాడు. పుల్లయ్యకు యెక్కడలేని విసుగూ, కోపం వచ్చాయి. మళ్ళీ పడకమీదవేసి మొత్తుతున్నాడు. కాస్సేపటికి మల్లు నిద్దర నధినయింటంతో మెల్లగా చప్పుడు కాకండా బయలుదేరాడు. అయ్య చెయ్యి వీపుమీద లేకపోవటంతో మల్లు తలెత్తి చూశాడు. అయ్య మెల్లగా రోడ్డుమీద కదులుతున్నాడు. ఆ చిన్న మనసుకు ఓ విషయం తట్టింది. వెంటపడితే అయ్య తనని రానివ్వడు. కొట్తాడేమో......దూరదూరంగా అయ్య పోల్చుకోకండా,.. దాక్కోని......మెల్లమెల్లగా వెంటపడ్డాడు!

పన్నెండు గంటల రాత్రి......వూరు నిద్దరపోయింది.......అక్కడక్కడ రిక్షావాళ్ళు అగుపించారు. పుల్లయ్య పెద్ద పెద్ద అంగలు వేసుకొని వాల్తేరు స్టేషనువేపు వెళ్ళాడు. దూరదూరంగా రోడ్డుప్రక్కనుంచి మల్లు అయ్యని అనుసరించాడు......

స్టేషను చేరేటప్పటికి నిజంగా మూడవతరగతి బుక్కింగు ఆఫీసు దగ్గర రద్దీ యెక్కువగా వుంది. పుల్లయ్యకు సంతోషం, భయం రెండూ ఆవరించాయ్! శరీరమంతా యెందుకో గగుర్పాటు జెందసాగింది. ఐనా తన బ్రతుకుతెరువు కోసం యీ పని చేసితీరాలనే మొండి పట్టుదల, అలా వస్తున్న మనిషిని చూడగానే మరింత నాటుకుంది. "ఈ బాబుదగ్గర డబ్బుంది – ఊరడుగుతాను – పేరడుగుతాను. పాతికే తీసుకొని, మళ్ళా అందులో యేనాడో పాతిక కలిపి...... ఆ బాబుకి యెల్లి యిచ్చేస్తాను – నిజంసెప్పి బతుక్కోసం సేసానని బతిమాలుకుంటాను.....దేముడు సూడడా?"

"ఏ వూరెల్తారు బాబూ?"

"పొందూరు."

సమాధానం సెప్పాడు, మంచి బాబులాగే వున్నాడని " ఆ వూరేనా బాబూ తమరిది?"

"అవును...."

"తమ పేరు......"

"నాగభూషణం......"

"చిత్తం, చిత్తం......"

మనసులో తను చెప్పినవి మరచిపోకుండా మళ్ళీ మళ్ళీ అనుకున్నాడు.... మల్లు ఆ షెడ్డు స్తంభంచాటున నిల్చుని అయ్యవేపు తదేక దీక్షతో చూస్తున్నాడు.....

అదిగో. నాగభూషణం టికెట్టు తీసుకోడానికి జనంలో దూరాడు. మరెవరిదీ. దొరికినా ముట్టుకోకూడదు. ఆ ఖద్దరు బెంగాలీ షర్టు పక్క జేబులో పర్సు కనిపిస్తోంది..... పుల్లయ్య అటువేపు చేతులో టిక్కెట్లు డబ్బు వున్నట్లు బుకింగ్ ఆఫీసువేపు నడిచాడు.... ఆ జనంలో తనూ దూరాడు – కాళ్ళు గజగజ

వణికిపోతున్నాయ్..... ఒళ్ళూ, తలా బరువై పోతున్నాయి..... మనస్సంతా మహా సముద్రమై అల్లకల్లోలం చేసేస్తోంది – ఆకలి.... గబగబ ఆ చేతిని ఆ జేబులో చెయ్యి పెట్టించింది.... పర్సు దొరికింది..... .అయ్యో! తెలుసుకున్నాడు. దొంగ – దొంగ – కేకలు.... పరుగెత్తుతున్న దొంగ దొరికిపోయాడు జనమంతా యిటువేపు తరలారు......మనిషో మూట.....ఒకడు ఒకనాడు జవ్వనులు మురిసిపోయిన గీరా గిరజాల జుత్తు గట్టిగా పట్టుకొని దించుతున్న తలెత్తాడు..... గుంపులో యెవరికి తోచినట్లు వాళ్ళు పడపడా వాయించేస్తున్నారు. పుల్లయ్య సిగ్గూ......బలహీనంతో క్రుంగిపోయి క్రింద కూర్చుండిపోతుంటే యెవరో తాపుతన్నారు....పోలీసులని పిలవండీ అని నాగభూషణంకు సలహాలిస్తున్నారు.

ఈ కోలాహలం చూసి కొడుకెంతసేపో చాటున వుండలేకపోయాడు. అయ్యను అంతా కొట్టూంటే నిల్చున్నవాళ్ళ మధ్యనుంచి సందుచేసుకొని లోనికి ప్రాకి కొట్టున్న పెద్దమనిషి కాలు రెండు చేతులతో పట్టుకొని ఒక్కకాటు వేశాడు. కోపంతో పుల్లయ్యను కొట్టున్న మనిషి అమ్మో అని ఒక్కసారి అన్నాడు. అని వెనుకకు తిరిగి ఆ పిల్లవాడిని ఆ కాలితోనే ఒక్కతాపు తన్నాడు. పిల్లడు క్రిందపడి దొర్లిపోయాడు...... మోటుగావున్న గచ్చు కనికరంలేకండా ఆ లేత చర్మానికి రాపాడి రక్తం తెప్పించింది.

నిస్సహాయుడై పుల్లయ్య కొడుకు వేపు చూశాడు – కళ్ళంట నీరు జలజల రాలసాగాయ్.

ఇంతలో నాగభూషణంగా రన్నారు:

"వాడ్ని విడిచిపెట్టండి!"

"పిచ్చి పట్టిందయ్యా – ఈ వేళ నిన్నూ, రేపు యింకొకర్ని – వీళ్ళ బతుకులింతే, జేబుకాటు లేదా ఖూనీలు చేసేస్తారు..... పోలీసులకు అప్పచెప్పవలసిందే....."

"నే నా కేసుల్లో తిరగలేను. నా డబ్బు నా దగ్గరేవుందికదా – విడిచి పెట్టం"డని ముందుకు వచ్చి పుల్లయ్యను విడిపించి చెయ్యి పట్టుకొని లేవనెత్తాడు. తలదాచుకొన్న పుల్లయ్య వెళ్ళిపోమనగానే కొడుకు దగ్గరకు వెళ్ళి యెత్తుకొని మాటాడకండా ఇంటివేపు అడుగులువేశాడు.

త్రోవలో కొడుకు తన ప్రతాపం చెప్తుంటే మరింత యేడుపువచ్చింది. కానీ ఒక్కమాటా ఆడలేదు. ఇంటికి వేళ్ళేసరికి నీలి యేడుస్తున్న పిల్లను ఓదారస్తూ "యెక్కడి కెళ్ళా"వంది. పుల్లయ్య మాటాడకండా గడపలో చారబడ్డాడు, మల్లు తన ప్రతాపం అమ్మ తెలుసుకోవాలని యిదివరకుండే ధోరణిలో "అమ్మా అమ్మా! అఅలు అంతా కలిసి అయ్యని దబ్బుదుదబ్బుదు యేసేస్తుంటే..... యెర్లి కరిసేశాను....." అని చెప్తున్నాడు.

ఈ మాటలు నోటనే వున్నాయ్, పుల్లయ్య "మల్లూ" అని అరిచాడు. అంతా గ్రహించిన నీలి "దానికి వెళ్ళావా?....." అని పెద్దగా నిట్టూర్చింది, పుల్లయ్యకు యెడతెగని అభిమానం, కోపం వచ్చి, కొడుకు వీపుమీద గట్టిగా చరిచాడు. అయిదేళ్ళూ అంటుకపోయాయి, యేడుస్తూనే అమ్మ దగ్గరకు వెళ్ళకండా "అయ్యా" అంటూ గడపకు పుల్లయ్యదగ్గరేకే వచ్చేసాడు. నీలి మాటాడలేదు. దీపం ఆర్పి పిల్లను వేసుకొని చారబడింది. ఆమెకు తల్చుకున్న కొద్దీ....దిగులుతో నిద్దరపట్టలేదు.

పుల్లయ్య వెల్లకిలా పడుకుంటే మల్లు మాఘ్మ్యాలుగా వక్షంమీద పడుకున్నాడు. చీకటి... అంతా నిశ్శబ్దంగా వుంది. ఆకాశం నుంచి చుక్కలు తనవేపు చూస్తున్నాయ్ వీవగించుకుంటున్నాయ్ – మధ్యమధ్యను కొడుకు బెక్కుతున్నాడు....

మెల్లగా తన చేతులు కొడుకు వీపుమీదకు వెళ్ళాయి........అభిమానంతో తలనుంచి ఒళ్ళంతా తాకాడు..... కొడుకు రాల్చిన కన్నీరు వక్షంమీదపడి చల్లగా వుంది..... ఒక్కసారి పుల్లయ్యకు అంతులేని దుఃఖం వచ్చేసింది. కొడుకును గట్టిగా నొక్కి పట్టుకొంటూ "నా మల్లూ......నా నాయనా!" అంటూ వలవల యేడ్చేశాడు.

# 30

పుల్లయ్య ఉదయం ఆలస్యంగా లేచేసరికి మల్లు కుక్కపిల్లను పట్టుకొని గెంతులేస్తున్నాడు. వాడి సంతోషానికి అంతులేకపోయింది. అయ్యతో ఆ కుక్కపిల్ల యెలా దొరికిందో చెప్పాడు. ఏవడో ఆ మనిషి బూచోడిలా వున్నాడట! వాడివెంట కుక్కపిల్ల నడుస్తుంటే వెనకనుంచి వెళ్ళి పట్టుకొని పారో!

దానికో తాడుకట్టి, వాడెక్కడ వస్తాడేమోనని పెరటితడికకు కట్టాడు. దానితో మాటలకూ ఆటలకూ దిగాడు. అది కయ్ కయ్‌మని వుండీ వుడిగి అరుస్తోంది. ఈ సందడి చూసుకొని పుల్లయ్య చడీచప్పుడు లేకండా చాటుగా ఒంటిగా పని వెదకటాన్కి వెళ్ళిపోయాడు.

ఎక్కడికివెళ్తే దొరుకుతుంది? చూడవలసిన పెద్ద "కుంపినీలు" అప్పుడే చూసేసాడు. మెయిన్‌రోడ్డుమీద ఏదో పెద్దమేడ కట్టుతున్నారు. అక్కడ కూలీలను తాపీ పనివారినెందరినో చూశాడు. "పనివుందా?" అని ఒక మేస్త్రీని అడిగాడు. లేదు అనే సమాధానం వెంటనే వచ్చింది. "తూరుపోడ్ని, పిల్లలుగలోడ్ని, మీలో ఒకడ్ని చేసుకోండయ్యా!"

"మేమే యిందరం వుంటే!"

ఆ ప్రక్కనున్నవాడు "పోనీ, యీ రోజుకి తీసుకోరా" అన్నాడు.

"సూడు, అలాగున్నాడు కదా! ఆడేం కూలిపని చేస్తాడురా?"

పుల్లయ్య తనవేపు చూచుకున్నాడు. చిరిగిపోయిన చింకి మోటు బనియను, ఆ చిరుగుల్లోంచి చూస్తే – యెముకలే కనిపిస్తున్నాయ్. ముడుకులు దిగలేదు పంచె – మాసిపోయింది. మూతినిండుగా మీసాలున్నా దానిని అనుకొన్న గెడ్డం బాగా మాసిపోయింది. తనకేం జబ్బులేదే? ఒకటే జబ్బు – ఒకటే విచారం – "ఛా, ఈ జానెడు పొట్టకేనా యీ తంటాలు – యీ యెత్తిపొడుపులూ?" ఎంత ప్రయత్నించినా కూలికి వస్తానన్న మాట నోటివెంబడి రాలేదు. ఆ గుంపుల ఆడవాళ్ళుకూడా ఉన్నారు. ఆ ఆడవాళ్ళలో కండలు తిరిగి సహజ సౌందర్యంతో పుట్టిపడే యౌవ్వనులు కూడా వున్నారు. కాస్సేపు నిల్చొని పరికించి చూశాడు. మీసాలు నల్లగా వున్న ఒక మేస్త్రీ "యేమే మరదలా! మా తమ్ముడు మెత్తనోడైపోనాడా నేక యింకోదాని వల్లోపడి అక్కర సెయ్యనేదా?" అంటున్నాడు.

ఆ జవ్వని ముసిముసినవ్వు నవ్వుతూ "ఆడదాన్ని సూస్తే తిమ్మనలాగ పళ్ళిగలించ"కంది. ధానితో నోరుమూసుకున్నాడు. మరో యిద్దరు ఆ యిల్లు కట్టిస్తున్నావాడి గురించి పనిచేసుకుంటూనే బాతాకానీ వేసుకుంటున్నారు. ఆ యజమానికి, ఒకనిపై ఆడది మోజుపడటంవల్ల యింతడబ్బు వచ్చేసిందని, అదృష్టం అంటే అలాగుండాలని ఒకడంటే– "అదే ఒక అదుష్టమా – సెమటోడ్చి గడించిందే దక్కాదు, ఇలాంటి వెలాగుంటాయ్!" అని మరొకడు అంటున్నారు,

ఆ ప్రక్కనున్న యింకొకడు కాలుతున్న చుట్టను ప్రక్కను పెట్టి, "లచ్చిందేవికి నీతి లేదేరా – ఉన్నోలింటికే యెల్తాది, మొన్న యీడి బామర్దికే బేకట్ల ఆటలో యేబయి యేలొచ్చాయట! ఇంతమంది సస్తున్నారు. ఆ బేకట్లు ఆటలోపడి మా అల్లుడు ఆఖరికి యేంచేసినాడు? రైలు క్రింద తలెట్టేసినాడు – అడు. పెళ్ళాం నలుగురుపిల్లలూ నా యింటిలో పడ్డారు – రోజులు సూసినావా యెలాగున్నాయో!" అన్నాడు.

ఈ మాటలన్నీ వింటూ పుల్లయ్య అలానే నిల్చుంటే యీ మేస్త్రీయే అన్నాడు: "పోనీ, యీ రోజుకి పనిసెయ్యి – మావేఁ యెక్కువైపోనాం!" మిగతావాళ్ళు కాదనలేదు. పుల్లయ్య సున్నం కలిపాడు – మోసాడు కొంతసేపు – కానీ వుత్సాహంగా లేదు. మధ్యాహ్నంసరికి పెద్దమేస్త్రీ అన్నాడు: "చూసావా! అడిపని – అడదానికంటే నాసి – యిలాంటోడి నేసుకుంటే నాకేం నాబం? – యింద ఈ అర్ధరూపాయి తీసుకొని యెల్లిపో!" అని పంపించివేశాడు.

పుల్లయ్యకు ఆ ఆడవాళ్ళ యెదరగా చాలా నామోషీ అనిపించింది. ఆ అర్ధరూపాయి వాడిమొహంమీద కొట్టేద్దామనుకున్నాడు. కానీ, చెయ్యాడలేదు. ఇంట్లో మల్లూ పిల్లా జ్ఞాపకం వొచ్చారు. వాళ్ళు ఆకలితో యీసరికి యేడుస్తుంటారు. ఇది ఒక పూటకైనా జరుపుతుందని యింటివేపు బయలుదేరాడు. త్రోవలో ఒక మూడంతస్థులమేడ కనిపించింది. నిల్చొని పైకి చూసాడు. "అది ఎక్కి సూస్తే పట్నం పట్నం అంతా కనిపిస్తాదేమో! ఎక్కితే బాగుణ్ణు!" కానీ తన జన్మలో అదెక్కగలడా?

ఇంతలో "అయ్యా" అన్నకేక వినిపించింది. మల్లు! – ఇక్కడికెలా వచ్చాడు – ఏ బస్సులూ కార్లక్రిందో పడిపోతే – వచ్చి గట్టిగా పట్టుకుని వెంటనే నిష్ఠురంగా మాట్లాడేస్తున్నాడు. కొడుకు నెత్తుకొనేసరికి యెక్కడలేని సత్తువ, ఆనందం కలిగాయి. నాలుగడుగులు వెయ్యగానే "అయ్యా, అయ్యా – అడిగో బూచోడు!" అని చూపించాడు.

వాడు ఆ రాత్రి చెట్టుక్రింద వున్న మనిషే! ఏదో గొణుక్కుంటున్నాడు. పుల్లయ్య ఆ దగ్గరగా నిల్చున్నాడు – వింటున్నాడు. "లోకం అంతా మోసమే – నాకు లోకం అంతా కలిసి మోసం చేశారు. అదిగో, ఆడు నా డబ్బుతో మూడంతస్తుల మేడ కట్టేశాడు. నా కుక్కపిల్లని ఎవడో ఎత్తుకపోయాడు – అదే మిగిలింది. అదే నాదయింది అదే నా కష్టాలు విని సానుభూతి చూపించి నా వెంట తిరిగింది – అది నాకు లేదు – నే నెందుకు ఒంటరిగా బతకాలి? – అయ్యో! నేనెంత పిరికివాడ్ని? – పిరికివాడు రోజూ చస్తాడు – ఎప్పుడో

అతీగతీలేక రోడ్డుమీద కుక్కలాగ చచ్చిపోతాడు – ఇది నిజం – కానీ నా రోదన వినేవాళ్ళింకెవరు?"

ఆ దీనాలాపన పుల్లయ్యకు అర్థమైంది. తనూ రోజూ చచ్చిపోతున్నాడనిపించింది. తన కెందు కీ బ్రతకలేనన్న పిరికి? ఆ పల్లూడిన ముసలమ్మ కర్రపెండలం అమ్మి కొడుకునూ వాడి పిల్లల్ని పోషిస్తోందే? ఆ తాపీ మేస్త్రీ యిలాచేసి తన కుటుంబంతోపాటు కూతురుకుటుంబం ఈడుస్తున్నాడే! తనలో ఏదో లోటుండాలనిపించింది. తనకెందుకా ఆశ? చప్పున పెళ్ళాం అన్నమాటలు స్ఫురించాయ్: "ఈ లోకంలో అందరూ రాజులు కాలేరు. అందరూ అడుక్కోరు – రాజుకుతగ్గ బతుకు రాజుది, అడుక్కున్నవాడికి తగింది వాడికి – రాజుకంటే రెండోవాడే సుఖంగా ఉంటాడు – రాజుకు మారాజు కావాలన్న ఆశ వుంటాది – ఆ ఆశతో వాడికి సుకం వుండదు. అడుక్కునేవాడికి కడుపునిండినరోజు సుకం – లేనినాడు బాధ – అంతే! తనకు నెలజీతం పనవ్వాలని కొట్లాటెందుకు? ఇలాగే యెళ్ళనీ – రోజులు బాగుంటే పేదోడు మారాజు అవడా! ఆడెవడో మే డెలాగ కట్టించేస్తున్నాడు?"

ఈ ఆలోచనలతో పుల్లయ్య ఇల్లు చేరుకున్నాడు. పట్నంలో తొలిసారి ఆర్జన పెళ్ళంచేతిలో పెట్టగానే ఆ అల్ప సంతోషి ముఖం ఒక్కసారి వెలిగినా వెంటనే ఎలాగ వచ్చిందో చెప్పమన్నది. అంతా వివరంగా చెప్పగానే "ఇలాగైతే బ్రతక్క యేం అవుతాం?" అన్నది.

సాయంత్రం కొడుకును పట్టుకొని ఈ కొట్లో ఆ కొట్లో పనికోసం వాకబుచేసుకొని వచ్చేసరికి యింటిదగ్గర సందడిగా వుంది. పిల్లికోసం యేడ్చిన పొరుగుమనిషి దుఃఖం కాస్తా దూరం కావటంవల్ల తన మామ్మూలు స్వరూపం దాల్చింది. ఆ వీధంతా ఆమంటే హడలు. మొగవాళ్ళుకూడా ఆమె నోరు విని యింటినుంచి వెళ్ళిపోతారు. పుల్లయ్య ఆమెను ఈవేళే సరిగ్గా చూశాడు. వయస్సు ముప్పై ఐదు నలభై మధ్యలో వుంటాయి. పిల్లలు లేరు, అందుచేత మనిషి చూపుకి ముప్పైయేళ్ళలోపు మనిషిలా ఉంటుంది. పిక్కబలం ఉండి ఆమెలో స్త్రీకి వుండే కోమలత్వం ఒక పాలు, మిగతా మూడుపాళ్ళు పురుషునిదే! మొగుడిలో యిటు దటు! వాడే పెళ్ళం ఈమే మొగుడులా యింట్లో మెసులుతారని ఆ వీధిలో అనుకొంటుంటారు, ఆమెకు వినిపించనట్లుగా!

పుల్లయ్య వెళ్ళినా ఆమె వాగ్ధాటి తగ్గలేదు. నీలి సన్నని గొంతుకతో యిచ్చిన సంజాయిషీ ఆమె వినిపించుకోలేదు. మొగుడ్ని చూచి నీలి యింట్లోనికి వెళ్ళిపోయింది. అడగ్గా యింతకీ తేలిందేమిటంటే యింటి మొగుడు తెలియక రెండు రూపాయిలకి యిల్లు యిచ్చేసాడు, ఇంకో రూపాయి యివ్వకపోతే ఖాళీ చేసి తీరాలని–

"దానికే యింత నోరుచేసిందా?" అన్నాడు.

"నిన్న పిల్లలు గోలచేస్తున్నారని యేదో కస్సు బుస్సుమంది. ఆ కోపం యీ కోపం కలిసింది."

"పిల్లలు అల్లరిపెట్టక – పెద్దోలు పెట్తారా? రానీ తగువు యెలాగ పెట్తారో చూస్తాను. నోరుజారిస్తే నువ్వూరుకోక!"

నీలి నవ్వింది. "అది జారేసిందని నేను జారేస్తే యేమున్నది? నా తప్పేం నేదు – నే నెందుకు దానిలాగ అయిపోవాల? కోపమంతా కక్కేసీ....."

"అంతా కక్కేస్తాది – కాటి కెల్లేవరకూ వుండదా?"

"ఒంట్లో ఒక పుండు ఎంతకాలం వుంటాది? అది బాగు కాకపోతే మనిషేమౌతాడు? అలాగే సెడ్డేదీ మనిషిలో ఎంతోగాలం వుండిపోదని మా మామ్మ చెప్పింది. మంచి దగ్గర సెడ్డకి లొంగుబాటు లేకపోతే యీ పెంపంచకమే నిలవదు."

పుల్లయ్య ఇంత సమాధానం విన్నాక మాటాడలేదు. ఆ రాత్రి నిద్రపోయే ముందు నీలి రాత్రిజరిగిన విషయంగురించి యెత్తింది. పుల్లయ్య దిగులుతో మాటాడలేదు. ఆమె మౌనంగావున్న భర్తతో మెల్లిగా అన్నది – "సూడు! యీలాగ పచ్చుల్లాగ సచ్చిపోదాంగానీ, దొంగతనానికి మాత్రం యెల్లొద్దు."

పుల్లయ్య తను దొంగతనానికి యెల్లలేదని తన వుద్దేశం చెప్పాడు. కొంతసేపయ్యాక "పొరపాటై పోనాది. ఏదో బతుకుతానని అనుకున్నాను. మల్లా నా పీక తెగినా అలాంటిపని చేస్తానా?" అన్నాడు.

"నానూ యెవరింటికాడైనా పని సూసుకుంటే యిద్దరు తెచ్చింది సరిపోదా?" అంది.

పుల్లయ్యకు యీ నిముషంలో తన గడచిన జీవితమే జ్ఞప్తికి వచ్చింది. మెయిన్‌రోడ్డులో కట్తున్న యింటిదగ్గర ఆడవాళ్ళమీద మగాళ్ళు విసిరే విసుర్లు నెమరువేసుకున్నాడు.

"ఎందుకులే" అనేసాడు.

ఆ మరుచటిరోజు వీళ్ళనీ, వాళ్ళనీ పని విషయం అడిగాడు. మళ్ళీ సిండి యాకంపెనీ నేవల్‌బేస్, హార్బరువేపు వెళ్ళాడు, పట్టరాని వాళ్ళ కాళ్ళు పట్టాడు. కాని లాభంలేకపోయింది. మధ్యాహ్నం ఒక దక్షిణాది వేలంవ్యాపారస్థుడి మూటలు మోసాడు. సాయంత్రంసరికి మూడు పావలాలు యిచ్చాడు. తనకు సంతోషంలేదుగాని నీలికి యిదే చాలానిపించింది. ఆ రాత్రంతా ఆవేదనే. పిల్లలు మధ్యాహ్నం ఆకలితో యేడుస్తుంటే పొరుగునున్న యీవ్వని పిల్లలకు తిండి పెట్టిందట – దాని దే జాతో – కడుపు మాడుతుంటే జాతీ గీతీ ఎందుకనుకున్నాడు. ఆ రాత్రి మీద తలుచుకున్నకొద్దీ నిద్దుర దూరమౌతోంది. ఎదరగా చెట్టుక్రింద బూచోడు పడుకొని వున్నాడు. చలి కొద్దిగా వేస్తోంది. ఉప్పుటేరుప్రక్కను రైలురోడ్డువుంది. పోతూపోతూ రైలు ఊలవేసింది.....భయంకరంగా! ఆలోచనలు పట్టుతప్పి మనిషిని నీరసం చేస్తున్నాయి – రైలుక్రింద పడిపోతే – అనుకున్నాడు! "ఛా ఛా – మొగోడై పుట్టావ్ – పాపలా డబ్బులు తెచ్చుకోలేవా? ఆడది, పిల్లలు యేమౌతారు?" వాళ్ళు యేడ్చుకొంటున్నట్లు అప్పుడే కళ్ళకు కట్టినట్లయినది. "నా నాయనా! నా మల్లూ" అని యేడ్చుకున్నాడు – ఆ దుఃఖంలో యెంతో అనుకున్నాడు "ఉద్యోగం నేకపోతే ఎలాగ బ్రతకడం? ఊరంతా తిరిగినా కానీ పుట్టదు. బీదొలకి సుట్టముక్క నేదు. గొప్పోలకో – ఇంత బతుకు బతికినా, నాకీగతి యిలా తెచ్చావేం భగవంతుడా!" అనుకున్నాడు.

అలా అనుకొంటుండగా మాగన్ను నిద్దురపట్టింది. ఏవేవో కలలు. తెల్లారి లేచేక మళ్ళీ గుండె బరువెక్కింది. పాదాలు అరిగిపోయినట్లు తిరిగాడు. అగపడినవాళ్ళందరికి ఆతృతతో ఆశతో దండాలు పెట్టాడు ఆ రైలు స్టేషనుకు వెళ్తే లైసెన్ను కూలీలు రానిచ్చారు కాదు. ఒక ముసలమ్మ మొయ్యలేక మొయ్యలేక చిన్న మూట తెస్తూ ఉంది. పోనీకదా అని మూట అందుకుంటే కూలోడని ఒద్దు, ఒద్దు అంది. గాడీమీద కూర్చోపెట్టాక "నా నాయనా – సుకపడతావురా" అని దీవించింది. ఒక్క అణాడబ్బులైనా యివ్వలేదు.

సుఖమెక్కడిది – రోజంతా యెలా గడుస్తుందని ఆరాటమే – రాను రాను యిటు భయం – అటు భయం – ఆకలి పీడించేస్తోంది. అభిమానం చంపేస్తోంది. "ఏమెట్టి యీ కుటుంబం పెంచేది దేముడా" అని పట్నం అంతా తిరిగి తిరిగి కాకిశోకం చేసాడు. ఎవడో తనలాంటోడే, కానీ తనకంటే పౌరుషమైన మనిషే, పట్నం బాగా చూశాడు. పట్నం సంగతులు బాగా తెలుసున్నవాడు – అన్నాడు:

"ఓరన్నా! గవుర్నమెంటోడు మావల్లే ఆ దొరల్ని తగిలేస్తాడు – మావల్లే గవుర్నమెంటోడు యేలతన్నాడు. సూడు మనలాంటి బీదోలు పిప్పైపోతన్నారు. ఎక్కడా కరువే – దేశవాళీప్రజ ఆకలితో సచ్చిపోయి మాడిపోతన్నారో. ...."

"అవునన్నా! మన గవుర్నమెంటోడు సిన్నోడు. పెద్దోడైతే మన పని బాగుండదా?" అన్నాడు పుల్లయ్య.

"నువ్వు జంగిలీవోడులాగ వున్నావు. గవుర్నమెంటోళ్ళు పెద్దోళ్ళే. అసలు సరిగ్గా పనిచేస్తే మనలాంటోలికి నౌకరీ కొదవా?"

"ఆడెందుకు సెయ్యడు?"

"సేస్తే యీ కరువెందుకుంటాది? బీదాడికష్టం యేం చెప్పేది? దానికి ఒక మొదలు సివరా నేదు. ఈ సైజ యెందుకూ పనికిరానోలై పోనారు. నంచం కట్టినోలికి వుంచినారు. నాలాంటి లేనోలికి తీసినారు. ఈల్లందరికి హిందూధర్మం ఎప్పుడు అలవడతాదో ఆరోజు మనం బాగుపడతాం–హిందూధర్మంలో నాయంగాపోయి వారికి కలిగినమట్టుకు అన్నీ జరిగిపోగా పక్కనున్నోడికి సూడమని.....అన్నారా!"

అని పుల్లయ్యనీ మల్లునీ ఆ మనిషి వెంటతీసుకెళ్లాడు. చిన్న కాఫీహోటలు – చిన్నబెంచీ! అంతా యీగలు, దోమలమయం.

"ఇదన్నా తాగు......"

ఆకలితో వుండడంవల్ల మారు మాటాడలేదు, త్రాగేక యేదో నేరం చేసినట్లనిపించింది. మల్లుకూడా త్రాగాడు.

బెల్లం టీ వాడికి చాలా రుచించింది. సాయంత్రం కావస్తోంది – ఇంట్లో పెళ్ళాం పిల్లి జ్ఞాపకానికి వచ్చారు. తానైతే యెవడో పోసిన తేనీరు పోసుకున్నాడు – వాళ్ళగతి?

ఈ క్రొత్త స్నేహితుడు "మీటింగుకు రావా?" అన్నాడు.

"మీటింగేటి?"

"తెలీదా? ముందుకు ఓట్లు వస్తన్నాయి. ఎవడికేస్తే నా బాదలు తగ్గుతాయే వాడికి యేస్తాను. పెద్దోలు బాగా యీ కరువుకి డబ్బు చేసుకున్నారు. ఎక్కడ

సూసినా అన్నాయమే – ఎక్కడా నంచమే – నాలాంటోలి బతుకేమైనాది? నాను బతకలేకపోనాను – నా కష్టాలు నా సెల్లెలు సూడలేకపోయింది...."

పుల్లయ్య ఆత్రుతతో "ఏమిసేసింది?" అన్నాడు.

ఆ మనిషి కళ్ళు చెమ్మగిల్లిపోయాయి. అంతలోనే పౌరుషం చుట్టుకుంది. "నా సెల్లి మానం అమ్ముకున్నాది. కత్తితో నరకాలనుకున్నాను. కత్తి సంపాదించాను. అయేల ఒక యేటు యేసేద్దును. కాని రెండురోజులైంది. గంజినేదు – నానెలాగో ఉన్నాను. కానీ నా తల్లిలేని ముగ్గురు పిల్లోళ్ళు......? దానార్నే ఆలని ప్రేణంతో వుంచింది. ఆ రాత్రి అది గంజి పోయ్యకపోతే అంతా సరి! ఏమి సెయ్యమంటావన్నా?"

పుల్లయ్య మనసు చివుక్కుమంది. అయ్యో పాపం అనుకున్నాడు.

ఇదంతా అబద్ధాలు కావన్నా! నాలుగు నిముషాలు యీలోకంలో బతికినా నీతిగా బతికినోడి తోవవేరు – నాకు ఆకలేస్తోందని వూరందరిమీద అబద్ధం సేస్తే దేముడు కాయడు. యీ గొప్పోల్ని నరికేమని అనను. ఆలకి మనలాంటోలి బతుకు తాలూకు బరువు తెలీదు. కావిడి మోసినోడికి బరువు తెలుస్తాదిగానన్నా వాలికేం తెలుస్తాది? ఈతకాయ యిచ్చి తాటికాయ పుచ్చుకోవాలని చూస్తారు గాని, తాటికాయ మాలాంటి బీదోలకిచ్చి మాదగ్గర నుంచి ఈతకాయంత బక్తి పుచ్చుకుంటే యెంతబాగుణ్ణు?"

పుల్లయ్యకు యీ మాటలు యెంతో నచ్చాయి. తనకంటే ఘోరంగా బాధపడేవాళ్ళీ లోకంలో వుంటే తను యింత వెర్రిగా యెందుకై పోవాలనిపించింది. తను కిరకిర చుట్టుకపోవడం బెంగలేదనుకున్నాడు.

మీటింగుదగ్గరకు తీసుకెళ్ళాడు. తనలాంటివాళ్ళే చాలామంది వున్నారు. అంతా చాలవరకు కార్మికులు – మధ్యతరగతివారు! వాళ్ళవేపు చూస్తూంటే పుల్లయ్యకు ఎక్కడలేని ఆనందం వేసింది. బహుశః యీ వేలకొద్దీ జనం తనలానే కష్టపడేవాళ్ళేమో? లేదా అంటే మీటింగు కెందుకొస్తారు? అరే – అదిగో తన పొరుగునున్న జేబుదొంగ – వీడినుంచే తనూ దొంగతనానికి వెళ్ళాడు! ఎంత గట్టిగా అరుస్తున్నాడో! ప్రజలలో ఆ కోలాహలం – తనెప్పుడూ ఇలాంటిది చూడలేదు. ప్రజలలో ఇంత వుత్సాహం ఉంది, తనకెందుకు లేకపోవాల? ఒక మనిషి సన్నంగా పేలవంగా ఉన్నాడు. గాలేస్తే ఎగిరిపోతాడేమో? సభావేదిక యెక్కేసరికి జయ జయధ్వానాలు మ్రోగాయి! పుల్లయ్యా జైకొట్టాడు. తండ్రిని చూచి కొడుకు గొంతుక తెగిపోయినట్లు అరిచాడు,

తనప్రక్కనున్న అన్న అన్నాడు: "ఓరన్నా! సత్తెం ఏనాటికైనా జయిస్తాది.. ఈ పెద్దోళ్ళందరు ఆ దొరలకాలంలో బాగా మింగడం నేర్చారు. అలవాటైపోనాది మరి. పోతాదా? రోజుకోధర – రోజుకోయుక్తితోని లోకాన్ని కాలేస్తన్నారు – వీళ్ళ ఆశ అడుగంటదా? అంతా మాయలోపడిగాని, యీ యదవలంతా యెన్నాల్లు బతుకుతారు! హరిశ్చంద్రుడు మారాజు – కష్టాల్సు, పడరాని కష్టాలు పడ్డాడు. కాటికాపరిగా మాతికాడిదగ్గర పనిచేశాడు – కాని మారాజు సచ్చిపోనాడా? అదీ బతుకుగాని – సూశావా ఎలాగున్నాడో ఆ బాబు?"

పుల్లయ్య వింతగా చూశాడు. ఆ మనిషి మళ్ళీ మాటలు పొడిగిస్తూ "న్యాయం యెటుపోతాది? యీ దోసుకున్నాలంతా సివరికి యీదిలోనకుక్కలాగ సచ్చిపోరా? యీ కుర్రోళ్ళు లేస్తన్నారు పైకి. ఈలలో ధర్మం, న్యాయం ఉన్నాయి. సెదుగును కడిగేసి వదిలేస్తారు. ఇక అల ఆటలు సాగనివ్వరులే – విని ఆ బాబు మాటలు....."

ఉపన్యాసకుడు చీపురుపుల్లలాగ ఉన్నాడుగాని గంగా ప్రవాహంలా ఉపన్యాసం గంటకుపైగా ప్రవహింపచేశాడు. ఎన్నిసార్లో ప్రజలు కుతూహలంగా జయ జయధ్వానాలు చేశారు. ఉద్రేకంతో కేకలు వేశారు. కూర్చున్నవాళ్ళ నరాలు పొంగి లేచిపోయి ముందుకురికారు. ప్రజారాజ్యం రాక ఏమౌతుందని సవాలుచేశాడు ఉపన్యాసకుడు. తన ధోరణిలో తన ఉనికినే మైమరిచిపోయాడు. మీటింగు అయిపోయాక వోట్లుకోసం విజ్ఞప్తి జరిగింది. బ్రతుకుభారం మోయలేక గిజగిజ గింజుకొంటూ, జీవితంమీద – భావిమీద ఆశతో బ్రతుకుతున్న ప్రజానీకంలో ఆ ఉపన్యాసం కాసేపు గింగురుమని ఆ కష్టాల్ని తేలికపరిచింది.

ఈ చివర నిల్చోని వెళ్ళిపోతున్న ప్రజలు నుద్దేశించి యెవడో ఏదో చెప్పాతున్నాడు. ఎవరది? "అయ్యో! అడుగో బూచోడు?" అని మల్లు చూపించాడు. ఆ బూచోడే గొణుక్కొంటున్నాడు. "అమాయకుల్లారా!" ఒక్క నవ్వు నవ్వాడు. "వాడికి వసపోసి విడిచిపెట్టారు. కాని బుర్ర లేదర్రా! వాడికి ఒక్కటే తెలుసు – దుయ్యబట్టడం! తిట్టేనాలుక మంచికీ తిడుతుంది చెడ్డకీ తిడుతుంది. వాడికి మనుష్యులపేర్లు తెలుసు, కాని చరిత్రగతే వాడికి తెలీదు! మీ అమాయకుల కళ్ళల్లో వాడి సగం తెలివితో దుమ్ముకొట్టున్నాడు" – పకపక నవ్వుతూ "మీలో పెద్ద పెద్ద కట్నాలు పుచ్చుకో కండా పెళ్ళిచేసుకోలేని వాళ్లెందరో చేతులెత్తండి. ఎక్కడ్నుంచో సులభంగా వేలు వచ్చిపడిపోవాలని దురాశతో లేనివాళ్లెందరో చెప్పండి. మీరంతా దురాశ అనే మాయలో చిక్కుకొని వాడి దబాయింపుల్లో పడిపోయారు! కాకపోతే అంతా మేజిక్‌లా అయిపోవాలంటాడు. వందయేళ్ళనుంచి అంటిపెట్టుకున్నది ఒక్కరోజులో మార్చివేయమంటాడు? గానుగెద్దు ఒక్కసారి దుక్కిటెద్దు అయిపోతుందా? ఆ మాటలాడేవాడు పిచ్చివాడురా అబ్బాయిలూ?" అన్నాడు.

అలా వెళ్ళిపోతున్నవారు బూచోడు వైపుచూసి హేళనగా పకపక నవ్వారు. బూచోడు మళ్ళీ గొణకటం ప్రారంభించాడు: "పిచ్చివాడు కాకపోతే – ప్రజలకు మరింత సంపాదించటానికి చేసే పోరాటంలో ఇదివరకు ఉన్నవాటిని పాడుచేసేమనేవాడిని ఇంకేం అనాలో నాకు తోచలేదు. ఉన్నది నాశనం చెయ్యటం పనిగా పెట్టుకొనే స్వభావంగలవారు ముందుకు ఏదైనా ఎలా నిర్మించగలరో నాకు అర్థం కాకుండా ఉంది – సంతృప్తిగల ప్రజలలో అలాంటి ఎడతెగని ఆశలను రేకెత్తిస్తున్నాడు. అంటే వాళ్ళ ఆశలు ఆకాశంమీదకు పంపించి – సంతృప్తిని మరచి పోనిస్తున్నాడు! అలాంటివాళ్ళకు నివ్వు రాజ్యానికివచ్చి ఎంతయిచ్చినా తృప్తివుండదు – నిజానికి అలాంటి రకంవాళ్ళను నువ్వెప్పుడూ సుఖపెట్టలేవు. నీ దుష్ప్రచారంతో వాళ్ళ అసలైన సౌఖ్యాన్ని ఎందుకు కాల్చివేస్తావు? గోడకట్టినట్లు ఇటుకమీద ఇటుకలా సౌఖ్యపరచే పనులు చేశావంటే సంతృప్తిగలమనిషే వర్ణించలేని సౌఖ్యాన్ని, ఆనందాన్ని పొందుతాడు. అలాంటి మనుషులు హెచ్చున్న దేశమే శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లి

కలకాలం నిలుస్తుంది. మీకందరికి కష్టంగా వుంటుంది – నేనేమన్నా! నాయనలారా! నేను బాధపడ్డానురా! ఒకరి బాధను పంచుకోడానికి ప్రయత్నించిన వాడినిరా! ఏదైనా నాకు చెప్పటాన్కి హక్కు లేకపోతే యింకెవరికుంది? వినండి వినకపోండి. చూడండి ఈ రోజుల్లో ఎన్ని కులాలు, యెన్ని పార్టీలు – యెన్ని సంఘాలు! ఇలా సంఘాలుగా ఉండి వీళ్ళంతా ఉన్నతంగా పోలేదే? ఒకరిమీద ఒకరికి అసహ్యం వ్యాపింపజేస్తున్నారు. మానవత్వంమీద అసహ్యాన్ని ప్రేరేపించడాన్కి సంఘాలు ఒద్దు నాయనా! నా దేశం, తలుచుకుంటే యీ యుగసంధిలో యింత అధ్వాన్నం అయిందా అని యేడుపొస్తుంది......"

ఇంకా ఎవరూ వినేవాళ్ళు లేకపోయినా అలా మాటాడుతూనే కళ్ళంట నీరుకారుస్తూ ముందుకు నడచిపోయాడు.

పుల్లయ్య ఇంటివేపు ఉత్సాహంతో అడుగులువేసినా యిల్లు దగ్గరౌతున్న కొద్దీ మళ్ళీ మనసులో ఈ పూటకెలాగుననే అందోళన రేగింది. ఆ రాత్రి నీలి పొరుగమ్మదగ్గర చోడిపిండి అప్పుతెచ్చి అంబలి కాయటంవల్ల త్రాగాడు. ఆ రాత్రి ఆలోచించి మరుచటిరోజు బజారులో తట్టపట్టుకొని కూలికివెళ్తే మంచిదనిపించింది. నిద్రపోయాడు.

## 31

రోజూ యెలా జరుగుతుందనే బెంగతో పుల్లయ్య పుల్లలా అయిపోయాడు. ఓ రోజు కూలి దొరుకుతుంది. ఓరోజు ఏమీ ఉండదు – ఒకనాడు ఓడలో సరుకులు దించటాన్కి వెళ్ళాడు. రెండుబస్తాలు ఒక్కసారే మోసేయాలని వుబలాటపడ్డాడు కాని, ఒక బస్తా దించేటప్పటికే ఎంతో కష్టమైంది, మరో రోజు పనిలేదు. తన బలమంతా యేమైపోయిందనిపించింది.

ఎక్కడో పని దొరుకుతుందని కాగితం రాపించి రిజిష్టరు చేయమని యెవడో చెప్పాడు. ఒకరోజంతా కష్టపడి నోరు కట్టుకొని కాగితం రాపించి రిజిష్టరుచేయిస్తే జవాబే రాలేదు. 'ఈ వేళ వస్తాది, రేపు వస్తాద'ని చూచి చూచి విసిగెత్తిపోయాడు. "ఏంపట్నం – తెల్లార్లేస్తే పైసా నేకపోతే జరగదు. మావూరే నయం,......ఎల్లిపోతే బాగున్ను – ఏ కర్రలమ్మో – ఏ కాయలమ్మో బతికిపోదును – కానీ యిలాగెల్తే అందరూ నవ్వరా? ఉన్నూరులో బతకలేనోడు పొన్నూరులో బతికిచచ్చినాడని యిదివరకే అన్నారు. అలాంటోలు పుల్లలాంటి పుల్లయ్యను చూసి గేలి సెయ్యరా? ఏదో సంపాదించి మూటకట్టి యెకరంపొలం నాదీ అని గడించానంటే, 'కాలుమీద కాలేసి బతికేస్తాను' ఎలాగొస్తాది – బతుకే బారమైపోనాది – కడుపే సవుద్రం అయిపోనాది – యీ పాడుకడుపుకి తెల్లారితే పరగడుపెందుకో?"

ఇలా విలపించి గింజుకున్నాడు. ఈ విచారం ఒక జబ్బులా అంటిపెట్టుకుంది. ఒకరోజు బుట్టపట్టుకొని బజారుకి వెళ్ళాడు. అక్కడంతా పిల్లలు. ముసలమ్మలు. వాళ్ళమధ్యకు కూలిని వెళ్ళటానికి సిగ్గువేసింది. అయినా తెగించివెళ్తే కుర్రవాళ్ళంతా

"సిగ్గులేదా? పోతు లావున్నా"వన్నారు. సిగ్గువేసింది. కాని ఆకలితో మలమల మాడేబదులు యేదో ఒక పని – ఏం చెయ్యడం? తన కొడుకుకంటె రెండేళ్ళు పెద్దపిల్లలుకూడా కూలి చేసుకుంటున్నారు. అయ్యో! నా కొడుకుని యీ పని చేయనిస్తానా? వద్దు వద్దనుకున్నాడు. ఇలా నాలుగైదురోజులు కూలికి వచ్చాడు. సాయంత్రంసరికి ఓ రోజు పదిఅణాలు – ఓ రోజు అర్ధరూపాయి గిట్టేది – ఒక్కొక్కరోజు రూపాయిపైన దొరికేది – అనాడైనా తనకు సంతోషం లేదు. కూలిడబ్బులు యేం డబ్బులు – ఒకనాడు యెందరికీ చేతులతో కూలిచ్చానో అనుకున్నాడు.

నీలి ఈ లేమిలోనూ చెయ్యి కట్టుకోలేదు. ఒకనాడు బూచోడికి గంజిపోసింది. వాడు సాధారణంగా ఎవర్నీ అడగడు – ఎవరిచ్చినా పుచ్చుకోడు – రెండు మూడురోజుల కొకసారి యెవరింటిదగ్గరకో వెళ్ళి నిల్చుంటాడు – చాలామందికి వీడిలో ఏదో మహత్యం వుందనే నమ్మకంవుంది – వీడికి చాలా వేదాంతం తెల్సునని కొందరు అంటారు. బూచోడొకనాడు ఇంటియెదరకు వచ్చి అడిగాడు. నీలి తనకోసం వుంచుకున్న నాలుగు మెతుకులూ, గంజీ పోసింది. త్రాగాడు, నవ్వాడు – వాడేంమాటాడుకున్నాడో నీలికి అర్థంకాలేదు.

చివరకు పుల్లయ్యకు బజారులో కూలివాడుగా ఉండటం కష్టమనిపించింది. పిల్లలు అతడి వెంటపడి నానామాటలాడేవాళ్ళు పుల్లయ్య గెడ్డాం గిరజాలనుచూచి పిచ్చివాడనేవారు. తను పిచ్చివాడా? "నా గేరాగిరజాలు. ....ఆ రోజుల్లో సుట్టుపట్టువున్న యెన్నివూళ్ళకి పేరుపడ్డాయి......!"

ఒకనాడు ఒక ముసలోడు కూలికి పిలిచాడు. ఆ గాడిదబరువు కుర్రవాడైతే మోయలేడని పుల్లయ్యను పిలిచాడు. బేరమాడలేదు. చాలాదూరం. వెంట నడుస్తూ వున్నాడు. ముసలాడు యేవో తన యింట్లో గొడవలు చెప్పుకుంటున్నాడు. పుల్లయ్యకు ఆశ్చర్యం వేసింది. ఇంత సిరిసంపదలతో వున్న మనిషికీ గొడవలున్నాయా అవి? రోలువెళ్ళి మద్దెలతో చెప్పుకున్నట్లు చెప్పక చెప్పక తనతోనా చెప్పుకోవాలి? నే నెవరితో చెప్పుకొను – ఇంటిగుట్టు లంకకిచేటు అంటూ అంత పెద్దమనిషి నాలాంటి కూలోడుతో చెప్పుకుంటున్నాడే – మంచిమనిషిలా గున్నాడు. డబ్బుకి కటకటలాడుతున్నానంటాడు – మేడ స్వంతంది వుందట – కొడుకు గడిస్తున్నాడట – అంతా అబద్ధాలు కాకపోతే యీలకి డబ్బు కష్టమేంటి? ఒక్కొక్క ఆడపిల్లకి పదివేలుంటేగాని చెల్లరట – పదివేలే! – నాకు రెండువేలుంటే బతికేద్దును! ఏంటో ఎంతసెట్టు కంతగాలంటారు?

ఊఁకొట్టూనే యిలా అనుకున్నాడు. ఒక మేడదగ్గర చాలా జనాన్ని చూచి "అక్కడెందుకు అంతమంది మూగినారు బాబో?" అన్నాడు. కొడుకు వాళ్ళవేపు చూపించి "అయ్యా, అయ్యా" అన్నాడు.

"ఎంప్లాయిమెంటు అపీసు – అక్కడ పనులిస్తారు!"

"అలాగా బాబో – ఈ వూరిలో యిలాంటిదొకటి వున్నాదని నాకు యెవరూ చెప్పేనారుకాదు......దినాలు బాగులేక తెలిసిందికాదు!"

"అక్కడికెళ్తే దినాలు బాగైపోవులే!" అన్నాడు కాస్త వేళాకోళంగా. పుల్లయ్య ఈ

మాటలు వినిపించుకోలేదు. యెంత వేగిరం తిరిగివస్తానని పరుగునడక సాగించాడు. ముసలాడి యింటిలో సామానులు పడవేసి యిచ్చింది మారుమాటాడకుండా తీసుకొని గబగబ తిరిగి వుద్యోగాలిచ్చే ఆఫీసుకు వచ్చాడు!

"ఎంతమంది!" అనుకున్నాడు. బుట్ట బైటపెట్టి చేతులు కట్టుకొని నిల్చొని యెవర్ని అడుగుదామని చూస్తున్నాడు. చాలామంది తెల్లతెల్లటి బట్టలు ఖరీదైన బట్ట లేసుకున్నవారున్నారు. తనలాంటి వారున్నా అందరిలోనూ తనే అసహ్యంగా వున్నాడు.

"నాకు పనిప్పించరా?" అన్నాడు ఒకమనిషిని చూసి.

వాడు చిన్న నవ్వునవ్వి "లోపలికెళ్ళరా" అన్నాడు.

గదిలో కాలుపెట్టేసరికి బంట్రోతు "బయటకి పోవయ్యా! అన్నాడు.

పుల్లయ్య గతుక్కుమని అడుగులు వినయంగా వెనక్కివేస్తే" కొడుకూ సరిగ్గా అలానే వేశాడు.

అంతలోనే బయటకువస్తూ "యెల్లెల్లు, అలాగున్నావుకదా నీకేం పని? అన్నాడు.

"నీ పున్నెం వుంటదయ్యా! తూరుపోణ్ణి, పిల్లులుగలోణ్ణి, ఒకప్పుడు" పెద్దబతుకు బతికాను – దొరబాబుతో సెప్పి నివ్వేదో నెలజీతం పని యిప్పిస్తే – నీ మేలు మరిచిపోతానా? ఏదో అకో పాకో యిచ్చుకుంటాను."

బ్రతిమాలుతూ అభినయంతో పుల్లయ్య విన్నవించుకుంటూ ఉంటేచుట్టూ వున్నవాళ్ళు నవ్వుకుంటున్నారు, బంట్రోతు కస్సుమంటూ "అలాంటి లంచాలు మాటలాడక! సూడు చుట్టూ సూడు, యెన్ని బోర్డులున్నాయో! నీకు సదువురాకపోతే యెవర్నేని అడుగు!" అన్నాడు.

"తెలీదయ్యా! నా మాటలతో నిన్ను కష్టపెట్టాను. నాకేదో పనిప్పిస్తావా నీ పాదాలకి సెప్పులా ఉంటాను!"

బంట్రోతు ఆఫీసరులానే ముఖంపెట్టి "వెళ్ళవోయ్! నీకేంపని? పెద్ద పెద్ద యమ్. ఏ. లు, బియ్యేలు సదివినోలకే లేకపోతే......వెళ్ళు వెళ్ళు" అని లోపల బెల్ వాగడంతో వెళ్ళిపోయాడు.

పుల్లయ్య చాలాసేపు చూశాడు. తనవెవ్వరూ పిల్వలేదు. అలా ఆ వరండాలో బుట్ట ప్రక్కనుపెట్టుకొని కూర్చుండిపోయాడు. మల్లు అయ్య ప్రక్కన నిల్చొని వుండీ వుడిగీ ప్రశ్నలు వేస్తున్నాడు మధ్యాహ్నం కావస్తోంది. రద్దీ చాలవరకు తగ్గింది. మల్లుకు చిరాకెత్తిందో లేక ఆ లేత హృదయానికి అయ్యబాధ నాటిందో గబగబ గదిలోనికి తొంగిచూశాడు. ఎవరో మనిషి కుర్చీమీద కూర్చున్నాడు. ఆడే అయ్యకి పని యిప్పిస్తాడు – మా అయ్యనాంటి మంచిమనిసి లేదు. మా అయ్యకు ఎందుకు పని దొరకదని అనుకొని గబగబ గదిలోనికి వెళ్ళాడు. ఆ అఫీసరు యెదురుగా నిల్చొని "మా అయ్యకి పని యిస్తావా లేదా?" అన్నాడు. బంట్రోతు గబగబా వచ్చి బయటకు ఈడ్చేస్తుండే మరీ గట్టిగా "మా అయ్యకు పని యివ్వకపోతే సూడండి – కుక్కపిల్లను తెచ్చి కరిపించేస్తా!" అన్నాడు.

అక్కడ ఉన్నవాళ్ళు పకపక నవ్వుతున్నారు బంట్రోతు ధాటిగా "పోతావా, మెడపట్టుకొని గెంటాలా!" అని పుల్లయ్యను గద్దించాడు. మల్లు కొరకర ఆ

బంట్రోతువైపు చూస్తుంటే "ఉల్లిపాయంత ఉన్నాడుగానీ వూరంత గడిబిడి చేస్తున్నాడు!" అని బంట్రోతు విసవిసలాడాడు.

పుల్లయ్య ఈ వేళ యేదో ఒకటి తేల్చుకోనిదే కదలకూడదనుకోవడంవల్ల ఆ బయట నిల్చున్నాడు. కొడుకు బుట్టలో కూర్చుని ఆఫీసువైపే చూస్తున్నాడు. ఇంతలో ఒక మనిషి – చాలా మంచిమనిషిలా వున్నాడు – వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ "యేవూరోయ్ నీది?" అన్నాడు. పుల్లయ్య గబగబ వెంటపడ్తూ "బాబూ! మాది తూరుపు – నవిరి. జరగక పట్నం వచ్చాను బాబూ!" అన్నాడు.

"అలానా పాపం!" అంటూనే సాగిపోతున్నాడు.

"పాపం" అని కనికారం చూపిస్తున్నా డీ. బాబు. ఈ ఆఫీసులోనే పని – పని చూపిస్తాడన్న ఆశతో అయనవెంట పడ్డాడు.

అతని యిల్లు ఆ దగ్గరలోనే వుంది, ఇంట్లో కాలుపెడుతూ "లాభంలేదు – వెళ్ళిపో" అన్నాడు. తలుపు వేసుకున్నాడు. కాని పుల్లయ్య ఆ గుమ్మం కదలలేదు. భోజనంచేసేక తలుపుతీసేసరికి పుల్లయ్య అక్కడే వుంటంచూసి "ఏమోయ్! నీలాంటివాళ్ళకి ఉద్యోగం దొరకడం కష్టం," అన్నాడు.

"బాబూ, తమలాంటి షెట్టిన మారాజులే మొండిసెయ్యి చూపిస్తే మాలాంటోలం బతకాలా! నా కిక్కడెవరూ గతిలేరు తమరు తప్పించి – బిచ్చం పెట్టకపోతే సచ్చిపోతాను–"

ఈ ప్రాధేయమైన గొంతుకవిని ఆయన కుర్చీమీద కూర్చొని లోనికి రమ్మన్నాడు. వినయంగా వచ్చి నేలపై కూర్చొని కొడుకుచేతకూడా దండం పెట్టించాడు.

"ఏదో నేను చేసేస్తానని దేముడుని నమ్మినట్లుగా నీవు నమ్ముతున్నావు. కానీ నా చేతిలో యేమీలేదు. నీ పేరు ఆ రిజిష్టరులో వేయగలనేమో–"

"అంతే సాలుబాబూ, ఈయాళకాకపోతే రేపియ్యరా?"

"అందులో వ్రాసినంతమాత్రాన వుద్యోగం రాదు. నిన్నెక్కడికైనా పంపించడానికి యిదివరకు యే గవర్నమెంటులో పనిచేసావో చూస్తారు. అందులో పేరున్న మాత్రాన నీకేం లాభంలేదు."

పుల్లయ్య వెలిగినముఖం కాస్తా మళ్ళీ విచారగ్రస్తమైంది – అయినా మనసులో ఈ బాబు తప్పక తనకు పని చూస్తాడన్న విశ్వాసంతో "బాబూ! మీరేమన్నా ఈ పాదాలు యిడిసిపెట్టను. ఈడి ముఖం సూడండి. మంచిరోజున పెద్దోడు పుట్టుకొచ్చాడు బాబూ! ఈడు పుట్టిన్నాడు చినుకులు జలజల రాలినాయి నాకేదో తమరు పనిప్పిస్తే నా కొడుకు పెద్దోడవడా? నీతి నిలపడా? దొంగల్నిపట్టే దొర కాడా? మీలాంటి మారాజులు యింటారనేకదా మాలాంటి పేదోల్లం కష్టాలు సెప్పుకుంటాం. చూడండి – బట్టముక్క తిప్పి కట్టుకోడానికి లేదు తిండికే లేనప్పుడు బట్టెక్కడొస్తాది? నోరుకట్టుకొని పనికి కాగితం పంపించాను – ఏమీ దానిమీద రాలేదు. ఈ కూలా? ఒక పూటకుంటే యింకోపూటకి లేదు. నా మాట అంటుంచండి, పిల్లలు చుట్టుకుపోతుంటే యెలా సూడమంటారు? ఈ పూటతాగితే రేపు ఈ యేళకి! అందరు సూసి నన్ను జబ్బు మనిషనుకుంటారు –

తిండికి లేకపోవడమే జబ్బు! మారాజులు మీలాంటి కుర్రాళ్ళు లేసినారు!" అన్నాడు.

"నేనేం చెయ్యలేనోయ్. నిజంగా చెప్తున్నాను" పాపం, ఆయన తన నిజపరిస్థితి యీ అమాయకుడు తెలుసుకోవాలని నొక్కి చెప్పినా పుల్లయ్య విడిచిపెట్టలేదు. నిముష నిముషానికి తనలో ఏదో ఆశా, విశ్వాసం హెచ్చిపోతోంది. మరికాస్త దైన్యస్వరంతో "బాబూ! చేసేవాళ్ళెప్పుడూ అలాగే అంటారు. ఒకరికి నాను దుర్మార్గం తలంచలేదు. నా పెళ్ళం సంగతి మీకు తెలీదు. దానిదగ్గర ధర్మం, నాయం వున్నాయి. అదంటే నాకు జడుపు! దానిమంచి నాకు యీ రోజు కాకపోతే రేపేనా వస్తాది. ఆ బగమంతుడు నాలాంటోలకే కష్టాలు పెట్టిస్తాడు – ఆకరికీ ఆ తండ్రే కనికరంతో మీలాంటి మా రాజుల్ని సూపిస్తాడు. తినేందుకు కూడులేదు – మేడలూ, మిద్దెలూ కోరలేదు – మూరెడుగుడ్డ, పిడికెడు మెతుకులూ దొరికితే సాలుబాబూ – పని సెయ్యనోడ్ని కాను – దొంగెత్తు యెత్తినోడ్ని కాను – ఈ దశలో మిమ్మల్ని ఆ బగమంతుడు సూపించినాడు. మీకు పదివేల నమస్కారాలు బాబో! నాకింత ఆదరవు యిప్పించండి" అని పుల్లయ్య సాష్టాంగపడిపోయాడు. కొడుకు తండ్రి ననుసరించాడు. ఎదురుగా కుర్చీమీద కూర్చున్న మనిషి కళ్ళు చెమ్మగిల్లిపోయాయి. వంటయింటి నుంచి వింటున్న అతని భార్య కళ్ళనుంచి బిందువులు రాలిపోయాయి.

ఆయన లేవనెత్తాడు. ఏమనడానికీ తనకు తోచలేదు. ఆ నిముషంలో తను యింకేమన్నా పుల్లయ్య హృదయం పగిలిపోతుందేమో ననిపించింది. రేపు పది గంటలకల్లా ఆఫీసు దగ్గరకు రా, నే నుంటానని పంపించివేశాడు. మళ్ళీ వెళ్ళిపోతున్నవాడ్ని పిలిచి "నీ పేరేంటోయ్?" అన్నాడు.

"పుల్లయ్య బాబూ!"

"ఇందు, యీ అర్థరూపాయితో నీ కొడుక్కేదో కొనియ్యి."

సంతోషంగా పుచ్చుకొని "మీ ఋణం యేంసేసినా తీర్చుకోలేను బాబూ.....యేదో పని సెప్పండి – కర్రలున్నాయా కొట్టేస్తాను. ఈ సుట్టుపట్ల వున్న గత్తర యెత్తి పారేస్తాను!" అన్నాడు.

అన్నిటికీ – వద్దులే – మధ్యాహ్నం అయిపోయింది. యింకోసారి చేద్దువుగాని అని పంపించివేశాడు. పుల్లయ్యను పంపించివేశాక "పాపం! అలాంటి బాధపడేవాళ్ళని ఒక కంట చూడండీ" అని భార్య అందుకుంది. వెంటనే జవాబులేదు. తరువాత అన్నాడు: "ఏదైనా చేద్దాం అన్నవాళ్ళకి చేసే అధికారం వుండదు. నేను ఒక గుమస్తాను. ఇదివరకే మా ఆఫీసంటే ప్రజల్లో నానా అపోహలూ వున్నాయ్. ఏదో తంటాలుపడి వాడ్ని వుద్యోగం కోసం పదిమందితో పంపిస్తాను – కానీ తీసుకునేవాణ్ణి నేనుకాదుగా!"

పుల్లయ్యతో చెప్దామనుకుంది భార్యతో చెప్పేశాడు. ఆ మరుచటిరోజు అతికష్టంమీద పేరు రిజిష్టరయ్యింది. ఆ వేళ సాయంత్రం యింటిదగ్గర పుల్లయ్యకు తంతంతా బోధపర్చాడు. "ఎక్కడైనా ఖాళీలువస్తే ఒకసారి పంపించే పూచీ నాది. తరువాత నీ అదృష్టం" అని చెప్పాడు. అంతా విన్నాక పుల్లయ్య కృతజ్ఞత చూపిస్తూ "ఆ మాత్రం సేసిన మారాజులేరి బాబూ! ఈ రోజుల్లో ఆకలంటే అన్నం యెవురుపెట్తారు?

అలాగని దౌర్జన్యంసేస్తే యెవ్వరూరుకుంటారు? ఇక్కడా అక్కడా పెద్దల్లోనూ కష్టమెరిగిన మారాజులుండబట్టి లోకం యింకా మునిగిపోలేదు. లేదా అంటే ఈ సంవత్సరం ఈ లోకాన్ని ముంచీదా బాబూ?" అన్నాడు.

ఒకవారం పదిరోజులవరకు అప్పుడప్పుడూ వచ్చి కనిపిస్తున్నాడు. ఒకనాడు అతను చెప్పాడు "ఇదిగో కాగితం – సరిగ్గా యీ వేళటిరోజు పదిగంటలకు రా! ఇలాగ వచ్చావంటే లాభంలేదు. ఒక నిక్కరు మంచి షర్టు వేసుకో. చూడు – ఆ గెడ్డం యేంబాగోలేదు – ఆ గిరజాలేంటి. అసహ్యంగా వున్నాయ్. అవి తీసి మామూల క్రాపింగు వుంచుకో: చూడ్డానికి అసహ్యంగా వుంటే వుద్యోగం యెవుడిస్తాడు చెప్పు? నేను చెప్పినట్లు చేసి అక్కడకు వెళ్ళు. వాళ్ళు యేది మొయ్యమన్నా మోసెయ్యి – భయపడకుండా జవాబు చెప్పు. లోపలికి వెళ్ళగానే యిలాగ సెల్యూట్ కొట్టు!" అన్నీ మరీమరీ చెప్పాడు.

ఆరోజు వచ్చింది. గిరజాలు తీయించేశాడు బట్టలు పొరుగు జేబుదొంగను యెరువు అడిగితే, యిందులో నావేవి కావనేశాడు. తనలా పుల్లయ్యనూ చెయ్యమని సలహా యిచ్చాడు. ఆ సలహా ప్రకారం చాకలివానిదగ్గర ఒక కాకీ నిక్కరు, కమీజు అద్దెకు తెచ్చాడు. ఎంత తయారయినా మనిషి సన్నగానే కనిపించాడు. గిరజాలు తీసేయటంవల్ల డాంబికం తగ్గిపోయింది. అది తీస్తున్నప్పుడు చాలా కష్టం అనిపించినా విధిలేక కళ్ళు మూసుకొని కత్తిరించడానికి మనసిచ్చేడు. ఆ పని చేస్తుంటే మల్లు మంగలాడిమీద కోపం అయిపోతుంటే తండ్రి వారించాడు. తన పొలం పోయిన్నాడు కూడా తనకు అంత కష్టం అనిపించలేదు. ఐనా కడుపు ముందా, యిది ముందా అనుకున్నాడు.

ఇంటర్వ్యూకి మరో పాతికమందితో సహా తనూ వెళ్ళాడు. ఆ స్థలం ఊరికి అయిదుమైళ్ళు దూరంలో వుంది. ఎండలో నడిచి వెళ్ళేసరికి అలసిపోయాడు. అక్కడ యిద్దరు ఆఫీసర్లు వచ్చినవాళ్ళని తనికీచేస్తున్నారు పుల్లయ్యకు ఆకలి వేస్తోంది. డబ్బు దగ్గరలేదు. వున్నమట్టుకు బట్టలు అద్దెకు వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళినా కడుపునిండుతుందనిలేదు. వుండగా వుండగా చివరకు తన పేరు పిల్చారు. ఆకలి – నడవడానికి శక్తి లేనట్లుంది. కాని వుత్సాహం తెచ్చుకున్నాడు. ఆ గదిలో కాలు పెట్టేసరికి కాళ్ళు గజగజలాడసాగినయ్, అటువంటివాళ్ళని తను యిదివరకు చూడలేదు. ఒకాయన తెల్లగా పొడుగ్గా వున్నాడు. బెంగాలీమనిషి. రెండోవాడు నల్లగా వున్నా పెద్దమొఖం కళ్ళద్దాలతో గంభీరంగా వున్నాడు.

"నీ పేరు...." బెంగాలీ ఆఫీసరు హిందీలో అంటే పుల్లయ్య గాభరాపడిపోయాడు. ప్రక్కనున్న అరవ ఆఫీసరు "నీ పేరేమబ్బా?" అనగానే ఆ గొంతుక విని గతుక్కుమన్నాడు..... "పుల్లయ్య" అని గొణిగేసి దీనంగా "బాబూ! మీరు కనికరం సూపించండి. తూరుపోడ్ని – పిల్లలు గలోడ్ని – ఒక్కప్పుడు గొప్పబతుకు బతికాను.....అన్నంలేక నానూ, పిల్లలూ సచ్చిపోతున్నాం........" అన్నాడు.

బెంగాలీ ఆఫీసరు "వాడేం అంటున్నాడని" ఆ ఆఫీసర్ని అడిగాడు కొద్దిగా తెలుగు తెలిసిన ఆ ఆఫీసరు తనకు తెలీదని అనే బదులు "వాడేదో గొప్పగా బ్రతికిన

పాత్రబ్రతుకు గురించి చెప్పేకుంటున్నాడు." అనిచెప్తూ పుల్లయ్యవేపు ముఖంత్రిప్పి "అదంతా ఎవరి క్కావాలబ్బా! పేరేమి - నీ పేరేమి?" అన్నాడు.

"పుల్లయ్య!"

బెంగాలీ ఆఫీసరు "ఏదేనా చుట్టుపట్లున్న దేముడు పేరా" అన్నాడు అంగ్లీషులో

వెంటనే తను ఇదివరకు తెలుగు తెలుసునని చెప్పినమాట నిలుపుకోడానికి......"కాదు. పుల్ల అంటే పులుపు - పులుపు మనిషి" అని ఇంగ్లీషులో చెప్పాడు.

వెంటనే ఆ ఆఫీసరు "అలాగే కనిపిస్తున్నాడులే!" అని ఇంగ్లీషులో అంటూ అక్కడున్న పెట్టెను ఎత్తమని చెప్పాడు సైగతో! పుల్లయ్య అసలే ఆకలితో వున్నాడేమో ఆ పెట్టె యెత్తుకోడానికి కాస్త గుంజాటన పడ్డాడు. ఆఫీసరు ఇంగ్లీషులో "వాడికాప్రజ్ఞ లేదు" అని చెప్పాడు. ఆ పెట్టె తిరిగి క్రిందపెట్టాక కాస్త అయాసంతో వణికిపోతూ నమస్కరించి దీనాతిదీనంగా "సాలా కష్టపడిపోతున్నాను. ఈ బట్టలూ అద్దెకు తీసుకొచ్చాను బాబూ! తిండిలేక నాకేకాదు పిల్లలూ సీపురుపుల్లల్లాగ అయిపోయినారు. పదిపూటలు కడుపునిండా తిండిపడితే ఇలాంటివి రెండు పెట్టెలు రెండు సెతుల్తో ఎత్తేస్తాను బాబూ!" అన్నాడు. ఇలా అంటూనే కళ్ళల్లో నీరు తిరిగిపోయాయి.

అరవ ఆఫీసరు "వెళ్ళు! ఎక్స్చేంజివాళ్ళు సెప్పుతారు!" అనగానే పుల్లయ్యకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. పని దొరికినట్లే అనుకున్నాడు. ఇంటికి ఆగిఆగి నడిచివెళ్ళేసరికి చీకటిపడిపోయింది. అలా గడపలో మూర్ఛపోయినట్లు చారపడి పోయాడు. నీలి అర్ధణాయిచ్చి గోంగూర కొని నీటిలో వుడకపెట్టింది. ఆ వీధిలోనే ఒకమ్మ దగ్గర రూపాయికి నెలకి పావలా వడ్డీకి ఒక రూపాయి తెచ్చిందేమో, కడుపు నిండగానే పుల్లయ్య తెప్పరిల్లాడు.

ఆ మరుచటి రోజు ఆ బాబును కలుసుకున్నాడు. జరిగినదంతా చెప్పేశాడు. "పనిలోకి యెప్పుడు రావాలో మీతో సెప్తానన్నారు బాబూ!" అని చెప్పాడు. ఆ ధైర్యం నాలుగు రోజులు చకచకా యిక్కడకూ, అక్కడకూ పనిపాట్లుకోసం వెళ్ళడం, యేదో కొద్దో గొప్పో కడుపుకు జరిగిపోడానికి అవకాశం యిచ్చింది.

ఆరోజున ఆయన చెప్పాడు - "వాళ్ళు నిన్ను తీసుకోలేదు. నేనేం చేస్తాను?" అని. పుల్లయ్య నడుం విరిగిపోయింది. అక్కడే కూలబడిపోయాడు. ఏడుపుకూడా వచ్చేసింది. గట్టిగా బావురుమని యేడ్చేద్దామనుకున్నాడు - కానీ కొద్దిసేపటివరకు నోటమాటరాలేదు..... చివరకు శోకమయమైన గొంతుకతో - "బాబూ! ఈ గిరజాలుని చూసి మా సుట్టుపక్కల వూళ్ళలో......సూపురేకల పాపలు మురిసిపోయేవోరు.....నాకు అవి పేణంకంటే హెచ్చు బాబో!..... అన్నం ముద్ద నోటిదగ్గరకు వస్తాదని..... మనసుకట్టి కత్తిరికి యిచ్చేశాను - నోటికొచ్చిన ముద్ద జారిపోయినాది! నన్ను శనీశ్వరుడు తిప్పుతుంటే మీరేంసేస్తారు బాబూ!" అంటూనే మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ దారీతెన్నూ చూడకండా అలా వెళ్ళిపోయాడు.

# 32

లోకం చలికి ముసుగు వేసుకోవటం మొదలుపెట్టింది, ఇక్కడా అక్కడా కూలిచేసుకుంటూ ఒకపూటుంటే యింకోపూటకు లేనట్టు బ్రతుకుతున్న పుల్లయ్యకు పాత – మీటింగు స్నేహితుడు తారసిల్లి, ఒకపూట వస్తేగానీ వీలులేదని తీసుకవెళ్ళాడు.

"సూడన్నా! ఈడికా ఒక్కకానీ లేదు, ఒక రూపాయి విలువ ఆస్తిలేదు. ఆ పెద్దోడిలాగ ఓట్లకి ఖర్చు సెయ్యాలంటే యెలాగొతాది? మనలాంటోల్లకింత సేవ చేస్తన్నాడు. సమయం వచ్చింది. మనమంతా ఒకటై ఆ బాబును నిలబెట్టాల!"

ఈ బోధనతో తన తిండికి లక్ష్యంచెయ్యకుండా ఓట్లకోసం తిరిగాడు. రకరకాల మనుష్యుల్ని కలుసుకున్నాడు. వీరిలో నెలజీతాలు తెచ్చుకొనేవాళ్ళున్నారు. జీతం తెచ్చుకొని త్రాగేసి పెళ్ళం, పిల్లలను కొట్టి తిండిలేక మాడ్చేవాళ్ళున్నారు. జీతం బ్రాకెట్లు ఆటలో పెట్టేవాళ్ళు కూడా వున్నారు. కరువు కల్పించినందుకూ, పేదోళ్ళని పీల్చుతూ డబ్బుదోచుకుంటున్నవాళ్ళని యింకా పేల్చీకండా వుంచినందుకూ వాళ్ళంతా ప్రభుత్వాన్ని దుయ్యబట్టసాగారు. ఎన్నోవందల దృష్టాంతాలు, వాళ్ళకు యేమిచేసినా, నాయమేనని నిరూపించడానికి తెస్తున్నారు. ప్రభుత్వం పేదవాళ్ళది కాదని పెట్టుబడుదార్లదని బంధుజనం పక్షపాతం గలవాళ్ళంతా ప్రజల మంత్రులని నానా భాషల్లోనూ వీళ్ల యేకకంఠంతో అనగలుగుతున్నారు, పుల్లయ్య వీరితోపాటు చెయ్యెత్తి జై కొట్టున్నా మనసులో అదోలా వుండేది. ఆ మీటింగులో అదంతా వింటున్నకొద్ది "ఇదంతా నిజమేగావాల, లేకపోతే నాలాంటోడెందుకు బతకలేకపోతన్నాడు?" అని అనుకున్నాడు. మూడురోజులు మధ్యాహ్నం వెళ్లాక తనంతట తనకే ఆ మాటలు తిరిగిపోతున్నాయి. నీలి విని "ఇందుకేనా యెల్తాన్నా"వంది.

"నీకు తెలీదులే – ఈతరంవాళ్ళు లేశారు. సెడుగు మరి సాగదులే. అందరూ – మారాజు దగ్గరనుంచీ మాలోడుదాక ఒక్కటే–"

నీలి నవ్వి "అలాగని కేకవేస్తే వచ్చేస్తాదా?" అంది.

"రాక?.....ఈ బాబు గవుర్నమెంటోడైతేడా..... దున్నేవోడిదే భూమి! – కూలోడికి రోజుకి మూడురూపాయలకి తక్కువవుండదు – అడుక్కునేవాడు ఆరోజుల్లో మాయమైపోతాడు!"

"చేసినోడు ఎప్పుడూ కబుర్లు సెప్పడు!"

"అలాగ! ఉండుండు. పెద్దోల డబ్బు పేదోల్లకి పంచిపెట్టడా?"

"పెడ్తే – అది ఖర్చుపెట్టేక పేదోడు మల్లా పేదోడు – సూడు ఎందుకిలాగ కూలినేకండా అందులో పడ్తావు? నీ యైదేళ్లూ ఒకలాగ వున్నాయా? ఏ యేలు లేకపోయినా కష్టమే. నలుగుర్నీ మంచన్న నాలుకని కోసి రెండు నాలుకలు సేసేక – జరగవలసినదాన్ని ఆపడానికి నివ్వెవడవు? నే నెవర్తిని? దానికోసంనీలాగ ముక్కూ, సెవులూ వున్నోడ్ని యెందుకు సంపుతావు? పులిలాగ ఈయేళ యెదుటోడ్ని సంపితే రేపు నీ కడుపు పుట్టినోడ్ని సంపవా? నీ రాగటా నాకేమీ వచ్చలేదు–"

నీలి మామ్మను తలుచుకుంది, ఆపదలోనూ ఆ ముదుసలి నూరిపోసినదే ఆమెకు జ్ఞాపకం వస్తుంది. పుల్లయ్య మాటాడలేదు. ఆ రాత్రి చలి వేస్తున్నా గడపలోనే పడుకున్నాడు. ఆ రాత్రిమీద కూడాను దూరంనుంచి ఓట్ల గురించి ప్రచారం వినిపిస్తోంది. ఎక్కడచూసినా కోలాహలమే. మీటింగులే – ప్రజలు తండోపతండాలుగా వెళ్తున్నారు, వాళ్లల్లో వుత్సాహం ద్విగుణీకృతంగా వుంది, ప్రతీ యింటిలోనూ యే రోజూ యేవో వాదవలే. పొరుగు జేబుకాటుకు, పెళ్ళాంకుకూడా వాదనే వచ్చింది.

ఇలా మారుమూలల్లో వుత్సాహం ఓట్లువేసే తేదీ దగ్గర పడ్తున్న కొలది హెచ్చవుతోంది, బూచోడు, ఆ రాత్రి చెట్టుక్రింద కూర్చోని కాస్సేపు కుక్కపిల్ల గురించి పలవరించాడు. ఆ మాటలు విన్న పుల్లయ్య మల్లు నిద్దరపోతున్నాడేమో డమే మెల్లగా కాళ్ళవేపు వున్న కుక్కపిల్లను యిచ్చివేద్దామని లేచాడు. ఇంతలో బూచోడు యేదో గొణుక్కున్నాడు. వాడి నోటి వెంటకూడా ఓట్ల గొడవే!

“ఓట్లు – ఓట్లు – ఎంత తగలేస్తున్నారు. ఇదంతా చూస్తుంటే డబ్బుతో సీట్లు కొనుక్కొని చేతులెత్తడమే డెమోక్రసీ అనిపిస్తోంది. డెమోక్రసీలో మంత్రివర్యుని దగ్గరనుంచీ బంట్రోతువరకూ స్టేట్‌మెంట్లు యివ్వడానికే ప్రయత్నిస్తారు. డెమోక్రసీ-ప్రతిఫలం యెలక్షన్ల గొడవల్లో పార్టీలుగా విడిపోయిన ప్రజలు అలా విడిపోయే వుండటం – ఇంతకీ ప్రభుత్వం అవునన్నది ప్రతిపక్షం కాదనడమే డెమోక్రసీ నిజస్వరూపం!”

పుల్లయ్య లేచి దగ్గరగా వెళ్ళి ఉపన్యాసధోరణిలో నిల్చున్న బూచోడుతో “ఎవరితో చెప్తున్నా” వన్నాడు, బూచోడు పుల్లయ్యవేపు చూడకండా “ఎవరితోనా? ఈ వున్న ఒకే చెట్టుతో – యీ రాళ్ళతో – ఇవికూడా మరి నాలుగురోజులుపోతే రాజకీయాల్లో పాల్గొంటాయ్! వాటికి ప్రాణం వున్నదని చెప్పారు కాదూ!” అన్నాడు.

“ఆ మీటింగులో సెప్పకూడదా?”

“మీటింగు! హాఁ! పార్లమెంటు, ఇంగ్లండులో ప్రజాస్వామ్యం వున్నతస్థాయిలో వుందంటే పార్లమెంటు ప్రసంగాలవల్ల కాదు–” అని నవ్వాడు.

ఆ నవ్వు కాస్సేపు పొడిగించి కూర్చున్నాడు. చలి వేస్తోంది. అయినా బూచోడు నవ్వుకుంటూంటే పుల్లయ్యకు అక్కడనుంచి కదలడానికి బుద్ధి పుట్టలేదు. ఎదురుగావున్న వుప్పుటేరు కాలవనుంచి దుర్గంధం చాలా హెచ్చుగా వీస్తోంది. అలా అక్కడ వున్నకొద్దీ పుల్లయ్యలో లేనిపోని ఆశలు రేకెత్తుతున్నాయ్. “బూచోడిని యీ చల్లనికాలాన మెల్లగా అడిగితే తప్పక బంగారం యెక్కడ దాచాడో చెప్తాడు – అది మెల్లగా త్రవ్వి నాను నవిరి పోయి పొలం కొనుక్కొని బతుకుతాను – యీడినీ తీసుకుపోయిపెంచుతాను” అనుకున్నాడు. మళ్ళీ ఆ క్షణంలోనే అలాంటి డబ్బు యెంతకాలం వుంటుందనిపించిది. తన వూర్లో పెద్దరైతుకు డబ్బు యెలా వచ్చింది? వాడయ్య రంగం వెళ్ళాడు. ఇంటికోసం వునాదులు త్రవ్వుతుంటే పెట్టెలో బంగారం దొరికితేకదా పెద్దోడైపోయాడు. అలాగు తనెందుకు కాకూడదు? ఈ కష్టాలన్నీ పారిపోతాయి – మల్లుకు పెద్దసదువు సదివించి పెద్ద దొరను చేసేయ్యనా?......ఇలా అనుకుండగానే బూచోడు మళ్ళీ మాటాడటం మొదలెట్టాడు–

"వాడు వూర్లో పెద్దమనిషి! ఆ పెద్దమనిషికి నాలుగుమూలాల్లో నలుగురు వుంపుడుగత్తెలు! వాడు దేశసేవకుడు. చుట్టూవున్న అమాయక ప్రజ పాపం వాడిని మనిషిలాచూసి గౌరవిస్తారు. వాడిడబ్బు గౌరవాన్ని తెస్తోంది. దానధర్మాలు చేస్తున్నట్లు పెద్ద దాతనని చెప్పకుంటుంటాడు. ఫలానావారి ధర్మమని అన్నిటిమీద స్టాంపు వేయించుకుంటాడు. వాడికి సంఘంలో గౌరవస్థానాన్ని యిచ్చే యీ అమాయక ప్రజల్ని చూస్తుంటే నాకు జాలి వేస్తోంది. నీతికి ఒక విషయంలో నిలబడనివాడు ఇంకే విషయంలోనూ దానికి విల్వలేదు. అలాంటి పెద్దమనిషికి తమ బాగోగులు చూడమని చెప్తే ప్రజాసౌఖ్యం ఎలా వస్తుంది? వాడికి తెలిసింది యెలా వేషంవేసి ప్రజల్ని మోసగించడమా అనే! ఈ చదువుకున్న మూర్ఖులకన్నా ఆ అమాయక ప్రజల్లో సంస్కారం వుంది. అలాగని వాడ్ని చంపమని చెప్పడం లేదు. రక్తదాహం గలవాడు మనిషి అనిపించుకోడు – పశువు. పశువుకు మానవ సంఘంలో చోటులేదు. అయితే ఇలాంటివాళ్ళందరినీ యేం సెయ్యాలి? గుండెనించి వచ్చే మర్యాద ఈయటం మానండి నాయనలారా, మానండి. ఒక చీమ నిజానికి పాటుపడితే దాన్ని సింహాసనంమీద యెక్కించండి. నిజమే మనుషుల్ని పెంచేదీ, రక్షించేదీ! నిజమే శాశ్వతంగా నిలిచేది. నిజంతో నిర్మింపబడ్డ ప్రభుత్వం – దాన్ని ఏమైనా అనండి, అదే కలకాలం నిలుస్తుంది! నిజంకు కట్టుపడని నాయకులు గొప్ప నాయకులని ఆత్మవంచన చేసుకోనీయండి. వాళ్ళ జీవితంలో ఎప్పుడో ఒక్క నిముషమైనా పశ్చాత్తాప పడకపోతే వాళ్ళు నాయకులేకాదు – మనుషులే కారు – అటువంటి పశువులకి అలాంటి అంత్యమే వస్తుంది! ఎంచేతంటే సత్యమే దేముడు. దైవత్వం యేదో పాలులో లేకండా మానవమాత్రుడు యే ఘనకార్యం చెయ్యలేడు."

బూచోడు కాస్సేపు తనలో తనే నవ్వుకున్నాడు: చలి కాస్తా వణికిస్తోంది – మంచు పడుతోంది. పుల్లయ్యకు నిముష నిముషానికి ఆతృత హెచ్చవుతోంది కొంతసేపటివరకూ నిశ్శబ్దంగా వుంది....ఆ ప్రశాంతతలో మెల్లగా;

"బంగారం ఎక్కడ పాతావు?" అని పుల్లయ్య ప్రశ్నించాడు.

"ఎక్కడా?"

"పాతావు కదూ?"

"అవును......"

"ఎక్కడా?"

"కొబ్బరిచెట్టుక్రింద......."

"ఇంటి వెనకా?......"

"అవును......"

"కొబ్బరిచెట్టుకు యెటువేపు?"

"ముందే."

"ఎన్ని తులాలు......నీదేనా?"

బూచోడు చర్రుమన్నాడు. "దానిదీ! నన్ను ఖూనీచేసిందే – దానిదీ, నీ కెందుకు ఫోఫో" అని అరిచాడు. ఇంకే ప్రశ్న వేసినా జవాబు చెప్పలేదు. లేచిపోయాడు.

"ఏమిలోకం – ఏమిలోకం – అంతా మాయ! ఆడది మాయ – మొగోడు మోసం! అంతా దొంగలు. నా కుక్కని కూడా నాకు లేకుండా చేసారు."

పుల్లయ్యకు కనికరంవేసి గబగబ గడపలోనికి వెళ్ళి కుక్కపిల్లను తీసుకువచ్చాడు. "ఇదిగో నీ కుక్కపిల్ల! మళ్ళా యిక్కడికి వచ్చావంటే పోతాది.......ఎల్లిపో......."

బూచోడు ఒక్కగంతు వేశాడు. "వచ్చావురా నాయనా – నా బాబూ – నీతో చెప్పకోటానికి ఎంత దాచుకున్నాను–" అంటూ ముద్దుపెట్టుకుని వెళ్ళిపోతుంటే అది చిన్న మొరుగు మొరిగింది.

"నీ మాట నాకు తెలీదా? ఏడవకు ఏడవకు బాబూ, కలుసుకున్నాం కదూ!" అని దాన్ని యెత్తుకొని వెళ్ళిపోయాడు.

ఆ మరుసటిరోజు ఉదయం పనికొస్తారా అని ఒకడు యింటివేపే వచ్చాడు. పుల్లయ్యకు ఎంతో ఆశ్చర్యం వేసింది – ఇలా యింటికి వచ్చే పరిస్థితి వచ్చిందికదా, లోకం ఇంతగా మారిపోయిందా అని సంతోషపడ్డాడు.

"ఏంపని?" అన్నాడు.

"రోజుకు రెండు రూపాయలు, రాళ్లెత్తమనం, రప్పలెత్తమనం – వస్తావా? ఇదిగో రెండు రూపాయలు!"

పుల్లయ్య అందుకొని నీలిచేతిలో పెట్టి వాడివెంట పడ్డాడు, మల్లు తండ్రిని అనుసరించాడు. ఒక అరమైలు దూరం నడిచారు. పెద్ద మేడ, ఆ మేడ యెదరగా యెంతోమంది నిల్చున్నారు. అంతా తనలాంటివాళ్ళే! వాళ్ళలోవాళ్ళు యేదో గుసగుసలాడుకుంటున్నారు. ఓట్ల గొడవే!

ఇంతలో పిలుపు వచ్చింది. అంతా లోనికి వెళ్ళారు. కుర్చీమీద ఎదురుగా పెద్ద మీసాలతో ఒక మనిషి కూర్చున్నాడు. వయస్సు యేభయ్యోపడి వుంటుంది. చేతికి నాలుగు వుంగరాలున్నాయ్. ముఖం తీవితో చామనచాయగా వుంది. మామూలుగా పంచ, సిల్కు కమీజు వేసివున్నాడు. చేతికి కప్పలాంటి వాచీ వుంది.

"వినండి, బాగా వినండి." నిశ్శబ్దంగా చేతులు కట్టుకొని నిల్చున్న ఆ యాభై మంది ఒక్కసారి వణికేట్లు ఆ మాటలు ధాటిగా వచ్చాయి.

"నేను చెప్పినమాటల్లో ఒకమాట మర్చిపోకూడదు. చెప్పినపని చేసుకొచ్చినవాళ్ళకి రేపు మూడు రూపాయలు!"

"సిత్తం......సిత్తం!"

ఆ వ్యక్తి కుర్చీమీదనుంచి లేచి నిల్చుని ఉపన్యాస ధోరణిలో......

"సదువుకున్నోళ్ళ దగ్గరికి మీ రెళ్ళకండి – మనదేశంలోని సదువుకున్నోలకంటే సాకలోడు నయం, ఆ సదువుకున్నాడన్నోడికి సగం గేనం. అంచేత మీరంతా యీ మహాపట్నంలోన పేదోడింటికే వెళ్ళండి. ఆడికష్టాలు మీకు తెలుసు. నాకు తెలుసు.......యిన్నారా?"

"సిత్తం.......సిత్తం!"

"నేను యిక్కడ ఎలాగ మాటాడినానో మీరు అలాగే మాటాడాలి! నాకు యింగ్లీషు రాదని తెలుగురాదా? నేను మీదగ్గర యెలాగ మాట్లాడుతున్నానో ఆ యెసెంబ్లీలోనూ నా బాసలోనే మాట్లాడుతాను. ఇంగ్లీషు వస్తే వున్నాది లేకపోతే లేదా? నా సూట్బూ వున్నవాళ్ళకి ఇంగ్లీషు రాదే! నాలాగే వాళ్ళూ పంచెకట్టి కమీజు వేసుకుంటున్నారు. అంచేత నాను వాళ్ళందరికంటే నయమే!"

"సిత్తం........సిత్తం"

కాస్తా మీసం మెలివేసి ఇటూ అటూ పచారు చేస్తూ "ఈ గవర్నుమెంటోడి రాగటా యేమీ బాగులేదు. చూసారా దొంగసారా బట్టీలు ఎలాగ లెగిచిపోతున్నాయో! ఎంత మంచి ఆఫీసరైనా యెండిచెప్పతో కొట్టే లొంగిపోతున్నాడు, వేలు చేసుకొన్నవాడిమీద పన్నులేదు. నేను ఆసెంబ్లీకి వెళ్ళి యిదే వాదిస్తాను. గవుర్నమెంటోడినే బట్టీలు పెట్టి పులిసిన సద్ది అన్నంలాంటి సారా నివ్వే యియ్యి. నా ప్రజా బాగుపడ్తారు. ఆ డబ్బు పెట్టి యీ మురికి గుంటలు బాగు చెయ్యమంటాను. ఇది చెప్పడానికి ఇంగ్లీషు రావాలా? మా అయ్యకి, తాతకీ యేం ఇంగ్లీషువచ్చేది! గ్రామసావిడిలో పంచాయితీ తీర్పు చెప్పినారంటే లండను వెళ్ళినా తిరుగుండేది కాదు. ఇవన్నీ బాగా విన్నారా! చెప్పండి – గట్టిగా చెప్పండి – అరవండి – గట్టిగా అరవండి మీ ఓటు!"

ఎవరూ గొంతుక పెగిలించలేదు. "అరవండిరా బంగారయ్యకి అని."

"మీ ఓటు!"

"బంగారయ్యకీ!" అన్ని కొంతుకులు కలిసాయి. పుల్లయ్య విధిలేక అన్నట్లు అన్నాడు. కానీ ఈ బాబు చెప్పినదాంట్లోనూ యేదో నిజం వుందనిపించింది. ఇంతకీ కూలి పుచ్చుకున్నాడు. తిరగడానికి బయలుదేరారు.

చలి హెచ్చుతున్నకొద్దీ ఓట్లుగొడవ హెచ్చవుతోంది. ఎక్కడా యీ కోలాహలమే. ఈ సీటుకి మూడు పార్టీవాళ్ళూ, ఒక స్వతంత్రుడు పోటీ చేస్తున్నారు స్వతంత్రుడు బంగారయ్య, పెద్దలు గడించిన ఆస్తి తగలెయ్యకండా యేవో కంట్రాక్టులుచేసి పెంచుకున్నాడు. యుద్ధకాలంలో కంట్రాక్టులు చేసి బాగా ఆర్జించాడు. ఈ మధ్యనే పధ్నాలుగు వేలిచ్చి కారు కొన్నాడు, ఈ యెలక్షన్లలో ఒక అర లకారమైనా ఖర్చుపెట్టి తనజాతిలో గౌరవం, కీర్తి తెచ్చుకుందామనే వుబలాటంతో రాత్రీ పగలూ నిద్దరలేకండా వుంది. "నేను మెంబరైతే కల్లూ, సారా మంచిది మొదటిలాగా రప్పించనా? యే వూరు రాబడి ఆ వూరులోనే ఖర్చులు పెట్టిస్తాను. కరువూ కాటకాలు నాలుగునెలల్లో లేకండా చేస్తా"నని ఆ చుట్టుపట్ల పల్లెల్లో ప్రచారం సాగిస్తున్నాడు. ఎంత స్వేచ్ఛ అనుకున్నా యీ చుట్టుపట్ల పల్లెల్లో ఓట్లు సాధారణంగా ఆ వూరు పెద్దలచేతిలో వుంటాయని వాని నమ్మకం. వాళ్ళను పట్టుకొని మూతికట్టేస్తేచాలు, కావలసిన ప్రచారం వాళ్ళే చేసుకుంటారు. బంగారయ్య ఆ పనే చేశాడు. ఆ అమాయక పల్లెజనంలో మూడువంతుల ఓటర్లు తనవేపే ఓటు వేస్తారు – తప్పదని అనుకున్నాడు.

ఇలా ఉండగా బంగారయ్యమీద యెదుటిపార్టీవాళ్ళు మంచి మంచి పుకార్లు వ్యాపింప జేస్తున్నారు. మధ్యతరగతి ప్రజలలో వాడంటే హేళనగా వుంది. పై అంతస్తులో వాడికెందుకని పకపక నవ్వుతున్నారు. ఉన్నది యెలాగ ఖర్చు అవుతుందని అంతా అనుకుంటున్నారు. బంగారయ్యమీద పుట్టిన పుకార్లలో మచ్చుకి కొన్ని – కారు కొన్నాడు కదూ – వెనక సీట్లో ఒక్కడే కూర్చున్నాడు. డ్రైవరు నడుపుతుండగా ఓ దగ్గర బర్ అని శబ్దం వచ్చిందట! వెనకసీట్లోనుంచి "అదేంటి! అదేంటి!" అన్నాడట. గేరేశాను బాబూ అంటే బంగారయ్య వెంటనే "యిక్కడెందుకేశావ్? ఇంటిదగ్గరే యేసేలేకపోయావా?" అని డ్రైవర్ని మందలించాడట! ఒకసారి డ్రైవరు

నడిరోడ్డుమీద కారు ఆపితే యెందుకాపినావంటే పెద్దరాయి అడ్డుంది బాబూ అన్నాడట. హారను కొట్టు, అదే తప్పకుంటాదని బంగారయ్య అన్నాడట! పట్నంలో ఒక మురుగుపేటకు వెళ్ళి వారందరితో యేం చెప్పాడట అంటే, తను అసెంబ్లీ మెంబరైతే కొళాయిలనుంచి సారా తెప్పించనా అనీ, అంతకీ అక్కడ తనకు మాటాడటం రాకపోతే పెద్ద ప్లీడర్ని ఖర్చుపెట్టి అక్కడ వాదించడానికి పెట్టనా అనీ అన్నాడట!

ఇలాంటి కట్టుకథలు యెదుట పార్టీలవాళ్ళు ప్రచారం చేస్తున్నారు. బంగారయ్య తొణకలేదు బెణకలేదు. "నాకు పేదోళ్ళబలం వుంది. నేను రాకపోతే యెవ డొస్తాడో చూస్తా!" నని ప్రగల్భాలు పలుకుతున్నాడు – డబ్బు విరజిమ్ముతున్నాడు. అవేళ సాయంత్రం తిరిగివచ్చిన వాళ్ళకి కడుపునిండా తిండి పెట్టించాడు.

"తినండర్రా? మీ కష్టాలు నాకు తెలుసు!"

వాళ్ళ భోజనాలయ్యాక "మీరు వెళ్ళడానికి వీల్లేదు. ఈ రాత్రి ఆ కాంగ్రెసోడు పెద్ద దండుని వూరిలో తిరగడానికి పరేపిస్తున్నాడు. మనము వెళ్ళాల. వాళ్ళ గొంతుకలన్నీ మన గొంతుకలో కలిసిపోవాల – బాగా పని చేసుకొచ్చారంటే మనిషికి రెండేసి రూపాయలు!" అన్నాడు.

ఈ మాటలు విని అంతా సరే అన్నారు. పుల్లయ్యకు కడుపునిండా తిండి యెన్నాళ్ళకి దొరికింది! "ఈ బాబు కష్టాలు తెలిసిన బాబులాగ వున్నాడు. ఇలాంటి బాబు గవుర్నమెంటోడైతే కష్టాలు పోతాయేమో! అల్లా బాబుకింద నాలుగురోజులు కూలీలేకండా తిరిగినాను. బుక్కెడు గంజైనా పోసారుకాదు!" అన్నుకున్నాడు.

ఈ రాత్రి పెద్దదండు పెట్రోమేక్సు లైటుపెట్టి బాజా బజంత్రీలతో బయలుదేరారు. కేకలు మిన్నుముట్టి పోతున్నాయి. త్రోవలో ఇంకోపార్టీ జండాలతో యెదురైంది. ఆ మధ్య నాలుగురోజులూ ఆ పార్టీతో తిరిగాడు. వాళ్ళంతా తనవేపే చూస్తున్నట్లనిపించింది పుల్లయ్యకు! తన స్నేహితుడు పొరుగు జేబుదొంగ వాళ్ళంతా అందులో వున్నారు. సిగ్గువేసింది మొదట. కానీ తరువాత నా కడుపుకన్నానా అనుకున్నాడు, రేపు పొద్దున్న నాను ఆకలితో అలమటిస్తే వీళ్లొక పైసాయైనా యిస్తారా అని అనుకుని ధైర్యంగానే అడుగులు వేస్తున్నాడు. ఇంకోవేపు నుంచి మరొక దండు – ముందు కాడికట్టిన యెడ్లు! ఆ చుట్టుపట్ల కోలాహలం మిన్నుముట్తోంది. అన్ని గొంతుకలూ కలిసినా లౌడుస్పీకర్లు ఆ గొంతుకల్ని మింగేస్తునాయ్, రానురాను ఒక గుంపుమీద ఇంకోగుంపు మాటలు విసురుకొంటున్నారు – రౌద్రం హెచ్చిపోతోంది! అందులో ఆ రౌద్రాన్ని తగ్గించడానికి ప్రయత్నించే సహృదయులు వున్నారు. కాని నిముష నిముషానికి స్థాయి హెచ్చిపోతోంది – మాటలు పోయి చేతలకి వచ్చాయి. రోడ్డువేయటానికి వున్న కంకరరాళ్ళ కుప్పలమీదకి చేతులు వెళ్ళాయి.....పుల్లయ్యవేపు రాళ్ళువచ్చి పడ్డాయి – పుల్లయ్యకూడా పౌరుషంకొద్దీ రాళ్ళు పట్టుకున్నాడు. విసురుదామనుకుంటే యేదో చెయ్యి తనచేతిని పట్టుకున్నట్లనిపించింది. పెళ్ళంతలపు రావటంవలన కామోసు రాళ్ళు క్రింద పడేశాడు.

ఇంతలో ఎవరో పోలీసులు వస్తున్నారని కేకలు వేశాడు.....కొందరు పారిపోయారు. ఒక పార్టీ ఒకవేపు వెళ్ళిపోయింది. ఇంకోపార్టీ ఇంకో వేపు.....బంగారయ్య

పార్టీ ముందుకు సాగిపోయింది..... సాగిపోతున్న కేకలు దూషణలతో సహా మిన్నుముట్టున్నాయ్-

ఆ దగ్గరలోనే బూచోడు కళ్ళువిప్పి అంతా చూస్తున్నాడు బూచోడు కుక్కపిల్లతో ఆ రోడ్డుపక్కన కూర్చుండిపోయాడు, కొద్దిక్షణాలు పకపకా నవ్వుకున్నాడు. తరవాత బుజ్జగించిచెప్పేధోరణిలో "చూశావా నాయనా, ఈ వెర్రితమ్ముళ్ళు యెలా కొట్లాడుకుంటున్నారో? దేనికి – ప్రజల్ని సుఖపెట్టే ప్రభుత్వంకోసం? ఒకరినొకరు మర్యాద్ధ ఇచ్చి పుచ్చుకోలేకపోతున్నారు. అసూయ చెదపురుగై మనుషుల్లో మానవత్వాన్ని పిప్పిచేస్తుంది. అలాంటి మనుషులున్న దేశం వేగం పతనంకాదా?" అన్నాడు.

ఆ ప్రశ్నవేసి లేచి నిల్చున్నాడు.

"బాబూ! నేనెందుకు పతనం అయిపోయానంటావ్? యెదుటివాళ్ళ చెడులో మంచి చూడలేకపోయాను. పతితుల్ని ప్రేమించే మంచి తనం నాలో లేకపోయిందోయ్! అంతా నాదనే అహంకారంతో కూలిపోయాను. ఈ లోకంలో పెరిగిపోతున్న కష్టాలకి కారణ మేమంటావ్? మనిషి అంతా నాదనే మాయలో చిక్కుకున్నాడు. ఈ మాయని యే ప్రభుత్వం తగ్గించగలుగుతుందో అదే రామరాజ్యాన్ని తేగలుగుతుంది. ఆ మాయ మానవుల్లో దురాశారూపంతో అంకురించివుంది. గుర్రానికి కళ్ళెంలాగ ఆ దురాశకు ప్రభుత్వం కళ్ళెం వెయ్యకపోతే దానిష్టం వచ్చినట్లు గెంతి బీభత్సం చెయ్యదా? పరిపాలించేవాడే కళ్ళెంలేని గుర్రమైతే అంతాసరి! వాడు సారధి కావాలంటే వాడి మెదడులో ఒక్క న్యాయదృష్టే వుంటే చాలదు, తెలివితేటలుండాలి! ఆ ఒక్కడి న్యాయం తెలివీ కోట్ల ప్రజలకు సుఖాన్ని యిస్తుంది. పూర్వకాలంలో రాజుల న్యాయం, మంత్రులతెలివీ కలిసే దేశాలు వర్ధిల్లాయ్. ప్రజలు సుఖపడ్డారు! అంచేత మనుషుల్లో అంతా సమానమనే వెర్రి అహంభావాన్ని రేకెత్తించి నిరాశ జెయ్యించి వాళ్ళని పతనం చెయ్యటం నాకు ఘోరాతి ఘోరమైన విషయంగా కనిపిస్తోంది. బాబూ! నీవు చాలా విశ్వాసమైన జాతిలోనివాడవోయ్. అందుచేత నీతో యింత చెప్పుకుంటున్నాను – అర్థం అవుతోందా!"

కుక్క చిన్న మొరుగు మొరిగింది. బూచోడు నవ్వుకున్నాడు. ఇంతలో ఏదో యేడుపు వినిపిస్తోంది. మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ, కుక్క కాస్త పెరిగినా క్రిందవదిలితే యెవరన్నా తీసుకవెళ్తారనే భయంతో ఎత్తుకొని అక్కడకు వెళ్ళాడు. గడపలో శవం! ఆ శవంపైపడి యిద్దరు పిల్లలు, భార్య యేడుస్తున్నారు. వాళ్ళగోడు విని యిరుగు పొరుగున వున్నవాళ్ళకళ్ళల్లో నీళ్ళు కారిపోతున్నయ్.

బూచోడు అలా నిల్చొని చూచాడు. "తమ్ముడా! చనిపోయావా?" అన్నాడు. అక్కడ మూగివున్నవాళ్ళు బూచోడివైపు వినయంగా చూస్తున్నారు. వాడిగెడ్డం, విరబోసిన జుత్తు, ఆ తెల్లని ముఖవర్చస్సు చూసి నలుగురిలోను అదో గౌరవభావం ఏర్పడింది. బూచోడు మరి కాస్త దగ్గరకు వెళ్ళి:

"ఎందుకు నాయనలారా గగ్గోలు పెట్తారు, ఇదిగో!" అంటూ ఒక సమకోణ త్రిభుజం, దానిభుజాలమీద చతురస్రాలు రాయిముక్కతో తారురోడ్డుమీద గీశాడు. మళ్ళీ ఆ చతురస్రాలను చూపిస్తూ "యిది మనస్సు, ఇది ఆత్మ. ఈ రెండు

కలిస్తేగానీ, పరమాత్మతో సమానంకాదు – మనసునూ, ఆత్మనూ కలపలేకపోయాడు – చచ్చిపోయాడు, అలా కలపనంతవరకూ పుట్టూనే వుంటాడు – చచ్చిపోతుంటాడు" అన్నాడు. తరవాత కాస్తసేపు మౌనంగా లేచి ఇటూ అటూ తిరిగాడు. అంతా బూచోడు ఏ మాహాత్యం చూపిస్తాడో అని ఆశతో చూస్తున్నారు. కానీ కొంతసేపటికి మాటాడకండానే తన దారిని తాను పోయాడు.

## 33

ఓట్లగొడవ అయిపోయింది. పుల్లయ్య కొద్దిరోజుల సౌఖ్యం అంతమైంది. బంగారయ్య వోడిపోయినా "తనలాంటోలంటే కనికరం కాదా, సాయంచెయ్యడా" అని రెండుపూటలు అతగాడి గుమ్మం విడిచిపెట్టలేదు. ఓట్లకోసం డబ్బు పుచ్చుకున్నవాళ్ళే మోసం చేశారని కుతకుత వుడికిపోతున్న బంగారయ్య అవసరం తీరిపోవటంచేత అసలు పుల్లయ్యని మనిషిలా చూడకండా గెంటించాడు! చాలా కష్టం అనిపించినా రోజులు బాగులేవనుకొని యింటికి వచ్చేశాడు.

ఈ మధ్య దొరికిన డబ్బు వడ్డీలతో అప్పతీరగా తిండికే సరిపోయింది. ఏ కొద్దో మిగిలితే దానితో పిల్లకు రెండు గౌనులు, మల్లుకు రెండు చెడ్డీలు, కమీజులు కుట్టించింది. ఇలా పనివుంటే యేదో మిగిల్చి ఒక రాట్నం చెయ్యించు కుందామనుకుంది. ఆ రాట్నంమీద డబ్బుచేసి ఒక గేదెను కొంటే న్యాయమైన పాలవర్తకం చేసుకొని బ్రతుకలేమా! అనుకుంది. ఆమె ఆశలన్నీ అడియాసలయ్యాయ్!

పుల్లయ్యకు బుట్టపట్టుకొని బజారుకు మళ్ళీ కూలికి వెళ్ళడానికి సిగ్గువేసింది. తను ఈమధ్య కొద్దిరోజులు తిండి యెరగడంవల్ల కాస్త ఒళ్ళు చేశాడు. తనలాంటివాడు బజారులో కూలిపనేమిటనిపించింది. రెండు రోజులు పనికోసం వూరంతా గాలించాడు, ఒకపూట స్టేషనునుంచి మూటలు మోస్తే అర్థరూపాయి కూలి దొరికింది. అంతే! మళ్ళీ తన పరిస్థితి మామ్మూలుకు వస్తోంది. ఈమధ్య కొంత విచారం మరచిపోయినవాడికి మళ్ళీ విచారం, ఆందోళన ఆవరించి గుల్లచేస్తోన్నాయి.

ఒకపూట బజారుకు తెగించి వెళ్ళాడు. మళ్ళీ వచ్చాడని కుర్రకుంకలు అంతా యేకమయ్యారు. హేళనకాదు – వెనకనుంచి వచ్చి పిచ్చాడని అరుస్తూ పంచెలాగుతూ, జుత్తులాగుతూ అల్లరిచేయసాగారు. నానా రకాల తిట్లూ మొదలుపెట్టారు. ఇదంతా భరించలేకపోయాడు పుల్లయ్య.

మళ్ళీ పస్తుండవలసినరోజులు వచ్చాయి! పిల్లలు కిరకిర చుట్టుకుంటున్నారు. ఒకరాత్రి బయటే గడపలో పడుకున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. మల్లు ప్రక్కన ఆకలికి యేడ్చి యేడ్చి పడుకున్నాడు. రైలు పట్టాలమీదనుంచి కరకరలాడుతూ కదిలిపోయింది. ఒక్కసారి ఒళ్ళు జలదరించింది. తను ఇలా చచ్చిపోతానేమోనన్న భయంవేసింది. "నా బతుకు ఇంత దరిద్రానికి వచ్చిందా? నా అయ్య అలాంటి పౌరుషమైన బ్రతుకు బ్రతికి చక్రవర్తిలాగ నలుగుర్లో ఘనత తెచ్చుకొని చచ్చిపోయాడు. నా పెళ్ళం మంచైనా నాకు కడుపునిండా గంజి పొయ్యలేదు. ఈ లోకంలో కడుపుముందా నాయంముందా? కడుపునిండకపోతే ఏంచేసినా అది నాయమే:– నా

నెందుకు బూచోడి ఇల్లేదో కనుక్కొని......ఆ కొబ్బరి చెట్టుక్రింద త్రవ్వి బంగారం తీసుకోకూడ"దనుకుని యెదురుగా వున్న చెట్టువేపు చూశాడు. బూచోడు ఆవేళ కుక్కను తీసుకున్న దగ్గరనుంచి రావటమే మానివేశాడు. చెట్టుకొమ్మలు గాలికి కదులుతూ చిన్నశబ్దం చేస్తున్నాయి. అలా పరిపరివిధాల తలచుకొని నిద్దరపోయాడు. నడిరేయి చలివేసింది, ఇంట్లోకి వెళ్ళి పడుకున్నాడు,

ఆ రాత్రి గుడ్డి వెంకన్న చనిపోయినట్లు కలగన్నాడు. తెలివి వచ్చాక వూరు జ్ఞాపకంవచ్చి మరి నిద్దరపట్టలేదు. భజనమందిరం దగ్గర వెంకన్న కోర్కెలు, యేడుపూ కళ్ళకుకట్టి అప్పుడే తనవూరు పెల్దామన్న కోరిక కలిగింది.

తెల్లవారింది. ఉదయమంతా తిరిగినా పని యెక్కడా దొరకలేదు, బూచోడు ఆ మూడంతస్థులమేడ యెదురుగా పాడుపడివున్న ఇంటి అరుగుమీద కనిపించాడు. ఆ మేడ పెరటివేపు కొబ్బరిచెట్టు వున్నదేమో చూశాడు, లేదు. ఏ ఇంటి పెరట్లైనా కొబ్బరిచెట్టు వుంటుందేమోనని తిరిగితే యెన్నో ఇళ్ళు అలాంటివి కనిపించాయి, ఇంతలో యెన్నో అనుమానాలు కలిగాయ్. బూచోడిది ఆ వూరు కాదేమో ననుకున్నాడు. మధ్యాహ్నం ఇంటికొచ్చేసరికి నీలి గంజిపోసింది; త్రాగాడు. ఆకలితో అంతా త్రాగాక జ్ఞాపకం వచ్చింది. పెళ్ళాం ఆ పూటకుకూడా పస్తుంటుందనే ఆలోచన కడుపులో గంజిపడినా త్రిప్పివేసింది!

కాళ్ళు పీకెడ్తున్నాయని మధ్యాహ్నం పండుకొని సాయంత్రంసరికి లేచారు. చీకటిపడ్తుండగా కొడుకుతోసహా వీధిలోనికి వెళ్ళాడు. రోడ్డు నిండుగా జనం కిటకిటలాడి పోతున్నారు, ఏదో ఒక పనిమీద వచ్చిన వాళ్ళు ఆ షాపుల్లో యేవో కొంటూనేవున్నారు. అవన్నీ చూస్తుంటే. కళ్ళు తిరిగిపోతున్నాయ్. తన మల్లుకు ఆడుకోడానికి రబ్బరుబంతి కొంటే...... అదిగో అదెవరో పిల్లోడు రోడ్డుమీదే బంతి కొడ్తున్నాడు – చూసిన కొడుకు "అయ్యా అయ్యా" అంటూ అటువేపే చెయ్యి చూపిస్తున్నాడు. ఇంకో పిల్ల నోటిలో బాకాపెట్టి వూదుకొంటూ వెళ్తోంది.... మల్లుకి అదీ కావాలి...... అదిగో ఆ చిన్నపాపచేతిలో రబ్బరు కుక్కపిల్లబొమ్మ – మల్లుకు ఇదీ అవసరమే!

"నివ్వంత పుట్టుక పుట్టావుకానీ – నీ రోజులు బాగాలేవు నాయనా!" అనుకున్నాడు. అలా కొంతదూరం వెళ్ళేసరికి రోడ్డుప్రక్కన దీపం వెల్తురులో జోతిష్యుడు చేతులు చూస్తున్నాడు. కాని డబ్బులులేవే. ఏం చెప్తాడో! నా దినా లెప్పుడు బాగుపడ్తాయో చెప్తాడు!

"అయ్యా! యెంత తీసుకుంటావు?" అన్నాడు.

"మోదకొండమ్మ పేరుసెప్పి నీకు కలిగిందే నాయనా!" అన్నాడు కోయజాతి మనుష్యుడు. కానీ అయినా దగ్గరలేని పుల్లయ్య విసుక్కొని ముందుకు వెళ్ళిపోయి కాళ్లు పీకెట్టడంవల్ల ఒక యెత్తైన కాలువగట్టుమీద కూర్చుండిపోయాడు. కడుపు ఆకలితో దహించుకపోతోంది. తనకే ఇలా వుంటే, తనకొడుక్కెలా ఉంటుంది? లేచి నిల్చోడానికే శక్తిలేదనిపించింది, అలా దారీ తెన్నూ తెలియని పాంధునిలా కుర్చుండిపోయాడు. పెద్దపులిలా ఆకలి మ్రింగేస్తోంది. రానురాను జనం పల్చబడిపోయారు. చుట్టుపట్లవున్న కొట్లు కొన్ని మూసివేస్తున్నారు! ఉండి ఉండి

గాలి వీచి తారు రోడ్డును తుడుస్తూపోతోంది...... మల్లు అలా అయ్యతొడమీద తలపెట్టి నీరసంతో వుండటంవల్ల యే ప్రశ్నలు వెయ్యటంలేదు. అలా కొడుకుతల నిమురుతూ మీద చెయ్యి వుంచాడు. ఎక్కడలేనీ జాలీ, అభిమానాలు కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్నాయి, నరాలన్నీ విచారభారంతో పొంగిపోయాయి! ఆ నిముషంలోనే ఆ కొడుకు పుట్టినప్పటి స్వరూపం కళ్ళకు కట్టింది.....నా వూర్లో ఇలాంటోడు పుట్టలేదు......అంత గొప్పోడూ ఇలాగై బస్తీలో కుళ్ళుకాలవదగ్గర ఆకలితో వరిగిపోతున్నాడు!.......ఇంకా అనుకున్నకొద్దీ తన ఆకలి మరిచిపోయి కొడుకు ఆకలిబాధను తను అనుభవిస్తున్నాడు.....ఆ ఎదురుగావున్న రొట్టెలదుకాణం మూసేస్తున్నాడు. వెళ్ళి ఒక రొట్టె తెచ్చుకుందామనుకున్నాడు – దొంగతనమా? తను దొరికిపోతాడా? తనను పోలీసుల కప్పజెప్పరా?.......

మరి ఇంటికెందుకు వెళ్ళాలనుకున్నాడు.....కాని తనూ, కొడుకూ అలా ఆకలితో మంచులో వుంటే యేమౌతుంది? రాత్రిపూట యెవరయినా దొంగనుకుంటే! తను యింటికి వెళ్ళకపోతే నీలి యెన్ని విధాలుగా అనుకుంటుందో!

చివరకు లేచాడు. కొడుకూ లేచి మెల్లగా అడుగులువేస్తున్నాడు......దగ్గరత్రోవన ఇంటికి పోదామని పీర్లకొనేరురోడ్డువెంబడి నడుస్తున్నారు......ఆ రోడ్డులో జనసంచారం లేదు. వీళ్ళిద్దరే కనిపిస్తున్నారు. నాలుగడుగులు వేశాక నీరసం అనిపించింది. అదిగో మునిసిపల్ దీపంకింద ఒక గుడ్డిమనిషి గుడ్డపరచి అడుక్కుంటోంది. అంతదూరంనుంచే చూశారు, గ్రుడ్డిదిలా ఉంది...... మాసిపోయిన చింకిబట్టలు...... శుష్కించిన శరీరంలోని ఎముకలు ఆ చిరుగులలో నుంచి కనిపిస్తున్నాయి. మఠం వేసుకొని ఆ రోడ్డువార కూర్చొని ఎవరూ నడవకపోయినా అదేపనిగా దీనాతిదీనమైన స్వరంతో......"అమ్మా......బాబూ......కష్టపడి పనిచేసుకోలేని పాపిష్టిజన్మండి తండ్రీ.....ఏ జన్మంలో యేం పాపం చేసుకున్నానో నా కష్టంమీద కడుపు నింపుకోలేకపోతున్నాను. మీరే తల్లీ తండ్రని చెయ్యి' చాస్తున్నాను......బాబయ్యా......ఈ గుడ్డిదాన్ని చూసి కనికరించండి తండ్రీ!" అంటోంది.

పుల్లయ్య ఆమెను చూశాక "అయ్యో! యెంత పాపం చేసిపుట్టిందో" అనుకున్నాడు. అలాంటోలకీ బ్రతుకుమీద ఆశేనా? అనిపించింది. ఆ దగ్గరగానే కొంతసేపు కూర్చుండిపోయాడు, ఆమె ఇంకా అలా అరుస్తూనే ఉంది. కుడిచేతితో బట్ట తడుముతూనే వుంది – ఒక చివర అణా వుంది......అది ఆమె చేతికి తగలలేదు.....పుల్లయ్యకు ఆ వెల్తురులో కనిపిస్తోంది......అదిగో......ఈమె పూర్తిగా గుడ్డిదే......అడుక్కోడానికి గుడ్డిది కాలేదు...... .అక్కడకు కొంతదూరంలో సినిమాహాలు వుంది. ఆట విడిచిపెట్టాక చాలా మంది ఈ త్రోవనే పోతారు. వాళ్ళకోసమని ఆమె అలా అరుస్తూనే వుంది. ఆట యింకా విడిచిపెట్టలేదు – పుల్లయ్య కూర్చున్నంతసేపూ ఒకరిద్దరు ఆ త్రోవనే వెళ్ళిపోయారు.

మళ్ళీ తనూ మల్లే.......ఆమె ఓ క్షణం వూరుకుంది. పుల్లయ్యలో ఈ కొద్ది క్షణాల్లోనూ ఏవేవో ఆలోచనలు –. అదిగో అణా రూపాయా? అనుకున్నాడు. ఆమె మళ్ళీ గొంతెత్తింది...... ఆ స్వరం హెచ్చుతున్నకొద్దీ పుల్లయ్యలో అదోలాంటి ఆవేశం వస్తోంది – ఆకలి ఆవేశం కల్పిస్తోంది. అంతా క్షణికమయినదిలా అనిపించి,

ఆ అణా తీసుకుంటే...... వడ్డీతో నాకు కలిగిన్నాడు ఇచ్చేస్తాననుకున్నాడు - మరుక్షణంలోనే "నా కొడుకు ముందరా? ఇదివరకే ఒకసారి పడ్డాను - నేను దొంగనైతే నా కొడుకు దొంగకాడా?" అనుకున్నాడు.

మళ్ళీ తటపటాయించాడు - ఏదో మేళతాళాలు వినిపించాయ్. దివిటీలు పట్టుకొని ఆ రోడ్డుమీదనుంచే ఏదో గుంపు వస్తున్నది. జాలరులు చేతిలో పెద్ద తాళపుజతలు మ్రోగుతున్నాయ్ - వెనుక అలంకరించుకున్న తోడపెద్దు నడుస్తోంది. వాళ్ళ గొంతుకలు విని పుల్లయ్యకు ప్రాణం వచ్చినట్లయింది. తను వూళ్ళో పాడుకున్నట్లవినిపించింది. తనూ, కొడుకూ అంతకంటే బాగా ఆడగలరు.......కానీ......

ఇంత సందడికీ కొడుకు ఉత్సాహం చూపించలేదు. దానినిబట్టి ఆ చిన్నప్రాణం ఆకలితో యెంత నకనకలాడిపోతోందో అర్థం చేసుకున్నాడు. ఈ ఆవేశాలు తరవాత మరింత నీరసం చేస్తున్నాయ్!

అదిగో......మిఠాయిబండి.......ఈ వూళ్ళో కాలుపెట్టినరాత్రి కనిపించిందిదేవేళ!....... ఈనాడు ఇలా వస్తోంది. గంట మోగుతోంది. మల్లు తలెత్తాడు. చూస్తున్నాడు. అదిగో ఇటువేపే వస్తోంది......వాళ్ళ ఎదురుగుండా "తీపితీపి మిఠాయ్! గరమ్ గరమ్ పకోడీ!" అని అరుస్తున్నాడు. ఆ అరుపు యెంత తియ్యగా వుంది! ఎంత గరమ్‌గా వుంది!

ఇదిగిదుగో ఎదురుగా వచ్చేసింది........మల్లు ఉత్సాహంగా లేచినిల్చొని "అయ్యా...... అయ్యా" చెయ్యెత్తి వ్రేలుతో అలా దించకండా చూస్తున్నాడు. బండి ముందుకుపోతుంటే ఆ చెయ్యి అటువేపే తిరుగుతోంది..... పుల్లయ్యకు ఎక్కడలేని దుఃఖం వచ్చేసింది..... "నా మల్లుకు ఆకలి....... నాకు...... ఆకలి..... నా కొడుకు ఆకలితో సచ్చిపోతే ఇవన్నీ నన్ను రచ్చిస్తాయా?....... ఎల్లు అయ్యా, పరుగెత్తి అపు. కొందాం" అని కొడుకును రెండోవేపు పంపించి ఇటూ అటూ చూసి మెల్లగా అందుకున్నాడు - అణా! చేతిలో అణా!!...... పరుగు పరుగున వెళ్ళి.......కొన్నాడు ఒక పకోడీపొట్లాం; విప్పాడు. కొడుకు పరుకు పరుకున నమిలివేస్తున్నాడు.......తన పళ్ళూ వణుకుతూనే నములుతున్నయ్......పొట్లాం ఖాళీ అయిపోయింది. కొడుకుముఖం తేరుకున్నట్లుంది. అదిగో మామూలు నవ్వు....నా అయ్య......దగ్గరగా తీసుకొని ముద్దులాడుతుంటే అంతదూరం నుంచి ఆ దీనురాలి గొంతుక వినిపిస్తోంది......రానురాను.......స్వరస్థాయి హెచ్చుగా.......చెవులు బ్రద్దలౌతున్నట్లుగా........ఒళ్ళంతా తిప్పివేస్తోంది........తను విన లేకపోతున్నాడు, అయ్యో నానేం చేసినాను?.......అదిగో ఆ అడుక్కునే పేదరాలి దగ్గర......దొంగతనం సెయ్యనుకున్నానే! దొంగనా? నాను దొంగనా......?" కళ్ళల్లో నీళ్ళు తిరిగిపోయాయి! కడుపంతా తెమిలేస్తోంది. చూపుడు వేళ్ళు నోటిలోపెట్టి ఆ నిర్జన ప్రదేశంలో కక్కుతుంటే కొడుకు తండ్రి ననుసరించాడు.

"అయ్యా అయ్యా - బాగులేదు....." అంటూ కక్కుతున్నాడు కొడుకు. కొద్దినిముషాల క్రితం అంత ఆప్యాయంగా తిన్న కొడుకు యిలా అంటూ కక్కటానికి ప్రయత్నిస్తుంటే పుల్లయ్య శోకం భరించలేకపోయాడు. శక్తి లేకపోయినా కొడుకును యెత్తుకున్నాడు. తొడుక్కున్న చింకిబనియను మరింత చిరిగిపోవటం కొడుకు చూసాడు. "అయ్యా, సిరిగిపోనాది...." అంటూ క్రిందికి దిగిపోయాడు.

మల్లు ముందు మెల్లగా నడుస్తున్నాడు. వెనుక మౌనంగా బరువుగా పుల్లయ్య వస్తున్నాడు.

"అయ్యా, బనీను సిరిగిపోనాది......మంచిది యేసుకో!"

"లేదు" అన్నాడు ముక్తసరిగా.

"అయ్యా! నాను పెద్దయితే నీకెన్నో యిస్తాను......"

ఆ చిన్నతండ్రి మాటలకు ఆనందం ఒకవేపు. దుఃఖం యింకోవేపు పెనవేసుకవచ్చినా "నాయనా! నివ్వెలాగ పెద్దోడువౌతావు?" అన్నాడు.

మల్లు సంతోషంగా అభినయంతో "అవుతాను – రెండు సేతుల్తో బువ్వ బుక్కడు బుక్కడు బుక్కేస్తాను," అన్నాడు.

అయ్యకళ్ళల్లోనుంచి కన్నీటిబిందువులు రాలాయి!

# 34

మరుసటిరోజు ఉదయం బుట్టపట్టుకొని బజారుకు వెళ్ళాడు. తన స్థితి మామ్మూలైంది. ఆ కుర్రకుంకల ఎగతాళి. ముసలమ్మలగోడు తనను సగం చచ్చినట్లు చేశాయి. తిరిగి వెళ్ళిపోదామనుకున్నా యీ ఒక్కరోజు మరి రానని వాళ్ళని బ్రతిమాలి నచ్చచెప్పాడు. మధ్యాహ్నమయేసరికి వచ్చిన నాలుగణాలతో యెక్కడ నాలుగు కడుపులు నిండుతాయి? ఏదో బుక్కెడు నోటిలో పోసుకున్నట్లుంది.

మధ్యాహ్నం చేసినకష్టం నాలుగణాలు వచ్చింది. తనకు లేకపోయినా తను అనుకున్నపని చేసితీరాలి. సాయంత్రం రోడ్డుమీద మనుష్యులు కిటకిటలాడిపోతున్నారు. అనుకున్నట్లే ఆ జ్యోతిష్కుడు వున్నాడు. గబగబ వెళ్ళి పుల్లయ్య దండంపెడ్తూ వినయంగా యెదురుగా కూర్చున్నాడు. కొడుకు తండ్రిని అనుసరించాడు. నల్లటి కోయ జ్యోతిష్కుడు ఒక్కసారి నిదానించి చూచి "గుడ్డలో యేంలేదు నాయనా! గుండెలో వుంది.......కుర్రాడు నిజాన్ని నిలబెడతాడు.....అయ్య పేరు ప్రతిష్టల్ని నిలపుతాడు" అన్నాడు.

ఈ మాటలు పుల్లయ్యకు యెంతో ఆనందాన్ని యిచ్చి అతనిపై పూర్తి నమ్మకాన్ని కలిగించాయి. కాస్సేపు మౌనంగా పుల్లయ్య చెయ్యి తీసుకొని చూసి చూసి "నాయనా! దగ్గిరికి వచ్చింది. దూరం వెళ్ళిపోతోంది! తామరాకుమీద గంగలా నీ గుండె వుంది! స్వస్థలమందు శని తిరుగుతున్నాడు – నలుగురు బతకాలంటావ్ – రేకను భగవద్ధానం బట్టి "ఆవుస్సు యెనభై యుంది. నాలుగుపైసాలు కలిసివస్తాది. ముందుకు సుకం ఉన్నది గానీ కష్టంలేదు! కడుపునిండా పెట్టే వూరుకుంటాది – లేదంటే ముక్కు నలుపుతాది....... ఏకోచక్రం ఒకటే మాట..... ఒకటే బుద్ధి..... మొగపురుషుడు తుమ్మతో సమానం! ఆడస్త్రీ పువ్వుతో సమానం. మోదకొండమ్మని నీ పేరు సెప్పి పూజచేస్తాం...... సెడుగంతా కడిగేస్తాది......మంచి రోజుల్ని తెస్తాది..... యీ కుంకం రాసుకో నాయనా....." అంటూ ఇద్దరికీ బొట్టుపెట్టాడు. పుల్లయ్య ఉత్సాహంగా కొడుకుగురించి యెన్నో ప్రశ్నలు వేశాడు. కోయ నవ్వి "ముకమే అద్దంలాగా వున్నాది నాయనా! పులికి యెదురుగా యెల్తాడు.

నాలుకకి యెముక వుంచినట్లు నాయమే పలుకుతాడు..... నూటానాటాకాదు కోటికి ఒకడు యిలాంటోడు పుట్టాడు!......" అని చెప్పాడు.

పుల్లయ్య వళ్ళు పులకరించింది! ఇంకేమీ అడగలేదు. బేడా వాడి చేతులోపెట్టి దండంపెట్టి మరీ వెళ్ళిపోయాడు. అప్పుడే దీపాలు వెలిగించారు. మళ్ళీ తనలో ఉత్సాహం చొచ్చుకపోతోంది. నడుస్తూనే కొడుకువేపు పదేపదే చూస్తున్నాడు, ఎంత చూస్తున్నా తనివితీరకుండావుంది. ఆ కొడుకు పుట్టుపూర్వోత్తరాలు జ్ఞాపకానికి రాసాగినయ్.

"నాకు అయుస్సు యెనభై యేళ్లుంది......శనిదేముడు యెన్నాళ్ళుండి పోతాడు - నా కొడుకును సదువులో వేస్తాను. ఎలాగ పట్నం సేరినాను - ఎవ్వురికాళ్ళు పట్టుకొనైనా సదివించేస్తాను. నా కొడుకు పెద్దసదువు సదువుతాడు. నాయం సెప్పాడంటే - ఆ గెద్దమీద కూర్చోడా? కోటికి ఒకడంటే మాటలా! నా అయ్య తక్కువపుట్టుక పుట్టాడా?" అలా అనుకుంటూనే పీర్లకోనేరురోడ్డు చేరుకున్నాడు. ఈ ఆలోచనలు ఆకలిని మరుగుపర్చాయి.

ఆ భిక్షుకి సరిగ్గా నిన్నటి స్థలంలోనే కూర్చొని అదేకంఠంతో అరుస్తోంది. నిన్న జరిగినదంతా తలుచుకుంటుంటే తనపై తనకే అసహ్యం వేసింది. రాత్రంతా తనకు సరిగా నిద్దరలేదు. అణాకు అణా వడ్డీవేసిమరీ ఆమె చేతిలో వేశాడు. అమె తడుముకొని బేడకాసు పోల్చుకొని ముఖం వెలిగించి దీవించింది! పుల్లయ్యకు ఆ దీవన శాపంలా తగిలినట్లపించింది. చేసినపని చెప్పకుంటే పాపం పోతుందనుకున్నాడు. కానీ చెప్పలేక "అలాగ దీవింపకమ్మా - నీ ఋణం తీర్చేస్తాను" అన్నాడు.

అమె అమాయకంగా నవ్వి "తెలిసిన బాబులు అలాగంటారు. నీ దగ్గర దాచి పెట్టానూ నాయనా..... మీ ఆర్జనలో మాలాంటి అనాధలకు యింత పడవేస్తే అది మాదెలా ఔతుంది? మీలాంటోలకి పుణ్యంరాదా బాబూ!" అంది.

పుల్లయ్య చటుక్కున "పున్నెమా? పాపం!" అన్నాడు.

"ఎంత మాటన్నావు తండ్రీ - పెద్దబ్రతుకు బ్రతికాను; ఏ జన్మలో ఒకరికి పెట్టలేదో ఈనాటికి నాకీగతి వచ్చింది. అన్నం దూరం అయినోలకు అయువెక్కువ నాయనా! ఒక్కరోజు పొచ్చుతగ్గుల్లో అందరూ అక్కడకు వెళ్ళవలసిందే - ఆ రోజు వచ్చేవరకూ కడుపు యేమైనా చేయిస్తుంది. ఇచ్చినవాడు పుచుకున్నవాడికంటే గొప్పవాడు బాబూ! అలాంటి వాళ్ళకి పుణ్యమే వస్తుంది."

ఒక క్షణం పుల్లయ్య ఆమెవేపు చూశాడు. నిన్న ఆమెను చూసి అసహ్యంచుకున్నాడు. అలాంటి హీనమైన బ్రతుకు బ్రతికేబదులు చచ్చిపోయింది కాదనుకున్నాడు, కానీ యీవేళ యిలాంటి తల్లులు కలకాలం బ్రతికుంటే బాగనిపించింది. కోయదొర చెప్పినట్లు గుడ్డలో యేముంది గుండెలో వున్నాది! తను యే పెంటమీద వుంటేనేం - తన నీలి ఆ కంపు వీధితో పందులదొడ్డిలాంటి పాకలో వున్నా దాని గొప్పతనం యెటుపోతుందనుకున్నాడు. ఈ లోకంలో యింతవరకు తను చూసిన మనుష్యులెందరో జ్ఞాపకానికి వస్తున్నారు. అందులో డబ్బున్న రాజిగాడు ఒకనాడు సుకంగా బ్రతికాడా? డబ్బులేని కటిక పేద ముసలమ్మ యెంత హాయిగా నవ్వుతూ చచ్చిపోయింది? అలాంటి రాజిగాడే నడుంకట్టుకొని కార్యంచేశాడే? ఈ ప్రపంచం

మంచీచెడ్డా అనే రెండే రెంటితో నిండిపోయింది. మంచికి చావులేదు; చెడ్డ చచ్చిపోయి మళ్ళీ పుట్టుంది! రోజా చావే – రోజా పుట్టుకే దానికి!!

ఆ నిర్మలహృదయం ప్రక్కన కూర్చోగానే పుల్లయ్యకు ఇలాంటి చల్లని ఆలోచనలు వచ్చాయి. యింటికి వెళ్ళి యెంతో గొప్పగా జ్యోతిష్యుడు చెప్పింది పెళ్ళాంతో చెప్తే ఆమె "ఆ పైసాలుంటే యీ పూటకు గడిచిపో" నంటే పుల్లయ్యకు కోపం వచ్చింది. "ఆ డెలాబతకాల? ఆడి కష్టం వుంచుకుంటానా?" అన్నాడు.

ఆ మరుచటిరోజు బజారుకు వెళ్ళలేదు. మరి వెళ్ళనని భీష్మించుకున్నాడు. ఓరోజు బయట కూలి దొరుకుతోంది ఓరోజులేదు. నీలి చాలా చిక్కిపోయింది. ఏ సమయాన ఆమెకు జబ్బు చేస్తుందోనని పుల్లయ్య ఆందోళన చెందసాగాడు. ఆ వీధిలో చేతిఅప్పులు యిచ్చినవాళ్ళు తొందర చేస్తున్నారు. అద్దె యింకా ఇవ్వలేదని యింటిమనిషి ఎగిరిపడిపోతోంది! అద్దె యివ్వకపోతే సామానులు వుంచి మనుషులు కదలిపోండంటోంది, నీలి యే యింట్లోనైనా పనిమనిషిగా కుదరాలని ప్రయత్నించింది. "అంట్లు తోముతావా? ఛస్తే యిలా చచ్చిపోదాంగానీ ఆ పనికి వెళ్ళొ"ద్దన్నాడు. ఐనా ఆమె రోజుకురోజు బలహీనమై పోతోంది, ఎక్కడ తిరిగినా కడుపునిండే కూలి దొరకలేదు. యేం చెయ్యటానికి తోచక పుల్లయ్య బేజారెత్తసాగాడు.

ఒకనాటి సాయంత్రం ఆకలివేస్తున్నా కొడుకును వెంటపెట్టుకుని ఏ కొట్లోనైనా పని దొరుకుతుందేమోనని మార్కెట్టులోకి వెళ్ళాడు. ఒకాయన అన్నాడు "నీ మంచీచెడ్డా మాకేం తెలుసు? మొన్న ఒకడ్ని పెట్టుకున్నాం, నిన్న చేతికి దొరికినమట్టుకు తీసుకపోయాడు దొంగతనంగా!" పుల్లయ్య యెంతో ప్రాధేయపడ్డాడు, కాని వాళ్ళు వెంటనే నమ్మేపరిస్థితిలో లేకపోవటంవల్ల లాభంలేకపోయింది. తిరిగి తిరిగి సగం ఆకలితో చచ్చిపోయి తండ్రీ కొడుకులు బొడారా రోడ్డుగుండా యింటివేపు వస్తున్నారు. అలా చీమనడకలా తలవంచుకొని నడుస్తుంటే "అన్నా" అన్న పిలుపు వినిపించింది. ఆ పిలుపు యిదివరకు విన్నదే. తలెత్తి చూశాడు.....అన్నను చూడగానే పుల్లయ్యకు సిగ్గువేసింది. ఓట్ల గొడవలో తనను కాదని బంగారయ్య డబ్బుకు ఆశపడ్డాడుగా!

మామూలుగా ఆ అన్న భుజంమీద చెయ్యివేసి "అన్నా! సాలా కాలానికి కలిసినావు, బంగారయ్య యేదైనా నౌకరీలో యేసినాడా?" అన్నాడు.

"లేదన్నా! ఆడి అవసరం అయిపోనాక కెంటించిసినాడు. ఆడినని యేం నాబం? నా రాత యిలాగున్నాది – శనిదేముడు పట్టుకున్నాడు – మంచికెళ్ళినా సెడుగే వస్తున్నాది – నీ మాట యిన్నాను కాదు........"

"కష్టపడినోడ్ని – నీ కష్టం నాకు తెలీదా అన్నా! కూలికెళ్ళినావు.....తప్పేంవున్నాది? రా, చానీరు తాగుదువుగాని."

పుల్లయ్య కాదనలేకపోయాడు. ఆ రోడ్డుప్రక్కనే వుంది కాకా హోటలు. బెంచీలు దగ్గరనుంచి అందులో పనిచేసే మనుషులు, హోటలు గోడలు అంతా నలుపే! ఒకమూల ఒక టేబిలుమీద సిలవరు పళ్ళెరాలలో రకరకాల తినుబండారాలున్నాయ్! ఒకమూల చా చేసే టేబులు. హోటల్ యజమాని లావుగా మోటుబనియను

లుంగీతో మొదటిలో కూర్చున్నాడు. ఆ టేబిలుమీద చిన్న గ్రామఫోను వుంది. హిందీ రికార్డులు వేస్తున్నాడు.

బోండాలు, పరోటాలు తెప్పించి యిద్దరి కడుపూ నిండేటట్లు కుక్కించాడు. చానీరు బలవంతంచేసి త్రాగించాడు. ఇంకా నాలుగు బోండాలు పొట్లం కట్టించి "అమ్మ కిచ్చీ" అని మల్లుచేతిలో పెట్టాడు. పుల్లయ్య తిన్నాక, రెండు మూడుసార్లయింది అన్నచేతే ఖర్చుపెట్టిస్తున్నానని సిగ్గు వేసింది. కడుపు నిండగానే సత్తువ వచ్చింది,

ముగ్గురూ మళ్ళీ రోడ్డుమీదపడి నడుస్తున్నారు. పుల్లయ్య "ఎక్కడైనా పని దొరికిందా అన్నా?" అన్నాడు.

"పని కరువా? ఓరన్నా! సెల్లెలు జబ్బుమనిషి అయిపోనాది, అందరూ యేల్తెత్తి చూపడమే! లోకం యింత పచ్చగావుంటే యీ కడుపులో సచ్చు పోసీమంటావా?"

"ఆ బాబు పనిచేస్తే నాకూ యింత ఆదరువుండేది."

"ఆ బాబూదీ పోనాది – ఆ బాబేం సెయ్యనేదు."

"అయితే యెలాగ అయినాది?"

"అంతా సెప్తాను......రా కూర్చో......" అని రోడ్డు ప్రక్కనేవున్న గట్టుమీద కూర్చున్నాడు. కూర్చున్న పుల్లయ్యతో "రేపు ప్రొద్దున్న రా – గొప్పోడి అశలు, బీదోడి కష్టాలేంటో సూస్తువుగానీ. ఇవన్నీ సూస్తే మనకి యీ లోకంలో నీతేంటి, గీతేంటి అనిపిస్తాది."

"నీతిపోతే అంతా సరన్నా!"

"అన్నా! నివ్వు ఆకలితో సచ్చిపోతే నీకు నీతేంసేస్తాది? నీవు బతికుంటేనే ఈ నీతీ గీతీ రచ్చిస్తాయి.....అధికారం, డబ్బుతో గుడ్డి అయినోడు రాజరికంచేస్తే యేం అవుతాది? ఒకరిమీద బాంబు యేసీమంటాడు. అయ్యో, ఆ బాంబు పడినదగ్గర నా పెళ్ళం, పిల్లలలాంటోలు వుంటారని అనుకోడే! ఏ పని చేసినా ప్రజంతా తన బిడ్డలనుకున్నావోడే గవర్నమెంటోడు కావాల. ఆడే మనకి తల్లీ. తండ్రీ! ఆడే మనలాంటి బీదోళ్ళకి గొప్పోలు సూసినట్లు సెయ్యకపోతే మనం నీతిగా యెలాగ బతుకుతాం అన్నా!"

"మన గవర్నమెంటుని అనక. ఆడు సిన్నోడు. అంతా యెంతకని సూస్తాడు."

"నివ్వు యింకా పట్నం సంగతి తెలుసుకోలేదన్నా. మన సిన్నతనాన మన అయ్యలకి అన్నం, బట్టా వుంటేసరి! యిప్పుడో కార్లు గీర్లు వచ్చినాయా! ప్రతివోడికి ఆశకు అంతులేకుండా పోతోంది. కడుపునిండితే సాలదు. కారు కావాల – కోరికలు యెక్కువౌతున్న కొద్దీ మనిషిలో మంచి సచ్చిపోతాది. అలాంటి వున్నోడు లేనోడిమీద సెలాయిస్తాడు! ఆడికి కారు – ఈడికి ఆకలి."

"ఈడికి కారు కావాలంటావా?"

"నివ్వు నా తల్లీ – తండ్రివి. ఆడికి కారుండనీ – ఈడికి ఆకలి లేకుండా సెయ్యి. ఈడు ఆశ తక్కువోడు. ఈడిలోనే మంచెక్కువుంటాది. ఈడే దేనికయినా నడుంకట్టుకొని నిలబడ్తాడు. అలా నిలబడినోలున్న లోకమే లోకం."

"అయితే గవర్నమెంటోడు యెందుకు సెయ్యడూ అని–"

# 35

అనుకున్నట్టే మల్లు ఆ మరుసటి రోజు రాత్రి వెంటపడసాగాడు. ఎంత బోధపర్చినా లాభంలేకపోయింది. నీలి బ్రతిమాలింది. ఎన్నో బుద్ధులు చెప్తున్నా వినిపించుకోలేదు. చివరకు ఆమె విసిగిపోయి కొడుకును పట్టుకొని మొగుడ్ని వెళ్ళిపోమని సైగచేసింది. పుల్లయ్య వెళ్తుంటే వీడు గగ్గోలుపెట్టి యేడుస్తూ గుంజాటనపడుతూ అమ్మచేతిలోంచి జారిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. చివరికి నీలి చింకిగుడ్డతో కాళ్ళు చేతులు కట్టి యింట్లో ఒకమూల కూర్చోబెట్టింది. అవీ పీకివేసి పరుగెత్తబోతే ఆమె పుట్టుకొని ఈసారి తాడుతో గట్టిగా కట్టింది. అలా యేడుస్తూ యేడుస్తూ బెక్కుతూ బెక్కుతూ చివరకు యెంతోసేపటికిగానీ నిద్రాదేవి ఒడిలో తలవాల్చలేదు.

పుల్లయ్య వెళ్ళగానే ఆ అన్న లేచి నిల్చొని తన యింటికి తీసుకవెళ్ళాడు. ఇదే అన్న యిల్లు చూడటం! ఆ చుట్టుపట్ల వున్న యిల్లవేపు ఆ వెన్నెల్లో చూశాడు. ఆ పరిసరాలు చెత్తాచెదరాలతో చాలా అసహ్యంగా వున్నాయి. ఈ చిన్నపాకలో ఒక భాగంలో అన్న. అన్న చెల్లీ, ముగ్గురు పిల్లలూ వున్నారు. ఒకే గది – అది గది అనే బదులు ఒక పంచగది అంటే బాగుంటుంది. చిన్న బుడ్డీదీపం ఆ గదిలో వెలుగుతోంది. ఆ గదిలో నేలమీద చిన్న గుడ్డ పరచుకొని అన్న చెల్లెలు పడుకుంది. ఉండి ఉండి ఆమె మూలుగు వినిపిస్తోంది. అన్న కొడుకు మల్లుకంటే మూడేళ్ళు పెద్దలా వున్నాడు. అక్కడే పుస్తకం పట్టుకొని గట్టిగా చదువుకొంటున్నాడు, పెద్దపిల్ల చిన్నపిల్లను అడ్డాలలో వేసి జోకొట్టుతుంది!

పుల్లయ్యకి పిల్లవాడి చదువు వినిపించి తన కొడుకు విషయం జ్ఞాపకానికి వచ్చింది. "బాగా సదువుతున్నాడే" అన్నాడు.

ఆ అన్న కొడుకు గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నాడు. వాడిమీద ఆశతోనే బ్రతుకుతున్నానని చెప్పాడు. అదంతా వింటుంటే తనలాగే కొడుకుల్ని చూసి అంత ఆనందం, గర్వంపడేవాళ్ళున్నారని తెలుసుకొన్నాడు. అన్న చెల్లెలువేపు ఆ యేడుస్తున్న తల్లిలేని పిల్లవేపు చూస్తుంటే పుల్లయ్యకెంతో కనికరం వేసి "రామరామ, తల్లిలేని పిల్ల – అమ్మలేని పిల్లలికి అల్లకల్లోలాలే......ఎలాగ బరిస్తున్నావన్నా" అన్నాడు.

అన్న అలా గడపలో కూర్చునే తనగాథ మొదలుపెట్టాడు: "అన్నా! బతుకుతానని కూలినేక, నాలినేక సెయ్యిబదుళ్ళు చేసి సెనగల యాపారం అనీ......యీ యాపారం. ఆ యాపారం యేదిసేసినా జరిగింది కాదు. అది పచ్చిపోయిన్నాడు – సేత సిల్లిగవ్వ నేదు. దానికి సరిగ్గా గెంజి పొయ్యనేక జబ్బులు పాలుచేసి నానే సంపేసినాను – సచ్చినదాకా నా కిదిలేదు అది లేదని అనలేదు. లేనినాడుకూడా వున్నట్టే మెలిగింది. అది సచ్చిన్నాడే నానూ సచ్చిపోయానన్నా."

పుల్లయ్య పని విషయమై మరచిపోయి ఆ విషాధగాధ వింటున్నాడు. అన్న మళ్ళీ ఆ గోలమధ్యనే మొదలుపెట్టాడు. "మన సేతుల్లో యేం వున్నదన్నా– ఉన్నదంతా గుండె దయిర్యమే – అదే తెచ్చుకున్నాను – యీ పిల్లల్ని సూసుకొని యిలాగ యెలిపోతుంది."

ఇంతలో ఇంకో వ్యక్తి వచ్చాడు. పొట్టిగా నల్లగా భీకరంగా వున్నాడు. మొరటులావున్న ఆ మనిషి రాగానే ఆ అన్న లేచాడు, ముగ్గురూ మౌనంగా నడిచారు, రోడ్డు ప్రక్కన కాలవగట్టుపై కూర్చొని ఆ అన్న "అదిగో మనవోడే అన్నా.... అలాగ కనిపిస్తున్నాడు గానీ బీదోలంటే యాడి ఒళ్ళంతా కోసి యిచ్చీమంటే యిచ్చేస్తాడు, ఎలాగ గడిస్తాడో అలాగే నిసుర్తాడు డబ్బును....." అన్నాడు.

అంతదూరంలో వున్న హార్బరులో దీపాలతోరణం అగుపిస్తోంది. అటువేపు చూస్తుంటే పుల్లయ్యకు తొందరపాటు హెచ్చవుతోంది.

"పనిలోనికి యెల్లమా?" అన్నాడు.

"అప్పుడేనా......అయినా యీ రాత్రులు మనం ఆటే సేయలేం!"

"ఏం?"

"అదిగో సూడు, అకాసంమీద యెవడున్నాడో.....ఆడు కుంగిపోవాల......"

పుల్లయ్య సంశయంగా చూశాడు. తనకేదో అనుమానంవేసి "ఓడ దించాల కదన్నా?" అన్నాడు.

"అవునన్నా....... మనలాంటోలకి వస్తే ఓడ – పోతే బేడ!"

"నాకు సరిగ్గా సెప్పన్నా!"

"నీకు కష్టంగా ఉన్నాదా? మనం పనిదొరికిన్నాడు సేసుకుందాం, లేనినాడు ఇందులో తప్పేం వున్నాది? మనం యీ సిన్నపనిసేసి యెవుడి కొంప కూల్చలేదే......"

"దొంగతనమా?" అన్నాడు పుల్లయ్య ఆశ్చర్యంగా.

"ఒరే చంద్రయ్యా! ఈ అన్న వృత్తి సేతకానివానిలాగ ఆకలితో సచ్చిపోతానంటాడుగానీ ఎలాగో కడుపునింపుకొని బ్రతుకుతాననడు?" అని పుల్లయ్య వేపు తిరిగి "అన్నా! నివ్వు పని సంపాదించుకొని బతగ్గలవా?" అన్నాడు.

పుల్లయ్య తలవూపాడు.

"చెప్ప్ప, సంపాదించగలవా?"

"లేను!"

"అయితే బతకడానికి దొంగతనం సెయ్యగలవా?"

"సెయ్యలేను!"

"పోనీ, ఏ డబ్బున్న అడది వలచివస్తే–"

"పాపం.......పాపం!"

"అయితే నివ్వు యీ పెంపంచకాన యెందుకూ పనికిరావన్నమాట. నివ్వు బతకలేవు – ఒకరిస్తే పుచ్చుకోలేవు – అయితే యెందుకు పనికొస్తావు?"

"నీతంటూ సచ్చిపోడానికి!......" చంద్రయ్య అందుకున్నాడు: "సూడన్నా, నీ నీతి నాకేం బోధపడలేదు, కడుపులు మాడి సచ్చిపోతున్నప్పుడు నీతంటూ కూర్చుంటావా? ఆ ధర్మరాజేం చేసినాడు? అబద్ధం ఆడనేదా? ఆడికంటే నువ్వు గొప్పోడివా? నువ్వు సాలా అమాయకుడివి – నా మాట యినకపోతే నాలుగురోజుల్లో యాడ్చినోలే ఎవరూ వుండరు."

పుల్లయ్య ముఖం క్రిందికి దింపివేశాడు. ఆ అన్న మళ్ళీ అన్నాడు: "మనం ఒకడ్ని ఖూనీ సెయ్యనేదు. ఒకడి రక్తం తాగనేదు. తోటి మనుషుల్ని దగాచేస్తున్న వాళ్ళదగ్గర న్యాయంగా అడిగితే యివ్వలేదని ఇంకోలాగ తీసుకుంటున్నాం - ఆకాశంమీదవున్న ఈ మేఘాలు అందరివీ - ఈ భూమిమీదవున్న పళ్ళూ ఫలసాయాలూ అందరివే - అయితే పెద్దోడు హెచ్చు - పిల్లడు తక్కువ తిన్నట్టే అలాగ యీటిని పంచుకుంటే యే గొడవా లేదు. మనలాంటి పిల్లోడికి పెట్టకుండా తినేసే, దయలేని యీ పెద్దోళ్ళపైపడక యింకెవురిమీద పడమంటావ్?"

పుల్లయ్య ఇంకా మౌనంగానే వింటున్నాడు. అన్న ఇంకా వాగ్ధాటిని ఆపలేదు: "నివ్వనుకుంటున్నావ్, ఇలాగ రాత్రులు దొంగతనానికి వెళ్ళినవాళ్ళే దొంగలని...... నీకు తెలీదు - ఈ దోచుకున్నోలు నూటికి నూరు లాబాలు యేసుకుంటున్నారు. ఆలు దొంగలా? మనలా బతకడానికి యెళ్ళినవాళ్ళు దొంగలా? నివ్వు రాకపోతే మాకు సేతకాదని కాదు - అదేంటో నీవు కలుసుకున్న మూర్తం అలాంటిది. అయ్యో! నాగోంటోడివి - పిల్లలతో మలమల మాడిపోతావని యింత సెప్పటం. నీ పిచ్చిగాని అన్నా, ఏదో ఒకలాగ దొంగతనం, అన్యాయం సెయ్యంది యీ లోకంలో ఎవుడు ఆస్తి పాస్తులు సేసుకున్నాడు. పోనీ నువ్వు దొంగతనం సెయ్యొద్దు - పైనే వుండు - నీ ఒంతు నీవు తీసుకో......"

అలా చందమామ క్రుంగేవరకు కూర్చున్నారు. పుల్లయ్యకు ఆ సమయంలో తిరిగి వెళ్ళిపోడానికి మనస్కరించలేదు. అప్పు తీర్చాలి - అద్దె యివ్వకపోతే నిలుచున్నపాటున గెంటించి వేస్తుందామె! పెళ్ళాం యెదరగా తను అన్ని గొప్పలు సెప్పాడు - మళ్ళీ లేదని యెలా చెప్పటం? తన కొడుకును చదువులో వెయ్యాలి. వాడికి పలకా పుస్తకాలు - బట్టలూ ఉండాలి - తను వాళ్ళతో చేరకపోతే రేపటినుంచీ యేం చెయ్యగలడు? తనవూరు వెళ్ళిపోతే? ఆ సుందరమైన భూములు, గలగల ప్రవహించే నది-గుమ్మటంలాంటి యిల్లు - పోతులు, వ్యవసాయం......ఆ చక్కని మనోహరప్రదేశం......మా తల్లి లచ్చిందేవి గలగలలు - నీలమ్మతల్లి సంబరాలు.....గరిడీ......ఎక్కడా సంతోషమే.......ఎక్కడా ఉత్సాహమే......ఒక్కసారి ఇవన్నీ వికటాట్టహాసం చేసినట్లనిపించాయి. "పుల్లయ్యా.. ..వూరెందుకు కదిలావో మరచిపోయావా? మనుషులు మారిపోయారు - వారితోపాటూ మేమూ మారిపోయాం... ..ఎక్కడికక్కడే ప్రాణంలేకండా ఒరిగిపోయాం......నివ్వు యీ పల్లెకువచ్చి ఏం చేద్దామ ..... బ్రతుకుతానంటావా? ఎలా బ్రతుకుతావ్.....? ఒక సెంటుభూమి వుందా? ఉండటానికి యిల్లు వుందా? అందరూ నిన్ను చూసి పకపక నవ్వి ఎక్కిరిస్తారు. పడిపోయావుగదా అని కనికరించరు....ఏం తిని బ్రతుకుతావ్? - ఏ ముకం పెట్టుకొని వెళ్తావ్?" ఇలా గుండెలో గడగడలు బయలుదేరాయి....మనసులో వడగళ్ళు.....వానలా కళ్ళలో నీరు అలుముకుంది....ఆ శోకంతో మనసులో "అమ్మా నీలమ్మతల్లీ!......కనికరించు తల్లీ.....ఈ పని సెయ్యలేను.......నాకేదో నాయంగా బతికే బతుకుతెరువు చూపించు!" అని వేడుకున్నాడు.

"ఏడుస్తున్నాడురా" అన్నాడు చంద్రయ్య. "అలాగే మొదటిరోజున మనకి లేదురా! ఆ బురదలో దిగకముందు మనుషులుగా వుంటాం......బురదలో గెంతితేగాని

మనకి జరగదు. ఒకసారి బురదలో గెంతాక ఏమైనా? పందులమైనాం కదా?"

కొంతసేపు మౌనం ముగ్గురినీ ఆవరించింది. తరవాత అన్న లేచి నిల్చొని "లే అన్నా! నివ్వు దొంగతనం సెయ్యక! మా యిద్దరమే సేస్తాం. నివ్వు దూరాన్న వుండు. నీకు పని దొరికినంతదాకా సచ్చిపోకండా బతకడానికి మా దగ్గర ఎంతో కొంత తీసుకో – అయితే ఇదిగో" అంటూ అన్న చంద్రయ్య అరచేతిని తన చేతిమీద వేసుకొని పుల్లయ్య చేతిని ఆపైనవేసి "అనండి దేముడు తోడుగా, మాలో యే ఒక్కరం దినాలు బాగులేక దొరికిపోయినా మిగతా ఇద్దరిగుట్టూ ఎంతమాత్రం సెప్పము," మళ్ళీ రెండుసార్లు ఈ ప్రమాణ స్వీకరణ చెయ్యించాడు. పుల్లయ్య తొలిసారి బెణుకుతూ, వణుకుతూ అన్నాడు. రెండోసారి బెణుకు తగ్గి మూడోసారి స్పష్టంగా అన్నాడు.

ఈ తంతు అయ్యాక ముగ్గురూ కలిసి బయలుదేరారు. చంద్రయ్య ఇదివరకే ఆ రాత్రి యెక్కడ కన్నం వెయ్యాలో తెములుచ్చుకొనే ఉన్నాడు. ఆ సందులోనికి వెళ్ళి ఉన్న ఒకే ఒక మ్యునిసిపల్ ఎలక్ట్రిక్ దీపం బల్బు రాయితో బ్రద్దలు చేశాడు చీకటి. అన్న పుల్లయ్యను సందు మొదట్లో ఒక చెత్తల డొక్కుచాటున కూర్చోబెట్టి గస్తీ పోలీసులుగాని ఇంకెవరివల్లగాని వచ్చే అపాయాన్ని రాకండా తను ఎటువంటి సైగ చెయ్యాలో, ఎలా పారిపోవాలో చెప్పాడు.

ఇందులో చంద్రయ్య ఆరితేరిన మనిషి. పుల్లయ్య అమూల కూర్చున్నాడే కానీ, కాళ్ళు గజగజ వణికిపోతున్నాయ్. శరీరమంతా ఆ వణుకు ఆవరించింది. తనకు యెక్కడలేని ఆవేశం, బెంగా ఆవరించాయి. దొంగలు పడ్తే తన వూర్లో యిలా వూరుకొనేవాడా? ఎలా గస్తీ తిరిగి మరీ పట్టుకొనేవాడు? అలాంటిది తను కళ్ళారా చూస్తూ వూరుకుంటాడా? గట్టిగా "దొంగలు.....దొంగలు" అని అరవాలనుకున్నాడు. నాలిక చివరివరకూ వచ్చింది. కానీ తన ఒట్టు, అన్న మంచితనం, బాధలు అన్నీ ఒక్కసారి కూడి నోటిని నొక్కేశాయి.

వీళ్ళిద్దరూ తిరిగి రావడానికి ఎంతసేపో పట్టలేదు. ముగ్గురూ మళ్ళీ నక్కినక్కి మొదటి కాలవగట్టుకు వచ్చారు. చంద్రయ్యకు ఈవేళ పని యేం సంతోషంగా లేదు. బనియనులోపలి జేబునించి ఏదో బంగారం వస్తువు, ఇంకా యేదో వుంది బరువుగా జేబులో – అదికూడా తీశాడు. కత్తి.......పుల్లయ్యకు భయం వేసింది. దొంగలకు దొరికిపోయినట్లుగా అనిపించింది.

తెల్లవారుఝాము కాడానికి యింకా రెండుగంటలు కావాలి.....అన్న రేపుప్రొద్దున్న కలుసుకుందాం అన్నాడు. పుల్లయ్య యింటివేపు బయలుదేరాడు.

త్రోవలో ఎన్నో అనుకున్నాడు. రేపు యీ డబ్బు తీసికెళ్ళి దాని సేతిలో యెలాగ పెట్టాను? అది యెలాగొచ్చిందని అడగదా? పెళ్ళిరోజు జ్ఞాపకం వచ్చింది. తను అర్జించుకున్న దాంట్లో పెళ్ళంకి సగం యిచ్చి తీరాల – అది పాటించకపోతే పెళ్ళినాటి ప్రమాణం జవదాటాడన్నమాట! మరి రేపు ఈ పాపిష్టి డబ్బుకు రాననుకున్నాడు.

# 36

ఉదయం అయ్యవేపు చూసి మల్లు అలక సాగించాడు. అయ్య పిలిచినా మాటాడలేదు. నీలి యెంత కూలిచ్చారని అడిగింది. వెంటనే జవాబుచెప్పకపోతే చిక్కని "మూడు రూపాయలు" అన్నాడు. ఆమె సంతోషంగా "రోజు వుంటాదా పని" అని అడిగింది. "ఏమోలే – దొరికిన్నాడు సేస్తాను – లేనినాడు లేద"న్నాడు.

ఈ అబద్ధాలు యెంతో బలవంతాన అన్నాడు. అన్నాక భయం వేసింది. ఇప్పటికీ, అప్పటికీ డబ్బు చేతపెట్టకపోవటంవల్ల నీలి "కూలివ్వనేదా?" అని ప్రశ్నించింది.

"ఇస్తారు!"

"ఎప్పుడు"

"ఈవేళే–"

అలా కాస్సేపు నిద్దరపోవాలనిపించింది. ఇంట్లోనే చారపడుతూ మల్లుని పిలిచాడు. కొడుకు రాలేదు. కూతురు దగ్గరగానే ఆడుకుంటోంది.

"అయ్యా! యీవేళ తీసికెళ్తానులేరా.....రా" అన్నాడు.

కొడుకు వచ్చాడేగానీ నవ్వలేదు. కాస్సేపు నవ్వించడానికి ప్రయత్నించాడు. ఇంతలో పొరుగమ్మ పెరటినుంచే నీలిని కేకవేసి నోరు డబ్బువిషయమై దాటీగా విడిచిపెట్టోంది. మూడురూపాయలూ ఆవేళ యివ్వాలని పోరు. ఆ గొంతుకవిని పుల్లయ్యకు పౌరుషంవచ్చి గప్పున లేచి;

"ఎక్కడో పారిపోయిన్నోల్లాగ మాటాడతన్నావు?" అన్నాడు.

"అంత పౌరుషం అయితే పారీకూడదా?"

"పారీకండా వుంచుకుంటామేంటి?"

"ఎప్పుడో యిత్తే యెలాగొతాది? ఎందరో యింటికోసం వస్తన్నారు – పౌరుషంయైనోడివైతే నెల అవగానే అద్దె పారీకూడదా?"

నీలి జోక్యం చేసుకొని భర్తను వారించి లోనికి పంపించింది. ఆవిడ గొంతుకమాత్రం ఆగలేదు. పుల్లయ్యకు యెక్కడలేని అభిమానం కలిగి, గబగబ అన్న యింటికి పరుగెత్తి "మూడురూపాయలు కావాలన్నా" అన్నాడు. అంతా విని చంద్రయ్య దగ్గరకు వెళ్ళి తెచ్చి యిస్తూ చాటుగా మెల్లగా "రాతిరిది యింకా అమ్మలేదు. దొంగవస్తువు సగానికి సగం – ఆ కంసాలోడికి ఆశ – అడిబయం ఆడిది – నీ వాటాకి పదిరూపాయలు వస్తా"యని సెంద్రయ్య సెప్పినాడు." అన్నాడు.

"ఇది సెయ్యి బదులు – ఆ డబ్బుమాటెందుక"న్నాడు పుల్లయ్య.

ఇంటికివచ్చి నీలి చేతికిచ్చి "దాని ముకంమీద కొట్టే" అన్నాడు. ఆవిడ ఆ మాటవిని నానా గొడవ చేసింది. నీలి బ్రతిమాలింది. "ఎందుకమ్మా – ఎవురు యెన్నాళ్ళుండిపోతాం – ఈమాత్రందానికి నోరు పాడుసేసుకుంటాం. ఇరుగూ, పొరుగూ మంచీసెడ్డకి కాకపోతే మరెవురవుతారని?" కొంతసేపటికి ఆమె ప్రవాహాన్ని అరికట్టకలిగింది.

ఆవేళ సాయంత్రం అన్నదగ్గరకి మల్లుతోసహా వెళ్ళాడు. అన్న సినీమాకి బలవంతాన తీసుకవెళ్ళాడు. ఆ బొమ్మలు చూసి మల్లు సరదా అంతా యింతా కాదు. ఒకోసారి కేకలువేసి గెంతుతుంటే ప్రక్కనున్నవాళ్ళు పుల్లయ్యను కోపగించారు. పుల్లయ్యకు సినీమా చూస్తున్నంతసేపూ అంతా అలాంటి ఆలోచనలే. ఆ మేడలూ, మిద్దెలూ, ఆ డబ్బూ, బట్టలూ అంతావుంటే సుకంగా బ్రతకలా అనుకున్నాడు. ఒకసారి చూశాక ఆ సినిమా మళ్ళీ మళ్ళీ చూడాలనిపించింది. పాటలు యెంత యింపుగా వుంటాయి. ఆ మూడుగంటలు యీ కష్టాలన్నీ మరిచిపోయి సంతోషంగా వున్నానే అనుకున్నాడు.

ఇంటికి వచ్చాక నీలి "యీ రాతిరికి పనికెళ్ళవా" అని అడిగింది. "ఈ యేళ లేదట" అన్నాడు. మల్లు సినీమా సంగతులు వుత్సాహంగా చెప్తున్నాడు. ఆ మరుచటిరోజు వీధిలో చంద్రయ్య కనిపించాడు. ఒక దగ్గరకు తీసుకవెళ్ళాడు. సందుగొందులు తిరిగి అక్కడకు వెళ్తే పదిమంది ఆ పాకలో కూర్చొని పేకాట ఆడుతున్నారు. "కూర్చో సూడు" అని చంద్రయ్యకూడా డబ్బుకట్టి ఆడుతున్నాడు. పుల్లయ్యకు అంతా ఆశ్చర్యంగా వుంది. మల్లుక్కూడా వుత్సాహంగా వుంది. మధ్యాహ్నం అయినా చంద్రయ్య కదల్లేదు. పుల్లయ్య వెళ్ళిపోతానని లేచాడు. చంద్రయ్య ఒక్కసారి బయటకు వచ్చి, "ఈ రాతిరికి రావాల - అప్పుడే యెళ్ళి అన్నను కలుసుకో" అన్నాడు.

పుల్లయ్య తల వూపాడేగాని యింటివేపే కాలు కదిపాడు. ఇంటికి వెళ్ళేసరికి యింట్లో యేమీలేదు. "ఎంతకని వడ్డీ అప్పులు - వాళ్ళువచ్చి యింటిమీద పడ్తున్నారు అని నీలి అన్నది. అలా వాకిట కూలబడిపోయాడు. చిన్నపిల్ల బువ్వకు యేడుస్తోంది. నీలి మాటాడకండా పెరట్లో కూర్చుంది.

అలా ఆ యేడుపులోనే పుల్లయ్య యెన్నో విధాలుగా ఆలోచించాడు. "తనకు పని యెక్కడ దొరుకుతాది? ఎలాగా ఒకసారి బురదలో దిగాను - బాగా దిగిపోతాను. నేను మునిగిపోయేముందు యీాలకీ యేదో దారి చూపిస్తాను" అనుకున్నాడు. "ఈ లోకంలో కడుపుముందర నీతీ గోతీ ఏమిటి? అలాంటి విశ్వామిత్రుడు లాంటోడు మాలపేటలోన కుక్కమాంసం దొంగిలాడాడని పదంలో యిన్నానుకదా. నీ లాంటోడికేంటి? ఇదంతా దేనికొచ్చిందో వచ్చింది - దీనితో నా కష్టాలన్నీ పోవాల - ఈ ఒక్క తప్పనే ఆ యమధర్మరాజు యినుపకాకులుసేత పొడిపించనీ పడ్తాను - నాను సచ్చాక యే కాకులు పొడిస్తే యెవురు సూడొచ్చారు........"

ఇలా వుద్రేకంతో లేచి అన్న దగ్గరకు వెళ్ళాడు. అన్న యేడు రూపాయలు యిచ్చి అన్నాడు:

"ఎలాగొచ్చింది అలానే యెలిపోతాదన్నా. ఇది వుండిపోతాదనుకోక. ఉన్నప్పుడే తిను. ఒళ్ళు గట్టిచేసుకో. తరవాత యెవుడికో నంచం కట్టే పని దొరికిపోతాది." పుల్లయ్యకు యీ మాటలు నచ్చాయి.

"చంద్రయ్య ఈ రాతిరికి రమ్మన్నాడు" అని గొణిగాడు. "అడు లేకపోతే మనకేం సేతనౌతాది? అందుకే అడు యేమిచ్చినా కాబోలనుకుంటున్నాం. ఆ యెదవకి యిద్దరు పెళ్ళాలు - పేకాట, బ్రేకట్లు ఆడకవుండలేదు, అందులో తాగుతాడు

– ఆడితో కూడావంటే మూడు రోజుల్లో నిన్ను మార్చేస్తాడు! మన పనితోటే వాటికీ సమ్మంధం" అన్నాడు.

పుల్లయ్య కొడుకువేపు చూపించి మెల్లగా "ఈడు ఒకంతట కదలనివ్వడు – సెంద్రయ్య మాత్తర్లు యిచ్చినాడు నిద్దరకి – ఏసేస్తాను""ముందు మా వోడికీ అది యేసినాను. నిద్దరట్టేస్తాది" అని చెప్పాడు.

త్రోవలో ఈ డబ్బు అంతా పెళ్ళంకి యిస్తే పోల్చుతుందని, ఆమెతో అప్పుతెచ్చానని రెండు రూపాయలు యిద్దామని నిర్ధారించుకున్నాడు.

# 37

పుల్లయ్యకు ఇంట్లో "ఒడ దించాల" అని, వీధిలో దొంగతనంకు వెళ్ళటం అలవాటైపోయింది. ఒకరాత్రి యింటిలో పడుకోడానికి మనస్కరించలేదు. రోజులు గడిచినకొద్దీ తనూ ఈ పనిలో ఆరితేరిపోతున్నాడు. ఇంట్లో మల్లు బాధ లేదు. అవసరం అయినప్పుడు బిళ్ళ యివ్వగానే వాడికి నిద్దర ఒస్తోంది. రానురాను వాడికి రాత్రులు పడుకోవటం అలవాటౌతోంది. తెలివి వున్నంతవరకూ తండ్రిని విడిచిపెట్టడంలేదు.

ఇప్పుడు తన పరిస్థితి చాలా నయం. కడుపునిండా తనకేకాదు, కుటుంబానికీ తిండే. కొడుకుకు బట్టలు కుట్టించాడు. బడిలో వేశాడు – ఇలాగైనా కాస్త దూరమౌతాడని. ఆ కొడుకు చదువుమీద యెంతో ఆశ పెట్టుకున్నాడు.

అంతేకాదు, తను వారానికి మూడుసార్లయినా మిగతావారిలా సినీమా చూస్తాడు. చంద్రయ్య యిప్పుడు ప్రాణస్నేహితుడయ్యాడు. అన్నతో పొత్తు కాస్త దూరమైపోయింది. బ్రాకెట్ల ఆట నేర్చాడు. ఒకోరోజు ఐదు, ఆరు రూపాయలవరకూ కట్తాడు. డబ్బు పోతున్నకొద్దీ పంతం హెచ్చవుతోంది దురాశ పీక్కుతింటోంది – వేలోస్తాయ్ – వస్తే మళ్ళా తన వూరికెళ్ళి........గొప్పబ్రతుకు బతుకుతానని ఆశ తనను పీడిస్తోంది. రానురాను పోయిన డబ్బు వచ్చినా ఒక యకరం పొలం దొరకదా? అన్న పట్టుదల హెచ్చవుతోంది. ఇప్పుడు దొంగతనం తప్పు, పాపం అన్నమాటే తల్చుకోడు. ఈ మధ్య ఒకసారి దొరికిపోవలసింది, కాని అదృష్టంకొద్ది తప్పుకున్నారు. ఒక వారంరోజులు జాగ్రత్తగా వున్నారు.

ఇంతకీ ఈ ఆరునెలల్లోనూ చేసినవన్నీ చిన్నదొంగతనాలే. ఏవీ తన దాహాన్ని తీర్చేవిగాలేవు. ఇంటికి యేరోజు మూడు, రెండురూపాయలు యిస్తున్నాడు – బాగా బ్రాకెట్లు ఆడిన్నాడు యేమీలేదు. నీలితో అబద్ధాలు ఆడటం అలవాటైపోయింది. అలా ఆడటంలో తప్పుగురించి అసలే ఆలోచించలేదు. ఇంత డబ్బులోనూ నీలికి బట్టలే కొనలేదు. ఆమె అసహ్యంగా వుందని ఒకనాడు ఒక చీరె తెచ్చాడు.

"ఎక్కడిదీ – రాతిరి కూలి యియ్యలేదన్నావు" అని ప్రశ్నించింది,

"ఒడ కెత్తాను, దొర – మా మంచోడు. గరిడీ సెయ్యమంటే సేసినాను – మెచ్చి ఐదురూపాయలిచ్చి నీ పెళ్ళానికో్క కొకనిచ్చీ అని యిచ్చినాడు" అన్నాడు.

నీలి చీరె కట్టుకుందేగానీ – అదోలా అనిపిస్తోంది. ఒళ్ళంతా ఒణుకుతున్నట్లని పించింది. అసలు ఆమె శరీరంలో యేంబాగు తగలటం లేదు. మొగుడు డబ్బు తెచ్చియిస్తున్నా ఆమెలో యెంత ప్రయత్నించినా సంతోషంగా లేదు. పుల్లయ్య ముఖంలో ఆమెకు యిదివరకున్న కళా కాంతులు కనపడలేదు. ఇదివరకున్న అమాయక చూపులు ఆ కళ్ళల్లో లేవు. మనిషి పుష్టిగా వున్నా మోటుగా కనిపిస్తున్నాడు. నడకలో మార్పు స్పష్టంగా ఆమెకు గోచరిస్తోంది.

ఆ కట్టుకున్న చీరె విప్పేవరకు ఆమెకు మనస్సు శాంతించలేదు. రేపు కడ్తే బాగుంటాదేమోనని అనుకుంది.

ఒకనాడు, మొదట తను వూర్లో దిగిన్నాడు వుండిన సత్రంలోనికి దొంగతనానికి వెళ్ళారు, ఆవేళ జరిగినదంతా జ్ఞప్తికి వచ్చింది. ఆవేళ పుల్లయ్యకీ యీవేళ పుల్లయ్యకూ యెంత తేడా అనుకున్నాడు. "ఆ పుల్లయ్య సచ్చిపోనాడు, సచ్చిపోనోడి గురించి యెందుకు తలుస్తానని" ఈ పుల్లయ్య తమాయించుకున్నాడు.

ఒకరోజు అన్న పుల్లయ్యని బలవంతాన యింటికి తీసుకెళ్ళాడు, అన్న యేమైనా అంటాడని పుల్లయ్యకు ఒకప్రక్క బెదురుగా వుంది. ఈ రోజుల్లో చంద్రయ్య పుల్లయ్య కలిసి, అన్నమాట సరిగ్గా వినటలేదు. అన్న మంచీచెడ్డా మాటాడి వెంటవచ్చాడు. ఆ పాతకాలవ గట్టున కూర్చున్నారు. సాయంత్రమైనా భూమి చల్లబడలేదు. ఆకాశంవేపు చూస్తూ అన్న అన్నాడు: "పనిమాట యేమంటావు?"

"మన కెక్కడ దొరుకుతాది" అన్నాడు పుల్లయ్య.

"ఎందుకు దొరకదు? ఇకముందు యేం దొరికినా మిగిలింది నా సేతికిచ్చీ! ఒక మూల పెట్టి యెవుడికైనా మూతికట్టే దొరకదా?"

"ఎక్కడ మిగులుతాది? పని దొరికినా మనకు మంచిపని యిస్తారా?"

"ఎందుకివ్వరు?"

"ఏంటోలే – ఈ పని బాగులేదా? ఎప్పుడో గవ్వలు పేలినట్లు పేలీదా? దాంతో ఈ వూర్లో వుంటానా? మళ్ళీ మా వూరెల్లి ఆ రాజిగాడితో పోటీపడనా? మళ్ళా వూరికి మొనగాడై యేలనా?"

అన్న, వుద్రేకంతో అంటున్న పుల్లయ్యవేపు చూసి శాంతంగా "ఒరన్నా! గోడకురాసిన సున్నం రాదు. జూదం ఆడిన డబ్బురాదు – నీ రోజున పేలిపోతాదని చూస్తున్నావ్? అది పేలదూ నువ్వు బతకలేవు–బతకవు!" అన్నాడు.

"రోజులు యెప్పుడూ ఒకలాగ వుంటాయా?"

"చెంద్రయ్య వృత్తే దొంగపని. నివ్వు నానూ కడుపుకోసం దొంగలయ్యాం, పని దొరికిననాడూ దొంగతనానికి యెల్తే మనం పచ్చి దొంగలం అన్నమాట! అలాంటప్పుడు ఏ గవర్నమెంటోడినీ అనలేం. పచ్చిదొంగలకి, రోజులు నడుస్తునకొద్దీ చెడ్డవేగానీ మంచివికావు. నా మాట విని ఆ ఆట మానేసి ఆ నాలుగు రాళ్ళూ ఒకమూల యేసేవంటే ఏదోపని కష్టపడి కడుపులో యేసుకున్నదానికీ కష్టపడకుండా నింపుకున్నదానికీ తేడాలేదా!"

"ఇప్పుడు నాకివేమీ సెప్పక, నా డబ్బు పాలా పోనాది, అది రావాల. నానీ

వ్వూరు కదలాల – నివ్వు ఎంతసెప్పు, నా తల కెక్కలే"దని పుల్లయ్య కటువుగా అన్నాడు.

అన్న లేచిపోతూ "నాను అనాడు అన్నట్లే అయినాది. ఆ బురదలో దిగిపోనావు. పంది అయిపోనావు" అనేశాడు.

పుల్లయ్య మాటాడక వెళ్ళిపోయాడు.

## 38

వేసవికాలం ఒకనాటి వుదయం పుల్లయ్య, చంద్రయ్య కలిసి వెళ్ళిపోతూండగా, బూచోడు తన మామూలు స్థలంలో కుక్కను ప్రక్కన పెట్టుకొని ఏదో గొణుక్కుంటున్నాడు. పుల్లయ్య చటుక్కున "వాడిని చూశావా? ఆడికథ నీకు తెలుసునా?" అన్నాడు.

"ఆడు దేముడితో సమానం–" అన్నాడు చంద్రయ్య. "నీవు యే విచ్చినా పుచ్చుకోడు. పుచ్చుకున్నాడంటే మనకు పెద్ద లాభం వచ్చిందన్నమాటే!"

పుల్లయ్య అలా నడుస్తూనే, "బంగారం కొబ్బరి చెట్టుక్రింద పాతి పెట్టానన్నాడు గుట్టంతా లాగాను! అయినా, ఆడి ఇల్లు ఎక్కడో యేంటో!" అన్నాడు.

"ఆడిఇల్లు అదిగో ఆ మూడంతస్థుల మేడ. బూచోడు మా గొప్పోడు. పెద్ద. సదువు సదివినాడట. సెప్పినాడా కొబ్బరిసెట్టు కిందని?"

"అవును. ఏదీ ఆ ఇంటియెనక కొబ్బరిచెట్టు నేదే!"

"రెండేళ్ళ క్రితం సూసినాను. అదిగో పెరటగదులు లేసిపోనాయి. ఏమాత్రం బంగారం?"

"అదే దొరికితే మరి మనం యీ యాపారం యిడిచి పెట్టేయొచ్చు!"

చంద్రయ్య సంతోషంగా నవ్వాడు. "అంతా నాకు వదిలీ! నాను ఆ గుట్టంతా లాగుతాను. ఎలాగైనా ఆ బంగారం అంకించుకోవాల. దానితో మన దరిద్రం పోతాది."

మూడురోజులు పోయాక అన్న, చంద్రయ్య, పుల్లయ్య కలుసుకున్నారు. ముగ్గురూ కాలవగట్టుమీద కూర్చొని వూసులాడుకున్నారు. చంద్రయ్య అన్నాడు: "ఆ యింటిగుట్టంతా నాగీశాను! ఆ యజమానున్నాడే బలే గట్టోడు. ఆ మూడో అంతస్థుమీద ఒకే గది వుందా? అందులోనే వుందట యినపపెట్టె. తాళాలు తలకిందే వుంటాయట. ఇంట్లో యెవురినీ నమ్మడట! రాత్రుళ్ళు యెవురినీ దగ్గిరికి సేరనివ్వడట!"

"ఇంతకీ బంగారం మాట?"

"ఇను మరి.......యిల్లు కట్టడానికి కొబ్బరిచెట్టు కొట్టించేసి పున్నాదులు తవ్వుతుంటే బంగారం, పెట్టెతోని దొరికిందట. ఆ యేళనుంచి మరీ నమ్మడు – మనుసుల్ని! బంగారం యెక్కడ దాస్తాడు మరి, ఇనపపెట్టెలోనే!"

"మరి మనకి యింతకంటే అదును దొరకదు. ఆడిడబ్బు కాదు కదా? బూచోడిది. మనం ఆ బంగారం అంకించుకున్నా పాపం నేదు" అన్నాడు పుల్లయ్య.

"విను మరి. మనం తొందడ్తే నాబంనేదు, సమయం సూడాల ఇంత పెద్దపని మనం సెయ్యనేదు – సెయ్యబోము – అంచేత అన్నీ జాగర్తగా సూసి పని నేర్చుకోవాల! ఏ మాత్రం పొరపాటు జరిగినా అంతా సరి! అంచేతనే ఆ యింటి నౌకరీవోడిని మంచి చేసుకున్నాను!"

"సచ్చిపోనాం" అన్నాడు అన్న.

"ఏం?" పుల్లయ్యందుకున్నాడు.

"రేపు పొద్దున్న దొంగతనం అయ్యాక ఆడే అటువేపు తిరిగిపోయి పోలీసోలకి నిన్ను అప్పచెప్పీడా?"

చంద్రయ్య పకాలుమని నవ్వాడు. "నీకు కడుపుకి జరక్క దొంగ వయ్యావు నానో గొప్పోడవ్వాలని దొంగనయ్యాను నాను యెందరి పోలీసోళ్ళ కళ్ళల్లోనో కారం జల్లాను, చంద్రయ్యలాగ వెళ్ళానా? వేసాను – సాధూ వేషం వేసాను. ఆడు సంగతులు సెప్పేసరికి కాలుమీదపడి మొక్కినాడు. ఆడి తాతలు తిరిగిరావాల పోల్చుకోడానికి! మీకా బెంగేమీ వద్దురా! అంతా పసందుగా జరిగిపోవడం నా పూచీ! ఆ యజమాని అసలు ఆ వలిసి వచ్చినదానినే నమ్మడట! నానా చీవాట్లు పెట్టాడట. నీ మొగుడికి ద్రోహంచేసినదానివి నాకు సెయ్యవా అని కొరికి నమిలీసిన మాటలు ఆడతాడట! ఆ యమ్మకి పచ్చవాతం – ఈ రాపులుతో అసలు మొగుడ్ని తల్చుకొని ఏడుస్తాదట! సావేనా వచ్చినాది కానాందట, ఆడి సంగతో – మరి. రాత్రిళ్ళు సరిగా పడుకోడట – పడుకున్నా యేదో పేలాపన. ఒకోనాడు ఎందుకో భయం అనిపిస్తాదట. తప్పతాగేసి పడుకొంటాడట.....అదిగో ఆ సమయంచూసి మనం యెయ్యాల కాటు!"

"అంత యెత్తు మేడింట్లో యెందరుంటారో, వీలౌతాదా?" అన్నాడు- పుల్లయ్య.

చంద్రయ్య నవ్వి " ఆ పిరికి వుంటే మనకు బతుకే లేదు. ఆకాసం మీద పడిపోతున్నా మనం అడ్డుతాం అన్నోడే యేమైనా యీ లోకంమీద సెయ్యగలడు, ఆ మేడయేపు యెప్పుడైనా సూసావా?"

"ఓ – ఎన్నోసార్లు."

"సెప్పు, యెలాగ యెక్కుతావో?"

"అటువేపు సందు ఇటువేపు సందు, ముందు రోడ్డుమీద దీపం – అటు సందులో దీపం నేదు గానీ, ఇటు సందులో వున్నాదే – చిక్కే" అన్నాడు.

"నే నంతా అప్పుడే పేను యేసుకున్నాను. ముందు దీపం, సందు దీపం బద్దలుకొట్టడం! పడమటియేపు మూడో అంతస్థునుంచి నీళ్ళుపోడానికి రెండు సిమ్మెంటు గొట్టాలు కిందదాకా వున్నాయికాదా – సీకటిరాత్రి ఆ రోడ్డంట తొమ్మిదిదాటితే యెవురూ తిరగరు – మంచి రాత్రి మీద యెక్కిపోవడం – చేసినపని చేసి – రెండోపక్క నుంచి అలాంటివే మూడు గొట్టాలున్నాయి–నాలుగుమెట్లు దిగితే ఆ గొట్టాన్ని పట్టుకోవచ్చు. పట్టుకొని దిగిపోవటం సులభం–"

"ఇటుపక్కనుంచైతే?"

"వద్దు. ఇటువేపు పెద్దసందు......వచ్చినా రాతిరి పోలీసోలు తిరిగితే తిరుగు తారు......గప్పైన దాగోడానికి అన్నీ గుమ్మాలే, యీలుండదు. అటువేపు సందులో పెరటి గుమ్మాలు–యే దొడ్లోనైనా దాగుండిపోగలం–"

"తలుపులు వేసీరా?" అన్నాడు పుల్లయ్య.

"నాను తీస్తాను కదూ? అలాగపోతే ఆ సందునుంచి రెండు మూడు సందులున్నాయి. ఏ సందునుంచి యెలిపోయినా సముద్రపొడ్డుకే, వేసంకాలం మనలాంటోలు ఎందరో పడుంటారు.......ఇసికమీద పడుకున్నట్టు టక్కు వేసీడమే.. ....అంతా గేపకం వుంచుకోండి..........ఆ సరియైన యేళకి నానే మీ యిళ్ళకి వస్తాను."

మిగిలిన యిద్దరూ చంద్రయ్య చెప్పినట్లు అంగీకరించారు.

చీకటి రాత్రులు వచ్చాయి, అనుకొని పదిహేనురోజులైంది గానీ చంద్రయ్య వెళ్దామని అనటంలేదు. పుల్లయ్యకు చాలా ఆతృతగా వుంది. ఎంత వేగిరం యీ పని అయిపోతే అంత త్వరలో తను మళ్ళీ నవిరి వెళ్ళిపోదామని కలలు కంటున్నాడు. మూడురోజులై పనిలేదని యింటిదగ్గరే వుంటున్నాడు. రాత్రుళ్ళు కొడుకూ తనూ గడపలో పడుకుంటున్నారు. నీలి గదిలో పడుకుంటోంది.

ఆ వేళ శనివారం. పొద్దున్నుంచి పుల్లయ్యకు అందోళనగానే వుంది. యేమిటీ ఆలస్యమని చిరాకెత్తుతోంది. ఇదేదో అయిపోతే– తనవూరు వెళ్ళిపోదామని అనుకున్నాడు. తన వూరు యెంతగా మారిపోయిందో? తనూ యేదో చెక్కాముక్కా కొనుక్కొని మట్టిని నమ్ముకొని చెమటోడ్చే రైతౌతానని – మళ్ళీ అనుకున్న జన్మ తనకు వస్తుందని ఎన్నోవిధాల అనుకున్నాడు. ఈ ఆశతో కూడుకున్న ఆలోచనలు ఈ ఆలస్యాన్ని సహించనివ్వకండా చేస్తున్నాయ్. తను ఒంటిగా గడపలో పడుకొని యిటు అటు కదులుతున్నాడు. ఎదురుగుండా చెట్టుకొమ్మలు గాలికి కదులుతున్నాయి. కాలవకంపు ఘోరంగా వుంది. ఏదో పిట్టఅరుపు వినటానికి పసందుగా లేదు, దూరాన్న రైలుకూత!

నీల ప్రక్కవున్న ఇంటిగల అమ్మ వాకిట కూర్చొని ఆమె చెప్తున్న మాటలు వింటోంది. మల్లు అమ్మ ప్రక్కన కూర్చొని ఆమె చెప్పేమాటలు వింటున్నాడు. లోకాభిరామాయణం అయ్యాక విసుగెత్తిందేమో, మల్లు అయ్యప్రక్కకు వచ్చాడు. తండ్రీ కొడుకులకు నిద్దరపట్టలేదు. తండ్రికి భవిష్యత్తు ఆశాజనకంగా కనిపించడంచేత దాని విషయమై ఆలోచించుకుంటున్నాడు. కొడుకు పగటివేళ బాగా నిద్దరపోయాడు. అంచేత నిద్దరరాలేదు.

మొగుడు యింట్లో లేడేమో, పిల్లికోసం యేడ్చిన ఆవిడ రాను రాను స్వవిషయంలోనికి దిగింది. బహుశా, ఆమె జీవితంలో యెవరికీ చెప్పరాని స్వవిషయాలు నీలితో గుట్టుగా గుస గుసలాడుతూ చెప్పుకుంటోంది – "నీలమ్మా! ఆయేల పిల్లి సచ్చిపోనేదు – నలుగురూ అని పోతారు నానే పిల్లిని సంపి, నా యేడుపు దానిమీద పెట్టి తీర్చుకున్నానని.... ..నా మొగుడి సంగతి యేడాదికాలేదుగాని......వచ్చి .....సూస్తన్నావుకదా! ఉత్తి ఆడదానికంటే అద్దోనం – నాను నోరెత్తితే పిల్లినాగైపోతాడు, నువ్వున్న ఇంట్లో అద్దికి ఉండేవాడు.....ఎవరూ నా అనేవోళ్ళు వుండేవోరుకాదు – మొక్కలీసోడు – అయితే గడించుకొనేవోడు – అలాగే సుకపడేవోడు. తిండీ,

తాగుడూ, ఒకటేంటి? వీధి వీదంతా నానంటె జడుస్తారా? అదేంటో ఆడిదగ్గర లొంగిపోనాను. తన్నేవోడు. ఆడు తన్నితే సుకమనిపించేది – మళ్ళా యెంతో సుకపెట్టేవోడు – అలాంటోడు సచ్చిపోతే – నానూ సచ్చిపోవాలనుకున్నాను – యెదవపేణం – తీపు – పిల్లిని దూరం తగిలేసి ఆ దుఃఖం యేడిసి తీరుసుకున్నాను – నా నెప్పుడూ కళ్ళంట నీరు తెచ్చుకోనేదు నీలమ్మా – అప్పుడే అదొకలాగ పిచ్చిదాన్నయిపోనాను.........."

నీలి యీా ఘోషనంతనూ విన్నది. అప్పటికే చాలా రాత్రయింది. "పడుకో నీలమ్మా – ఉత్తిమనిషివి కావని" ఆవిడ లేచిపోయింది. నీలి గదిలోనికిపోయి పడుకుని మల్లు వుండీ వుడిగీ అయ్యకు వేస్తున్న ప్రశ్నలు వింటూ వింటూ అలా నిద్దరపోయింది.

కాలం దొర్లిపోతోంది. కానీ పుల్లయ్యకు కునుకురాలేదు. ఆ చెట్టువేపు చూస్తున్నకొద్దీ బూచోడూ బంగారమే అగుపిస్తోన్నాయి. ఆశతో ఆలోచనలు అల్లల్లాడిపోతున్నాయ్. కొడుకు మీదపడుకొని చిన్న చిన్న కూనిరాగాలు తీస్తున్నాడు. తీస్తూ తీస్తూ వుండగానే వాడికి కండ్లు బరువెక్కిపోయాయి.

ఇంతలో పుల్లయ్య యింటి యెదురుగా యిద్దరు నిల్చున్నారు. పుల్లయ్యకు వాళ్ళను చూడగానే ఆ ఆకారాలనుబట్టే పోల్చుకున్నాడు. సంతోషంతో లేవబోయి కొడుకును ప్రక్కకు వేస్తే వాడు లేచిపోయాడు. వాడ్ని మెల్లగా తట్టి లేచేసరికి లేచి వెంటపడగానే పుల్లయ్యకు పట్టరాని కోపం వచ్చింది – వాళ్ళని సైగచేసి నీలి యెక్కడ లేచిపోతుందనో మెల్లగా తిరిగి వచ్చి వాడిని వక్షంమీద వేసుకొని కాసేపు జోకొట్టినట్లుగా ఒళ్ళు తడిమాడు.

ఆ చిన్న హృదయంలో అప్పుడే సంశయం పొడసూపింది – ఈ వేళ యెలాగైనా తనను అయ్య రానివ్వడని నిశ్చయించుకున్నాడు, ఆరోజు రాత్రిలా అయ్య వెనకాలే మెల్లమెల్లగా అయ్యకు కనపడకండా అనుసరించాలని నిశ్చయించుకున్నాడేమో నిద్రపోతున్నట్లు నటించాడు. పుల్లయ్య కొద్దిసేపయ్యాక మల్లుని మెల్లగా పక్కమీద వేశాడు. కొడుకు నిద్రపోతున్నాడని నిర్ధారణ చేసుకున్నాక మెల్లగా లేచి అడుగులు ముందుకువేస్తుంటే కొడుకు కళ్ళుతెరచి చూస్తున్నాడు.

అదిగో......ఆ రోడ్డుచివర, అయ్య ఆ యిద్దర్నీ కలుసుకున్నాడు. లేస్తే కనిపించి పోతానని యింకా అలా చూస్తూనే ఉన్నాడు. ముగ్గురూ కదిలి ఒక మూలకు చేరుకున్నారు. అక్కడ నిల్చున్నాక చంద్రయ్య గొణిగాడు. "తలుపుతీసుకొని వీ డొక్కడే మేడమీద పడుకున్నాడు. ఇంట్లో వాళ్ళంతా పెళ్ళికి పోనారు. అంతా రడీగా వున్నాది. ఆడిదగ్గర పిస్తోలు వున్నాదట, ఒళ్ళంతా కళ్ళు పెట్టుకొని పనిసెయ్యాల. ఇలాగ యెళ్లేటప్పుడు యెవడైనా పోలీసోడడిగితే రెండో ఆట సినీమానించి వస్తున్నాం. సముద్రపొడ్డున పడుకోడానికి పోతున్నాం అని సెప్పాలి." తరువాత ముగ్గురి చేతులు ఒకదానిమీద ఒకటి అన్చి "మన దినాలు బాగులేక మనలో యే ఒక్కరు దొరికినా ఆ దేముడు తోడుగా మిగతా యిద్దరిగుట్టూ పీక తెగినా సెప్పకూడదు" అని ముగ్గురూ ప్రమాణ స్వీకారం చేసారు. చంద్రయ్య ఇంకో విషయంకూడా చెప్పాడు.

మిగతావాళ్లు వెంటనే దొరికిపోయినవాడి యింటికి వెళ్ళి, పోలీసులు కొట్టినా తిట్టినా తమకేం తెలీదని చెప్పేటట్లు చూడాలని, దొరికినవాడు. కూడా తను దొంగతనం చెయ్యలేదని చెప్పాలని మరీమరీ చెప్పాడు.

ఇక ముగ్గురూ కాలుకదపటం యీ చిన్నికళ్ళకి కనుపించాయి, అయ్యతో నున్న అన్న, చంద్రయ్యను గుర్తుపట్టాడు. వారు రోడ్డు మలుపు తిరిగారు. కంటికి అగపడలేదు! గబగబ లేచాడు – రోడ్డు – చివరకు వెళ్ళి తొంగిచూశాడు – ముగ్గురూ అగుపించారు. అదిగో – చెత్తల డొక్కు – వొంగొని ప్రాకుతూ ఆడొక్కుచాటునుంచి చూశాడు. అయ్య వెనుకకు చూశాడు. కాని, కొడుకు యిలా వచ్చాడనీ, యీ చాటున వున్నాడని యెలా తెలుసుకుంటాడు? – మళ్ళీ యింకో సందు......యీ సందు తనకు బాగా తెలుసు – యెన్నిసార్లో ఈ సందుత్రోవ తిరిగాడు...... ఇక్కడే ఇదిగో ఆ వీధిపిల్లలు గోలీకాయలు ఆట ఆడుకొనేవారు. తనూ చూసేవాడు సరదాగా. తన బడీ ఈ సందులోనేకదా......వీధిలో చీకటిగా వుంది – వాళ్ళు వెళ్ళిపోవటం కాలవలో వంగి మరీ చూశాడు – చీకటైనా ముగ్గురూ అగడం తనకు కనిపించింది – అలా కాలవప్రక్కనుంచే నడ్డివంచి నడిచాడు – అదిగో చెత్తలడబ్బా–ఆ చాటున కూర్చోని వంగి చూస్తుంటే ఆ చుక్కల మిసమిస వెలుగులో ఆ తెల్లని గోడలుగల మేడమీదికి ప్రాకుతున్న మనుషులు స్పష్టంగా అగుపిస్తున్నారు. ఆశ్చర్యంగా రెప్పవెయ్యకండా చూస్తున్నాడు. ఎక్కడలేని కోరికా తనను వుత్తేజపరుస్తోంది, అయ్యలాగా తనూ ఆమేడపైకి యెగబ్రాకాలి – కానీ అయ్యకి తను అక్కడికి వచ్చానని తెలిస్తే.... అమ్మతో ఆసారి చెప్పితే కొట్టాడుకదా – అసలే మాటాడను అనుకొని అలా నోరుకట్టుకొని చూస్తున్నాడు.

ఇంతలో తనకు కుక్క అరుపు వినిపించింది, ఆ అరుపు వినిపించేసరికి చివరివాడు సగంవరకు యెగబ్రాకాడు. ఆగిపోయి మళ్ళీ యెగబ్రాకుతున్నాడు......

మేడవీధివేపు వుండుండి బౌబౌమనీ అరుస్తున్న కుక్క–బూచోడు "పడుకోర నాయనా!" అని అంటున్నా అరుస్తోంది. సగం నిద్దరనుంచి మేల్కొన్న బూచోడు ఇటూ అటూ తేరిచూశాడు......చీకటిగా వుంది. కుక్క తనదగ్గరనుంచి ఒక గెంతుగెంతి అదేపనిగా అరవగానే బూచోడు లేచి దానిదగ్గరకు వచ్చాడు. మేడవేపు చూడగానే – చివరివాడు మేడయెక్కి పోవడం చూశాడు. వెనువెంటనే కుక్క అరుపుతోబాటు "ఒరే శ్రీనీ, దొంగలు దూరారురా..... దొంగలురా......దొంగలురా – దొంగ" లంటూ పెద్దకేకలు పెట్టసాగాడు. ఆ కేకలు, కుక్కఅరుపు శ్రీనివాసరావును మేల్కొల్పాయి. ఇంతలోనే ధన్ ధన్ అన్న ప్రేలుడు శబ్దం వినిపించింది.

కొద్ది క్షణాలు అంతా భయంకరం అనిపించింది. మల్లుక్కూడా భయంవేసి ఆ చెత్తల డొక్కులోనికి దిగిపోయి దగ్గరకు ముడుచుకొని ఒకమూల కూర్చున్నాడు. అయ్య మళ్ళీ ఆ గొట్టం పట్టుకొని దిగిపోతాడేమోనని. కళ్ళప్పచెప్పి చూస్తున్నాడు, ఆ డొక్కు ప్రక్కనుంచే మనుషులు పరుగెత్తుతున్న చప్పుడు వినిపిస్తోంది. ఎందరి గొంతుకలో వినిపిస్తున్నయ్. ఇంతలోనే లారీలువచ్చే శబ్దం – అవన్నీ వింటుంటే ఆ చిన్నప్రాణం ఆ డొక్కులో యెవరికీ కనిపించకుండా చెత్తలో చెత్తయి, మురికిలో మురికై, రెండు నక్షత్రాలులాంటి కళ్ళతో భువినుండి ఆకాశంవేపు చూస్తున్నది.

ఆ కళ్ళు నిరీక్షిస్తున్న పని యెంతకీ జరగలేదు – "అయ్యి దిగలేదు, మా అయ్యి రాలేదు..... మా అయ్యి యెప్పుడొస్తాడు? మా అయ్యిరానిది నాను కదలను!" అని ఆ చిన్నప్రాణం బితుకుబితుకుమంటూనే పట్టుదల చూపుతోంది.

చాలాసేపటికి కోలాహలం తగ్గింది. మనుషులు తిరిగి వెళ్ళిపోతున్నారు. బూచోడూ, కుక్కగురించి చెప్పుకుంటున్నారు. దొంగలుగురించి యేదో అనుకుంటున్నారు. కాని మల్లుకి యేమీ చెవినిపట్టలేదు, విన్న ముక్కలయినా అర్థంకాలేదు. "మా అయ్యిని ఆ యేళ టేషినిదగ్గర అలా కొట్టేసినారు – ఇక్కడా అలాగ సేస్తన్నారా? నా ందుకుండి? మా అయ్యిని కొట్టినోళ్ళని కరిసేస్తాను – యెల్తాను......యిప్పుడైతే.....ఆ ఁడ యెక్కగలనా? ఎక్కితే మా అయ్యి నన్ను చూసి యేల వచ్చినావని కొట్టడా? మా అయ్యిని యెవుడైనా కొడ్తే ఆ లిద్దరూ ఊరుకుంటారా?" ఇలా పరిపరివిధాల ఆ చిన్న హృదయం ఆ చెత్తగృహంలోనే, ఒకప్రక్క కంటి రెప్పలు బరువెక్కుతున్నా ఓమూల కంపుతో ఒళ్ళంతా తెములుతున్నా ఆరాటం జెందుతోంది.

చూసి చూసి కనులు కాయలుకాసిపోయాయి. అంతా నిశ్శబ్దం ఆవరించింది. నల్లటి ఆకాశాన మిణుకుమనే చుక్కలూ – తనచుట్టూ రకరకాల వస్తుసముదాయంతో యేర్పడ్డ చెత్త–యీ రెండే తోడయ్యాయి. చివరికి విసుగుజెందిన మనసుకు వొక ఆలోచన తట్టింది. "అయ్యి ఆ తోవన యింటికి యెలిపోనాడేమో! లేకపోతే అలాగ ఓడదించడానికి యెల్లిపోనాడేమో! యెళ్ళి పొద్దున లేపినదాకా చూస్తాను" అని అనుకొని మెల్లగా లేస్తూ చుట్టూ చూశాడు. అంతా చీకటిగా నిశ్శబ్దంగా ఉంది. భయపడి వచ్చిన త్రోవవెంబడే యింటికి పరుగెత్తాడు. గడపలో అయ్యిలేడు. అలాగ అయ్యికోసం ఎదురుచూస్తున్న కళ్ళు చాలసేపటికిగానీ మూత పడలేకపోయాయి.

# 39

నీలి తెల్లవారుఝామునే కొడుకును లేపి "అయ్యేడీ?....." అని అడిగింది. మల్లు ఆదరా బాదరా లేచి అక్కడనుంచి పెరటికి వెళ్ళిపోయాడు. నీలి పెరటికి వెళ్ళి రెట్టించి అడిగింది. ఆ చిన్ని మనసుకు అబద్ధం ఆడటం చేతకాక, అంతా చెప్తే అయ్యికి కోపం వస్తుందని నోరు మూసుకున్నాడు.

నీలి ఓ క్షణం రెట్టించినా జవాబు రాకపోవటంవల్ల ఎక్కడకో బయటకు వెళ్ళివుంటాడని వూరుకుంది. మల్లు వీధిలో ఇటూ అటూ తిరుగుతూ అయ్యికోసం చూస్తున్నాడు. ఉదయభానుని కిరణాలు ఏటవాలుగా పడుతున్నాయి. ఎవరి పనులు వారు చూసుకుంటున్నారు. ఆరాటంతో దిగులుతో నిండిన యీ చిన్ని మనసుకు కాలం జాలం తెలియటంలే ు. "అయ్యి యింకా రానేదు. అయ్యికి యేం అయినాదో?" అనుకోసాగాడు. అయ్యినిగురించి ఆలోచిస్తున్నకొద్దీ ఎదుటివాళ్ళపై కోపం ముంచుకొస్తోంది. గబగబ ఇంటిలోకి వెళ్ళాడు. ఇటూ అటూ చూశాడు. కర్ర ఆగుపించలేదు. పెరటికి వెళ్ళి తడకలోని వెదురుపుల్ల విరిచాడు. నీలి యింక ప్రొద్దెక్కినా, భర్త రాకపోవటంతో మల్లుని పట్టుకుని గట్టిగా అడిగింది. వాడు చేతులతో నోరు మూసుకోవటంతో, కోపం విసుగూ ఆమెను చుట్టివేశాయి

ఎందుకో ఆమెకు భయం భయంగా అనిపిస్తోంది. ఎక్కడో ఏదో అపకారం జరిగి పోయినట్లు మనశ్శాంతి లేకండా అదోలా అయిపోతోంది.

తల్లిచేత ఒక దెబ్బ తిన్నా ఖాతరుచేయక మల్లు గబగబ చేతినున్న వెదురుపుల్లతో వీధిలోపడి గబగబ ముందుకు పరిగెత్తాడు. సరిగ్గా రాత్రి వెళ్ళిన త్రోవగుండానే ఆవేశంతో పరుగెత్తాడు. రాత్రి దాగున్న చెత్తలు డొక్కుదాటి ముందుకు సాగిపోయాడు. "ఇదిగో ఈ మేడలో మా అయ్య వచ్చాడు. వీళ్ళు మా అయ్యని దాచేసినారు....." అనుకొని ఆ యింటిలోకి ముఖం పొంగించి కోపంతో " మా అయ్యని యిత్తారా లేదా?" అని అరుస్తూ పరుగెత్తాడు.

ఎదురుగావున్న నౌకరీమనిషి ఆ కుర్రవాడి దుడుకుతనానికి అబ్బురపడి అలా వింతగా చూస్తున్నాడు. మల్లు కర్రతో నేలమీద గట్టిగా కొట్టి "మా అయ్యని వదలకపోతే అందరినీ యీ కర్రతో కొట్టేస్తాను...." అని అరుస్తూ మళ్ళీ క్రింద నాలుగుసార్లు గట్టిగా కొట్టాడు.

ఇంతలో లోపలనించి కాకీదుస్తులతో ఒక మనిషి రావటం చూసి మరికాస్త గట్టిగా –

"ఊం....మా అయ్యనివ్వండి" అని అరిచాడు. నౌఖరీమనిషి ఏదో అనబోతున్నా అనటానికి అస్కారం మల్లు ఈయలేదు. ఆ పోలీసుఇనస్పెక్టరు వస్తూనే నౌఖరుతో నవ్వుతూ "ఈ పిల్లాడికి బిస్కతులు యిష్టం – తీసుకురా వేగం" అన్నాడు. నౌఖరు బయటకు వెళ్ళాడు. ఇంతలో యింటినుంచి మరికొందరు ఉద్యోగులు చేరారు.

మల్లు ఆవేశం ఇంకా తగ్గలేదు. ఆ వాగ్ధాటి ఆగలేదు. ఇన్‌స్పెక్టరు నవ్వుతూ "మీ అయ్య రాలేదు!" అన్నాడు.

"రాలేదా? ఆం రాతిరి రానేదా?"

"తలుపులు యేసుంటే ఎలా వస్తాడు?"

"మా అయ్యా మరిద్దరూ అలాగ గోడెక్కి రానేదా?" నిష్ఠురంగా మల్లు మాటాడుతూ మళ్ళీ పౌరుషంతో "మా అయ్యని వదిలేయండి – మా అయ్య మా మంచోడు!" అన్నాడు.

బిస్కట్లు వచ్చాయి. ఇన్‌స్పెక్టరు నవ్వుతూ "మీ అయ్యని వదిలేస్తాం. ఇవి ముందు తిను" అని చేతిలో పెట్టుంటే అవి దూరంగా విసిరేసి "నా కొద్దు – మా అయ్య కావాల!" అన్నాడు.

"ఒక్కటైనా తిను" అంటూ విసిరేసిన బిస్కట్లు మళ్ళీ చేతపెట్టినా పుచ్చుకోక "మా అయ్యనిస్తావా లేదా?" అంటూ కర్ర ఇన్‌స్పెక్టరువేపు కత్తిలా ఝుళిపించాడు.

ఇన్‌స్పెక్టరు ప్రసన్నవదనంతో "మీ అయ్యపేరు చెప్పితేనేగాని ఎలాగిస్తాను?" అన్నాడు.

"ఇస్తావా?"

"ఇస్తాను!"

"మా అయ్యపేరే తెలీదా? – పుల్లయ్య!"

"మరి మీ అయ్యతోవున్న యిద్దరిపేర్లో?"

"మా అయ్యపేరు సెప్తే మా అయ్యనిస్తానన్నావు?"

"ఇస్తాను. నేను అడిగినవన్నీ చెప్తేనే మీ అయ్యనిస్తాను."

"ముందు మా అయ్యని సూపించు!"

"నే నడిగినవన్నీ చెప్తేనే నీకు అయ్య. లేకపోతే, వెళ్ళిపో!"

"నేను యెళ్ళను – నాకు అయ్యనిచ్చీ, యెళ్ళిపోతాను" అని గద్దింపుతోను, ప్రార్థనతోనూ మిళితమైన స్వరంతో అన్నాడు.

నౌఖరుతో "ఈ కుర్రాడిని బయటకు పంపించు" అని ఇన్‌స్పెక్టరు అనగానే వాడు మల్లుచెయ్యి పట్టుకున్నాడు. ఆ కర్ర రెండోచేతికి తీసుకొని ఆ నౌకర్ని కొట్టబోతుంటే ఇన్‌స్పెక్టరు ఆ కర్ర లాగుకున్నాడు. మల్లు గుంజాటనపడి నౌఖర్ని కరవబోయాడు. కాని లాభం లేకపోయింది. బయటపడినా ఒకటే ఏడుపు. కోపంతో మధ్య మధ్యను లేచిపోయి "మా అయ్యని ఇవ్వకపోతే – మీ అందరినీ ఏం చేస్తానో సూడండి! మా అయ్యసేత మీ అందరినీ కొట్టించేస్తాను. మా అయ్య.......అయ్య.......అయ్యా!" అని చివరకు కేకలు వేశాడు. గొంతుక పట్టుకుపోయింది. భయంపెట్తే లొంగేఘటం కాదని తెలుసుకొన్న ఇన్‌స్పెక్టరు కొంతసేపయ్యాక నవ్వుతూ బయటకు వచ్చి "నే నడిగింది చెప్తే – ఇప్పటికి మీ అయ్యనిచ్చేద్దును – రా – లోపలికి రా – మీ అయ్యని చూద్దువుగాని!" అనగానే మల్లు ఒక్కసారి ఊరకలు వేసుకొంటూ లోనికి వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ మల్లుమీద చెయ్యివేసి పేరు కనుక్కున్నాక "మల్లు మంచోడు – పుల్లయ్య మరీ మంచి!......కదా మల్లూ?" అన్నాడు.

ఈ పొగడ్త ఆ లేత హృదయానికి ఎక్కడలేని తృప్తిని యిచ్చింది. నవ్వుముఖంతో "మా అయ్య మా మంచోడు!" అన్నాడు.

అలా ఆ కుర్రావాణ్ణి పైకి లేవనెత్తి గిరగిర త్రిప్పుతూ "మల్లూ! మీ అయ్యతో యిద్దరొచ్చారు కదూ! వాళ్ళ పేర్లు?"

"అన్న – సెంద్రయ్య"

"వాళ్ళు ఎలాగుంటారు?"

"ఒకడు అదిగో ఆడిలాగ. ఇంకొకడు నీలాగ" అంటూ పొట్టి పొడుగులను చూపించాడు. ఇలా ఆ కుర్రవాణ్ణి నవ్వించి, మరపించి, మంచిచేసుకొని ఆ దొంగలు ఎలా ఎగ్రాకిందీ, తను ఎక్కడనుంచి చూసిందీ అంతా గుట్లు లాగారు. అయ్య ఏంపని చేసేవోడంటే వోడలు దించేవాడని – రాతిరిపనే అని చెప్పాడు. ఇంకేంతసేపో ప్రశ్నలు వేయలేకపోయారు. కుర్రవాని మరచిపోయిన ఆతృత మళ్ళీ పొడచూపింది. వేధిస్తుంటే ఇన్‌స్పెక్టర్ "ఉండు, నేనే మీ అయ్యను తీసుకొస్తా"నని లోపలికి వెళ్లాడు. కొద్ది క్షణాలలోనే ఒక క్రొత్త మనిషితో తిరిగివస్తూ "పెద్ద ఓడ వచ్చిందట! సరుకు దించడానికి మీ అయ్య పరుగెత్తాడు. మా మల్లువస్తే రాతిరికి వస్తానని చెప్పమన్నాడట! నీవు యింటికెళ్ళి ఆడుకో. మీ అయ్య రాతిరికి వస్తాడు!" అన్నాడు.

ఆ చెప్పే విధానం, దానికి ఆ వచ్చిన క్రొత్తమనిషి సాక్ష్యం ఆ లేత మనస్సును నమ్మించాయి. తిరుగుముఖం పట్టే ఆ కుర్రవాని వెంబడి ఇన్‌స్పెక్టరు కూడా పడ్డాడు. మల్లు ఆ యింటిలోకి వెళ్తుండగా చూసి, ఆ యిల్లు గుర్తు పట్టాడు.

ఇంటికివెళ్ళి అమ్మతో అయ్య ఓడ దించడానికి వెళ్ళాడని అమ్మ అడగకుండానే చెప్పాడు. సాయంత్రంవరకు ఎటూ కదలకుండా ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

చీకటి పడింది. అయ్య ఇంకా రాలేదు. నిముషం గడిచినకొద్దీ ఆ లేత మనస్సులో మథనం అధికమై, కళ్ళల్లో నీరు చిమ్ముతోంది. నీలికూడా ఆతృతగా ఎదురుచూస్తోంది. ఇరుగు పొరుగువాళ్ళు ఎక్కడో భాగ్యవంతుల ఇంట్లో రాత్రి దొంగలు పడ్డారని, ఆయన పిస్తోలు పేల్చినా దొంగలు దొరకలేదనీ విన్నది.

"వాళ్ళకేం పోయేకాలమమ్మా! దొంగబతుకూ ఒక బతుకేనా?" అని నీలి అందుకుంది.

"దోచుకెళ్ళిపోయినా పూచీలేకపోనట! ఆ బాబు బుర్ర బద్దలు చేసినారట – బతికితే అదృష్టమంతుడేనట – ఆస్పత్రిలో వున్నాడట!"

నీలికి తన తలే బద్దలైనట్లు అనిపించింది. "రామ రామ – ఆ బాబు లేచిన వేళ అలాంటిది" అనుకుంది.

పొరుగమ్మ అందుకుంది: "అ డబ్బు ఆడిది కాదట! యెవురిదో కలిసొచ్చిందట. ఎలాగొచ్చిందో అలాగే పోతాదని అనుకుంటే ఆ బాబు పేణంమీదకి రాకపోనట! పిస్తోలు గాలిలోన పేలించినాడట – యెదురుగా పేలిస్తే అందరూ సచ్చిపోదురుట!"

జేబుదొంగ పెళ్ళం మాటామాటా కలిపి "మా సెడ్డోడట! అలాంటోలికి అలాగే కావాలలే!" అంది.

నీలి చప్పున "అదా తల్లీ సబబు చెప్పినావు! యెంత మంచి మారాజు కాకపోతే, పిస్తోలు గాలిలో పేలుస్తాడు? సెడ్డోడైతే దొంగలమీదే పేలించేసును! అలాంటి బాబుకి అన్నాయం జరగదు. ఆ బాబు బతికి బయటపడడా? పడతాడు" అంది.

ఇలా వాళ్ళలోవాళ్ళు చాలాసేపు మాటాడుకున్నారు. ఎనిమిదిగంటల రాత్రయినా ఇంకా పుల్లయ్య యింటికి చేరకపోవటంతో మల్లు "అయ్యా!" అని యేడుస్తున్నాడు. వాడికి అయ్య రాలేదని దుఃఖంతోపాటు అయ్యమీద కోపంకూడా అధికం కాజొచ్చింది, నీలికికూడా యేం చెయ్యటానికీ తోచటం లేదు. ఆమెకూడా అలా వాకిట కూర్చొని వచ్చేపోయేవాళ్ళవేపు చూస్తోంది. తిండీ తిప్పలూ లేకుండా తల్లీ, కొడుకూ అలా చూస్తూనే వున్నారు. పదిగంటల రాత్రయింది. జనసంచారంలేదు. ఎదురుగావున్న చెట్లకొమ్మలు వుండుండి గాలికి కదులుతున్నాయ్. నిరాశ ఇద్దర్నీ ఆ చీకటిలాగే మ్రింగివేస్తోంది.

అంతదూరంలో ఎవరో మనిషి వస్తున్నట్లగపడింది. వస్తుండగానే మల్లు ఒక్క యెగురు యెగిరి "అదుగో అయ్య!" అంటూ ముందుకు పురుగులెత్తాడు. అయ్యను ముందుకు కదలనివ్వకుండా కాళ్ళు పట్టుకొని యేడుపూ నిష్ఠురంతో యేవేవో అనేస్తున్నాడు. అయ్య కొడుకుని యెత్తుకున్నాడు; ముద్దులాడాడు. కానీ చేతిమురుకుది రాపాడి రక్తం వచ్చిందేమో నొప్పిగావుంది. ముఖంమీద దేనికో ఢీకొనటంవల్ల తగిలిన దెబ్బవల్ల బొడిపికట్టివున్నది. మల్లు ఉత్సాహంగా అయ్య ముఖంలో ముఖం పెట్టే తడుముగా ఆ బొడిపి తగిలింది. ఆతృతతో "అయ్యా! దెబ్బతగిలిందా? ఆలు కొట్టారా?" అన్నాడు.

పుల్లయ్యకు ఈ చివరప్రశ్న అయోమయంగా అనిపించింది. చప్పున "ఎవరు?" అన్నాడు.

"ఆ పెద్దమేడోలు కొట్టారా? అలకి దుబ్బుడుదుబ్బుడు యేసేద్దం యీ రాతిరికి యెల్లి!" చాలా దయతో అన్నాడు.

పుల్లయ్య నిర్విణ్ణుడైనాడు. చప్పున మాటరాలేదు. కొడుకు మాటలు ఆపటంకూడాలేదు. ఆవేళ ప్రొద్దున్న తను కర్రపట్టుకొని వెళ్ళినట్లు "ఓడదించడానికి యెల్తన్నానని నానువస్తే అలకి సెప్పమని సెప్పినావు కదా?" అనీ యిలా చెప్తుంటే యేం జరిగిందో వూహించుకొన్న పుల్లయ్య. ఇంట్లోకి వెళ్ళటానికి భయం వేసింది, ఆ మల్లుని అక్కడే దించి యెదురుగా నీలి అగపడుతున్నా వెనుకకు పరుగెత్తి పోవాలని వుబలాటపడుతున్నాడు. కానీ ఆమె ఒక తాడుతో తనను బిగించి ముందుకు లాగుతున్నట్లు అనిపించింది. అంతలోనే కొడుకుమీద అమిత కోపం, చిరాకు వచ్చేశాయి. నీలి అలా సంశయంతో నిల్చున్న మొగుడువేపు నాలుగడుగులువేసి వచ్చింది.

"ఇంట్లో సెప్పవాయె ఎటెళ్ళిందీ? ఆడు యేడ్చి యేడ్చి వున్నాడు. నాకు బెంగగా వున్నది!"

ఈ మాటలు ఆమె నోటిలోనే వున్నాయ్, రెండు వేపులనుంచీ యెవరో వస్తున్న పాదాలచప్పుడు. నీలి అటువేపు యింకా చూడనేలేదు, పుల్లయ్య ఆదరా బాదరాగా కాలువవేపు వెళ్ళిపోతున్నాడు. వాళ్ళా అటువేపే.......ఇంతలో అక్కడ బేటరి దీపాలు వెలగనారంభించాయి. ఇటూ అటూ ఎర్రటోపీలతో పోలీసులు. నీలి కిదంతా అయోమయం అనిపించింది. అంతా ఒక భయంకరమైన కలలా తోచింది. ఆమె కాళ్ళు గజగజ వణక నారంభించాయి. ఇంతలో కేకలు "పట్టుకో దొంగని!" అని వినిపించాయి.

"ఎవ రా దొంగ?"

తన మొగుడా? తన మొగుడా దొంగ? తను దొంగవాడి పెళ్ళామా? – కాదు కాదు – ఇదంతా యేదో మాయ – ఏదో కల – ఇది నిజం కాదు.......

దొరికిపోయిన దొంగచేతులకు బేడీలు పెట్టటం ఆమె కళ్ళతో చూసింది. వీధంతా మేలుకొంది. ప్రజలంతా చుట్టుముట్టారు. ఇంతమంది మధ్య తలవంచుకుని నిల్చున్నాడు దొంగ – పుల్లయ్య! మనిషోమాట – మనిషోకూత! తన ఇరుగూ పొరుగూవాళ్ళే అనరాని నానా దుర్భాషలాడుతున్నారు. ఆ మంచిబాబు తల బద్దలుగొట్టిన దొంగ తన మొగుడు'

నీలి ఇవన్నీ వినలేకపోయింది. ఇవన్నీ కనలేకపోయింది, ఆమెకు గుండె దడపట్టుకొని సగం చచ్చి నేలకు ఒరిగిపోయింది. వెంట పరుగెత్తినా వెనుకకు త్రోయబడ్డ మల్లు ఒకే కంఠంతో గగ్గోలుపెడ్తున్నాడు. దొంగతో పోలీసులు ముందుకు సాగిపోతున్నారు. వాళ్ళవేపు చూడలేక చూడలేక చూస్తోంది. ఆ ప్రజ కదలిపోతున్నారు – కదిలి పోయారు! కాళ్ళు చేతులు కొట్టుకొని కొడుకు యేడుస్తున్నాడు.

అంతా చీకటి – ఆ చీకటిలో ఏకాకి తను – ఆమెకు యెక్కడలేని దుఃఖమూ ముంచుకొచ్చింది. మళ్ళీలేచి పరుగెత్తి అయ్యని వెంబడించాలని ఉరుకుతున్న

కొడుకుని వారిస్తూ గుంజాటన పడుతోంది. చాలాసేపటికి ఇద్దరూ అలసిపోయారు, మెల్లమెల్లగా కొడుకుని యెత్తుకొని ఇంటిలోకి నడిచి కూలబడిపోయింది.

# 40

ఆరాత్రి నయాన భయాన్న అడిగినా పుల్లయ్య పోలీసుస్టేషనులో "నాకేమీ తెలీదని" చెప్పాడు. చివరకు లాఠీదెబ్బలతో ఒళ్ళంతా హూనంచేసినా యిలా చచ్చిపోతానుగానీ నేనేగుట్టూ ఇవ్వనని భీష్మించుకున్నాడు, విసుగెత్తిన పోలీసులు యీడ్చి యీడ్చి లాకప్‌లో వుంచారు. హూనమైన శరీరం బాధపెట్టుంటే పుల్లయ్యకు కళ్ళలో నీరుకూడా ∙ తిరిగిపోతోంది. అలా ఆ కొట్టులో ఇనప కటకటాల వెనుక కూలబడిపోయాడు. ఆ బాధలో ఏవేవో అనుకున్నాడు: గొణుక్కున్నాడు. తనలో తనే తిట్టుకుంటున్నాడు; నెత్తీ నోరూ కొట్టుకున్నాడు, అలా వేకువఝాముకుగానీ మాగన్నుగా నిద్దరపట్టలేదు. ఆ కొద్దిసేపైనా యేవేవో కలలు. అందులో పోలీసులు అగుపించారు; తెలివి వచ్చేసరికి ఒళ్ళంతా పచ్చిగా వుంది. కదలలేనంత నీరసం అనిపించింది. "మల్లు ఎంతగా యేడుస్తున్నాడో! నీలి ఎలాగ బతుకుతాది? ఏందారి?" అని వాపోయాడు.

నిల్చుంటే నిలవలేకపోయాడు. ఆకలి బ్రహ్మాండంగా వుంది. శరీరం అంతా దిగ్గుట్లు పొడిచినట్లు, యే కీలు కా కీలు విరిగిపోయినట్లు, యెక్కడి కండ లక్కడ తెగినట్లు అనిపించింది!

ఆ రోజు పుల్లయ్యను సెంట్రల్ జైలుకి పంపించారు.

నీలికి ముందు రాత్రంతా యెంత ప్రయత్నించినా నిద్దర రాలేదు. జరిగినవన్నీ జ్ఞప్తికి వస్తున్నాయి. ఏడ్చీ ఏడ్చీ పడున్న మల్లు నిద్రపోతున్నాడు. తలుచుకున్నకొద్ది మొగుడు అప్పుడు ఆడిన అబద్దాలను నిజాలుగా యెలా తీసుకోగలిగినానని అబ్బురపడింది. "ఆడికి పని దొరకకపోతే నాను ఎక్కడైనా పాసిపని చేసి పోషిద్దును. ఎగిరేపిట్టకి మసాల రాసిన మనిసైపోనాడు! మనరాత బాగులేనప్పుడు ఏ కూలిపని సేసినా తప్పేంవున్నాది? ఈయేళ ఒకడి తల కొట్టే ఋణం వుండిపోతాదా? ఇక్కడ తీర్చకపోతే అక్కడ తీర్చడా? కానలేకపోనాను. ఇలాగ గొంగళిపురుగులాగా అయిపోవాలా"

ఆమె యిలా తల్చుకొంటూ కడుపు చెరువు చేసుకుంది. కాని ఆమెకు యీ దుఃఖంలోనూ, విచారంలోనూ మామ్మ జ్ఞప్తికి వచ్చింది. ఆమె చనిపోతూ చెప్పిన మాటలు నెమరువేసుకుంది. "అవును, మామ్మ సెప్పింది నిజం! ఆడు అలాగైనాడని నాను యిలాగ యిసారిస్తూవుంటే పిల్లల గతేం అవుతాది? యేదిపోయినా బతుకొచ్చు ధైర్యంపోతే యింకేం వున్నది?" అని మామ్మను తలచుకొని గుండె దిట్టం చేసుకుంది. నీలమ్మతల్లికి మొక్కుకుంది.

ప్రొద్దున్న ఇరుగు పొరుగువాళ్ళు ఆమెను ఒక వెలివేసిన మనిషిలా చూశారు. "దొంగోడి పెళ్ళం దొంగే" అని వ్యాఖ్యానించిం దొక తల్లి. "దీనికి తెలీకుండా యేపనౌతాది? ఇలాంటోలకి అద్దెలకు ఆశపడి యివ్వడం యీధిపరువు పోవడం"

అని ఇంకో ముసలాడు ఛ్రుమన్నాడు. "ఆడిపని అయిపోనాది; దీని సంగతి సూడండి – ముక్కూ ముఖం తెలియనివాళ్ళని యిధిలోన వుంచడం తప్పని" అంకో అమ్మ అట్టహాసం చేసింది. "ఒక్కడ్నుంచి యీధంతటిమీదా పోలీసులు నిగావుంస్తారని" జేబుదొంగ నలుగురిలోను గొడవ చేశాడు.

ఇవన్నీ విన్న నీలి మౌనంగా, శాంతంగా మనసులో నీలమ్మతల్లికి "ఇవన్నీ పడే బలం యీ తల్లీ!" అని మొక్కుకుంది. ఎవరేమన్నా ఆ గొంతుక పెగలలేదు. ఎదురు మాటాడలేదు. ఆమె ధైర్యాన్ని మల్లు అయ్యకోసం ఏడుస్తూ కొంత సడలింపజేస్తున్నాడు.

పోలీసులు బలవంతాన తీసుకవెళ్ళి ఏమడిగినా యేడుపు తప్పించి ఇంకేమీ వాడివద్ద జవాబు రాలేదు. ఎన్నివిధాల ప్రయత్నించినా మల్లుని మాట్లాడించలేకపోయారు. ఇంటికి తిరిగివచ్చి అయ్యని మరిపించడానికి నీలి ఏమి చెప్పినా లాభం లేకపోయింది. ఏడుపు తగ్గాక మరుచటిరోజు తీసుకవస్తానని పోలీసులతో నీలి చెప్పి వాళ్ళను పంపించింది.

అలా ఏడ్చి ఏడ్చి రాత్రి తొమ్మిదికి మల్లు నిద్దరపోయాడు. పిల్ల చాలా సేపటి క్రితమే తినగానే నిద్దరపోయింది. నీలికి ఆకలి వేస్తున్నా తిండిమీద మనసుపోలేదు. అలా వాకిట కూర్చొని శూన్యంలోకి చూస్తోంది – ఇంతలో ఒక సాధువు "మాదకవళం తల్లీ!" అంటూ ఇరుగు పొరుగు ఇళ్ళు చూడకుండా ఆమె దగ్గరకే వచ్చాడు. నీలి లేచి ఉన్నదాంట్లో సగం తెచ్చి ఆ డొక్కులో వేయగానే ఆ సాధు "చాలా కష్టంలో వున్నవమ్మా!" అన్నాడు.

"అవును బాబూ!"

"నాకు తెలుసును – నీ మొగుడు పోలీసులచేతిలో ఉన్నాడు. నీ గుండె తామరాకుమీద నీటిబొట్టులా ఉన్నాది. నేను చెప్పినట్లు వింటివా మీరంతా సుఖపడ్తారు. ఇది భగవంతుడి ఆజ్ఞ!" అన్నాడు.

ఆమె సవినయంగా నిల్చొని "సెప్పు బాబూ!" అన్నది.

సాధువు నేల కూర్చోగానే ఆమె అంత దూరంలో కూర్చుంది. సాధువు మెల్లగా "నీ మొగుడ్ని కలిసినాను. పోలీసులు యేవడిగినా నాకు తెలీదను. నీ కొడుకు సేత ఏమీ మాట్లాడించకు. ఆలు కొట్టనీ, తిట్టనీ ఏమీ సెప్పకపోతే నీ మొగుడు రేపు యింతయేలకి యింటికి రాడా? వస్తాడు – వస్తాడు" అన్నాడు.

నీలి ఆ సాధువువైపు ఒకసారి తలెత్తి చూసి మళ్ళీ తలదించి సవినయంగా "బాబూ, తమరు పెద్దలు. లోకం సూశారు. నాను యేలోకం సూడనే లేదు. మా వూరు – యీ వూరే నా కళ్ళతో సూసినాను. మీరిలాగ సెప్పమంటున్నారు కదా – పోలీసు కళ్ళు, లోకం కళ్ళు మూసేస్తానుగాని దేముడి కళ్ళు మూసేయగలనా? నాయం నాయమే – అన్నాయం అన్నాయమే! అన్నాయం నాయం ఎలాగ సేసీమంటావు బాబూ? – ఈ రోజు నా మొగుడ్ని మొనగాడ్ని చేసి అన్నాయాన్ని నాయం సేసీ మంటావా? .....కాలానికి నా మొగుడు ఆ మొనగాడు పెంకులు పట్టుకొని అడుక్కోడా? మారాజు తండ్రి ఆ పిస్తోలు నా మొగుడుమీద పేలిస్తే యీయాళకి అంతా సరి! అలాంటి బాబుమీదా నన్ను అబద్ధమాడమంటున్నావు?" అంది.

ఈ మాటలతో ఆ సాధువు "కష్టపడిపోతావు. నీకు చూసేవాడెవడూ లేడు. చిప్ప పట్టుకుంటావు – ఆకలితో సచ్చిపోతావు. ఆఖరికి నీ మొగుడు మాట కాదని ఆడికి యెప్పటికీ దూరమైపోతావు. నీ మొగుడే ఇవన్నీ సెప్పమన్నాడు. నా పని నేను చేసేసినాను." కాస్త హెచ్చరిక స్వరంతో అనగానే నీలి ఓ క్షణం జవాబు చెప్పలేకపోయింది. మరుక్షణంలో ఆమెలోని అచంచలమైన విశ్వాసం జయించింది. నెమ్మదైన స్వరంతో అన్నది: "బాబూ! నా మొగుడు ఈ వేళ సెప్పాడని అబద్ధం అడితే నిజం ఐపోతాదా? నిజం అనేది నిలకడమీదైనా తెలుస్తాది! అలాగ నేకపోతే ఈ లోకం ఇలాగ ఉంటాదా? వర్షాలు పడ్తాయా? ఎండ కాస్తాదా? సీకటి వస్తాదా? బాబూ, సిన్నదాన్ని. మీలాంటి సాధువుకి సెప్పిందాన్ని కాను. నాను కళ్ళలో నిప్పులు పోసుకోలేదు. కుడితిలోపడ్డ ఎలుకలాగ కొట్టుకోనూ లేదు. అన్నిటికీ ఆ తండ్రే ఉన్నాడు. నా పని నాను సేసిస్తే – జరగవలసింది జరక్కమానదు" అంటూ అక్కడనించి లేచిపోయింది.

సాధువు చంద్రయ్య చేసేదిలేక తనదారిని తను వెళ్ళిపోయేముందు "తొందరపడకు! బాగా ఆలోచించు. మొగుడు నీకు మరిదక్కడు, నివ్వు నేను సెప్పినట్లు సెయ్యకపోతే ఆడిపీక తెగిపోతాది. అడుక్కు తినాలి!" అన్నాడు. ఆ రాత్రంతా నీలికి నిద్దరరాలేదు.

ఎన్ని విధాలగానో ఆలోచించుకుంటోంది. "గుడ్డి వెంకన్న దొంగాడని వాడ్నిసూసి ఎగిరి పడేవోడే! మా వంశం పౌరుషంగల వంశం – నాను పౌరుషంతోనే సస్తాను – అలా నచ్చిపోతానుగానీ దొంగతనం సెయ్యనే అన్నాడే! సత్రంలో దొంగల్ని ఒక్కడే సాహసంచేసి కొట్టాడే – ఆ రోజు రాత్రి టేషనికాడ దొంగతనం ఎందుకు సేసావంటే – బతుకుతాననుకున్నాను, మళ్ళా పీక తెగినా అలాంటి పని సేస్తానా అన్నాడే. తనదంతా వూళ్లో వాదులుకున్నాడు గానీ, ఒకడికి అన్నాయం సెయ్యలేదు. అలాంటోడు దొంగతనం సేసినాడంటే నాను నమ్మలేను – అంతోడు కొడుకు, మట్టిని నమ్ముకొని సెమటకార్చి బతికినాడు. దొంగతనానికి యెల్లాడని ఎలాగ నమ్ముతాను – కాదు – నా మొగుడెల్లలేదు. నా మొగుడికేమీ తెలీదు. ఆడంత మంచోడు ఇంకో రెవరున్నారు? నానే తొందరపడి ఆ దొంగతనం యీడే సేసాడనుకున్నాను–"

ఆ క్షణంలోనే ఎవరో వస్తున్నట్లు అడుగులు చప్పుడయ్యింది....."అదిగో నా మొగుడు దొంగ అయితేకదా? పోలీసులు వదిలేసినారు....." కాస్సేపు అలా ఎదురు చూసింది. ఆ పాదాల చప్పుడు దూరంగా పోయింది. మరో కొద్దినిముషాలు పోయాక ఆ ముందురోజు రాత్రి జరిగిందంతా కళ్ళకు కట్టింది. "ఏ లొసుకులేకపోతే పోలీసులు వస్తున్నారని దాగుడుమూతలు సేస్తాడెందుకు? మాటలకి అలాగ బేజారెత్తిపోతాడెందుకు? ఒంటిమీద దెబ్బ లెలాగుంటాయ్ – ఏ సావాసంలోపడి సెయ్యకపోతే పోలీసోలు వృత్తినే తీసుక యెల్లిపోతారా? వవిరిలో తప్పంటేకదా తీసికెళ్ళినారు – సేశాడు. సెయ్యకపోతే అబద్ధం ఆడమని ఆ సాదుసేత కబురెందుకెట్టాడు? సేసినాడు – నానుసెప్తే నా మొగుడికి యేం అయిపోతాదో? ఆడికంటే యీ నోకాన నాకెవురున్నారు? ఆడికోసం యేమైనా

సేస్తాను. ఆడు బతకాల. అదే నాకు కావాల......" ఇలా కొంతసేపు లోలోపలే అనుకున్నది. తరవాత తన విశ్వాసాలకీ, ఈ అభిమానానికీ ఘర్షణ పడ్డది. వేకువఝాముకు అనుకుంది: "ఏ అబద్ధాలాడో నా మొగుణ్ణి తెచ్చుకుంటాను. నా మొగుడు సేసినదానికి సిచ్చపడకండా చేస్తే మాకు జరుగుబాటు అవుతాదా? నాకు మొగుడౌతాడా? నిజం నిజమే – అబద్ధం అబద్ధమే! నాయం నిలుస్తాదిగానీ అన్నాయం నిలవదు. నాకెందుకు యిలాగ అయిపోనాను? నాను నిజమే సెప్పతాను......దేముడు నేడా!.....నా మొగుడేమవనీ – నా బతుకేమవనీ, నా పిల్లలేమవనీ........ నాను నిజమే సెప్పతాను........ నాను ఆకలితో పోతున్నా నాకు యేడుపొస్తే సంతోషంమీద వస్తాది – దుఃఖంమీద రాదు! నాను అంతా నిజమే సెప్పతాను" అని నిర్ధారించుకుంది.

ఆ మరుచటిరోజు పోలీసులు వచ్చి ఆమెను, మల్లును స్టేషనుకు తీసుకవెళ్ళారు. మల్లు ఎదురుగా ఆరుగురు మనుషులను నిలబెట్టి ఆ రాత్రి పుల్లయ్యతో ఎవరు వచ్చారో పోల్చమని చెప్పారు. మల్లు కోపంగా నేను చెప్పనన్నాడు. ఈ పోలీసులంతా కలిసే తన అయ్యను తీసుకెళ్ళారని వాడి బాధ. నీలి కొడుకును బ్రతిమాలింది. ఎన్ని విధాలుగానో నచ్చచెప్పితే ఇందులో ఎవరూ లేరని తేలింది. ఆ ఇన్‌స్పెక్టరు యిప్పుడు తన తెలివితేటలను ఉపయోగించవలసి వచ్చింది. ఒక బాకా తను వూది మల్లు చేతికి యిచ్చాడు. ఏదీ నివ్వు వూదగలవా అన్నాడు. మల్లు అంతకంటే బాగా వూదాడు. బిస్కట్ నాలా నివ్వు తినగలవా అని అంటే అంతకంటే గబగబ పరుకుపరుకుమని నమిలేశాడు. తరువాత "చూశావా! మీ అయ్య ఏం పని చేశాడో? మీ అయ్య దొంగ కాడు. వదిలేశాం. వదిలేస్తే ఏం చేశాడో తెలుసా? ఆలిద్దరి యింటికి వెళ్ళిపోతానని వెళ్ళిపోయాడు. వాళ్ళ యిల్లు నీకు తెలుసా?" అన్నాడు.

"అన్న యిల్లు తెలుసు."

"చంద్రయ్యది?"

"ఉహూఁ!"

"మీ అయ్యతో నీవెక్కడి కెళ్ళావో సెప్తావా?"

"ఓ" అంటే, ఇన్‌స్పెక్టరు తన వెంబడి కుర్రవాడ్ని తీసుకవెళ్ళాడు ఆ హోటల్ యజమాని యీ కుర్రవానితో యింకో యిద్దరు మనుషులు అప్పుడప్పుడూ వచ్చేవారని, ఒకోసారి యింకో పొట్టిమనిషి వచ్చేవాడనీ, వాళ్ళయిళ్ళు ఎక్కడ వున్నవో తనకు తెలియదనీ చెప్పాడు. ఇన్‌స్పెక్టరు ఆ యజమానిని వాళ్ళని అప్పచెప్పకపోతే తననే తీసుకవెళ్తానని బెదిరించాడు. తరువాత అన్న యిల్లు దూరంనుంచే చూపి వెళ్ళిపోయాడు. "మీ అయ్య చంద్రయ్య యింట్లో ఉన్నాడేమో: ఆ యిల్లు తెలుసుకొని నిన్ను తీసుకెళ్తానులే" అని మల్లుకి నచ్చచెప్పాడు.

తిరిగి స్టేషనకు వచ్చేవరకు నీలి అలానే అక్కడ కూర్చుంది. ఇన్‌స్పెక్టరు ఆమెవేపు చూడగానే యెందుకో జాలివేసింది. తను అడిగిన ప్రశ్నలకు సమాధానాలు వున్నదున్నట్లు ఆమె తడుముకోకండా చెప్తుంటే తనకు ఆమెమీద గౌరవం యేర్పడింది. ఆమెకు యేవిధంగానైనా సహాయంచేస్తే బాగుండునని అనిపించినా తన వుద్యోగధర్మం విడనాడకూడదని ఆమె చెప్పినట్లే అన్నీ వ్రాసుకున్నాడు.

ఆమె వెళ్ళిపోతూ తిరిగివచ్చి ఇన్‌స్పెక్టరుతో "ఆ మారాజు తండ్రికి యెలాగున్నది బాబూ! తెలివి వచ్చిందా?" అంటే, ఇన్‌స్పెక్టరు "గండం గడిచింది. బ్రతుకుతాడు!"

అన్నాడు. నీలి కదులుతూ "దేముడు లేడా? ఆ మంచిబాబుని బాగ చూడడా?" అంటుంటే ఇన్‌స్పెక్టరు నవ్వుతూ "వాడు మంచోడా? వాడి డబ్బు చూసి అంటున్నావా?" అన్నాడు.

"మంచిబాబు కాకపోతే పిస్తోలు దొంగలమీద పేలించడా బాబూ!" అని ఆమె మెల్లగా కొడుకును పట్టుకుని ముందుకు కదలిపోయింది. అలా వెళ్ళిపోతూ నాలుగైదు వీధుల్లో పనికోసం కొన్ని గుమ్మాల దగ్గరకు వెళ్ళింది, కష్టసుఖాలు చెప్పుకుంది.

ఒక యింట్లో యజమానురాలు చాలా తక్కువ డబ్బుకు పనికి కుదుర్చుకుంది. ఎన్నో షరతుల్ని పెట్టింది. ఆమె గొంతుక ధాటీ యెవరినైనా హడలుగొట్టేట్టున్నది. అన్నిటికీ నీలి తలఒగ్గింది. అవేళనుంచే పని. చెప్పినపని చేసుకొని యింటికి వెళ్తుంటే తనలాంటి మనిషే "వాళ్ళ యింట్లో పనికి కుదిరావా?" అని అడిగింది.

"అవునమ్మా!"

"వాళ్ళు మనుషులా? ఇచ్చేది యేగానే గానీ రక్తం పిల్చేస్తారు. అందుకే వాళ్ళ యింట్లో నెలకో పనిమనిషి మారుతుంది. వాళ్ళసంగతి తెలిసినవాళ్ళెవ రాపనికివెళ్ళరు"

"కష్టానికి ఆదుకున్న దాఅమ్మ! నాలుగంటే పడతాము! ఏనాటికైనా ఆ యమ్మ మనిషేకదా, కనికరం రాదా?" అంటూ నీలి ముందుకు నడిచింది.

# 41

మేజిస్ట్రేటు కోర్టులోనే విచారణ ప్రారంభమైంది. ముగ్గురు ముద్దాయిలను ఒకవేపు నిల్చోబెట్టి వారిమీద నేరారోపణ చేశారు. ముగ్గురూ నిర్దోషులమని చెప్పారు.

ఇక అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటరుకు నేరనిరూపణ చెయ్యవలసిన అవసరం వచ్చింది. మొదటిసాక్షిగా నీలమ్మను పిలిపించారు. నీలి కూతురును కోర్టుబయట చెట్టుక్రింద కొడుకుకు అప్పచెప్పి కోర్టులోకి వచ్చింది. ఉన్నమట్టుకు చింకిచీరల్లో మంచిది కట్టుకొని శరీరమంతా కప్పుకుంది. మనిషి చిక్కిపోయివున్నది. ముఖం పాలిపోయి, వేసినమెట్టు (కొప్పు) కూడా మోటుగావుంది.

తలవంచుకొని బోను యెక్కుతుండగా ఆమెకాళ్ళు గజగజ వణకనారంభించినయ్. ఎక్కి, బోనును చేతితో పట్టుకొని నిల్చొని తల యెత్తేసరికి ముగ్గురు నేరస్థులూ అగుపించారు. తలదించుకొనివున్న భర్తవేపు చూడగానే ఆమెలో అదొకవిధమైన సంచలనం కలిగింది. ఎందుకో ఆ ముఖం చూడటానికి సిగ్గువేసింది. శక్తిహీనయై కళ్ళల్లో నీరు తిరుగుతున్నప్పటికీ వెంటనే తనవిధి జ్ఞప్తికివచ్చి ధైర్యాన్ని కోలుకోడానికి ప్రయత్నించింది.

భార్య, కొడుకు చెప్పే సాక్ష్యంపైనే, తనూ తన సహచరులూ బయటపడే అవకాశం వున్నదని, తమవేపు వాదించడానికి గవర్నమెంటు వారిచ్చిన ప్లీడరు చెప్పాడు. చంద్రయ్య వెళ్ళి నచ్చచెప్పాడని పుల్లయ్యకు తెలుసు. ఈసరికి ఆలోచించి తప్పకుండా తను బయటకు రావటానికి పనికివచ్చే సాక్ష్యం ఇస్తుందనే గాఢనమ్మకంతోనే వున్నాడు.

ఇంతలో డఫేదారు "అమ్మా! ఈ ప్రమాణం చెయ్యి" అంటూ "దేవుని యెదుట......" అన్నాడు.

ఆమె అడ్డి, "అదెందుకు బాబూ! ఆ తండ్రి యెప్పుడూ వుంటాడు....."అంది.

"అలాగ ప్రమాణం చెయ్యాలమ్మా!"

నీలి డఫేదారు చెప్పినట్లు ప్రమాణంచేసింది. ఆమెలో కొద్ది క్షణాలక్రితంవున్న బెణుకు, బాధ, సంచలనం తగ్గిపోవటం మొదలుపెట్టాయి. ఆ గొంతుకలో యేదో దైవత్వం చొచ్చుకున్నట్లుంది. భయం రానురాను సడలిపోయింది.

అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు ఆమెను ప్రశ్నించడానికి వుపక్రమించాడు.

"నీ పేరు?"

"నీలమ్మ."

"నీ భర్త పేరు?"

"పుల్లయ్య."

"ఈ ముగ్గురిలో నీ భర్తను గుర్తుపట్టగలవా?"

"హుఁ, మధ్యనున్నాడు."

తరువాత వేసిన వివిధప్రశ్నలకూ ఆమె నిస్సంకోచంగా జవాబు చెప్తుంటే, పుల్లయ్య కళ్లు మండుకుపోతున్నాయ్. వాడికి యెక్కడలేని కోపం, బాధా పెల్లుబుకుతుంటే చేసేదిలేక లోలోన బాధపడుతున్నాడు.

ఒకనాడు స్టేషనుదగ్గర దొంగతనం మొదలు. ఓడసరుకు దించడానికని రాత్రుళ్ళు వెళ్లేవాడని, ఒకనాడు చీరె తెచ్చిన విషయం, వాళ్ళగ్రామంలో ప్రాక్యూరిమెంటు తగవుల్లో జరిమానాపడ్డ సంగతి, ఈ నేరం జరిగిననాటి రాత్రి, తరవాత వుదయం కొడుకుకూ, తనకూ జరిగిన తంతు అంతా ప్రశ్నలు అడుగుతుంటే నీలి సమాధానాలిచ్చింది, మిగతా ఇద్దరినీ తను ఇదివరకు చూడలేదనీ, వాళ్ళు యెప్పుడూ తన యింటిదగ్గరకు రాలేదనీ కూడా చెప్పింది.

ఈ నిజాలన్నీ ఆమె తొణకకుండా, బెణకకుండా చెప్పటంతో ముద్దాయిలతరపు ప్లీడరుకు అట్టే పనిలేకపోయింది. కానీ తన ప్రయత్నం మానలేదు. ఆయన వేసిన ప్రశ్నలలో కొన్ని;

"నీ మొగుడిబుద్ధి యెలాంటిది?"

ఆమె సమాధానం చెప్పలేదు.

"పోనీ, నలుగురూ నీ మొగుడిని గురించి యేమనుకునేవారు?"

"మా మామ్మ చచ్చిపోతూ చెప్పింది, చెయ్యికాలితే కుండ వదిలి పెడ్తాడని......ఈ వూరు వచ్చినాక ఎవురు యేం అనుకున్నారో నాకు తెలీదు బాబూ!"

"అలాంటివాడని నీ మొగుడంటే నీకు కోపంగా వుండేది కాదూ?"

"కోపం తెచ్చుకొని యెవర్ని బాగుచేస్తాం బాబూ? కోపం తెచ్చుకున్నోల్లకే నష్టంగానీ......"

"నీ మొగుడు నీమీద కోపపడేవాడుకదూ? అంచేత నీకు వాడిమీద కోపంవుండేది – ఏం? అంతేనా?"

"ఇలాంటి వెందుకడుగుతారు బాబూ?"

"మీ యిద్దరికీ సరిగ్గా పడేదికాదని ఒప్పుకుంటావన్నమాట!"

"అలాగెందుకు ఒప్పుకుంటాను? నా మొగుడు నన్నెప్పుడూ తిట్టనేదు; కొట్టనేదు – మీ రిన్ని అనండి – ఇదేంపని? ఆ రోజుల్లో మా వూర్లో గుడ్డి వెంకన్న యెప్పుడో దొంగతనాలు చేసేవోడని వాడిమీద లేచేవోడు. అలాంటోడు యిలాగ అవుతాడనుకున్నానా? కానుకున్నాను కాదు – ఆడిన మాటలన్నీ నమ్మినాను. నాను సెప్పినట్లు ఆ వూర్లోనేవుండి కంబారితనం చేసుకుంటే బత్తికేద్దుం బాబూ? ఇన్నాడుకాదు – ఈ పాపం పనికి నెట్టుకున్నాడు."

పుల్లయ్యకు పట్టరాని కోపం వస్తోంది. ఇదంతా నీకోసం చేశాననీ – నివ్వే దగా చేశావనీ అరవాలనుకున్నాడు. తను మాటాడితే నేరం ఒప్పుకున్నట్లవుతుందని బలవంతాన పెదాలు నొక్కుకున్నాడు.

నీలి సాక్ష్యం అయిపోయింది. మల్లును కోర్టులోనికి తీసుకువచ్చే ముందు ప్రాసిక్యూటరు మేజిస్ట్రేటుకు విన్నపం చేశాడు – కుర్రవాడికి తండ్రిమీద చాలా అభిమానం. కాబట్టి తండ్రి యెదురుగా కనిపిస్తే ఏడుపు తప్పించి సాక్ష్యం రాదనీ అంచేత యీ ముద్దాయిని చాటుగా వుంచాలనీ కోరాడు, మేజిస్ట్రేటు అందుకు అంగీకరించాడు.

మల్లు సెప్పినట్లు విని ధీమాగా బోనుయెక్కి యిటూ అటూ తిరిగాడు. బోనులో మునిగిపోయినట్లున్నాడు. చేతిలో చిన్నకర్ర పారేమన్నా పారేకండానే బోను యెక్కాడేమో, లోనుంచే ఆ కర్రతో బోనుచుట్టూ ఒక్కసారి త్రిప్పి గరగరలాడించాడు.

ప్రాసిక్యూటర్ నవ్వుముఖంతో –

"అబ్బాయి – చాలా మంచివాడు. నీ పేరు?" అన్నాడు

"మల్లు!"

"మీ అయ్య పేరు?"

మల్లు వేళాకోళంగా నవ్వుతూ "మా అయ్యపేరే తెలీదా? – పుల్లయ్య!" అన్నాడు.

"మంచిపేరే!"

"మా అయ్య మంచోడు – మా అయ్య పేరు మంచిదే! నీ పేరు?"

"నా పేరు గోవిందరావు."

వెక్కిరిస్తూ, "ఛా – అంతపేరా? మంచిదికాదు!"

"చిన్నపేరు చేసుకుంటానుగానీ......ఏదీ చెప్పు – ఆవేళరాత్రి మీ అయ్య, నివ్వూ మీ యింటిగడపలో పడుకున్నారుకదూ?"

"ఎప్పుడూ పడుకుంటాం – నాను మా అయ్యగుండెలమీద పడుకుంటే, మా అయ్య సరదా – నా సరదా – ఓఓ....." నవ్వు ముంచుకొచ్చింది.

"అయితే ఆవేళ యేమయిందో చెప్పు!"

"ఏయేళ?"

"మీ అయ్య మేడెక్కినాడు – ఆయేళ"

"అక్కడ సెప్పినాను. ఇక్కడెందుకు?"

"ఇదిగో వీళ్ళంతా వినలేదట – వింటామంటున్నారు. చెప్పెయ్ మల్లూ – చాలా మంచివాడివి!"

మల్లు కర్ర కాలికింద పెట్టి రెండుచేతులతోనూ బోనుపట్టుకొని కోర్టులోవున్న మనుషులవేపు చూస్తూ మొదలుపెట్టాడు. చిన్ని చెడ్డీ ఆపైన భుజాలు చిరిగిన కమీజు – ముఖంమీద పడుతున్న జుత్తు – ఎలకపళ్ళు, ముచ్చటైనమాట.....

"ఆ యేళ అమ్మతోని పొరుగమ్మదగ్గర కూకున్నాను. అలాగొచ్చి అయ్యదగ్గర పడుకోటానికి యెళ్ళి....పదాలు పాడినాను......మద్దాన్నం పడుకున్నానుకదా – నాకు కునుకురాదు.......అయ్యకిరాదు.....సీకటి..... గొప్ప సీకటి. అలాగ కునికిపోనాను. నాకు తెలివొచ్చినాది – మా అయ్య లేసిపోతున్నాడు. నానూ లేసినాను. మళ్ళావచ్చి మీదేసుకొని జోకొట్టాడు. ఈయేళ మా అయ్య నన్ను రానివ్వడు – మా అయ్యపని నాను సూడాల – ఎంత ఓడో యేమిటో.....టక్కు యేసినాను – దాగోని అలుయెనకాలే వెళ్ళినాను."

"మీ అయ్యతో వున్నవాళ్ళిద్దరెవరు?" అని ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

"అన్న – సెంద్రయ్య!"

"వాళ్ళేనా?" అని వాళ్ళిద్దరినీ చూపించగానే మల్లు పోల్చి అవునని చెప్తూ అన్న నుద్దేశించి "నీవు బోండాలు, సానీరు యిచ్చేవోడివికదా?" అన్నాడు.

తరవాత ప్రాసిక్యూటరు "అయితే వాళ్ళయెనకాలే వెళ్ళావు. తరవాత యేమైంది?" అన్నాడు.

"ఏమైనాదా?" కొంతసేపు ఆలోచించి;

"ఎనకాలే యెళ్ళాను; దీపందగ్గర ఆగినారు – మా అయ్యసూస్తే కొట్టేస్తాడు – సెత్తల డొక్కుపాటునే వుండిపోనాను.......అలాగయెళ్తే ఓడనేదు మేడ! నానూ మేడెక్కితే ఎంత బాగున్ను – అయ్యసూస్తే కొట్టడా? మా అయ్యకి కోపంరాదా? మీదకెక్కినారు – కుక్క బౌ! బౌ! భయం వేసినాది. ఓ – ఓ .......గొల్లు; సెత్తలడొక్కులో దాగుండిపోనాను.....మా అయ్య మరి రానేదు" అంటూ ధైర్యగానే ఆ మరుచటిరోజు జరిగిన విషయమూ ఆగి ఆగి చెప్పాడు. అయ్య ఆ రాత్రి తిరిగిరావటం వరకు బాగానే వెళ్ళింది, తరవాత ధైర్యమైన ఆ గొంతుక దుఃఖం పెల్లుబికింది.

"ఆయేళ పోలీసులు మా అయ్యని తీసుకపోనారు. ఎంత యేడిసినా మా అయ్య రాడు – కనపడడు – మా అయ్యని యేంచేసినారో? ఇక్కడున్నాడు, అక్కడున్నాడంటారు! ఎక్కడున్నాడో.....మా అయ్యంటే యిలాగ లేనిపోనివి సెప్పినోలకి దబ్బుడు దబ్బుడు యేసీడా? మా అయ్య యెంత మంచోడు! మా అయ్యోడని అమ్మనడిగితే వూరికెళ్ళాండంటాది. వూరికెళ్తే నాకు సెప్పకండా యెల్తాడా? యెళ్ళినా నన్ను వదిలి యిన్నాళ్ళు వుండడే....." అంతలోనే ఆ గొంతుక మహోకటుత్వం దాల్చింది. పౌరుషం, కోపం మిన్నుముట్టాయి. గబగబ కాళ్ళ క్రిందవున్న కర్రతీసి ఝులిపించాడు. బోనుమీద గట్టిగా నాలుగుసార్లు కొట్టి "పోలీసోలూ! మీరంతా మా అయ్యని యేదో సేసినారు! మా అయ్య నివ్వకపోతే సూడండి, మీ అందరిని దబ్బుడ దబ్బుడ యీ కర్రతో యేస్తేను? మీ అందరినీ

గట్టిగా కరిసేస్తాను. అయ్యా......అయ్యా!" గట్టిగా కేకలు వేశాడు. ఆ నిముషంలోనే ప్రక్కన దాచిపెట్టిన అయ్యకు ఒళ్ళంతా వణికిపోయింది. కాళ్ళు కాయలు కాసి పోయాయి. కోపం, తాపం అంతా ఆ క్షణంలో మరచిపోయి గప్పున ముందుకు చొచ్చుకుపోయాడు.

"మల్లా - నా నాయనా!" అంటూ బోనులోకి ఒక్కయెగురు యెగరాలను కున్నాడు. అయ్యని చూసిన మల్లు పట్టలేని సంతోషంతో "అయ్యా" అంటూ ఒక్క కేకవేసి బోనుదిగిపోయాడు.

ఏడుస్తున్న మల్లును డఫేదారు బయటికి, ముందుకు వురుకుతున్న పుల్లయ్యను పోలీసులు వెనుకకు తీసుకపోయారు.

# 42

కోర్టు నుంచి తిరిగి ఖైదులోకి వచ్చేసరికి సాయంత్రమైంది. రాగానే కూలబడిపోయాడు. మనస్సంతా రౌద్రంతో మండిపోతోంది. ఎదురుగా ఇనప కటకటాలు అడ్డుగా వున్నాయ్. లేదా అంటే ఆ భరించలేని కోపంతో పరుగెత్తిపోయి పెళ్ళంపీక పిసికేసేవాడే!

"అదే చేసినాది. నా మల్లు అయ్య సెప్పొద్దన్నాడంటే మాటాడేవోడా? నా మీద నిగాపెట్టి పగోడికి సేసినట్టు చేసింది. దానినుంచే పాడయినాను. అదెమ్మప్ప మాటలు యిన్నానుకాను. బుగత అన్నట్లే నాకు దగా చేసింది. దానంచేసి ఇల్లు గుల చేసింది, రాజిగాడికి తల ఒగ్గించి అంతా నాశనం చేసింది. పిరికిమందేసి నా పౌరుషాన్ని కాల్చేసింది, దాని అంతస్తు సూసుకోలేకపోనాను. పంతానికి పాకులాడి ఆ తక్కువదాన్ని, సెల్లక వుండిపోయినదాన్ని కట్టుకున్నాను. యెతెత్తి యెంగిలాగుమీదే కాలేసినాను! వలసివచ్చిన ఆ రంబనికట్టుకోనుంటే నాకీగతి పట్టేదా? బంగారంలాంటి వూరు వదిలేవోడినా? ఈ కటికనేలమీద దొర్లేవాడినా? ఇలా నా నాయన మల్లుకి దూరం అయ్యేవాడినా? ఇదే చేసింది. దీన్ని తిట్టినా, కొట్టినా, సంపినా పాపంనేద"ని అట్టుడికినట్టయిపోయి ఆవేశపడిపోతున్నాడు. ఆవేళ తిండి సయించలేదు. పెళ్ళంమీద కోపమే ఒళ్ళంతా నిండిపోయివుంది, ఈ ఆలోచనలతో చీకట్లై పోయింది.

వుండీ వుడీగీ వెర్రివాడిలా యిటు అటూ తిరుగుతున్నాడు. ఒకోసారి ఆలోచనలకు తగ్గట్లుగానే నటిస్తున్నాడు. మాటలు మధ్య మధ్య బయటకు వస్తున్నాయ్. మూడుసార్లు ఇనపకడ్డీలు వంచటానికి ప్రయత్నించాడు. తన బలమంతా వుపయోగించినా తలుపు వూడిపోలేదు.

ఈ తోడిమనిషి బాధను అలా పవళించి చూస్తున్న యింకోఖైదీ చాలాసేపయ్యాక "ఏమైంది నాయనా?" అన్నాడు.

"అయ్యింది - అది చేసింది - ఈ తలుపు ఊడితే దాన్ని ఒక్క ఏటు ఏసేనా?"

"ఎవరిని.......?"

"దానినే – ఆ తక్కువదానిని – అది నా పెళ్ళమట......వూరంతా వద్దంటే ఆ గతిలేనిదాన్ని చేసుకున్నాను. అది నామీద యెదురుసాక్ష్యం చెప్పింది......" పుల్లయ్య కోపం ఒక్కసారిగా ఉధృతమైన దుఃఖంగా మారిపోయింది. వలవల ఏడ్చేస్తూ "నా మల్లును – నా నాయన్ని ఎన్నాళ్లో అది సూడనివ్వదు........యిలాగ నా నాయనకోసం పలవరించి పలవరించి ........నా నేమౌతాను?" అన్నాడు.

వెక్కి వెక్కి ఆయన దగ్గరకు వెళ్ళి ఏడుస్తున్నాడు. ఆ చల్లనిచెయ్యి మెల్లగా తనదగ్గర వంగినవాని తల నిమిరింది. కొంతసేపయ్యాక మెల్లగా తనచోటుకు తీసుకవెళ్ళి నిద్రపుచ్చాడు. పుల్లయ్య నరాలన్నీ నీరసంచేత పీకసాగాయ్. అలా జార్లపడి కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు మూయగానే కోర్టు, భార్య, కొడుకు, ఆ దృశ్యం అంతా అగుపిస్తోంది. ఎక్కడలేని బాధ దానికితోడు అతృత తనతో పెనవేసుకొని వస్తున్నవి. కళ్ళువిప్పి ఓరగా చూశాడు. పైన జైలు జవాను యిటూ అటూ పచారుచేస్తున్నాడు. వరండాలోని వెలుతురు కొద్దిగా ఈ కొట్టులోకి పడ్తోంది. ఆ లేతవెలుగులో తను ఓదార్చిన మనిషివేపు చూశాడు.

చప్పున "బూచోడు ఇక్కడి కెలాగొచ్చా" డనుకున్నాడు? బూచోడా? కాదే?...... ఎవరు? దాసుడులాగున్నాడు..... దాసుడు ఏనాడో పోయాడుకదా– ఎలా వస్తాడు? అయితే, అయితే బూచోడా? అలాంటోడిని ఖయిదులో ఎందుకు పెడ్తారు? అయితే ఎవరు? ఈ మనిషి యీవేళపొద్దున ఈ కొట్టులో లేడే? ఎలాగొచ్చాడు? ఎవరు?

అతడు మెల్లగా ఒక ప్రశ్న వేశాడు–

"నాయనా! బాధ తగ్గిందా?" అని......

వెంటనే జవాబు రాలేదుగానీ........ఊఁ అని తనకు తెలియకండానే మూలిగాడు. పైన అడుగుల చప్పుడు వినిపించలేదు. బహుశ జవాను ఆ చివర కూర్చొని వుంటాడు. రాత్రి గడిచిపోతున్నకొద్దీ పుల్లయ్యకు నిద్దర దూరమైపోతోంది, తన తోడి ఖైదీకూడా నిద్దరపోలేదు. మళ్ళీ కొంతసేపయ్యాక "నిద్దర రాలేదా నాయనా?" అని ప్రశ్నించాడు.

ఆ గొంతుక వింటూనే పుల్లయ్యకు ఒళ్ళు జలదరిస్తోంది ఆ గొంతుక యెక్కడో విన్నట్లు– ఆ గొంతుకలోనుంచి వచ్చిన మాటలు చల్లని నీరులా తన కోపాగ్నిమీద పనిచేస్తున్నాయి.

కొంతసేపయ్యాక లేచి కూర్చున్నాడు. ఆయనకూడా దగ్గరకువచ్చి "నీకీగతి యెందుకొచ్చింది నాయనా?" అన్నాడు. ఆ ప్రశ్నతో తన బ్రతుకంతా విప్పిచెప్పు కుందామనిపించింది. తన ముక్కు, మొహం ఎరగకపోయినా, వూరూ పేరూ తెలియకపోయినా ఈ లోకంలో యీాయన ఒక్కడే తన బాధ పంచుకునే మనిషనిపించింది. అలా కూర్చొనే మెల్లగా మొదటనుంచీ తన బతుకంతా యీ వేళవరకు జరిగింది. చెప్పుకొచ్చాడు! అంతా విన్నాక అతను ఒక నిట్టూర్పు విడిచాడు – అంతే! ఇంకేం వ్యాఖ్యానించలేదు. లేచిపోయి "చాలా రాత్రి అయింది పడుకో నాయనా! అలసిపోయినవున్నావ"ని అతను తన జాగాకు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయినా పుల్లయ్య అటువేపే చూస్తున్నాడు. అలా చార్లబడినా దృష్టి తనవేసే పోతోంది – కొంతసేపటికి మాగన్నుగా నిద్దరపట్టింది.

వేకువజామున తెలివి వచ్చింది. నిద్దర పట్టలేదు. ఆయన మఠం వేసుకొని కూర్చొనివున్నట్లు గుర్తించాడు. ఈ దృశ్యం నీలమ్మగుడిలో శివాలువేస్తున్న దాసుడ్ని జ్ఞప్తికి తెచ్చింది.......అలా ఆలోచిస్తుండగానే "నాయనా!" అని పిల్చాడు. పుల్లయ్య దగ్గరకువెళ్ళాడు. ఆయనముఖం స్పష్టంగా అగపడలేదుగానీ, ఏదో తేజస్సు మెరుస్తున్నట్లు అనుకున్నాడు

మీద చెయ్యివేసి నిమురుతూ ఆదరణతో......"నాయనా! ఒకనాడు నేను నాతోటివాళ్ళని అసూయతో అసహ్యంగా చూశాను. అప్పుడు నాదీ అనే సంపద వుండేది. కానీ మనిషిలా బ్రతకలేక, ఇలా జైలుపాలయ్యాను. ఇప్పుడో – నాదీ అనేది ఏమీలేదు. కానీ, నేను తిరిగి జనంలోకి సంతోషంగా బ్రతకటానికి వెళ్ళిపోతున్నాను. ఈ గాలీ, నీరూ వగైరా పంచభూతాలూ తమ ధర్మాన్ని పాటిస్తున్నప్పుడు వాటి కలయికవల్ల తయారైన మనిషి తన ధర్మం పాటించకపోతే, అంతా సరి! నినీకెవరూ దగా చెయ్యలేదు. అబద్ధం ఆడి, నీకు నివ్వే దగాచేసుకోబోతున్నావ్, ఆ గ్రహపాటును నవ్వుతూ ధైర్యంగా తీసుకో!" అన్నాడు.

మళ్ళీ తన తల నిమురుతూ గెడ్డం పట్టుకొని "నిజాన్ని బయటపెట్టిన అలాంటి పెళ్ళాం వుండటం నీకు గర్వంకాదా? అలాగ ధైర్యంగా దొంగల్ని అప్పచెప్పే కొడుకును కన్నావే? – నీకంటే అదృష్టవంతుడెవడున్నాడు? నాయనా..... ఈ జన్మతోనే అంతా సరికాదోయ్.......ఒక పుల్లతో చక్రం తయారవుతుందా? చక్రం తయారయి కదిలి రోడ్డు చివరకు చేరేసరికి యెన్నిజన్మలో! నువ్వు ఖైదులోవుంటే వాళ్ళకి ఎలా జరుగుతుందనా?......ఆ తల్లికి ఆ ధర్మమే గొడుగై కాస్తుంది – ఆమె పాపం చేస్తేనా పామైకరవటానికి?.....ఆలోచించు" అన్నాడు.

అంటూ ఆ వ్యక్తి లేచిపోయాడు. ఇంతలో కొట్టు తలుపు తెరవబడ్డాయి. ఆయన బయటకు వెళ్లాడు గానీ పుల్లయ్య అలా కూర్చుండిపోయాడు. తెల్లవారిపోయింది – కొట్టు కదిలి వెళ్ళాడు. తిరిగి వచ్చాడుగాని. అతను చెప్పిందే మనసులో తిరుగుతోంది. అలా ఆ విషయం గురించే ఆలోచించుకుంటూ కూర్చున్నాడు. రాత్రంతా సరిగా నిద్దర లేకపోవటంవల్ల కళ్ళు ఎర్రబడి వున్నయ్. కళ్ళు మూయటానికి వీలులేకుండా పనిపాట్లు చెయ్యటానికి వెళ్ళవలసివుంది – ఏదో పనిచేస్తున్నా అతను చెప్పినవే జ్ఞాపకానికి వస్తున్నాయ్.

మధ్యాహ్నం మళ్ళీ కొట్టుకు వచ్చేసరికి అతను లేడు. వస్తాడేమో, యెలాగుంటాడో సరిగ్గా చూదామని చాలాసేపు చూశాడు. కాని యెప్పటికీ రాలేదు! చివరకు జవానుని అతని విషయం అడిగాడు. "పొద్దున్నే వదిలేశారు" అన్నాడు – పుల్లయ్య చాలా నొచ్చుకున్నాడు. ప్రొద్దున్నే సరిగ్గా చూడవలసింది.

ప్రొద్దు తిరిగిపోతున్నకొద్దీ మనసు మనసులా లేదు. ఎడతెగని ఆలోచనలు. సాయంత్రం అయింది. గాలి వీస్తోంది. చెత్తా చెదారం ఎగురుతోంది. ఉత్తరదిక్కున వున్న మేఘాలు చెదర సాగినయ్. రానురాను ఆకాశం వినీలంగా అగుపిస్తోంది.

చీకటి పడింది. పుల్లయ్య గతం అంతా మళ్ళీ నెమరువేసుకుంటున్నాడు. పెళ్ళి.....పెళ్ళికిముందే తనకొడుకెలా వుండాలో వూహించుకున్నాడే–ముచ్చటగా ముద్దుగావున్న పాపడు – ఆడూ తనలాగే గేరా గిరజాలు పెంచుతాడు. నలుగురిలో

మెప్పతెస్తాడు – దేనికీ జడవడు. అడ్ని గరిడీలో ఘటికుడ్ని చేసి – మాటన్నాడంటే పేణంపోయినా నిలబడతాడు. దొంగల్ని పట్టేదొర......నా కొడుకు దొంగల్ని పట్టే దొరకాలేడా? అయ్యాడు అయ్యాడు..... చెయ్యిసూసి చెప్పినాడుకదా కోటికొక్కడని......నా కొడుకు కోటికొక్కడే అయినాడుకాదా?......నాను కోరినట్టే అయినాడు........నా నాయన మల్లు – నిజాన్ని నిలిపిన కొడుకైనాడుకదా? అయితే నాకెందుకు యింత బాధ?

ఇలా అనుకుంటుండగానే, కొడుకుతోపాటు పెళ్ళం అగుపించినట్లయింది. ఆ అమాయకమైన ముఖం......బోనులో నిల్చొని తొణక్కుండా, బెణక్కుండా చెప్పే ఆ ముఖవర్చస్సు......ఏదో తేజస్సు చూసినట్లనిపించింది. ఆ తేజస్సు ముందు తను నిల్చోలేకపోయినట్లు – తలెత్తడానికి సిగ్గుపడినట్లు అయిపోయాడే!

ఆ రాత్రి అన్నంముద్ద నోటికి వెళ్ళలేదు. కలుపుతున్నాడేగాని పెళ్ళాం, పిల్లలూ యెలాగున్నారోనని మనసు ద్రవించసాగింది. బలవంతాన ముద్ద నోటిలోనికి కుక్కుతుంటే కళ్ళంట నీరు బొటబొటా గిన్నెలోకి కారసాగింది. అలాగ లేచిపోయాడు.

ఆ రాత్రంతా ఆమె, ఆ మాటలు తనను నిద్దరపోనివ్వలేదు. లోలోన యేదో పురుగు తనను తొలచి బాధపెట్టున్నట్లుంది. "నా పెళ్ళాం కొడుకు నిజం సెప్పారు. అంచేత ఆ పెద్దోడు అంత దెబ్బతగిలినా సచ్చిపోనేదు. నాను సెడ్డోడ్ని అయిపోనాను. జూదం నేర్చినాను; సెడ్డోడితో కూడినాను. మనిషినే మారిపోనాను. అలాగుంటే నా పెళ్ళాం పిల్లలకి అయ్యేవోడినా? నాకు జైలే బాగున్నాది. నా పెళ్ళం కొడుకూ నా మంచికే చేసినారు. నాను పదుగురిలాగ యిక్కడ పని నేర్చుకుంటాను. తరువాత బతికేనా?" అనుకున్నాడు.

ఆకాశంలోకి చూశాడు – ఎవరెవరో అగుపించినట్లయింది. కొంతసేపయ్యాక మళ్ళీ కొడుకే తలపుకొచ్చాడు. వాడు పుట్టకముందు తనుపడ్డ గర్వం –– పుట్టాక తను యెగిరిన యెగుర్లూ –– పేరుంచావు తండ్రీ.... అనుకున్నాడు. నిముష నిముషానికి ఆ కొడుకును దగ్గరికి చేరదీసుకొని తన మనసారా ముద్దులాడుదా మనిపించింది. చివరకు ఊహాలోనే కొడుకును ముద్దులాడసాగాడు. ఆ కటిక నేలనే ముద్దులాడుతుంటే కళ్ళంట నీరు జలజల తాలుతోంది. ఎంతోసేపటికి పైనుంచి జవాను–

"ఎందు కేడుస్తున్నావ్––పడుకో! పడుకో!" అన్నాడు.

గబగబ ఇనపకమ్మీల దగ్గరకి పరుగెత్తుకొచ్చి "అదిగో...ఆ అరుబారు కెళ్ళే తోవలో నా యిల్లు ––– నా నాయన్ని తెచ్చిచూపించావా? నీకు దేముడు మంచి చేస్తాడు!" అన్నాడు.

"గోల చెయ్యక. జెయిలరు వచ్చాడంటే ఏమవుతాది? పడుకో" అంటూ వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

పుల్లయ్య ఆ కమ్మీలు గట్టిగా పట్టుకొని బాధతో నిట్టూర్చాడు–––

# 43

ఎండవేళ వచ్చిన నీలి, పిల్లలను పెట్టుకొని సెషన్సుకోర్టు ఎదురుగానున్న చెట్టుక్రింద కూర్చొనివుంది. ప్రొద్దు తిరిగినా ఇంకా పిలవలేదు.

ఆకలి పీడిస్తోంది. పిల్ల ఏడుస్తోంది. వీళ్ళని ఏమిపెట్టి పోషించేది దేముడా అన్న బాధ ఆమెను పీక్కుతింటోంది. ఇలాంటి సమయంలో పనిచేయలేదని ఆ యింటి యజమానురాలు పంపించివేసింది. పురుడు పోసుకున్నాక రమ్మంది. ఈ లోగా యెలాగ జరుగుతుంది? కొడుకైనా చేతికి అందివచ్చాడు కాదని నొచ్చుకుంది. నిన్నరాత్రినుంచీ ఆమెకు బెంగబెంగగా వుంది. రాత్రి ఇన్ని మంచినీళ్ళు త్రాగి నిద్దరపోయింది. ఏ పని చెయ్యడానికీ శక్తిలేదు. ఆగి ఆగి కష్టపడి ఎలాగో కోర్టుకు వచ్చింది. కళ్ళు తిరిగిపోతున్నట్టున్నాయ్.

ఈ సమయాన్నే ముద్దాయిలను కోర్టుకు హాజరుపర్చారు. జడ్జీ ఇంకే ప్రశ్నా వెయ్యకుండానే పుల్లయ్య యిలా అన్నాడు: "బాబూ! నాను నిజం సెప్పుతాను. పెభువులు కటాక్షించి నా కోరిక తీర్చండి. అదేమీ మా పెద్దది కాదు. అడిగో నా నాయన మల్లు, బయట సెట్టు క్రింద ఉన్నాడు. ఆడిని ఒక్కసారి యీ చేతులతో ఎత్తుకొని ముద్దులాడనివ్వండి బాబూ! మీకు దేముడు బాగా చూస్తాడు!!"

జడ్జి అందుకు అంగీకరించి తను చెప్పదలచుకున్నది చెప్పమన్నాడు. పుల్లయ్య ఇంకో సమయంలో అయితే తనుపడ్డ బాధ, తనకు జరిగిన అన్యాయాలు, దగాలు అన్నీ చెప్పుకొనేవాడే! కానీ తన కొడుకును ఎత్తుకొని ముద్దులాడతాననే ఆతృత నిజాన్ని నాలుగుముక్కల్లో సెప్పనిచ్చింది.

"గొట్టం పట్టుకొని సివర నానే ఆ బాబు మేడెక్కాను. ఆ బాబు సేతిలో తుపాకి వున్నాది. అలయేపు పేల్చేస్తున్నాడు. అలిద్దరూ సచ్చిపోతారు. ఆ గాబరాలో నాకేం తోసినాది కాదు. అక్కడేవున్న బల్ల ఎనకనించి ఆ బుర్రమీద యెత్తేసినాను. ఇంతలో యీాదంతా గోల ––– దొరికిపోతామని, భితుకుతో దొంగతనం సెయ్యకుండా యెలిపోనాను."

"నీతో వున్నవాళ్ళిద్దరూ వీళ్ళేనా?" అని జడ్జి ప్రశ్నించాడు.

పుల్లయ్య జవాబు చెప్పలేదు.

జడ్జి మళ్ళీ రెట్టించి ప్రశ్నించాడు.

"బాబూ! సెమించండి. అది నాకు అడగకండి!"

"నిజం చెప్తేకదా నీ కోరిక తీర్చటం అవుతుంది!"

పుల్లయ్య తల దించేశాడు. మనస్సు చిన్నబోయింది. ఇంతలో అన్న నోరు వినిపించింది.

"మరెందుకు బాబూ? నిజం ఏ నాటికైనా తెలిసిపోదా? మా ముగ్గురమే బాబూ చేసాం."

పుల్లయ్యకు అన్న మీద యెడతెగని అభిమానం కలిగి తలెత్తిచూశాడు. ఆ అమాయకమయిన మనిషి ఇదివరకు పడ్డ కష్టనష్టాలు, నేర్చిన నీతులు అన్నీ ఒక్కసారి జ్ఞప్తికి వచ్చాయి.

పోలీసు ఇన్‌స్పెక్టరు మల్లును కోర్టులోకి తీసుకువెళ్ళగానే, అయ్యను చూసి కెవ్వున కేకవేసి ముందుకు వురికాడు. చేతులుచాచిన అయ్యమీదకు ఎగిరి గట్టిగా కౌగలించుకొని "అయ్యా!..." అంటూ ఒకటే సంతోషం. ఆ సంతోషంలో యేడుపు..... వుత్సాహం.

అయ్య కొడుకును మనసారా ముద్దులాడుతున్నాడు. వలవల యేడుస్తున్నాడు. "నాయనా... నా తండ్రీ.... పేరు నిలిపినావు...." ఏడుపులో మాట సరిగ్గా రావటం లేదు. ఎన్నో బుద్ధులు చెప్దామనుకున్నాడు, ఎన్నెన్నో...ఎంతగానో చెప్పకుందా మనుకున్నాడు. కానీ ఏడుపు తప్ప ఒక్కమాటా సరిగా రాలేదు. ఆ దృశ్యం చూసినవాళ్ళ మనసులు కూడా ద్రవించిపోయినయ్.

ఇక మల్లుని విడిచిపెట్టాలి. వీల్లేదు...విడిపిస్తుంటే మల్లు గట్టిగా యేడుస్తున్నాడు....ఆ కేకలు విని నీలి అత్రుతగా అటువేపు రాగానే యేడుస్తున్న మొగుడు ముఖం అగపడింది. ఆ ముఖం అలా చూడగానే ఆమెలో యేదో సంతోషం పొంగిపోయింది. ఆ ముఖం నిజంగా.... తొలి రోజున అమాయక ముఖం... పోయిన కళా కాంతులు తిరిగివచ్చినయ్... ఆ ముఖంవేపు చూస్తుంటే అమె ఆకలి అంతా మరచిపోయింది.... అప్రయత్నంగా ఆమె కళ్ళవెంట నీళ్ళు కారాయ్. ఆ గడచిపోయిన రోజులు ఒక్కసారి పెనవేసుకొని జ్ఞప్తికి వచ్చాయ్... ఆ తొలినాటిరాత్రి పంతం... ఈ వెట్టిబాగుల పిల్ల.... ఆనాడు ఆ గిరజాల్లో చేతులు పెట్టి... ఒక్కొక్క మాట రాలిస్తే ఆ ముఖం ఎంత అమాయకంగా వుంది! ఆనాడు కొడుకు పుట్టిన్నాడు ఆ ముఖంలో తేజస్సు, మళ్ళీ ఎంత కాలానికి అలాంటి మొగుడ్ని చూసింది....

మల్లును బైటకు తెచ్చిన ఇనస్పెక్టరు నీలికి అప్పచెప్తూ "నిజం చెప్పేశాడు. ఇంక నువ్వు యిలా తిరగక్కర్లేదులే" అన్నాడు.

ఆ చూలాలు దీనంగా "బాబూ...." ఏదో అడగబోయి మరచిపోయినట్లుగా వూరుకుంటే, గ్రహించుకున్నట్లుగా "మూడు నాలుగేళ్ళయినా శిక్ష తప్పదు" అన్నాడు. ఓ క్షణం అలా నిల్చుండిపోయింది.

ఆమె అక్కడనుంచి మెల్లగా కదలబోయింది. మల్లు గోల ఇంకా తగ్గలేదు. మెల్లగా కోర్టుదాటి రోడ్డుమీద పడినా "అమ్మో! అయ్యని తీసుకుపోతున్నారే..." అని అరుస్తున్నాడు. రోడ్డుమీద నడుస్తున్నవాళ్ళు వింతగా ఈ పిల్లవానివేపు చూస్తున్నారు.

నాలుగడుగులు వేశాక, ఆమె శక్తివిహీన అయ్యింది. సంతోషంతో నిండిన కడుపు యిప్పుడు ఖాళీ అయిపోయింది. ఆకలి–బ్రహ్మాండంగా వుంది. కాళ్ళు తేలిపోతున్నయ్. కళ్ళు మందుకుపోతూ నీటితో నిండిపోతున్నట్లున్నయ్. మళ్ళీ ప్రయత్నించి ముందుకు అడుగులు వెయ్యబోయింది. మనిషి తూలిపోతోంది — తన యిల్లు యింకెంతో దూరం. ... ఇల్లా అది...? వెళ్ళగానే అద్దె యివ్వలేదని యెన్ని మాటలు అడుతుందో? ... బయటకు గెంటివెయ్యదూ? తాళం వేసుకొని వుంటుంది ——– మరి రానివ్వదేమో...

సాయంత్రం రోడ్డు మీద ప్రజ కదులుతున్నారు. బండ్లు, బస్సులూ, రిక్షాలు వెళ్ళిపోతున్నాయ్. కానీ ఆమె ముందుకు కదలలేకపోయింది! తనకే కాదు ఆకలి —– పిల్లలకి..... కడుపులో నున్న కండక్కూడాను కొండంత ఆకలే!

ఎలాగో కష్టపడి మరికొంత దూరం నడిచింది... అదిగో శివాలయం అగుపిస్తోంది. శివాలయం ముందు బారులుతీరి ముష్టివాళ్ళు కూర్చున్నారు. దుకాణాలు అగుపిస్తున్నాయ్. అరటిపళ్ళ గెలలు –– నాలుగుపళ్ళు తింటే కడుపు శాంతించును....ఎలాగొస్తాది...? శివాలయానికి ఎందరో భక్తులు పట్టుచీరలు కట్టుకొని, కార్లమీద కూడా వస్తున్నవాళ్ళున్నారు. చాలా రద్దీగా వున్నది. రోడ్డుమీద నడుస్తూ తల తిరిగినట్టున్నందువల్ల కూర్చుండిపోయింది. ప్రక్కనేవున్న ముష్టివాడు ఇంకొకర్తె చేరిందని యేవగించుకున్నాడు. యెదురుగావున్న ఇంకో ముష్టిది కొఱకొఱా చూసింది.

లేవలేని నీలి నిరాశతో పిల్లలవేపు చూసింది. మల్లుకు ఇంకా దుఃఖం పోలేదు. కడుపులో పిల్ల "అమ్మా అకలే..." అని గగ్గోలుపెడ్తున్నట్లు తిరిగిపోతోంది.

ఈ ఆడకూతురు కన్నవారింట్లో కడుపుకు కష్టాలు పడింది. కానీ చెయ్యి కట్టుకోలేదు. యౌవనంతో వంగుతూ, వాలుతూ, వయ్యారంగా తిరుగుతూ, ఆడుతూ పాడుతూ మురిసిపోయింది. పెళ్ళిగడియలో యేమీ తెలియని అమాయకురాలి మల్లే, సిగ్గుతో ముడుచుకుపోయింది. పెళ్లమై– పంతంపట్టిన మొగుడు కళ్ళు విప్పింది. ఇల్లాలై ఇంటిని నిలిపింది. ఒకనాడూ ఆమె ఒకరికి చెయ్యి చాపలేదు. లేనినాడు కూడా ఒకరికి యిచ్చింది. ఈమె చెయ్యి ఒకనాడు ఇచ్చినవేపే తిరిగింది గానీ, పుచ్చుకున్న వేపు తిరగలేదు. అలాంటి పవిత్రమైన చెయ్యి... ఈ నాడు...ఈ నిమిషంలో...అడుగుతున్న వేపు తిరుగుతుంటే...ఆమె చెయ్యి గజగజ వణక నారంభించింది. ఎంత ప్రయత్నిస్తున్నా ఆ చెయ్యి మళ్ళీ క్రిందకే వెళ్లిపోతోంది....చివరకు అతి ప్రయత్నంతో ఆ చేతిని పైకెత్తి అడుక్కునేటట్లు త్రిప్పగానే...ఆ చేతిమీద...ఆమె రెండు కళ్ళనుంచీ ....రెండే రెండు కన్నీటిబొట్లు రాలాయి!

☆ సమాప్తం ☆

★ ★ ★